మహర్షి వేదవ్యాస ప్రణీత

# శ్రీమద్భాగవతము

## (నవమ స్కంధము)
## ఆరవ సంపుటము

స్వామి తత్త్వవిదానంద సరస్వతి






తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

శ్రీమహర్షి వేదవ్యాస ప్రణీత

# శ్రీ మద్భాగవతము

## (నవమ స్కంధము)

**ఆరవ సంపుటము**

స్వామి తత్త్వవిదానంద సరస్వతి
(బ్రహ్మవిద్యాకుటీర్, పాత అల్వాల్, సికింద్రాబాదు)
గారిచే రచింపబడిన "తత్త్వప్రకాశిక" అనే
తెలుగు టీకతో కూడినది




ప్రచురణ
**కార్యనిర్వహణాధికారి**
**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.**
**2007**

# SRIMADBHAGAVATAMU

with Telugu Commentary

Skandha IX - Volume - VI

by
**SWAMI TATTVAVIDANANDA SARASWATI**

T.T.D. Religious Publications Series No : 765



First Edition : 2007

Copies : 2000

*Published by*
**Sri K.V.RAMANACHARY, I.A.S.,**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati — 517 501

*Printed at:*
Tirumala Tirupati Devasthanams Press
Tirupati - 517 507

# ముందు మాట

భారతీయ వాఙ్మయంలో పురాణాలు అత్యంత విశిష్టమైనవి. అవి లోకానికి మిత్రులవలె హితాన్ని ఉపదేశిస్తాయి. కాబట్టి, "మిత్ర సమ్మితములు" గా ప్రఖ్యాతి వహించాయి. పురాణాలు ప్రాచీనమైనవైనా ఎప్పటికప్పుడు నిత్యనూతనంగా ప్రకాశిస్తూ వుంటాయి. .అవి మన పురాతన విజ్ఞాన సర్వస్వాలు (Encyclopaedias). అటువంటి పదునెనిమిది పురాణాల్లో అగ్రగణ్యమైనది శ్రీమద్భాగవతము.

'భాగవత' మంటే భగవంతుని గూర్చి వివరించే గ్రంథమని భావం. ఇలాగే 'భగవత్' శబ్దంతో సంబంధించిన నామధేయం కల మరొక ప్రసిద్ధ గ్రంథం 'భగవద్గీత'. భగవంతుడు చెప్పింది భగవద్గీత; ఆ భగవంతుని గూర్చి చెప్పేది భాగవతము. ఇది ఈ రెంటికి గల అవినాభావ సంబంధం.

వేర్వేరు పురాణాలను, ఇతిహాసాలను రచియించిన వేదవ్యాసుడు బదరికావనంలో సరస్వతీనదీ తీరాన గల తన ఆశ్రమంలో ఒకప్పుడు చింతిస్తూ కూర్చొని ఉండినాడు. ఆ సమయంలో అక్కడకు విచ్చేసిన నారదమహర్షి, విషయం తెలిసికొని, వ్యాసునితో ఇలా అన్నాడు. 'మునీంద్రా! నీవు ఇంతవరకు ఎన్నో గ్రంథాలను రచించినప్పటికీ, భగవానుడైన శ్రీమహావిష్ణువు యొక్క గుణగణాలను, మహిమలను, అవతారలీలలను వెల్లడించే కథలతో గూడిన సమగ్ర గ్రంథాన్ని ప్రత్యేకంగా రచింపలేదు. కావున, అలాంటి ఉత్కృష్ట గ్రంథాన్ని రచిస్తే నీకు పరిపూర్ణమైన మనశ్శాంతి ఏర్పడుతుంది' – అని చెప్పిన నారదుని ఆదేశాన్ని పాటించి, వేదవ్యాస మహాముని రచించిన ఉదాత్త గ్రంథమే శ్రీమద్భాగవత మహాపురాణం!

ఈ గ్రంథానికి 'భక్తిశాస్త్ర' మని, 'సాత్వత సంహిత' అని, 'మోక్షగ్రంథ' మని, 'హయగ్రీవ బ్రహ్మవిద్య' అని – అనేక నామాంతరాలు పూర్వంనుండీ వాడుకలో ఉన్నాయి. ఇవన్నీ ఈ భాగవత గ్రంథానికి గల ప్రశస్తిని చక్కగా చాటుతూ వున్నాయి.

ఈ సుప్రసిద్ధ గ్రంథానికి "తత్త్వప్రకాశిక" – అనే పేరుతో తెలుగు టీక సమకూర్చబడింది. ప్రతిపదార్థ, తాత్పర్యాలతో కూడిన ఈ తెలుగు టీక సరళమైన భాషలో, సులభశైలిలో, సామాన్య పాఠకులను సైతం ఆకట్టుకొనే రీతిలో సముచితంగా కొనసాగింది. సార్థక నామధేయంతో వరలిన ఈ టీకను రచించిన సహృదయులు, సుగృహీత నామధేయులు, బ్రహ్మవిద్యానిధులు, బహుగ్రంథకర్తలు పూజ్యశ్రీ తత్త్వవిదానంద సరస్వతీ స్వామివారికి కృతజ్ఞతాపూర్వక అభివందనాలు.

చివరగా నొక్కమాట: పద్మపురాణంలో శ్రీమద్భాగవతం సాక్షాత్తు భగవంతుని స్వరూపంగా నిరూపింపబడింది. తదనుగుణంగా భాగవతంలోని మొదటి, రెండు స్కంధాలు భగవంతుని పాదాలు; మూడు నాలుగు స్కంధాలు ఊరువులు; ఐదవ స్కంధం నాభి ప్రదేశం; ఆరవ స్కంధం హృదయం; ఏడు, ఎనిమిది స్కంధాలు బాహువులు; తొమ్మిదవ స్కంధం కంఠం; పదవ స్కంధం ముఖం; పదకొండవది లలాటం; పంద్రెండవ స్కంధం శిఖ.

పద్మపురాణంలో పై వరుసక్రమాన్ని బట్టి, ప్రస్తుతం ప్రచురితమయిన నవమ స్కంధం శ్రీ భగవానుని కంఠభాగంగా భావించాలి. ఇది ఆరవ సంపుటంగా వెలువడింది. ఇలాగే తరువాతి దశమ, ఏకాదశ, ద్వాదశ స్కంధాలను కూడ త్వరలో ప్రచురించే ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. శ్రీ లక్ష్మీవేంకటరమణుని అనుగ్రహ విశేషంతో మిగిలిన సంపుటాలు కూడ ప్రచురితం కాగలవు. తి.తి. దేవస్థానం ప్రచురిస్తున్న ఈ ధార్మిక గ్రంథాలన్నీ పాఠకుల ఆదరాభిమానాలను చూరగొనగలవని ఆకాంక్షిస్తున్నాను.

కార్యనిర్వహణాధికారి
తి.తి.దేవస్థానములు, తిరుపతి.

# విషయ సూచిక



* * * * *

శ్రీగణేశాయ నమః

ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్రీ మహర్షి వేదవ్యాస ప్రణీతం

# శ్రీమద్భాగవత మహాపురాణమ్

## తత్త్వ ప్రకాశికా సంయుతమ్

## నవమః స్కంధః

## అథ ప్రథమోఽధ్యాయః

### సుద్యుమ్న మహారాజు వృత్తాంతము

రాజోవాచ।
మన్వంతరాణి సర్వాణి త్వయోక్తాని శ్రుతాని మే ।
వీర్యాణ్యనంతవీర్యస్య హరేస్తత్ర కృతాని చ ।। 1

రాజా - పరీక్షిన్మహారాజు, ఉవాచ - పలికెను, త్వయా - నీచే, ఉక్తాని - చెప్పబడిన, సర్వాణి - అన్ని, మన్వంతరాణి - మన్వంతరములు, తత్ర - వాటియందు, అనంతవీర్యస్య - అనంతమగు శక్తిగల, హరేః - శ్రీహరియొక్క, కృతాని - చేయబడిన, వీర్యాణి చ - ప్రభావమును బోధించే కర్మలు కూడ, మే - నాచే, శ్రుతాని - వినబడినవి.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను -- పదునాల్గు మన్వంతరములను, వాటియందు అనంతశక్తిశాలియగు శ్రీహరి తన మహిమను ప్రకటిస్తూ చేసిన కర్మలను కూడ తమరు వర్ణించి చెప్పగా, నేను వింటిని.

యోఽసౌ సత్యవ్రతో నామ రాజర్షిర్ద్రవిడేశ్వరః ।
జ్ఞానం యోఽతీతకల్పాంతే లేభే పురుషసేవయా ।। 2

సత్యవ్రతః - సత్యవ్రతుడని, నామ - ప్రసిద్ధి గాంచిన, యః - ఏ, అసౌ - ఈ, రాజర్షిః - రాజర్షి గలడో ఆయన, ద్రవిడ-ఈశ్వరః - ద్రవిడదేశ ప్రభువు, యః - ఏ రాజర్షియైతే, అతీతకల్ప-అంతే - గడచిన కల్పము యొక్క అంతమునందు, పురుషసేవయా - మత్స్యమూర్తియగు శ్రీహరి యొక్క సేవచే, జ్ఞానమ్ - ఆత్మజ్ఞానమును, లేభే - పొందెనో.

గడచిన కల్పముయొక్క అంతమునందు సత్యవ్రతుడని ప్రసిద్ధి గాంచిన రాజర్షి ద్రవిడదేశమునకు ప్రభువుగ నుండెను. ఆయన మత్స్య మూర్తియగు శ్రీహరిని సేవించి ఆత్మజ్ఞానమును పొందెను.

స వై వివస్వతః పుత్రో మనురాసీదితి శ్రుతమ్ ।
త్వత్తస్తస్య సుతాః ప్రోక్తా ఇక్ష్వాకుప్రముఖా నృపాః ।। 3

సః వై - ఆయనయే, వివస్వతః - సూర్యుని, పుత్రః - పుత్రుడగు, మనుః - మనువు, ఆసీత్ - ఆయెను, ఇతి - అని, త్వత్తః - నీనుండి, శ్రుతమ్ - వినబడినది, ఇక్ష్వాకుప్రముఖాః - ఇక్ష్వాకుడు మొదలుగా గల, నృపాః - రాజులు, తస్య - శ్రాద్ధదేవుడనే ఆ మనువుయొక్క, సుతాః - పుత్రులని, ఉక్తాః - చెప్పబడినవారు.

ఆ సత్యవ్రతుడే ఈ కల్పమునందు సూర్యుని పుత్రుడై శ్రాద్ధదేవు డనే మనువు ఆయెననియు, ఇక్ష్వాకుడు మొదలగువారు ఆయన పుత్రుల నియు నీవు చెప్పగా వింటిని.

తేషాం వంశం పృథగ్బ్రహ్మన్వంశ్యానుచరితాని చ ।
కీర్తయస్వ మహాభాగ నిత్యం శుశ్రూషతాం హి నః ।। 4

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, మహాభాగ - ఓ మహాత్మా!, తేషామ్ - వారియొక్క, పృథక్ - వేర్వేరు, వంశమ్ - వంశమును గురించి, వంశ్య-అ నుచరితాని చ - ఆ వంశమునందు జన్మించినవారల తరువాతి వృత్తాంత

ములను కూడ, నిత్యమ్ - సర్వదా, శుశ్రూషతామ్ - వినగోరే, నః - మాకు, కీర్తయస్వ - వర్ణించి చెప్పుము.

ఓ మహర్షీ! నీవు మహాత్ముడవు. ఆ ఇక్ష్వాకుడు మొదలగువారి యొక్క వేర్వేరు వంశములను, వారి వంశములలో జన్మించినవారల తరువాతి వృత్తాంతములను వర్ణించి చెప్పుము. మాకు నిరంతరముగా వినాలనే కోరిక గలదు.

యే భూతా యే భవిష్యాశ్చ భవంత్యద్యతనాశ్చ యే ।
తేషాం నః పుణ్యకీర్తీనాం సర్వేషాం వద విక్రమాన్ ।। 5

యే - ఎవరైతే, భూతాః చ - గడచిన కాలములోని వారో, యే చ - ఎవరైతే, భవిష్యాః - రాబోయే కాలములో రాబోవువారో, యే చ - ఎవరైతే, అద్యతనాః - వర్తమానకాలములోనివారై, భవంతి - ఉన్నారో, పుణ్యకీర్తీనామ్ - పవిత్రమగు కీర్తిగల, తేషామ్ - వారి, సర్వేషామ్ - అందరి యొక్క, విక్రమాన్ - పరాక్రమములను గురించి, నః - మాకు, వద - చెప్పుము.

ఆ వంశములో గడచిన కాలములోని వారు, వర్తమానములో నున్నవారు, భవిష్యత్తులో రాబోవువారు అగు రాజులందరియొక్క పరాక్రమములను గురించి మాకు చెప్పుడు. వారి కీర్తి పవిత్రమైనది.

సూత ఉవాచ ।
ఏవం పరీక్షితా రాజ్ఞా సదసి బ్రహ్మవాదినామ్ ।
పృష్టః ప్రోవాచ భగవాన్ శుకః పరమధర్మవిత్ ।। 6

ఏవమ్ - ఈ విధముగా, బ్రహ్మవాదినామ్ - వేదవేత్తలయొక్క, సదసి - సభయందు, పరీక్షితా రాజ్ఞా - పరీక్షిన్మహారాజుచే, పృష్టః - ప్రశ్నించబడినవాడై, పరమధర్మవిత్ - గొప్ప ధర్మవేత్తయగు, భగవాన్ - పూజనీయుడైన, శుకః - శుక మహర్షి, ప్రోవాచ - బదులు చెప్పెను.

సూత మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా బ్రహ్మవేత్తల సభ యందు పరీక్షిన్మహారాజు పూజనీయుడైన శుక మహర్షిని ప్రశ్నించగా, పరమధర్మమగు భక్తిలో విద్వాంసుడగు ఆ మహర్షి ఇట్లు బదులు చెప్పెను.

శ్రీశుక ఉవాచ ।
శ్రూయతాం మానవో వంశః ప్రాచుర్యేణ పరంతప ।
న శక్యతే విస్తరతో వక్తుం వర్షశతైరపి ॥ 7

పరంతప - శత్రువులను తపింప జేయువాడా!, మానవః - మనువునకు చెందిన, వంశః - వంశము, ప్రాధాన్యేన - ప్రముఖముగా, శ్రూయతామ్ - వినబడుగాక!, విస్తరతః - విస్తారముగా, వక్తుమ్ - చెప్పుటకు, వర్షశతైః అపి - వందల సంవత్సరములచేనైననూ, న శక్యతే - శక్యము కాదు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- (లోపలి) శత్రువులను తపింప జేసిన ఓ మహారాజా! నేను మనువుయొక్క వంశములోని ప్రముఖములైన విషయములను చెప్పెదను, వినుము. ఆ వంశమును విస్తారముగా వర్ణించుటకు వందలాది సంవత్సరములైననూ చాలదు.

పరావరేషాం భూతానామాత్మా యః పురుషః పరః ।
స ఏవాసీదిదం విశ్వం కల్పాంతేఽన్యన్న కించన ॥ 8

ఇదమ్ - ఈ, విశ్వమ్ - జగత్తు, కల్ప-అంతే - ప్రళయమునందు, సః - ఆ, పరః పురుషః ఏవ - పురుషోత్తముడుగనే, ఆసీత్ - ఉండెను, యః - ఎవడైతే, పర-అవరేషామ్ - పెద్ద-చిన్నయగు, భూతానామ్ - ప్రాణులకు, ఆత్మా - ఆత్మయో, అన్యత్ - ఇతరము, కించన - ఏదైననూ, న - లేకుండెను.

ఈ కనబడే జగత్తు ప్రళయమునందు ఆ పురుషోత్తముడుగనే యుండెను. ఇతరము ఏదియు లేకుండెను. పెద్ద-చిన్న ప్రాణులన్నింటికీ ఆత్మ (స్వస్వరూపము) ఆ పురుషోత్తముడే.

తస్య నాభేస్సమభవత్పద్మకోశో హిరణ్మయః ।
తస్మిన్ జజ్ఞే మహారాజ స్వయంభూశ్చతురాననః ॥ 9

మహారాజ - ఓ పరీక్షిన్మహారాజా!, తస్య - ఆ పురుషోత్తమునియొక్క, నాభేః - నాభినుండి, హిరణ్మయః - బంగరు (ప్రకాశశీలమగు), పద్మకోశః - పద్మపు మొగ్గ, సమభవత్ - ఆవిర్భవించెను, తస్మిన్ - దానియందు, చతురాననః - నాలుగు మోములవాడు, స్వయంభూః - స్వయంభువుడగు బ్రహ్మగారు, జజ్ఞే - ప్రకటమాయెను.

ఓ పరీక్షిన్మహారాజా! ఆ పురుషోత్తముని నాభినుండి ప్రకాశించే బంగరు పద్మము పుట్టెను. దానియందు నాలుగు మోముల బ్రహ్మగారు ప్రకటమాయెను. బ్రహ్మగారు స్వయంభువుడు (పుట్టుక లేని చైతన్యమే స్వరూపముగా గలవాడు).

మరీచిర్మనసస్తస్య జజ్ఞే తస్యాపి కశ్యపః ।
దాక్షాయణ్యాం తతోఽదిత్యాం వివస్వానభవత్సుతః ।। 10

తస్య - ఆ బ్రహ్మగారియొక్క, మనసః - మనస్సునుండి, మరీచిః - మరీచి, జజ్ఞే - పుట్టెను, తస్య అపి - ఆ మరీచికి కూడ, కశ్యపః - కశ్యపుడు, తతః - ఆ కశ్యపునినుండి, దాక్షాయణ్యామ్ - దక్షుని కుమార్తెయగు, అదిత్యామ్ - అదితియందు, వివస్వాన్ - సూర్యుడు, సుతః - పుత్రుడై, అభవత్ - కలిగెను.

ఆ బ్రహ్మగారి సంకల్పమునుండి మరీచి మహర్షి పుట్టెను. మరీచికి కశ్యపుడు పుత్రుడు. కశ్యపునకు దక్షుని కుమార్తెయగు అదితియందు అధికమగు ప్రకాశము గల సూర్యుడు పుత్రుడై పుట్టెను.

తతో మనుశ్శ్రాద్ధదేవస్సంజ్ఞాయామాస భారత ।
శ్రద్ధాయాం జనయామాస దశ పుత్రాన్ స ఆత్మవాన్ ।। 11

ఇక్ష్వాకున్నృగశర్యాతిదిష్టధృష్టకరూషకాన్ ।
నరిష్యంతం పృషధ్రం చ నభగం చ కవిం విభుః ।। 12

భారత - ఓ భరత వంశీయుడా!, తతః - ఆ సూర్యుని వలన, సంజ్ఞాయామ్ - సంజ్ఞయందు, శ్రాద్ధదేవః మనుః - శ్రాద్ధదేవ మనువు, ఆస - కలిగెను, ఆత్మవాన్ - మనీషి, విభుః - శక్తిమంతుడు అగు, సః - ఆ

మనువు, శ్రద్ధాయామ్ - శ్రద్ధయందు, ఇక్ష్వాకునృగశర్యాతిదిష్టధృష్టకరూషకాన్ - ఇక్ష్వాకువును నృగుని శర్యాతిని దిష్టుని ధృష్టుని కరూషకుని, నరిష్యంతమ్ - నరిష్యంతుని, పృషధ్రం చ - పృషధ్రుని, నభగం చ - నభగుని, కవిమ్ - కవిని, దశ - పదిమంది, పుత్రాన్ - పుత్రులను, జనయామాస - కనెను.

భరత వంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! ఆ సూర్యునకు సంజ్ఞయందు శ్రాద్ధదేవ మనువు పుత్రుడై పుట్టెను. శక్తిమంతుడు మరియు మనీషి అగు ఆ మనువునకు శ్రద్ధయందు పదిమంది పుత్రులు కలిగిరి. ఇక్ష్వాకువు, నృగుడు, శర్యాతి, దిష్టుడు, ధృష్టుడు, కరూషకుడు, నరిష్యంతుడు, పృషధ్రుడు, నభగుడు, కవి అనునవి వారి పేర్లు.

అప్రజస్య మనోః పూర్వం వసిష్ఠో భగవాన్ కిల ।
మిత్రావరుణయోరిష్టిం ప్రజార్థమకరోత్ప్రభుః ॥ 13

పూర్వమ్ - పూర్వము, అప్రజస్య - సంతానము లేని, మనోః - మనువునకు, భగవాన్ - పూజనీయుడు, ప్రభుః - సమర్థుడు అగు, వసిష్ఠః - వసిష్ఠుడు, ప్రజా-అర్థమ్ - సంతానము కొరకై, మిత్రావరుణయోః - మిత్రుడు-వరుణుల, ఇష్టిమ్ - యాగమును, అకరోత్ కిల - చేసెనట.

ఇక్ష్వాకుడు మొదలగు పుత్రులు పుట్టుటకు ముందు, వైవస్వత మనువునకు సంతానము లేకుండెను. సమర్థుడగు వసిష్ఠ భగవానుడు అప్పుడు సంతానము కొరకై మనువుచే మిత్రుడు-వరుణుడు దేవతలుగా గల యజ్ఞమును చేయించెనట.

తత్ర శ్రద్ధా మనోః పత్నీ హోతారం సమయాచత ।
దుహిత్రర్థముపాగమ్య ప్రణిపత్య పయోవ్రతా ॥ 14

తత్ర - ఆ యజ్ఞమునందు, మనోః - మనువుయొక్క, పత్నీ - భార్య, పయోవ్రతా - పాలను మాత్రమే ఆహారముగా తీసుకొనే వ్రతమును కలిగియున్న, శ్రద్ధా - శ్రద్ధ, హోతారమ్ - హోతను, ఉపాగమ్య - సమీపించి, ప్రణిపత్య - ప్రణమిల్లి, దుహితృ-అర్థమ్ - కుమార్తె కొరకై, సమయాచత - కోరెను.

ఆ యజ్ఞమునందు మనువుయొక్క ధర్మపత్నియగు శ్రద్ధాదేవి యజ్ఞనియమమునుసరించి కేవలము పాలను మాత్రమే ఆహారముగా తీసుకొనుచుండెను. ఆమె హోత (హోమమునకు ముందు దేవతలను ఆహ్వానించే ఋత్విక్కు) వద్దకు వెళ్లి ఆయనకు ప్రణమిల్లి, తనకు కుమార్తె కలుగునట్లుగా దేవతలను ప్రార్థించుమని కోరెను.

ప్రేషితోఽధ్వర్యుణా హోతా ధ్యాయంస్తత్సుసమాహితః ।
హవిషి వ్యచరత్తేన వషట్కారం గృణన్ ద్విజః ॥ 15

అధ్వర్యుణా - అధ్వర్యునిచే, ప్రేషితః - ప్రేష ఈయబడిన, హోతా - హోతయగు, ద్విజః - బ్రాహ్మణుడు, హవిషి - హవిస్సు (స్వీక రించబడగా), తత్ - ఆ వచనమును, సుసమాహితః - మిక్కిలి ఏకాగ్ర మగు చిత్తము గలవాడై, ధ్యాయన్ - ధ్యానించుచున్నవాడై, వషట్కారమ్ - వషట్ అనే మంత్రమును, గృణన్ - ఉచ్చరించువాడై, తేన - ఆ హవి స్సుతో, వ్యచరత్ - హోమము చేసెను.

అధ్వర్యుడు హోమమును చేయుమని నిర్దేశించగానే హోతయగు బ్రాహ్మణుడు హవిస్సును చేతిలోకి తీసుకొనెను. ఆయన మిక్కిలి ఏకాగ్ర మగు చిత్తముతో శ్రద్ధ చెప్పిన ఆ వచనమునే ధ్యానిస్తూ, వషట్ అనే మంత్రమునుచ్చరించి ఆ హవిస్సును హోమము చేసెను.

హోతుస్తద్వ్యభిచారేణ కన్యేలా నామ సాభవత్ ।
తాం విలోక్య మనుః ప్రాహ నాతిహృష్టమనా గురుమ్ ॥ 16

హోతుః - హోతయొక్క, తద్-వ్యభిచారేణ - అట్టి తప్పుగా ఉచ్చ రించుట (ఆచరించుట) చే, సా - ఆ, ఇలా నామ - ఇలయని ప్రసిద్ధి గాంచిన, కన్యా - కన్య, అభవత్ - కలిగెను, మనుః - మనువు, తామ్ - ఆమెను, విలోక్య - చూచి, న-అతిహృష్టమనాః - మిక్కిలి సంతోషించని మనస్సు గలవాడై, గురుమ్ - గురువగు వసిష్ఠుని ఉద్దేశించి, ప్రాహ - పలికెను.

ఆ విధముగా హోత తప్పుగా సంకల్పించి హోమమును చేయుటచే ఇల (వాక్కు) అని ప్రసిద్ధి గాంచిన కన్య పుట్టెను. ఆమెను చూచి మనువు చాల సంతోషపడలేదు. ఆయన గురువగు వసిష్ఠునితో నిట్లనెను.

భగవన్ కిమిదం జాతం కర్మ వో బ్రహ్మవాదినామ్ ।
విపర్యయమహో కష్టం మైవం స్యాద్బ్రహ్మవిక్రియా ॥ 17

భగవన్ - ఓ పూజనీయా!, బ్రహ్మవాదినామ్ - బ్రహ్మవేత్తలగు, వః - మీయొక్క, ఇదమ్ - ఈ, కర్మ - కర్మ, విపర్యయమ్ - విపరీతము, కిమ్ - ఏ విధముగా, జాతమ్ - అయినది?, అహో - అయ్యో!, కష్టమ్ - కష్టము!, ఏవమ్ - ఈ తీరున, బ్రహ్మవిక్రియా - మంత్రము విపరీతముగనగుట, మా స్యాత్ - కారాదు.

ఓ పూజనీయా! బ్రహ్మవేత్తలగు మీయొక్క కర్మ విపరీతము ఎట్లు అయినది? అయ్యో కష్టము! ఈ తీరున మంత్రము విపరీతము కారాదు.

యూయం మంత్రవిదో యుక్తాస్తపసా దగ్ధకిల్బిషాః ।
కుతస్సంకల్పవైషమ్యమనృతం విబుధేష్వివ ॥ 18

యూయమ్ - తమరు, మంత్రవిదః - మంత్రములు తెలిసినవారు, తపసా - తపస్సుతో, యుక్తాః - కూడియున్నవారు, దగ్ధకిల్బిషాః - దహించివేయబడిన దోషములు గలవారు, విబుధేషు ఇవ - దేవతల (విద్వాంసుల) యందు, అనృతం ఇవ - అసత్యము వలె, సంకల్పవైషమ్యమ్ - సంకల్పము విపరీతమగుట, కుతః - ఎందువలన?

తమరు మంత్రవేత్తలు, తపస్సంపన్నులు. మీయందు సకలదోషములు దహించి వేయబడినవి. అట్టి మీరు చేసిన సంకల్పము విపరీతమగుటకు కారణమేమి? దేవతల (విద్వాంసుల) యందు అసత్యము ఉండగల్గునా?

తన్నిశమ్య వచస్తస్య భగవాన్ ప్రపితామహః ।
హోతుర్వ్యతిక్రమం జ్ఞాత్వా బభాషే రవినందనమ్ ॥ 19

భగవాన్ - పూజనీయుడు, ప్రపితామహః - ముత్తాత అగు వసిష్ఠుడు, తస్య - ఆ మనువుయొక్క, తత్ - ఆ, వచః - మాటను, నిశమ్య - విని, హోతుః - హోతయొక్క, వ్యతిక్రమమ్ - అపరాధమును, జ్ఞాత్వా - తెలుసుకొని, రవినందనమ్ - సూర్యపుత్రుడగు మనువును ఉద్దేశించి, బభాషే - పలికెను.

పూజనీయుడగు వసిష్ఠుడు మనువునకు ముత్తాత. ఆయన సూర్య పుత్రుడగు మనువు చెప్పిన ఆ మాటను విని హోత విపరీతముగా చేసినాడని తెలుసుకొనెను. అపుడాయన మనువుతో నిట్లనెను.

ఏతత్సంకల్ప వైషమ్యం హోతుస్తే వ్యభిచారతః ।
తథాపి సాధయిష్యే తే సుప్రజాస్త్వం స్వతేజసా ॥ 20

తే - నీయొక్క, హోతుః - హోతయొక్క, వ్యభిచారతః - అసందర్భముగా ధ్యానించుట అనే తప్పు వలన, ఏతత్ - ఈ, సంకల్పవైషమ్యమ్ - సంకల్పమునకు విపరీతము, తథాపి - అయినప్పటికీ, స్వతేజసా - నాయొక్క తేజస్సుతో, తే - నీ కొరకు, సుప్రజాస్త్వమ్ - చక్కని సంతానమును కలిగియుండుటను, సాధయిష్యే - సాధించి పెట్టెదను.

నీ హోత అసందర్భముగా ధ్యానమును చేయుట వలననే, ఈ విధముగా నీ సంకల్పమునకు విపరీతమగు ఫలము కలిగినది. అయిననూ పోయినదేమీ లేదు. నేను నా తేజస్సుతో నీకు చక్కని పుత్రసంతానము కలుగునట్లు చేసెదను.

ఏవం వ్యవసితో రాజన్ భగవాన్ స మహాయశాః ।
అస్తౌషీదాదిపురుషమిలాయాః పుంస్త్వకామ్యయా ॥ 21

రాజన్ - ఓ మహారాజా!, భగవాన్ - పూజనీయుడు, మహాయశాః - గొప్ప కీర్తి గలవాడు అగు, సః - ఆ వసిష్ఠుడు, ఏవమ్ - ఈ విధముగా, వ్యవసితః - నిశ్చయించుకున్నవాడై, ఇలాయాః - ఇలకు, పుంస్త్వకామ్యయా - మగదనమునందలి కోరికతో, ఆదిపురుషమ్ - జగత్కారణుడగు పురుషోత్తముని, అస్తౌషీత్ - స్తోత్రము చేసెను.

పూజనీయుడగు వసిష్ఠుడు గొప్ప కీర్తి గలవాడు. ఆయన ఈ విధ ముగా నిశ్చయించుకొని, ఇలను మగవానిగా మార్చాలనే కోరికతో జగత్కా రణుడగు పురుషోత్తముని స్తుతించెను.

తస్మై కామవరం తుష్టో భగవాన్ హరిరీశ్వరః ।
దదావిలాఽభవత్తేన సుద్యుమ్నః పురుషర్షభః ।। 22

ఈశ్వరః - జగన్నాథుడగు, భగవాన్ హరిః - శ్రీహరి భగవానుడు, తస్మై - ఆ వసిష్ఠుని కొరకు, తుష్టః - సంతసించినవాడై, కామవరమ్ - కోరిన వరమును, దదౌ - ఇచ్చెను, తేన - దానిచే, ఇలా - ఇల, సుద్యుమ్నః - సుద్యుమ్నుడనే, పురుష-ఋషభః - గొప్ప పురుషుడు, అభవత్ - ఆయెను.

జగన్నాథుడగు శ్రీహరి భగవానుడు ఆ వసిష్ఠుని యెడల సంతో షించి కోరిన వరమును ఇచ్చెను. ఆ వరముచే ఇల సుద్యుమ్నుడనే గొప్ప పురుషుడుగా మారిపోయెను.

స ఏకదా మహారాజ విచరన్మృగయాం వనే ।
వృతః కతిపయామాత్యైరశ్వమారుహ్య సైంధవమ్ ।। 23

మహారాజ - ఓ మహారాజా!, ఏకదా - ఒకనాడు, సః - ఆ సుద్యు మ్నుడు, కతిపయ-అమాత్యైః - కొందరు మంత్రులతో, వృతః - చుట్టువా రబడినవాడై, సైంధవమ్ - సింధుదేశమునందు పుట్టిన, అశ్వమ్ - గుర్ర మును, ఆరుహ్య - ఎక్కి, వనే - అడవియందు, మృగయామ్ - వేటను, విచరన్ - సంచరించువాడు.

ఓ పరీక్షిన్మహారాజా! ఒకనాడా సుద్యుమ్నుడు కొందరు మంత్రులు చుట్టువారి రాగా, సింధుదేశమునందు పుట్టిన (మంచి) గుర్రము నెక్కి అడవికి వేటకు వెళ్లెను.

ప్రగృహ్య రుచిరం చాపం శరాంశ్చ పరమాద్భుతాన్ ।
దంశితోఽనుమృగం వీరో జగామ దిశముత్తరామ్ ।। 24

దంశితః - కవచమును ధరించిన, వీరః - వీరుడగు సుద్యుమ్నుడు, రుచిరమ్ - అందమగు, చాపమ్ - ధనుస్సును, పరమ-అద్భుతాన్ - మిక్కిలి అచ్చెరువును గొలిపే, శరాన్ చ - బాణములను కూడ, ప్రగృహ్య - పట్టుకొని, అనుమృగమ్ - మృగముల వెంబడి, ఉత్తరాం దిశమ్ - ఉత్తర దిక్కు వైపు, జగామ - వెళ్లెను.

వీరుడగు సుద్యుమ్నుడు కవచమును వేసుకొని, అందమైన ధనుస్సును మరియు మిక్కిలి అచ్చెరువును గొలిపే బాణములను కూడ పట్టుకొని, మృగముల వెంబడి ఉత్తరదిక్కు వైపునకు వెళ్లెను.

స కుమారో వనం మేరోరధస్తాత్ప్రవివేశ హ ।
యత్రాస్తే భగవాన్ శర్వో రమమాణస్సహోమయా ।। 25

సః - ఆ, కుమారః - సుద్యుమ్న కుమారుడు, మేరోః - మేరు పర్వతముయొక్క, అధస్తాత్ - క్రింద, వనమ్ - అడవిని, ప్రవివేశ హ - ప్రవేశించెను, యత్ర - ఎచ్చటనైతే, భగవాన్ శర్వః - శివ భగవానుడు, ఉమయా సహ - పార్వతితో గూడి, రమమాణః - రమించుచున్నవాడై, ఆస్తే - ఉన్నాడో.

ఆ సుద్యుమ్న కుమారుడు మేరు పర్వతమునకు క్రిందనుండే ఇలావృతమనే అడవిలోనికి ప్రవేశించెను. ఆ అడవిలో సంహారకర్తయగు శివ భగవానుడు పార్వతితో కూడి రమించుచుండును.

తస్మిన్ ప్రవిష్ట ఏవాసౌ సుద్యుమ్నః పరవీరహా ।
అపశ్యత్ స్త్రియమాత్మానమశ్వం చ వడవాం నృప ।। 26

నృప - ఓ రాజా!, తస్మిన్ - ఆ అడవియందు, ప్రవిష్టః ఏవ - ప్రవేశిస్తూనే, పరవీరహా - శత్రువీరులను దునుమాడే, అసౌ - ఈ, సుద్యుమ్నః - సుద్యుమ్నుడు, ఆత్మానమ్ - తనను, స్త్రియమ్ - స్త్రీనిగను, చ - మరియు, అశ్వమ్ - గుర్రమును, వడవామ్ - ఆడుగుర్రముగను, అపశ్యత్ - కనుగొనెను.

ఓ పరీక్షిన్మహారాజా! సుద్యుమ్నుడు శత్రువీరులను దునుమాడే వీరుడు. ఆతడు ఆ అడవిలోనికి ప్రవేశిస్తూనే, తాను స్త్రీగను మరియు తన గుర్రము అడు గుర్రముగను మారిపోయినట్లు కనుగొనెను.

తథా తదనుగాస్సర్వే ఆత్మలింగవిపర్యయమ్ ।
దృష్ట్వా విమనసోఽభూవన్ వీక్షమాణాః పరస్పరమ్ ॥ 27

తథా - అదే విధముగా, తద్-అనుగాః - ఆయన అనుచరులు, సర్వే - అందరు, ఆత్మలింగవిపర్యయమ్ - తమ లింగము మారిపోవుట ను, దృష్ట్వా - కనుగొని, పరస్పరమ్ - ఒకరినొకరు, వీక్షమాణాః - చూచు చున్నవారై, విమనసః - చెడిన మనస్సులు గలవారు, అభూవన్ - అయిరి.

ఆ సుద్యుమ్నుని అనుచరులందరు తాము కూడ సుద్యుమ్నుని వలెనే స్త్రీలమైతిమని కనుగొని, ఒకరినొకరు చూచుకొనుచుండిరి. వారి మనస్సులు చెడిపోయెను.

రాజోవాచ ।
కథమేవంగుణో దేశః కేన వా భగవాన్ కృతః ।
ప్రశ్నమేనం సమాచక్ష్వ పరం కౌతూహలం హి నః ॥ 28

భగవన్ - ఓ పూజనీయా!, ఏవంగుణః - ఇట్టి లక్షణములు గల, దేశః - స్థానము, కథమ్ - ఎట్లు, కేన వా - ఎవనిచే, కృతః - చేయబడి నది?, ఏనమ్ - ఈ, ప్రశ్నమ్ - ప్రశ్నను, సమాచక్ష్వ - చక్కగా బదులిడు ము, హి - ఏలయనగా, నః - మాకు, కౌతూహలమ్ - కుతూహలము, పరమ్ - అతిశయించినది.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను -- పూజనీయుడవగు ఓ శుక మహర్షీ! ఆ స్థానమునకు ఆ లక్షణము (మగవానిని స్త్రీగా చేయుట) ను ఎవరు ఎట్లు కలిగించిరి? ఈ ప్రశ్నకు బదులిండు. ఎందుకంటే, మాకీ విష యమును తెలుసుకోవాలనే అధికమగు ఉత్కంఠ గలదు.

శ్రీశుక ఉవాచ ।
ఏకదా గిరిశం ద్రష్టుమృషయస్తత్ర సువ్రతాః ।
దిశో వితిమిరాభాసాః కుర్వంతస్సముపాగమన్ ॥ 29

సువ్రతాః - చక్కని వ్రతనిష్ఠ గల, ఋషయః - మహర్షులు, ఏకదా - ఒకనాడు, దిశః - దిక్కులను, వితిమిర-ఆభాసాః - తొలగిన చీకట్లను కలిగి ఇతరమును వెలవెలబోవునట్లుగా, కుర్వంతః - చేయుచున్నవారై, తత్ర - ఆ ఇలావృత వనమునందు, గిరిశమ్ - రుద్రుని, ద్రష్టుమ్ - చూచుటకై, సముపాగమన్ - విచ్చేసిరి.

చక్కని వ్రతనిష్ఠగల మహర్షులు ఒకనాడు రుద్రుని దర్శించుటకై ఆ ఇలావృత వనమునకు విచ్చేసిరి. వారి కాంతులచే దిక్కుల చీకట్లు తొలగిపోయెను. వారి ప్రకాశము ముందు సర్వము వెలవెల బోవుచుండెను.

తాన్ విలోక్యాంబికా దేవీ వివాసా వ్రీడితా భృశమ్ ।
భర్తురంకాత్సముత్థాయ నీవీమాశ్వథ పర్యధాత్ ॥ 30

వివాసా - తొలగిన వస్త్రము గల, అంబికా దేవీ - పార్వతీ దేవి, తాన్ - వారిని, విలోక్య - చూచి, భృశమ్ - మిక్కిలి, వ్రీడితా - సిగ్గు పడినదై, ఆశు - వెంటనే, భర్తుః - భర్తయొక్క, అంకాత్ - అంకమునుండి, సముత్థాయ - పైకి లేచి, అథ - అప్పుడు, నీవీమ్ - నడుము వస్త్రమును, పరి-అధాత్ - చుట్టూ సర్దుకొనెను.

వస్త్రము తొలగియున్న పార్వతీదేవి వారిని చూచి చాల సిగ్గుపడి రుద్రుని అంకమునుండి వెంటనే పైకి లేచి, నడుము చుట్టూ వస్త్రమును సర్దుకొనెను.

ఋషయోఽపి తయోర్వీక్ష్య ప్రసంగం రమమాణయోః ।
నివృత్తాః ప్రయయుస్తస్మాన్నరనారాయణాశ్రమమ్ ॥ 31

ఋషయః అపి - మహర్షులు కూడ, రమమాణయోః - రమించుచున్న, తయోః - వారిద్దరియొక్క, ప్రసంగమ్ - రతియందలి ఆసక్తిని, వీక్ష్య - చూచి, తస్మాత్ - అచ్చటనుండి, నివృత్తాః - వెనుకకు మరలినవా

రై, నరనారాయణ-ఆశ్రమమ్ - నరనారాయణుల ఆశ్రమమును గురించి, ప్రయయుః - వెళ్లిరి.

పార్వతి, రుద్రుడు పరస్పరము అధికమగు ఆసక్తితో రమించుటను గాంచిన ఆ మహర్షులైతే అచటనుండి వెనుకకు మరలి, నరనారాయణుల ఆశ్రమమునకు వెళ్లిరి.

తదిదం భగవానాహ ప్రియాయాః ప్రియకామ్యయా ।
స్థానం యః ప్రవిశేదేతత్స వై యోషిద్భవేదితి ।। 32

తత్ - అప్పుడు, భగవాన్ - రుద్ర భగవానుడు, ప్రియాయాః - ప్రియురాలగు పార్వతికి, ప్రియకామ్యయా - ప్రియమును చేయవలెననే కోరికతో, ఇదమ్ - ఈ మాటను, ఆహ - పలికెను, యః - ఎవడైతే, ఏతత్ - ఈ, స్థానమ్ - స్థానమును, ప్రవిశేత్ - ప్రవేశించునో, సః - అట్టివాడు, వై - నిశ్చయముగా, యోషిత్ - స్త్రీ, భవేత్ - అగును, ఇతి - అని.

అప్పుడు రుద్ర భగవానుడు తన ప్రియురాలగు పార్వతికి ప్రియమును చేయగోరి ఇట్లు పలికెను -- ఎవడైతే ఈ స్థానమునకు వచ్చునో, అట్టివాడు స్త్రీ అయి తీరును, అని.

తత ఊర్ధ్వం వనం తద్వై పురుషా వర్జయంతి హి ।
సా చానుచరసంయుక్తా విచచార వనాద్వనమ్ ।। 33

తతః - ఆ రుద్రుని శాపముకంటె, ఊర్ధ్వమ్ - తరువాత, తత్ - ఆ, వనమ్ - ఇలావృత వనమును, పురుషాః - మగవారు, వై - నిశ్చయముగా, వర్జయంతి హి - విడిచి పెట్టుచున్నారు, సా చ - ఆ ఇల కూడ, అనుచరసంయుక్తా - అనుచరులతో కూడినదై, వనాత్ - ఉద్యానమునుండి, వనమ్ - ఉద్యానమును గురించి, విచచార - సంచరించెను.

రుద్రుని ఆ విధముగా శపించిన తరువాతి కాలములో మగవారు ఆ ఇలావృత వనమునకు ఆమడ దూరములో నుండజొచ్చిరి. ఇలగా మారిన సుద్యుమ్నుడు స్త్రీలుగా మారిన తన అనుచరులు వెంటరాగా, అచట ఒక ఉద్యానమునుండి మరియొక ఉద్యానమునకు విహరించెను.

అథ తామాశ్రమాభ్యాశే చరంతీం ప్రమదోత్తమామ్ ।
స్త్రీభిః పరివృతాం వీక్ష్య చకమే భగవాన్ బుధః ॥ 34

అథ - తరువాత, ఆశ్రమ-అభ్యాశే - ఆశ్రమమునకు సమీపమునందు, చరంతీమ్ - సంచరించుచున్నట్టియు, స్త్రీభిః - స్త్రీలచే, పరివృతామ్ - చుట్టువారబడి యున్నట్టియు, ప్రమద-ఉత్తమామ్ - మత్తెక్కించే యువతులలో గొప్పదియగు, తామ్ - ఆ ఇలను, వీక్ష్య - చూచి, భగవాన్ - పూజనీయుడగు, బుధః - బుధుడు, చకమే - కామించెను.

తరువాత తన ఆశ్రమమునకు దగ్గరలో స్త్రీలు చుట్టువారి రాగా విహరించుచున్న ఆ ఇలను బుధుడు చూచెను. మత్తెక్కించే సుందరులలో గొప్పదియగు ఆమెను బుధుడు కామించెను.

సాఽపి తం చకమే సుభ్రూస్సోమరాజసుతం పతిమ్ ।
స తస్యాం జనయామాస పురూరవసమాత్మజమ్ ॥ 35

సుభ్రూః - చక్కని కనుబొమలు గల, సా అపి - ఆ ఇల కూడ, సోమరాజసుతమ్ - లతలకు రాజగు చంద్రుని పుత్రుడైన, తమ్ - ఆ బుధుని, పతిమ్ - భర్తనుగా, చకమే - ప్రేమించెను, సః - ఆ బుధుడు, తస్యామ్ - ఆమెయందు, పురూరవసమ్ - పురూరవుడనే, ఆత్మజమ్ - పుత్రుని, జనయామాస - కనెను.

బుధుడు ఓషధులకు ప్రభువగు చంద్రుని పుత్రుడు. చక్కని కనుబొమలు గల ఆ ఇల బుధుని ప్రేమించి ఆయన తన భర్త కావాలని కోరెను. బుధునకు ఆమెయందు పురూరవుడనే పుత్రుడు కలిగెను.

ఏవం స్త్రీత్వమనుప్రాప్తస్సుద్యుమ్నో మానవో నృపః ।
సస్మార స్వకులాచార్యం వసిష్ఠమితి శుశ్రుమ ॥ 36

మానవః - మనుపుత్రుడైన, సుద్యుమ్నః నృపః - సుద్యుమ్న మహారాజు, ఏవమ్ - ఈ విధముగా, స్త్రీత్వమ్ - స్త్రీత్వమును, అనుప్రాప్తః - శాపముననుసరించి పొందినవాడై, స్వకుల-ఆచార్యమ్ - తమ

కులగురువగు, వసిష్ఠమ్ - వసిష్ఠుని, సస్మార - స్మరించెను, ఇతి - అని, శుశ్రుమ - వినియున్నాము.

మనుపుత్రుడగు సుద్యుమ్న మహారాజు ఈ విధముగా స్త్రీగా మారిపోయెను. ఆయన తమ కులగురువగు వసిష్ఠుని స్మరించెనని మేము వింటిమి.

స తస్య తాం దశాం దృష్ట్వా కృపయా భృశపీడితః ।
సుద్యుమ్నస్యాశయన్ పుంస్త్వముపాధావత శంకరమ్ ॥ 37

సః - ఆ వసిష్ఠుడు, తస్య - ఆ సుద్యుమ్నునియొక్క, తామ్ - ఆ, దశామ్ - అవస్థను, దృష్ట్వా - చూచి, కృపయా - దయచే, భృశపీడితః - అధికమగు పీడను పొందినవాడై, సుద్యుమ్నస్య - సుద్యుమ్నునకు, పుంస్త్వమ్ - మగవాడగుటను, ఆశయన్ - కోరువాడై, శంకరమ్ - శంకరుని, ఉపాధావత - సేవించెను.

ఆ వసిష్ఠుడు సుద్యుమ్నుని ఆ అవస్థను గాంచి, దయచే మనస్సులో చాల కష్టపడెను. అపుడాయన సుద్యుమ్నుడు మరల మగవాడు కావాలనే కోరికతో శంకరుని సేవించెను.

తుష్టస్తస్మై స భగవానృషయే ప్రియమావహన్ ।
స్వాం చ వాచమృతాం కుర్వన్నిదమాహ విశాం పతే ॥ 38

విశాం పతే - ఓ నరేంద్రా!, సః - ఆ, భగవాన్ - శంకర భగవానుడు, తస్మై - ఆ, ఋషయే - వసిష్ఠ మహర్షి కొరకి, తుష్టః - సంతుష్టుడై, ప్రియమ్ - ప్రీతిని, ఆవహన్ - కలిగించువాడై, స్వామ్ - తన, వాచం చ - మాటను కూడ, ఋతామ్ - సత్యమునుగా, కుర్వన్ - చేయుచున్నవాడై, ఇదమ్ - ఈ మాటను, ఆహ - పలికెను.

ఓ పరీక్షిన్మహారాజా! ఆ శంకర భగవానుడు ఆ వసిష్ఠ మహర్షి విషయములో సంతుష్టుడాయెను. ఆయన ఆ మహర్షికి ప్రీతిని కలిగించ గోరెను. ఆయన తన శాపవాక్యమును కూడ సత్యము చేయుచున్నవాడై, ఇట్లు పలికెను.

మాసం పుమాన్ స భవితా మాసం స్త్రీ తవ గోత్రజః ।
ఇత్థం వ్యవస్థయా కామం సుద్యుమ్నోఽవతు మేదినీమ్ ।। 39

తవ - నీయొక్క, గోత్రజః - శిష్యుడగు, సః - ఆతడు, మాసమ్ - నిండా నెల రోజులు, పుమాన్ - పురుషుడు, మాసమ్ - నెల రోజులను, స్త్రీ - స్త్రీ, భవితా - కాగలడు, సుద్యుమ్నః - సుద్యుమ్నుడు, ఇత్థమ్ - ఈ విధముగా, వ్యవస్థయా - ఏర్పాటుచే, కామమ్ - యథేచ్ఛగా, మేదినీమ్ - భూమిని, అవతు - పాలించుగాక!

నీ శిష్యుడగు సుద్యుమ్నుడు నిండా నెల రోజులు మగవాడుగను, ఇంకో నెల స్త్రీగను అగును. ఈ విధమైన ఏర్పాటుతో ఆతడు యథేచ్ఛగా భూమిని పాలించుగాక!

ఆచార్యానుగ్రహాత్కామం లబ్ధ్వా పుంస్త్వం వ్యవస్థయా ।
పాలయామాస జగతీం నాభ్యనందన్ స్మ తం ప్రజాః ।। 40

ఆచార్య-అనుగ్రహాత్ - గురువగు వసిష్ఠుని అనుగ్రహము వలన, వ్యవస్థయా - ఏర్పాటుతో, కామమ్ - కోరబడుచున్న, పుంస్త్వమ్ - మగదనమును, లబ్ధ్వా - పొంది, (కామమ్ - యథేచ్ఛగా), జగతీమ్ - భూమిని, పాలయామాస - పాలించెను, తమ్ - ఆయనను, ప్రజాః - ప్రజలు, న అభ్యనందన్ - మెచ్చలేదు.

గురువగు వసిష్ఠుని అనుగ్రహము వలన సుద్యుమ్నుడు తాను కోరుచున్న మగదనమును ఒక పద్ధతిలో (నెల రోజులు మగ, నెల ఆడ) పొంది, భూమిని యథేచ్ఛగా పాలించెను. కాని, జనులు ఆయనను (నెల రోజులు కనబడక పోవుటచే) మెచ్చలేదు.

తస్యోత్కలో గయో రాజన్ విమలశ్చ సుతాస్త్రయః ।
దక్షిణాపథరాజానో బభూవుర్ధర్మవత్సలాః ।। 41

రాజన్ - ఓ రాజా!, తస్య - ఆయనకు, ఉత్కలః - ఉత్కలుడు, గయః - గయుడు, చ - మరియు, విమలః - విమలుడు అనే, త్రయః - ముగ్గురు, సుతాః - కొడుకులు, ధర్మవత్సలాః - ధర్మమునందు ప్రేమగల

వారలు, దక్షిణాపథరాజానః - దక్షిణదేశమునకు రాజులు, బభూవుః - అయిరి.

ఆ సుద్యుమ్నునకు ఉత్కలుడు, గయుడు, విమలుడు అనే ముగ్గురు కొడుకులు కలిగిరి. వారు ధర్మమునందు ప్రేమ గలవారు. వారు దక్షిణదేశమునకు రాజులైరి.

తతః పరిణతే కాలే ప్రతిష్ఠానపతిః ప్రభుః ।
పురూరవస ఉత్సృజ్య గాం పుత్రాయ గతో వనమ్ ॥ 42

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే నవమస్కంధే ప్రథమోఽధ్యాయః ॥

తతః - తరువాత, కాలే - కాలమునందు, పరిణతే - పెద్దతనము రాగా, ప్రతిష్ఠానపతిః - ప్రతిష్ఠాన నగరమునకు అధిపతియగు, ప్రభుః - సుద్యుమ్న మహారాజు, గామ్ - భూమిని, పుత్రాయ - పుత్రుడగు, పురూరవసే - పురూరవుని కొరకు, ఉత్సృజ్య - అప్పజెప్పి, వనమ్ - అడవిని గురించి, గతః - వెళ్లినవాడు.

ప్రతిష్ఠాన నగరమును రాజధానిగా చేసుకొని పాలించిన సుద్యుమ్న మహారాజు తరువాత చాల కాలమునకు పెద్దవాడాయెను. అపుడాయన రాజ్యమును తన పుత్రుడగు పురూరవునకు అప్పజెప్పి వనమునకు (తపస్సు కొరకై) వెళ్లెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
సుద్యుమ్న చరితమును వర్ణించే మొదటి
అధ్యాయము ముగిసినది (1).



# అథ ద్వితీయోఽధ్యాయః

## పృషధ్రుడు మొదలగు మనుపుత్రుల వంశములు

శ్రీశుక ఉవాచ।
ఏవం గతేఽథ సుద్యుమ్నే మనుర్వైవస్వతస్సుతే ।
పుత్రకామస్తపస్తేపే యమునాయాం శతం సమాః ॥ 1

ఏవమ్ - ఈ విధముగా, సుతే - పుత్రుడగు, సుద్యుమ్నే - సుద్యుమ్న మహారాజు, గతే - వెళ్లగా, అథ - తరువాత, వైవస్వతః మనుః - వైవస్వత మనువు, పుత్రకామః - పుత్రులను కోరువాడై, యమునాయామ్ - యమునా నదీతీరమునందు, శతమ్ - వంద, సమాః - సంవత్సరములను, తపః - తపస్సును, తేపే - చేసెను.

ఈ విధముగా (పుత్రునకు రాజ్యమును అప్పజెప్పి) తన పుత్రుడగు సుద్యుమ్నుడు అడవికి వెళ్లగా, వైవస్వత మనువు (శ్రాద్ధదేవుడు) పుత్రులను గోరి యమునా నదీతీరమునందు నిరంతరముగా వంద సంవత్సరములు తపస్సును చేసెను.

తతోఽయజన్మనుర్దేవమపత్యార్థం హరిం ప్రభుమ్ ।
ఇక్ష్వాకుపూర్వజాన్ పుత్రాంల్లేభే స్వసదృశాన్ దశ ॥ 2

తతః - ఆ తపస్సునందు, మనుః - మనువు, అపత్య-అర్థమ్ - సంతానము కొరకై, ప్రభుమ్ - జగన్నాథుడగు, హరిం దేవమ్ - శ్రీహరి భగవానుని, అయజత్ - ఆరాధించెను, ఇక్ష్వాకుపూర్వజాన్ - ఇక్ష్వాకుడు పెద్ద కొడుకుగా గల, స్వసదృశాన్ - తనతో సమానమైన, దశ - పదిమంది, పుత్రాన్ - పుత్రులను, లేభే - పొందెను.

ఆ తపస్సులో మనువు సంతానము కొరకై జగన్నాథుడగు శ్రీహరి భగవానుని ఆరాధించి, పదిమంది తనతో సమానులైన పుత్రులను పొందెను. వారిలో ఇక్ష్వాకుడు పెద్దవాడు.

పృషధ్రస్తు మనోః పుత్రో గోపాలో గురుణా కృతః ।
పాలయామాస గా యత్తో రాత్ర్యాం వీరాసనవ్రతః ।। 3

మనోః - మనువుయొక్క, పుత్రః - పుత్రుడగు, పృషధ్రః తు - పృషధ్రుడైతే, గురుణా - గురువగు వసిష్ఠునిచే, గోపాలః - గోవులకు రక్షకుడుగా, కృతః - నియోగించ బడినవాడు, రాత్ర్యామ్ - రాత్రియందు, వీరాసనస్థితః - వీరాసనమునందున్నవాడై, యత్తః - సావధానుడై, గాః - గోవులను, పాలయామాస - రక్షించెను.

మనువు పుత్రుడగు పృషధ్రుని గురువగు వసిష్ఠుడు గోవులను రక్షించే పనిలో నియమించెను. ఆతడు రాత్రియందు సావధానముగా వీరాసనము (కత్తి చేతబట్టి మేల్కొనియుండుట) నందున్నవాడై గోవులను పాలించెను.

ఏకదా ప్రావిశద్గోష్ఠం శార్దూలో నిశి వర్షతి ।
శయానా గావ ఉత్థాయ భీతాస్తా బభ్రముర్వ్రజే ।। 4

ఏకదా - ఒకనాడు, నిశి - రాత్రియందు, వర్షతి - వర్షించుచుండగా, శార్దూలః - పెద్దపులి, గోష్ఠమ్ - గోవుల కొట్టమును, ప్రావిశత్ - ప్రవేశించెను, శయానాః - నిద్రించుచున్న, తాః - ఆ, గావః - గోవులు, ఉత్థాయ - పైకి లేచి, భీతాః - భయపడినవై, వ్రజే - గోశాలయందు, బభ్రముః - తిరుగాడినవి.

ఒకనాడు రాత్రి వర్షము పడుచుండెను. అపుడు గోశాలలోనికి ఒక పెద్ద పులి ప్రవేశించెను. పరుండియున్న గోవులు భయపడి పైకి లేచి ఆ గోశాలలో తిరుగాడ జొచ్చినవి.

ఏకాం జగ్రాహ బలవాన్ సా చుక్రోశ భయాతురా ।
తస్యాస్తత్క్రందితం శ్రుత్వా పృషధ్రోఽభిససార హ ।। 5

బలవాన్ - బలశాలియగు ఆ పులి, ఏకామ్ - ఒక గోవును, జగ్రాహ - పట్టుకొనెను, భయ-ఆతురా - భయముచే వ్యాకులమైన, సా - ఆ గోవు, చుక్రోశ - ఆక్రోశించెను, తస్యాః - ఆ గోవుయొక్క, తత్ - ఆ (దీనమైన), క్రందితమ్ - ఆక్రందనను, శ్రుత్వా - విని, పృషధ్రః - పృషధ్రుడు, అభిససార హ - పరుగు దీసెనట.

బలశాలియగు ఆ పులి ఒక గోవును పట్టుకొనగా, ఆ గోవు భయముతో కంగారు పడి ఆక్రోశించెను. దాని ఆ దీనమైన ఆక్రందనను విని పృషధ్రుడు పరుగు దీసెను.

ఖడ్గమాదాయ తరసా ప్రలీనోడుగణే నిశి ।
అజానన్నహనద్బభ్రోశ్శిరశ్శార్దూలశంకయా ।। 6

నిశి - రాత్రి, ప్రలీన-ఉడుగణే - కనబడని నక్షత్రముల గుంపులు గలది కాగా, తరసా - వేగముగా, ఖడ్గమ్ - కత్తిని, ఆదాయ - తీసుకొని, బభ్రోః - కపిలగోవుయొక్క, శిరః - తలను, శార్దూలశంకయా - పెద్దపులి అనే శంకతో, అజానన్ - తెలియనివాడై, అహనత్ - నరికెను.

మేఘములు కారణముగా నక్షత్రముల కాంతి కూడ లేని ఆ రాత్రి చీకటిలో పృషధ్రుడు సరిగా చూడలేకపోయెను. ఆయన పెద్ద పులి అని శంకించి ఒక కపిల గోవుయొక్క తలను నరికెను.

వ్యాఘ్రోఽపి వృక్ణశ్రవణో నిస్త్రింశాగ్రాహతస్తతః ।
నిశ్చక్రామ భృశం భీతో రక్తం పథి సముత్సృజన్ ।। 7

భృశమ్ - మిక్కిలి, భీతః - భయపడిన, వ్యాఘ్రః అపి - పెద్ద పులి కూడ, నిస్త్రింశ-అగ్ర-ఆహతః - కత్తియొక్క కొనచే కొట్టబడినదై, వృక్ణశ్రవణః - నరుకబడిన చెవి గలదియై, పథి - మార్గమునందు, రక్తమ్ - రక్తమును, సముత్సృజన్ - స్రవించుచున్నదై, తతః - ఆ గోష్ఠమునుండి, నిశ్చక్రామ - నిష్క్రమించెను.

కత్తి కొన తగిలి చెవి తెగిపోగా పెద్దపులి కూడ చాల భయపడెను. మార్గమునందు రక్తము స్రవించుచుండగా, అది ఆ గోశాలనుండి బయటకు పారిపోయెను.

మన్యమానో హతం వ్యాఘ్రం పృషధ్రః పరవీరహా ।
అద్రాక్షీత్స్వహతాం బభ్రుం వ్యుష్టాయాం నిశి దుఃఖితః ।। 8

పరవీరహా - శత్రువీరులను దునుమాడే, పృషధ్రః - పృషధ్రుడు, వ్యాఘ్రమ్ - పెద్దపులిని, హతమ్ - సంహరించబడినదానినిగా, మన్యమానః - తలపోయువాడై, నిశి - రాత్రి, వ్యుష్టాయామ్ - తెల్లవారగా, స్వహతామ్ - తనచే చంపబడిన, బభ్రుమ్ - కపిలగోవును, అద్రాక్షీత్ - చూచెను, దుఃఖితః - దుఃఖితుడాయెను.

పృషధ్రుడు శత్రువీరులను దునుమాడే వీరుడు. తన చేతిలో పెద్ద పులియే చచ్చినదని ఆయన తలపోసెను. రాత్రి తెల్లవారిన పిదప ఆయన చచ్చి పడియున్న కపిలగోవును చూచి దుఃఖమును పొందెను.

తం శశాప కులాచార్యః కృతాగసమకామతః ।
న క్షత్రబంధుశ్శూద్రస్త్వం కర్మణా భవితామునా ।। 9

కుల-ఆచార్యః - కులగురువగు వసిష్ఠుడు, అకామతః - చేయాలనుకోకుండా, కృత-ఆగసమ్ - చేయబడిన పాపము గల, తమ్ - ఆ పృషధ్రుని, శశాప - శపించెను, అమునా - ఈ, కర్మణా - కర్మచే, త్వమ్ - నీవు, క్షత్రబంధుః - క్షత్రియాధముడవు, న - కావు, శూద్రః - శూద్రుడవు, భవితా - కాగలవు.

పృషధ్రుడు చేయాలనుకోకుండగనే పాపమును చేసెను. అయినను, కులగురువగు వసిష్ఠుడు ఆయనను ఇట్లు శపించెను -- ఈ కర్మచే నీవు క్షత్రియాధముడుగనైననూ మిగిలియుండవు; శూద్రుడవు కమ్ము.

ఏవం శప్తస్తు గురుణా ప్రత్యగృహ్ణాత్కృతాంజలిః ।
అధారయద్వ్రతం వీర ఊర్ధ్వరేతా మునిప్రియమ్ ।। 10

గురుణా - కులగురువుచే, ఏవమ్ - ఈ విధముగా, శప్తః తు - శపించబడిన, వీరః - వీరుడగు పృషధ్రుడైతే, కృత-అంజలిః - దోసిలి యొగ్గినవాడై, ప్రత్యగృహ్ణాత్ - స్వీకరించెను, ఊర్ధ్వరేతాః - ఊర్ధ్వరేతస్కుడై, మునిప్రియమ్ - మహర్షులకు ప్రియమైన, వ్రతమ్ - బ్రహ్మచర్య వ్రతమును, అధారయత్ - ధరించెను.

కులగురువు ఈ విధముగా శపించగా, వీరుడగు పృషధ్రుడైతే శాపమును స్వీకరించెను. ఆయన ఊర్ధ్వరేతస్కుడై మునులకు ప్రియమైన బ్రహ్మచర్య వ్రతమును దృఢముగా పాటించెను.

వాసుదేవే భగవతి సర్వాత్మని పరేఽమలే ।
ఏకాంతిత్వం గతో భక్త్యా సర్వభూతసుహృత్సమః ॥ 11

సర్వభూతసుహృత్ - సకలప్రాణుల హితమును కోరువాడు, సమః - సర్వము విషయములో సమత్వము గలవాడు అగు పృషధ్రుడు, సర్వ-ఆత్మని - సర్వముయొక్క స్వరూపమైనవాడు (సర్వము రూపములోనున్నవాడు), పరే - సర్వమునకు అతీతమైనవాడు, అమలే - దోషములు లేనివాడు అగు, వాసుదేవే భగవతి - వాసుదేవ భగవానునియందు, భక్త్యా - భక్తిచే, ఏకాంతిత్వమ్ - సర్వాతిశాయియగు ప్రేమను కలిగియుండుటను, గతః - పొందినవాడు.

సర్వప్రాణుల హితమును గోరే ఆ పృషధ్రుడు సర్వమునందు సమత్వము (ఈశ్వరుని దర్శించుట) ను కలిగియుండెను. సర్వమునకు స్వరూపమై సర్వము రూపములోనున్నవాడే అయిననూ, సర్వమునకు అతీతుడై దోషరహితుడగు వాసుదేవ భగవానునియందు ఆయనకు భక్తిచే సర్వాతిశాయియగు ప్రేమ కలిగెను.

విముక్తసంగశ్శాంతాత్మా సంయతాక్షోఽపరిగ్రహః ।
యదృచ్ఛయోపపన్నేన కల్పయన్ వృత్తిమాత్మనః ॥ 12

విముక్తసంగః - తొలగిన సంసారాసక్తి గలవాడు, శాంత-ఆత్మా - ప్రశాంతమైన అంతఃకరణము గలవాడు, సంయత-అక్షః - నిగ్రహించబడిన ఇంద్రియములు గలవాడు, అపరిగ్రహః - భోగవస్తువులను ప్రోగు చేయని

వాడు, యదృచ్ఛయా - అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే), ఉపపన్నేన లభించినదానితో, ఆత్మనః - తనకు, వృత్తిమ్ - జీవికను, కల్పయన్ కల్పించుకొనువాడు.

ఆ పృషధ్రుడు సంసారాసక్తిని విడిచిపెట్టినవాడై ప్రసన్నమైన అంతఃకరణమును కలిగియుండెను. ఆయన ఇంద్రియనిగ్రహము కలవాడగుటచే భోగవస్తువులను ప్రోగు చేయలేదు. ఆయన అనుకోకుండా ఈశ్వరేచ్ఛచే లభించినదానితో తనకు బ్రదుకుదెరువును కల్పించుకొనెను.

ఆత్మన్యాత్మానమాధాయ జ్ఞానతృప్తస్సమాహితః ।
విచచార మహీమేతాం జడాంధబధిరాకృతిః ॥ 13

సమాహితః - సావధానుడై, ఆత్మానమ్ - బుద్ధిని, ఆత్మని - తన స్వరూపమునందు, ఆధాయ - విలీనము చేసి, జ్ఞానతృప్తః - ఆత్మనిష్ఠచే సంతుష్టుడై, జడ-అంధబధిర-ఆకృతిః - జడుడు గ్రుడ్డివాడు చెవిటివాడు అనువారల ఆకారము గలవాడై, ఏతామ్ - ఈ, మహీమ్ - భూమిని, విచచార - సంచరించెను.

ఆయన సావధానుడై బుద్ధిని తన సచ్చిత్స్వరూపమునందు నిలిపి అట్టి ఆత్మనిష్ఠచేతనే సంతుష్టుడై ఈ లోకములో సంచరించెను. ఆయన చూచుటకు మందుడుగను, గ్రుడ్డి-చెవిటివాడు వలెను కనబడెడివాడు.

ఏవంవృత్తో వనం గత్వా దృష్ట్వా దావాగ్నిముత్థితమ్ ।
తేనోపయుక్తకరణో బ్రహ్మ ప్రాప పరం మునిః ॥ 14

ఏవంవృత్తః - ఈ విధముగా జీవనమును గడుపుచున్న, మునిః - మననశీలుడైన పృషధ్రుడు, వనమ్ - అడవిని గురించి, గత్వా - వెళ్లి, ఉత్థితమ్ - ఎగసిపడిన, దావ-అగ్నిమ్ - కార్చిచ్చును, దృష్ట్వా - చూచి, తేన - దానిచే, ఉపయుక్తకరణః - దహించబడిన దేహము గలవాడై, పరం బ్రహ్మ - పరబ్రహ్మను, ప్రాప - చేరెను.

ఈ విధముగా జీవనము గడుపుతూ ఆ పృషధ్రుడు అడవికి వెళ్లగా, అచట ఆయనకు ఎగసిపడే కార్చిచ్చు తారసిల్లెను. ఆయన

దేహము దానిలో దగ్ధము కాగా, ఆయన పరబ్రహ్మలో విలీనమయ్యెను (జీవన్ముక్తుడు విదేహముక్తిని పొందెను).

కవిః కనీయాన్ విషయేషు నిస్స్పృహో
విసృజ్య రాజ్యం సహ బంధుభిర్వనమ్ ।
నివేశ్య చిత్తే పురుషం స్వరోచిషం వివేశ కైశోరవయాః పరం గతః ॥15

కనీయాన్ - ఆఖరి పుత్రుడగు, కవిః - కవి, విషయేషు - ఇంద్రియభోగములయందు, నిస్స్పృహః - తృష్ణ లేనివాడై, రాజ్యమ్ - రాజ్యమును, విసృజ్య - విడిచిపెట్టి, బంధుభిః సహ - బంధువులతో సహా, వనమ్ - అడవిని, వివేశ - ప్రవేశించెను, స్వరోచిషమ్ - స్వయంప్రకాశ స్వరూపుడగు, పురుషమ్ - పూర్ణబ్రహ్మను, చిత్తే - చిత్తమునందు, నివేశ్య - నిలిపియుంచి, కైశోరవయాః - కుర్రవాడుగనే, పరమ్ - పరమాత్మను, గతః - చేరినవాడు.

మనువుయొక్క ఆఖరి పుత్రుడగు కవికి ఇంద్రియభోగములయందు తృష్ణ లేకుండెను. ఆతడు యువకుడుగ నుండగనే రాజ్యమును విడిచిపెట్టి బంధువులతో గూడి అడవికి వెళ్లి, తన చిత్తమును స్వయంప్రకాశ స్వరూపుడగు పూర్ణబ్రహ్మయందు నిలిపియుంచి, పరమాత్మను చేరుకొనెను.

కరూషాన్మానవాదాసన్ కారూషాః క్షత్రజాతయః ।
ఉత్తరాపథగోప్తారో బ్రహ్మణ్యా ధర్మవత్సలాః ॥ 16

మానవాత్ - మనుపుత్రుడగు, కరూషాత్ - కరూషుని వలన, కారూషాః - కారూషులు అనే, క్షత్రజాతయః - క్షత్రియజాతులు, ఆసన్ - కలిగినవి, ఉత్తరాపథగోప్తారః - ఉత్తరదేశమును రక్షించువారు, బ్రహ్మణ్యాః - వేదవేత్తలయందు భక్తి గలవారు, ధర్మవత్సలాః - ధర్మమునందు ప్రేమ గలవారు.

మనుపుత్రుడగు కరీషునినుండి కారీషులు అనే క్షత్రియజాతులు ఉద్భవించెను. వేదవేత్తలయందు భక్తి మరియు ధర్మమునందు ప్రేమ గల ఆ కారూషులు ఉత్తరదేశమును పాలించిరి.

ధృష్టాద్ధార్ష్టమభూత్ క్షత్రం బ్రహ్మభూయం గతం క్షితౌ ।
నృగస్య వంశస్సుమతిర్భూతజ్యోతిస్తతో వసుః ॥ 17

ధృష్టాత్ - ధృష్టునినుండి, ధార్ష్టమ్ - ధార్ష్టుడనే, క్షత్రమ్ - క్షత్రియుడు, అభూత్ - కలిగెను, క్షితౌ - భూలోకమునందు, బ్రహ్మభూయమ్ - బ్రాహ్మణుడగుటను, గతమ్ - పొందినవాడు, నృగస్య - నృగుని, వంశః - పుత్రుడు, సుమతిః - సుమతి, తతః - వానినుండి, భూతజ్యోతిః - భూతజ్యోతి, వసుః - వసువు.

ధృష్టుని పుత్రుడు ధార్ష్టుడు. ఆయన క్షత్రియుడే అయినను, ఈ లోకమునందే బ్రాహ్మణత్వమును పొందెను. నృగుని పుత్రుడు సుమతి. సుమతి పుత్రుడు భూతజ్యోతి. ఆయన పుత్రుడు వసువు.

వసోః ప్రతీకస్తత్పుత్ర ఓఘవానోఘవత్పితా ।
కన్యా చౌఘవతీ నామ సుదర్శన ఉవాహ తామ్ ॥ 18

వసోః - వసువుయొక్క, పుత్రః - పుత్రుడు, ప్రతీకః - ప్రతీకుడు, తత్-పుత్రః - ఆయనీ పుత్రుడు, ఓఘవాన్ - ఓఘవంతుడు, ఓఘవత్-పితా - ఓఘవంతుని తండ్రి, ఓఘవతీ నామ - ఓఘవతి అని ప్రసిద్ధి గాంచిన, కన్యా చ - కన్య కూడ, తామ్ - ఆమెను, సుదర్శనః - సుదర్శనుడు, ఉవాహ - వివాహమాడెను.

వసువుయొక్క పుత్రుడు ప్రతీకుడు. ప్రతీకుని పుత్రుడు ఓఘవంతుడు. ఓఘవంతుని పుత్రుని పేరు కూడ ఓఘవంతుడే. ఓఘవంతునకు ఓఘవతి అనే కన్య కూడ ఉండెను. ఆమెను సుదర్శనుడు వివాహమాడెను.

చిత్రసేనో నరిష్యంతాదృక్షస్తస్య సుతోఽభవత్ ।
తస్య మీఢ్వాంస్తతః కూర్చ ఇంద్రసేనస్తు తత్సుతః ॥ 19

నరిష్యంతాత్ - నరిష్యంతునినుండి, చిత్రసేనః - చిత్రసేనుడు, తస్య - వానికి, ఋక్షః - ఋక్షుడు అనే, సుతః - పుత్రుడు, అభవత్ - కలిగెను, తస్య - వానికి, మీఢ్వాన్ - మీఢ్వంతుడు, తతః - వానినుండి,

కూర్చః - కూర్చుడు, తత్-సుతః తు - వాని పుత్రుడైతే, ఇంద్రసేనః - ఇంద్రసేనుడు.

(మనుపుత్రుడగు) నరిష్యంతుని పుత్రుడు చిత్రసేనుడు. చిత్రసేనుని పుత్రుడు ఋక్షుడు. ఋక్షుని పుత్రుడు మీఢ్వంతుడు. మీఢ్వంతుని పుత్రుడు కూర్చుడు. కూర్చుని పుత్రుడు ఇంద్రసేనుడు.

వీతిహోత్రస్త్వింద్రసేనాత్తస్య సత్యశ్రవా అభూత్ ।
ఉరుశ్రవాస్సుతస్తస్య దేవదత్తస్తతోఽభవత్ ॥ 20

ఇంద్రసేనాత్ తు - ఇంద్రసేనునినుండైతే, వీతిహోత్రః - వీతిహోత్రుడు, తస్య - వానికి, సత్యశ్రవాః - సత్యశ్రవసుడు, అభూత్ - కలిగెను, తస్య - వాని, సుతః - పుత్రుడు, ఉరుశ్రవాః - ఉరుశ్రవసుడు, తతః - వానినుండి, దేవదత్తః - దేవదత్తుడు, అభవత్ - కలిగెను.

ఇంద్రసేనుని పుత్రుడు వీతిహోత్రుడు. వీతిహోత్రుని పుత్రుడు సత్యశ్రవసుడు. సత్యశ్రవసుని పుత్రుడు ఉరుశ్రవసుడు. ఉరుశ్రవసుని పుత్రుడు దేవదత్తుడు.

తతోఽగ్నివేశ్యో భగవానగ్నిస్స్వయమభూత్సుతః ।
కానీన ఇతి విఖ్యాతో జాతూకర్ణ్యో మహానృషిః ॥ 21

తతః - ఆ దేవదత్తునినుండి, భగవాన్ అగ్నిః - అగ్నిదేవుడు, స్వయమ్ - స్వయముగా, అగ్నివేశ్యః - అగ్నివేశ్యుడనే, సుతః - పుత్రుడు, అభూత్ - అయెను, కానీనః - కానీనుడు అనియు, జాతూకర్ణ్యః - జాతూకర్ణ్యుడనే, మహాన్ ఋషిః - మహర్షి, ఇతి - అనియు, విఖ్యాతః - ప్రఖ్యాతిని గాంచినవాడు.

ఆ దేవదత్తునకు అగ్నిదేవుడు స్వయముగా అగ్నివేశ్యుడనే పుత్రుడై జన్మించి, కానీనుడనియు మరియు జాతూకర్ణ్య మహర్షి అనియు ప్రఖ్యాతిని గాంచెను.

తతో బ్రహ్మకులం జాతమాగ్నివేశ్యాయనం నృప ।
నరిష్యంతాన్వయః ప్రోక్తో దిష్టవంశమతశ్శృణు ॥ 22

నృప - ఓ మహారాజా!, ఆగ్నివేశ్యాయనమ్ - ఆగ్నివేశ్యాయనము అనే, బ్రహ్మకులమ్ - బ్రాహ్మణుల గోత్రము (వంశము), తతః - ఆ అగ్నివేశ్యునినుండి, జాతమ్ - ఉద్భవించినది, నరిష్యంత-అన్వయః - నరిష్యంతుని వంశము, ప్రోక్తః - చెప్పబడినది, అతః - ఈ పైన, దిష్టవంశమ్ - దిష్టుని వంశమును గురించి, శృణు - వినుము.

ఓ మహారాజా! ఆ అగ్నివేశ్యునినుండి ఆగ్నివేశ్యాయనము అనే బ్రాహ్మణుల వంశము ఉద్భవించెను. నేనింతవరకు నరిష్యంతుని వంశమును గురించి చెప్పితిని. ఈపైన దిష్టుని వంశమును గురించి చెప్పెదను.

నాభాగో దిష్టపుత్రోఽన్యః కర్మణా వైశ్యతాం గతః ।
భలందనస్సుతస్తస్య వత్సప్రీతిర్భలందనాత్ ॥ 23

దిష్టపుత్రః - దిష్టుని పుత్రుడు, నాభాగః - నాభాగుడు, అన్యః - మరియొకడు, కర్మణా - కర్మచే, వైశ్యతామ్ - వైశ్యత్వమును, గతః - పొందినవాడు, తస్య - వాని, సుతః - పుత్రుడు, భలందనః - భలందనుడు, భలందనాత్ - భలందనునినుండి, వత్సప్రీతిః - వత్సప్రీతి.

దిష్టుని పుత్రుడు నాభాగుడు. ఈ నాభాగుడు వేరు, రాబోయే నాభాగుడు వేరు. ఈ నాభాగుడు తాను చేసిన కర్మను బట్టి వైశ్యుడైనాడు. వాని పుత్రుడు భలందనుడు. భలందనుని పుత్రుడు వత్సప్రీతి.

వత్సప్రీతేస్సుతః ప్రాంశుస్తత్సుతం ప్రమతిం విదుః ।
ఖనిత్రః ప్రమతేస్తస్మాచ్చాక్షుషోఽథ వివింశతిః ॥ 24

వత్సప్రీతేః - వత్సప్రీతియొక్క, సుతః - పుత్రుడు, ప్రాంశుః - ప్రాంశువు, తత్-సుతమ్ - వాని పుత్రుని, ప్రమతిమ్ - ప్రమతినిగా, విదుః - తెలియుచున్నారు, ప్రమతేః - ప్రమతియొక్క (పుత్రుడు), ఖనిత్రః - ఖనిత్రుడు, తస్మాత్ - ఆ ఖనిత్రునినుండి, చాక్షుషః - చాక్షుషుడు, అథ - ఆయననుండి, వివింశతిః - వివింశతి.

వత్సప్రీతి పుత్రుడు ప్రాంశుడు. ప్రాంశుని పుత్రుడు ప్రమతి. ప్రమతి పుత్రుడు ఖనిత్రుడు. ఖనిత్రుని పుత్రుడు చాక్షుషుడు. చాక్షుషుని పుత్రుడు వివింశతి.

వివింశతిసుతో రంభః ఖనినేత్రోఽస్య ధార్మికః ।
కరంధమో మహారాజ తస్యాసీదాత్మజో నృప ॥ 25

మహారాజ - ఓ మహారాజా!, వివింశతిసుతః - వివింశతియొక్క పుత్రుడు, రంభః - రంభుడు, అస్య - వీని (పుత్రుడు), ధార్మికః - ధార్మికుడగు, ఖనినేత్రః - ఖనినేత్రుడు, నృప - ఓ నరేంద్రా!, తస్య - వానికి, కరంధమః - కరంధముడనే, ఆత్మజః - పుత్రుడు, ఆసీత్ - కలిగెను.

జనులను పాలించే ఓ పరీక్షిన్మహారాజా! వివింశతి పుత్రుడు రంభుడు. రంభుని పుత్రుడు ధర్మాత్ముడగు ఖనినేత్రుడు. ఖనినేత్రునకు కరంధముడనే పుత్రుడు ఉండెను.

తస్యావీక్షిత్సుతో యస్య మరుత్తశ్చక్రవర్త్యభూత్ ।
సంవర్తోఽయాజయద్యం వై మహాయోగ్యంగిరస్సుతః ॥ 26

తస్య - ఆ కరంధమునకు, అవీక్షిత్ - అవీక్షిత్తు, సుతః - పుత్రుడు, యస్య - ఎవనికైతే, చక్రవర్తీ - చక్రవర్తియగు, మరుత్తః - మరుత్తుడు, అభూత్ - కలిగెనో, మహాయోగీ - గొప్ప యోగి, అంగిరః-సుతః - అంగిరసుని పుత్రుడు అగు, సంవర్తః - సంవర్తుడు, యం వై - ఎవనినైతే, అయాజయత్ - యజ్ఞమును చేయించెనో.

ఆ కరంధముని పుత్రుడు అవీక్షిత్తు. అవీక్షిత్తుయొక్క పుత్రుడగు మరుత్తు చక్రవర్తి ఆయెను. అంగిరసుని పుత్రుడగు సంవర్తుడు మహాయోగి. ఆయన మరుత్తునిచే యజ్ఞమును చేయించెను.

మరుత్తస్య యథా యజ్ఞో న తథాన్యస్య కశ్చన ।
సర్వం హిరణ్మయం త్వాసీద్యత్కించిచ్చాస్య శోభనమ్ ॥ 27

మరుత్తస్య - మరుత్తుని, యజ్ఞః - యజ్ఞము, యథా - ఎట్లో, తథా - అట్లు, అన్యస్య - మరియొకని, కశ్చన - ఏ యజ్ఞమైననూ, న - లేదు,

అస్య - ఈ మరుత్తుయొక్క, యత్ కించిత్ తు - ఏదైతే పాత్రలు మొదలై నవి గలవో, సర్వమ్ - ఆ సర్వము, శోభనమ్ - ప్రకాశించేది, హిర ణ్మయం చ - బంగారముతో చేసినది కూడ, ఆసీత్ - ఆయెను.

మరుత్తుని యజ్ఞమువంటి యజ్ఞమును చేసినవారు మరెవ్వరూ లేరు. ఆ యజ్ఞములో పాత్రలు మొదలగు సర్వము కూడ బంగారముతో చేయబడి ప్రకాశించెను.

అమాద్యదింద్రస్సోమేన దక్షిణాభిర్ద్విజాతయః ।
మరుతః పరివేష్టారో విశ్వేదేవాస్సభాసదః ॥ 28

ఇంద్రః - ఇంద్రుడు, సోమేన - సోమరసముతో, అమాద్యత్ - హర్షమును పొందెను, ద్విజాతయః - బ్రాహ్మణులు, దక్షిణాభిః - దక్షిణల తో, మరుతః - మరుద్గణములు, పరివేష్టారః - వడ్డించువారు, విశ్వేదేవాః - విశ్వేదేవతలు, సభాసదః - సభాసదులు.

ఆ యజ్ఞములో ఇంద్రుడు సోమరసముతో మరియు బ్రాహ్మణులు దక్షిణలతో హర్షమును పొందిరి. మరుద్గణములు వడ్డనవారు కాగా, విశ్వేదే వతలు సభాసదులైరి.

మరుత్తస్య దమః పుత్రస్తస్యాసీద్రాజ్యవర్ధనః ।
సుధృతిస్తత్సుతో జజ్ఞే సౌధృతేయో నరస్సుతః ॥ 29

మరుత్తస్య - మరుత్తునియొక్క, పుత్రః - పుత్రుడు, దమః - దముడు, తస్య - వానికి, రాజ్యవర్ధనః - రాజ్యవర్ధనుడు, ఆసీత్ - కలిగె ను, సుధృతిః - సుధృతి, తత్-సుతః - వానికి పుత్రుడై, జజ్ఞే - జన్మించె ను, సౌధృతేయః సుతః - సుధృతికి చెందిన పుత్రుడు, నరః - నరుడు.

మరుత్తుని పుత్రుడు దముడు. దముని పుత్రుడు రాజ్యవర్ధనుడు. రాజ్యవర్ధనుని పుత్రుడు సుధృతి. సుధృతి పుత్రుడు నరుడు.

తత్సుతః కేవలస్తస్మాద్బంధుమాన్ వేగవాంస్తతః ।
బంధుస్తస్యాభవద్యస్య తృణబిందుర్మహీపతిః ॥ 30

**తత్-సుతః - ఆ నరుని పుత్రుడు, కేవలః - కేవలుడు, తస్మాత్ - ఆ కేవలుని వలన, బంధుమాన్ - బంధుమంతుడు, తతః - ఆయన వలన, వేగవాన్ - వేగవంతుడు, తస్య - వానికి, బంధుః - బంధువు, అభవత్ - కలిగెను, యస్య - ఎవనికైతే, తృణబిందుః మహీపతిః - తృణబిందు మహా రాజో.**

నరుని పుత్రుడు కేవలుడు. కేవలుని పుత్రుడు బంధుమంతుడు. బంధుమంతుని పుత్రుడు వేగవంతుడు. వేగవంతుని పుత్రుడు బంధువు. బంధువు పుత్రుడు తృణబిందు మహారాజు.

తం భేజేఽలంబుషా దేవీ భజనీయగుణాలయమ్ ।
వరాప్సరా యతః పుత్రాః కన్యా చేడవిడాఽభవత్ ॥ 31

భజనీయగుణ-ఆలయమ్ - సేవించదగిన గుణములకు నిలయు డగు, తమ్ - ఆ తృణబిందువును, వర-అప్సరా - గొప్ప అప్సరసయగు, అలంబుషా దేవీ - అలంబుషా దేవి, భేజే - సేవించెను, యతః - ఎవనివ లనైతే, పుత్రాః - పుత్రులు, ఇడవిడా - ఇడవిడ అనే, కన్యా చ - కన్య కూడ, అభవత్ - కలిగెనో.

ఆ తృణబిందువు సేవించదగిన సద్గుణములకు నిలయము. అప్స రసలలో శ్రేష్ఠురాలగు అలంబుషా దేవి ఆయనను వివాహమాడెను. ఆయ నకు అనేక పుత్రులు, ఇడవిడ అనే కన్య కూడ కలిగిరి.

తస్యాముత్పాదయామాస విశ్రవా ధనదం సుతమ్ ।
ప్రాదాయ విద్యాం పరమామృషిర్యోగేశ్వరాత్పితుః ॥ 32

విశ్రవాః ఋషిః - విశ్రవస మహర్షి, యోగ-ఈశ్వరాత్ - యోగు లలో శ్రేష్ఠుడగు, పితుః - తండ్రియగు పులస్త్యునినుండి, పరమామ్ - సర్వోత్తమమైన (ఇహపరములనిచ్చే), విద్యామ్ - విద్యను, ప్రాదాయ - గ్రహించి, తస్యామ్ - ఆ ఇడవిడయందు, ధనదమ్ - కుబేరుడనే, సుతమ్ - పుత్రుని, ఉత్పాదయామాస - కనెను.

విశ్రవస మహర్షి యోగులలో శ్రేష్ఠుడగు తన తండ్రి పులస్త్యుని నుండి సర్వోత్తమమైన (ఇహపరదాయకమగు) విద్యను గ్రహించెను. ఆయనకు ఆ ఇడవిడయందు కుబేరుడు పుత్రుడై జన్మించెను.

విశాలశ్శూన్యబంధుశ్చ ధూమ్రకేతుశ్చ తత్సుతాః ।
విశాలో వంశకృద్రాజా వైశాలీం నిర్మమే పురీమ్ ॥ 33

విశాలః - విశాలుడు, శూన్యబంధుః చ - శూన్యబంధువు, ధూమ్రకేతుః చ - ధూమ్రకేతువు, తత్-సుతాః - ఆ తృణబిందువుయొక్క పుత్రులు, వంశకృత్ - వంశకర్తయగు, విశాలః రాజా - విశాల మహారాజు, వైశాలీం పురీమ్ - వైశాలీ నగరమును, నిర్మమే - నిర్మించెను.

విశాలుడు, శూన్యబంధువు, ధూమ్రకేతువు అనువారలు తృణబిందుని పుత్రులు. వారిలో విశాల మహారాజు వంశకర్త. ఆయన వైశాలీ నగరమును నిర్మించెను.

హేమచంద్రస్సుతస్తస్య ధూమ్రాక్షస్తస్య చాత్మజః ।
తత్పుత్రాత్సంయమాదాసీత్కృశాశ్వస్సహదేవజః ॥ 34

హేమచంద్రః - హేమచంద్రుడు, తస్య - ఆ విశాలునియొక్క, సుతః - పుత్రుడు, ధూమ్రాక్షః - ధూమ్రాక్షుడు, తస్య చ - ఆ హేమచంద్రునియొక్క, ఆత్మజః - పుత్రుడు, తత్-పుత్రాత్ - ఆ ధూమ్రాక్షుని పుత్రుడగు, సంయమాత్ - సంయమునినుండి, కృశాశ్వః - కృశాశ్వుడు, సహదేవజః - దేవజునితో కూడినవాడై, ఆసీత్ - కలిగెను.

విశాలుని పుత్రుడు హేమచంద్రుడు. హేమచంద్రుని పుత్రుడు ధూమ్రాక్షుడు. ధూమ్రాక్షుని పుత్రుడు సంయముడు. సంయముని పుత్రులు కృశాశ్వుడు మరియు దేవజుడు.

కృశాశ్వాత్సోమదత్తోఽభూద్యోఽశ్వమేధైరిడస్పతిమ్ ।
ఇష్ట్వా పురుషమాపాగ్ర్యాం గతిం యోగేశ్వరాశ్రితః ॥ 35

కృశాశ్వాత్ - కృశాశ్వునినుండి, సోమదత్తః - సోమదత్తుడు, అభూత్ - కలిగెను, యః - ఎవడైతే, అశ్వమేధైః - అశ్వమేధ యాగముల

చే, ఇడస్పతిమ్ - అన్నపతి (వాక్పతి, భూపతి) అగు, పురుషమ్ - పూర్ణు డగు ఈశ్వరుని, ఇష్ట్వా - ఆరాధించి, యోగ-ఈశ్వర-ఆశ్రితః - యోగిశ్రే ష్ఠులగు నారదాదులను ఆశ్రయించినవాడై, అగ్ర్యామ్ - సర్వోత్తమమగు, గతిమ్ - మోక్షమును, ఆప - పొందెనో.

కృశాశ్వుని పుత్రుడు సోమదత్తుడు. సోమదత్తుడు అనేకములైన అశ్వమేధ యాగములచే అన్నమునకు (భూమికి, వాక్కునకు) ప్రభువగు పూర్ణ-ఈశ్వరుని ఆరాధించెను. ఆయన యోగిపుంగవులగు నారదాదులను ఆశ్రయించి సర్వోత్తమ ఫలమైన మోక్షమును పొందెను.

సౌమదత్తిస్తు సుమతిస్తత్సుతో జనమేజయః ।
ఏతే వైశాలభూపాలాస్తృణబిందోర్యశోధరాః ।। 36

సౌమదత్తిః తు - సోమదత్తుని పుత్రుడైతే, సుమతిః - సుమతి. తత్ -సుతః - ఆయన పుత్రుడు, జనమేజయః - జనమేజయుడు, ఏతే - ఈ, వైశాలభూపాలాః - వైశాల నగర రాజులు, తృణబిందోః - తృణబిందువు యొక్క, యశః-ధరాః - కీర్తిని నిలబెట్టువారు.

సోమదత్తుని పుత్రుడు సుమతి. సుమతి పుత్రుడు జనమేజయుడు. ఈ హేమచంద్రుడు మొదలుగా గల వైశాల నగర రాజులు తృణబిందువు యొక్క కీర్తిని నిలబెట్టిరి.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో పృష
ధ్రుడు మొదలగు మనుపుత్రుల వంశములను వర్ణించే
రెండవ అధ్యాయము ముగిసినది (2).

* * * * *

# అథ తృతీయోఽధ్యాయః

## సుకన్యా రేవతుల వృత్తాంతము

శ్రీశుక ఉవాచ।
శర్యాతిర్మానవో రాజా బ్రహ్మిష్ఠస్స బభూవ హ ।
యో వా అంగిరసాం సత్రే ద్వితీయమహ ఊచివాన్ ॥ 1

మానవః - మనుపుత్రుడగు, సః - ఆ, శర్యాతిః - శర్యాతి, బ్రహ్మిష్ఠః - వేదవేత్తయై, బభూవ హ - ఉండెను, యః వై - ఎవడైతే, అంగిరసామ్ - అంగిరస గోత్రీయుల, సత్రే - సత్రయాగమునందు, ద్వితీయం అహః - రెండవ రోజు కర్మను గురించి, ఊచివాన్ - చెప్పెనో.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- మనుపుత్రుడగు ఆ శర్యాతి వేదవేత్తయై ఉండెను. ఆయన అంగిరస గోత్రీయుల సత్రయాగమునందు రెండవ రోజు చేయవలసిన కర్మను గురించి చెప్పి వ్యవస్థను చేసెను.

సుకన్యా నామ తస్యాసీత్కన్యా కమలలోచనా ।
తయా సార్ధం వనగతో హ్యగమచ్చ్యవనాశ్రమమ్ ॥ 2

తస్య - ఆయనకు, సుకన్యా నామ - సుకన్య అని ప్రసిద్ధి చెంది న, కమలలోచనా - కలువ కన్నుల, కన్యా - కుమార్తె, ఆసీత్ - ఉండెను, తయా సార్ధమ్ - ఆమెతో గూడి, వనగతః - వనమును గురించి వెళ్లిన ఆయన, చ్యవన-ఆశ్రమమ్ - చ్యవన మహర్షి ఆశ్రమమును గురించి, అగమత్ - వెళ్లెను.

ఆ శర్యాతికి సుకన్య కనే కలువ కన్నుల కుమార్తె ఉండెను. ఆయన ఆమెతోగూడి అడవికి వెళ్లి చ్యవన మహర్షి ఆశ్రమమునకు వెళ్లెను.

సా సఖీభిః పరివృతా విచిన్వంత్యంఘ్రిపాన్ వనే ।
వల్మీకరంధ్రే దదృశే ఖద్యోతే ఇవ జ్యోతిషీ ॥ 3

సా - ఆమె, సఖీభిః - చెలికత్తెలచే, పరివృతా - చుట్టువారబడివదై, వనే - అడవియందు, అంఘ్రిపాన్ - చెట్లను, విచిన్వంతీ - వెదుకుచున్నదై, వల్మీకరంధ్రే - పాము పుట్ట చిల్లులో, ఖద్యోతే ఇవ - మిణుగురు పురుగులవంటి, జ్యోతిషీ - రెండు వెలుగులను, దదృశే - చూచెను.

ఆ సుకన్య తన చెలికత్తెలు చుట్టువారి రాగా అడవిలో చెట్లను వెదుకుచుండెను. ఆమెకు పాము పుట్ట చిల్లులో రెండు మిణుగురు పురుగులవంటి వెలుగులు కనబడెను.

తే దైవచోదితా బాలా జ్యోతిషీ కంటకేన వై ।
అవిధ్యన్ముగ్ధభావేన సుస్రావాసృక్తతో బహు ।। 4

దైవచోదితా - విధిచే ప్రేరితయైన, బాలా - ఆ సుకన్య, ముగ్ధభావేన - బాల్యమునందలి చాపల్యముచే, తే - ఆ, జ్యోతిషీ - రెండు వెలుగులను, కంటకేన - ముల్లుతో, వై - గట్టిగా, అవిధ్యత్ - పొడిచెను, తతః - వాటినుండి, బహు - అధికమగు, అసృక్ - రక్తము, సుస్రావ - స్రవించెను.

విధిచే ప్రేరితయైన ఆ సుకన్య చిన్నవయసు చిలిపిదనముచే ఆ రెండు వెలుగులను ముల్లతో గట్టిగా పొడిచెను. అపుడు వాటినుండి రక్తము అధికముగా స్రవించెను.

శకృన్మూత్రనిరోధోऽభూత్సైనికానాం చ తత్క్షణాత్ ।
రాజర్షిస్తముపాలక్ష్య పురుషాన్ విస్మితోऽబ్రవీత్ ।। 5

సైనికానాం చ - సైనికులకు, తత్-క్షణాత్ - వెనువెంటనే, శకృత్-మూత్రనిరోధః - మల మూత్రములు ఆగిపోవుట, అభూత్ - కలిగెను, తమ్ - ఆ విషయమును, ఉపాలక్ష్య - చూచి, రాజర్షిః - రాజర్షియగు శర్యాతి, విస్మితః - ఆశ్చర్యపడినవాడై, పురుషాన్ - సేవకులను గురించి, అబ్రవీత్ - పలికెను.

వెనువెంటనే సైనికులకు మలమూత్రములు బంధించబడెను. ఆ విషయమును తెలిసి రాజర్షియగు శర్యాతి ఆశ్చర్యమును పొంది, సైనికులతో నిట్లనెను.

అప్యభద్రం న యుష్మాభిర్భార్గవస్య విచేష్టితమ్ ।
వ్యక్తం కేనాపి నస్తస్య కృతమాశ్రమదూషణమ్ ।। 6

యుష్మాభిః - మీచే, భార్గవస్య - భృగువంశీయుడగు చ్యవనున కు, అభద్రమ్ - అపరాధము, అపి న విచేష్టితమ్ - చేయబడలేదు గదా? నః - మనలో, కేన అపి - ఎవరో ఒకరిచే, తస్య - ఆయనయొక్క, ఆశ్రమ దూషణమ్ - ఆశ్రమమును చెడగొట్టుట, కృతమ్ - చేయబడినదని, వ్యక్తమ్ - స్పష్టము.

మీరు భృగువంశీయుడగు చ్యవనుని యెడల అపరాధమును చేయలేదు గదా? మనలో ఎవరో ఒకరు ఆయన ఆశ్రమమును కలుషితము చేసినారని (మూత్రబంధనమును బట్టి) స్పష్టమగుచున్నది.

సుకన్యా ప్రాహ పితరం భీతా కించిత్కృతం మయా ।
ద్వే జ్యోతిషీ అజానంత్యా నిర్భిన్నే కంటకేన వై ।। 7

భీతా - భయపడిన, సుకన్యా - సుకన్య, పితరమ్ - తండ్రిని గురించి, ప్రాహ - పలికెను, మయా - నాచే, కించిత్ - ఒకానొకటి, కృతమ్ - చేయబడినది, అజానంత్యా - తెలియని నాచే, ద్వే - రెండు, జ్యోతిషీ - వెలుగులు, కంటకేన - ముల్లుతో, వై - గట్టిగా, నిర్భిన్నే - పొడువబడినవి.

భయపడిన సుకన్య తండ్రితో నిట్లనెను -- నేను ఒక పనిని చేసితి ని. నేను తెలుసుకోకుండా రెండు వెలిగే చుక్కలను ముల్లుతో గట్టిగా పొడి చితిని.

దుహితుస్తద్వచశ్శ్రుత్వా శర్యాతిర్జాతసాధ్వసః ।
మునిం ప్రసాదయామాస వల్మీకాంతర్హితం శనైః ।। 8

దుహితుః - కుమార్తెయొక్క, తత్ - ఆ, వచః - మాటను, శ్రుత్వా - విని, జాతసాధ్వసః - పుట్టిన భయము గల, శర్యాతిః - శర్యాతి, వల్మీక -అంతర్హితమ్ - పుట్టలోపల కనబడకుండా ఉన్న, మునిమ్ - చ్యవన మహ ర్షిని, శనైః - మెల్లగా, ప్రసాదయామాస - ప్రసన్నుని చేసుకొనెను.

కుమార్తె మాటను విన్న శర్యాతికి భయము కలిగెను. పుట్టలోపల కనబడకుండా ఉన్న చ్యవముని ఆయన మెల్లగా ప్రసన్నుని చేసుకొనెను.

తదభిప్రాయమాజ్ఞాయ ప్రాదాద్దుహితరం మునేః ।
కృచ్ఛ్రాన్ముక్తస్తమామంత్ర్య పురం ప్రాయాత్సమాహితః ।। 9

తద్-అభిప్రాయమ్ - ఆ మహర్షియొక్క అభిప్రాయమును, ఆజ్ఞాయ - తెలుసుకొని, దుహితరమ్ - కుమార్తెను, మునేః - ఆ మహర్షికి, ప్రాదాత్ - ఇచ్చి వివాహము చేసెను, సమాహితః - సావధానుడై, కృచ్ఛ్రాత్ - సంకటమునుండి, ముక్తః - విముక్తుడై, తమ్ - ఆయనను, ఆమంత్ర్య - ఒప్పించి, పురమ్ - నగరమును గురించి, ప్రాయాత్ - బయలు దేరెను.

ఆ మహర్షి అభిప్రాయమును తెలుసుకున్న శర్యాతి తన కుమార్తెను ఆయనకిచ్చి వివాహము చేసెను. ఈ విధముగా ఆయన సావధానముగా ఆ విపత్తునుండి బయట పడి, ఆ మహర్షి వద్ద సెలవు తీసుకొని తన నగరమునకు బయలుదేరి వెళ్లెను.

సుకన్యా చ్యవనం ప్రాప్య పతిం పరమకోపనమ్ ।
ప్రీణయామాస చిత్తజ్ఞా అప్రమత్తానువృత్తిభిః ।। 10

సుకన్యా - సుకన్య, పరమకోపనమ్ - మిక్కిలి కోపిష్ఠియగు, చ్యవనమ్ - చ్యవన మహర్షిని, పతిమ్ - భర్తనుగా, ప్రాప్య - పొంది, చిత్తజ్ఞా - ఆయన మనసునెరిగి, అప్రమత్తా - సావధానురాలై, అనువృత్తిభిః - అనుకూలమగు ఆచరణములచే, ప్రీణయామాస - ప్రీతిని కలిగించెను.

సుకన్య భర్తయగు చ్యవన మహర్షి మిక్కిలి కోపిష్ఠి. కాని, ఆమె ఆయన మనసునెరిగి సావధానురాలై ఆయనకు అనుకూలమగు సేవలను చేసి ఆయనకు ప్రీతిని కలిగించెను.

కస్యచిత్త్వథ కాలస్య నాసత్యావాశ్రమాగతౌ ।
తౌ పూజయిత్వా ప్రోవాచ వయో మే దత్తమీశ్వరౌ ।। 11

అథ - తరువాత, కస్యచిత్ - కొంత, కాలస్య తు - కాలమునకైతే, నాసత్యౌ - అశ్వినీ దేవతలు, ఆశ్రమ-ఆగతౌ - ఆశ్రమమును గురించి వచ్చినవారు, తౌ - వారిద్దరిని, పూజయిత్వా - పూజించి, ప్ర-ఉవాచ - పలికెను, ఈశ్వరౌ - సమర్థులగు మీరిద్దరు, మే - నా కొరకు, వయః - యౌవనమును, దత్తమ్ - ఇండు.

తరువాత కొంత కాలమునకు అశ్వినీ దేవతలు ఆ మహర్షి ఆశ్రమమునకు రాగా, ఆయన వారిని పూజించి ఇట్లు పలికెను -- మీరిద్దరు సర్వ సమర్థులు. నాకు యౌవనమును ప్రసాదించుడు.

గ్రహం గ్రహీష్యే సోమస్య యజ్ఞే వామప్యసోమపోః ।
క్రియతాం మే వయో రూపం ప్రమదానాం యదీప్సితమ్ ॥ 12

యజ్ఞే - యజ్ఞమునందు, అసోమపోః - సోమమునందు భాగము లేని, వాం అపి - మీ ఇద్దరికి కూడ, గ్రహమ్ - సోమరసపాత్రను, గ్రహీష్యే - స్వీకరించ (సమర్పించ) గలను, మే - నాకొరకు, వయః - యౌవనము, రూపమ్ - రూపము, క్రియతామ్ - చేయబడుగాక!, యత్ - ఏది, ప్రమదానామ్ - మత్తెక్కించే యువతులకు, ఈప్సితమ్ - అభీష్టమో.

మీకిద్దరికి యజ్ఞములో సోమమునందు భాగము లేదు. నేను మీకిద్దరి కొరకై సోమరసపాత్రను గ్రహించి సమర్పించ గలను. మీరు నాకు యౌవనమును, మత్తెక్కించే యువతులకు ప్రీతికరమైన రూపముము కలిగించుడు.

బాఢమిత్యూచతుర్విప్రమభినంద్య భిషక్తమౌ ।
నిమజ్జతాం భవానస్మిన్ హ్రదే సిద్ధవినిర్మితే ॥ 13

భిషక్తమౌ - గొప్ప వైద్యులైన అశ్వినీ దేవతలు, విప్రమ్ - చ్యవన మహర్షిని, అభినంద్య - కొనియాడి, బాఢమ్ - సరే, భవాన్ - తమరు, సిద్ధవినిర్మితే - సిద్ధులచే నిర్మించబడిన, అస్మిన్ - ఈ, హ్రదే - సరస్సునందు, నిమజ్జతామ్ - మునిగెదరు గాక!, ఇతి - అని, ఊచతుః - పలికిరి.

గొప్ప వైద్యులైన అశ్వినీ దేవతలు చ్యవన మహర్షిని కొనియాడి ఇట్లు పలికిరి -- సరే, తమరు సిద్ధులచే నిర్మించబడిన ఈ సరస్సునందు మునుగుడు.

ఇత్యుక్త్వా జరయా గ్రస్తదేహో ధమనిసంతతః ।
హ్రదం ప్రవేశితోऽశ్విభ్యాం వలీపలితవిప్రియః ॥ 14

ఇతి - ఈ విధముగా, ఉక్త్వా - పలికి, జరయా - ముసలిదనముతో, గ్రస్తదేహః - వ్యాపించబడిన దేహము గలవాడు, ధమనిసంతతః - నరములచే వ్యాపించబడినవాడు, వలీపలితవిప్రియః - ముడుతలతో తెల్లని జుట్టుతో వికృతముగా నున్న చ్యవనుడు, అశ్విభ్యామ్ - అశ్వినీ దేవతలిద్దరిచే, హ్రదమ్ - సరస్సును, ప్రవేశితః - ప్రవేశ పెట్టబడినవాడు.

ముసలిదనము చ్యవనుని దేహమునంతనూ వ్యాపించగా, దేహములోని నరములు అంతటా బయటకు పొక్కి యుండెను. ఒళ్లు ముడుతలు పడగా, జుట్టు తెల్లబడి ఆయన వికృతముగా నుండెను. అశ్వినీ దేవతలిద్దరు పైన చెప్పిన విధముగా పలికి, ఆయనను ఆ సరస్సులోనికి ప్రవేశ పెట్టిరి.

పురుషాస్త్రయ ఉత్తస్థురపీచ్యా వనితాప్రియాః ।
పద్మస్రజః కుండలినస్తుల్యరూపాస్సువాససః ॥ 15

అపీచ్యాః - సుందరాకారులు, వనితాప్రియాః - యువతులకు ప్రీతిని గొల్పువారు, పద్మస్రజః - పద్మముల మాలలు గలవారు, కుండలినః - కుండలములు గలవారు, తుల్యరూపాః - సమానమైన రూపములు గలవారు, సువాససః - చక్కని వస్త్రములు గల, త్రయః - ముగ్గురు, పురుషాః - పురుషులు, ఉత్తస్థుః - పైకి లేచిరి.

ఆ సరస్సునుండి కుండలములను, పద్మముల మాలలను, చక్కని వస్త్రములను ధరించియున్న సుందరాకారులగు ముగ్గురు పురుషులు పైకి లేచిరి. సమానమైన వారి రూపములు యువతులకు ప్రీతిని గొల్పునవి.

తాన్నిరీక్ష్య వరారోహా సరూపాన్ సూర్యవర్చసః ।
అజానతీ పతిం సాధ్వీ అశ్వినౌ శరణం యయౌ ॥ 16

సరూపాన్ - సమానమైన రూపము కలిగినట్టియు, సూర్యవర్చసః - సూర్యుని తేజస్సువంటి తేజస్సు గల, తాన్ - వారిని ముగ్గురిని, నిరీక్ష్య - చూచి, వరారోహా - సుందరి, సాధ్వీ - పతివ్రతయగు సుకన్య, పతిమ్ - భర్తను, అజానతీ - గుర్తు పట్టనిదై, అశ్వినౌ - అశ్వినీ దేవతలనిద్దరిని, శరణం యయౌ - శరణు జొచ్చెను.

సమానమైన రూపముతో సూర్యుని వలె వెలిగిపోవుచున్న వారిని ముగ్గురిని సుందరియగు సుకన్య చూచెను. కాని, ఆ పతివ్రత తన భర్తను గుర్తు పట్టలేకపోయెను. అపుడామె అశ్వినీ దేవతలనే శరణు జొచ్చెను.

దర్శయిత్వా పతిం తస్యై పాతివ్రత్యేన తోషితౌ ।
ఋషిమామంత్ర్య యయతుర్విమానేన త్రివిష్టపమ్ ॥ 17

తస్యై - ఆమె కొరకు, పతిమ్ - భర్తను, దర్శయిత్వా - చూపించి, పాతివ్రత్యేన - పాతివ్రత్యముచే, తోషితౌ - సంతోషించినవారై, ఋషిమ్ - చ్యవన మహర్షిని, ఆమంత్ర్య - సెలవు తీసుకొని, విమానేన - విమానముచే, త్రివిష్టపమ్ - స్వర్గమును గురించి, యయతుః - వెళ్లిరి.

అశ్వినీ దేవతలు సుకన్యయొక్క పాతివ్రత్యముచే సంతోషించి, ఆమెకు ఆమె భర్తను చూపించిరి. అపుడు వారు చ్యవన మహర్షి వద్ద సెలవు తీసుకొని విమానమెక్కి స్వర్గమునకు వెళ్లిరి.

యక్ష్యమాణోఽథ శర్యాతిశ్చ్యవనస్యాశ్రమం గతః ।
దదర్శ దుహితుః పార్శ్వే పురుషం సూర్యవర్చసమ్ ॥ 18

అథ - తరువాత, యక్ష్యమాణః - యజ్ఞమును చేయబోయే, శర్యాతిః - శర్యాతి, చ్యవనస్య - చ్యవన మహర్షియొక్క, ఆశ్రమమ్ - ఆశ్రమమును గురించి, గతః - వెళ్లినవాడు, దుహితుః - కుమార్తెయొక్క, పార్శ్వే - ప్రక్కన, సూర్యవర్చసమ్ - సూర్యునివలె వెలిగిపోవుచున్న, పురుషమ్ - యువకుని, దదర్శ - చూచెను.

తరువాత శర్యాతి యజ్ఞమును చేయబోవువాడై, చ్యవన మహర్షి ఆశ్రమమునకు వెళ్లెను. అచట ఆయనకు తన కుమార్తెయగు సుకన్య సరసన సూర్యునివలె వెలిగిపోవుచున్న యువకుడు కనబడెను.

రాజా దుహితరం ప్రాహ కృతపాదాభివందనామ్ ।
ఆశిషశ్చాప్రయుంజానో నాతిప్రీతమనా ఇవ ।। 19

కృతపాద-అభివందనామ్ - చేయబడిన పాదనమస్కారము గల, దుహితరమ్ - కుమార్తెను గురించి, ఆశిషః - ఆశీర్వచనములను, అప్రయుంజానః చ - పలుకకుండగనే, న-అతిప్రీతమనాః ఇవ - మిక్కిలి ప్రీతి కలుగని మనస్సు గలవాడు వలె, రాజా - రాజు, ప్రాహ - పలికెను.

శర్యాతి మహారాజు తన కుమార్తెయగు సుకన్యను చూచెను. ఆయన మనస్సునకు అధికమగు ప్రీతి కలుగలేదు. కావుననే, ఆమె తన పాదములకు నమస్కరించిననూ ఆశీర్వచనము పలుకకుండగనే, ఆ రాజు ఆమెతో నిట్లనెను.

చికీర్షితం తే కిమిదం పతిస్త్వయా ప్రలంభితో లోకనమస్కృతో మునిః,
యత్త్వం జరాగ్రస్తమసత్యసమ్మతం విహాయ జారం భజసేऽముమధ్వగమ్।

అసతి - ఓ దుష్టురాలా!, తే - నీచే, ఇదమ్ - ఇది, కిమ్ - ఏమి, చికీర్షితమ్ - చేయగోర బడినది?, లోకనమస్కృతః - జనులచే నమస్కరించబడే, మునిః - మహర్షియగు, పతిః - భర్త, త్వయా - నీచే, ప్రలంభితః - వంచించ బడినాడు, యత్ - ఏలయనగా, త్వమ్ - నీవు, జరాగ్రస్తమ్ - ముసలిదనముచే పట్టుకొనబడినట్టియు, అసమ్మతమ్ - ఇష్టము కానట్టి భర్తను, విహాయ - విడిచిపెట్టి, అముమ్ - ఈ, అధ్వగమ్ - దారిన పోయే, జారమ్ - విటుని, భజసే - సేవించుచున్నావో.

ఓ దుష్టురాలా! ఇది యేమి? నీవు యేమి చేయ దలచితివి? నీ భర్త లోకముచే నమస్కరించబడే మహర్షి. నీవాయనను వంచించితివి. ఎందుకంటే, ముసలిదనము ఆవరించిన ఆ మహర్షి నీకు నచ్చుబాటు కాలేదు. కావుననే, దారిన పోయే ఈ విటుని పట్టుకున్నావు.

కథం మతిస్తేఽవగతాన్యథా సతాం కులప్రసూతే కులదూషణం త్విదమ్ ।
బిభర్షి జారం యదపత్రపా కులం పితుశ్చ భర్తుశ్చ నయస్యధస్తమః ।। 21

సతామ్ - సత్పురుషులయొక్క, కులప్రసూతే - కులమునందు పుట్టినదానా!, తే - నీయొక్క, మతిః - బుద్ధి, అన్యథా - మరియొక విధముగా, కథమ్ - ఎట్లు, అవగతా - నిశ్చయించుకున్నది? (నశించినది?), ఇదం తు - ఇదియైతే, కులదూషణమ్ - కులమును చెడగొట్టుట, అపత్రపా - తొలగిన సిగ్గు గలదానవై, జారమ్ - విటుని, బిభర్షి యత్ - సేవించుచున్నావనేది యేది గలదో, పితుః - తండ్రియొక్క, చ - మరియు, భర్తుః చ - భర్తయొక్క కూడ, కులమ్ - వంశమును, అధః-తమః - నరకమును, నయసి - పొందించుచున్నావు.

ఓ సుకన్యా! సత్పురుషుల వంశమునందు పుట్టిన నీకు ఇట్టి అయోగ్యమగు బుద్ధి ఎట్లు కలిగినది? (నీ బుద్ధి ఇట్లు నశించినదేల?) నీవు సిగ్గు లేకుండా విటుని సేవించుట యేది గలదో ఇది కులమును చెడగొట్టుటయే. నీవు తండ్రి మరియు భర్తల రెండు కులములను నరకములోనికి త్రోసివేయుచున్నావు.

ఏవం బ్రువాణం పితరం స్మయమానా శుచిస్మితా ।
ఉవాచ తాత జామాతా తవైష భృగునందనః ।। 22

శుచిస్మితా - స్వచ్ఛమైన చిరునవ్వు గల సుకన్య, స్మయమానా - నవ్వుచున్నదై, ఏవమ్ - ఈ విధముగా, బ్రువాణమ్ - పలుకుచున్న, పితరమ్ - తండ్రిని గురించి, ఉవాచ - పలికెను, తాత - తండ్రీ!, ఏషః - ఈయన, భృగునందనః - భృగుపుత్రుడగు చ్యవనుడు, తవ - నీ, జామాతా - అల్లుడు.

స్వచ్ఛమైన చిరునవ్వు గల సుకన్య ఇట్లు పలుకుచున్న తండ్రిని ఉద్దేశించి చిరునవ్వుతో నిట్లనెను -- తండ్రీ! ఈయన నీ అల్లుడు, భృగునందనుడు అగు చ్యవనుడే.

శశంస పిత్రే తత్సర్వం వయోరూపాభిలంభనమ్ ।
విస్మితః పరమప్రీతస్తనయాం పరిషస్వజే ।। 23

వయః-రూప-అభిలంభనమ్ - వయస్సును రూపమును పొందుట అనే, తత్ - ఆ, సర్వమ్ - అంతనూ, పిత్రే - తండ్రి కొరకు, శశంస - చెప్పెను, విస్మితః - ఆశ్చర్యపడినవాడు, పరమప్రీతః - మిక్కిలి సంతోషించినవాడు, తనయామ్ - కుమార్తెను, పరిషస్వజే - కౌగిలించుకొనెను.

చ్యవనుడు వయస్సును, రూపమును పొందిన వృత్తాంతమునంతనూ సుకన్య శర్యాతికి చెప్పెను. ఆయన ఆశ్చర్యమును, పరమానందమును పొంది కుమార్తెను కౌగిలించుకొనెను.

సోమేన యాజయన్ వీరం గ్రహం సోమస్య చాగ్రహీత్ ।
అసోమపోరప్యశ్వినోశ్చ్యవనస్స్వేన తేజసా ।। 24

వీరమ్ - వీరుడగు శర్యాతిని, సోమేన యాజయన్ - సోమయాగమును చేయించువాడై, చ్యవనః - చ్యవనుడు, స్వేన - తనదైన, తేజసా - తేజస్సుచే, అసోమపోః - సోమమునందు భాగము లేని, అశ్వినోః అపి - అశ్వినీ దేవతలకు కూడ, సోమస్య - సోమరసముయొక్క, గ్రహమ్ - పాత్రను, అగ్రహీత్ చ - గ్రహించెను.

వీరుడగు శర్యాతిచే చ్యవనుడు సోమయాగమును చేయించెను. దానిలో చ్యవనుడు తన తేజస్సుచే సోమరసపాత్రను గ్రహించి, సోమయాగములో భాగము లేని అశ్వినీ దేవతలకు కూడ సమర్పించెను.

హంతుం తమాదదే వజ్రం సద్యోమన్యురమర్షితః ।
సవజ్రం స్తంభయామాస భుజమింద్రస్య భార్గవః ।। 25

సద్యః-మన్యుః - వెంటనే కోపమును పొందువాడు, అమర్షితః - సహనము లేనివాడు అగు, ఇంద్రః - ఇంద్రుడు, తమ్ - ఆ చ్యవనుని, హంతుమ్ - సంహరించుటకు, వజ్రమ్ - వజ్రమును, ఆదదే - తీసుకొనెను, భార్గవః - భృగుపుత్రుడగు చ్యవనుడు, సవజ్రమ్ - వజ్రముతో కూడియున్న, ఇంద్రస్య - ఇంద్రునియొక్క, భుజమ్ - భుజమును, స్తంభయామాస - స్తంభింప జేసెను.

సహనము నెరుంగని ఇంద్రునకు కోపము వెంటనే వచ్చెను. ఆయన భృగుపుత్రుడగు ఆ చ్యవనుని చంపుటకై వజ్రమును తీసుకొనెను. కాని, చ్యవనుడు వజ్రమును పట్టుకున్న ఇంద్రుని చేతిని స్తంభింప జేసెను.

అన్వజానంస్తతస్సర్వే గ్రహం సోమస్య చాశ్వినోః ।
భిషజావితి యత్పూర్వం సోమాహుత్యా బహిష్కృతౌ ॥ 26

తతః - తరువాత, సర్వే - అందరు, అశ్వినోః చ - అశ్వినీ దేవతలకు కూడ, సోమస్య - సోమరసముయొక్క, గ్రహమ్ - పాత్రను, అను-అజానన్ - అంగీకరించిరి, యత్ - ఏ అశ్వినులైతే, పూర్వమ్ - ఇదివరలో, భిషజౌ ఇతి - వైద్యులనే కారణముగా, సోమ-ఆహుత్యాః - సోమరసము యొక్క ఆహుతినుండి, బహిః-కృతౌ - బహిష్కరించ బడినారో.

ఇదివరలో వైద్యులనే కారణముగా అశ్వినీ దేవతలు సోమరసము యొక్క ఆహుతినుండి బహిష్కరించ బడినారు. కాని, ఇంద్రుని చేతిని చ్యవనుడు స్తంభింప జేసిన తరువాత దేవతలందరు, అశ్వినీ దేవతలకు కూడ సోమరసపాత్రను స్వీకరించి ఆహుతినిచ్చుటను అంగీకరించిరి.

ఉత్తానబర్హిరానర్తో భూరిషేణ ఇతి త్రయః ।
శర్యాతేరభవన్ పుత్రా ఆనర్తాద్రేవతోఽభవత్ ॥ 27

శర్యాతేః - శర్యాతి వలన, ఉత్తానబర్హిః - ఉత్తానబర్హి, ఆనర్తః - ఆనర్తుడు, భూరిషేణః - భూరిషేణుడు, ఇతి - అనే, త్రయః - ముగ్గురు, పుత్రాః - పుత్రులు, అభవన్ - కలిగిరి, ఆనర్తాత్ - ఆనర్తుని వలన, రేవతః - రేవతుడు, అభవత్ - కలిగెను.

శర్యాతి మహారాజునకు ఉత్తానబర్హి, ఆనర్తుడు, భూరిషేణుడు అనే ముగ్గురు పుత్రులు కలిగిరి. ఆనర్తుని పుత్రుడు రేవతుడు.

సోఽన్తస్సముద్రే నగరీం వినిర్మాయ కుశస్థలీమ్ ।
ఆస్థితోఽభుంక్త విషయానానర్తాదీనరిందమ ॥ 28

అరిందమ - శత్రువులను దునుమాడే ఓ మహారాజా!, సః - ఆ రేవతుడు, సముద్రే అంతః - సముద్రము లోపల, కుశస్థలీమ్ - కుశస్థలి

అనే, నగరీమ్ - నగరమును, నిర్మాయ - నిర్మించి, ఆస్థితః - అధిష్ఠించిన వాడై, ఆనర్త-ఆదీన్ - ఆనర్తము మొదలుగాగల, విషయాన్ - దేశములను, అభుంక్త - పాలించెను.

శత్రువులను దునుమాడిన ఓ మహారాజా! ఆ రేవతుడు సముద్రము లోపల (ద్వీపమునందు) కుశస్థలి అనే నగరమును నిర్మించి, దానిని రాజధానిగా చేసుకొని, ఆనర్తము మొదలగు దేశములను పాలించెను.

తస్య పుత్రశతం జజ్ఞే కకుద్మిజ్యేష్ఠముత్తమమ్ ।
కకుద్మీ రేవతీం కన్యాం స్వామాదాయ విభుం గతః ॥ 29

కన్యావరం పరిప్రష్టుం బ్రహ్మలోకమపావృతమ్ ।
ఆవర్తమానే గాంధర్వే స్థితోఽలబ్ధక్షణః క్షణమ్ ॥ 30

తస్య - వానికి, కకుద్మిజ్యేష్ఠమ్ - కకుద్మి పెద్దవాడుగా గల, ఉత్తమమ్ - శ్రేష్ఠమైన, పుత్రశతమ్ - పుత్రుల వంద, జజ్ఞే - పుట్టెను, కకుద్మీ - కకుద్మి, స్వామ్ - తన, కన్యామ్ - కుమార్తెయగు, రేవతీమ్ - రేవతిని, ఆదాయ - తీసుకొని, విభుమ్ - బ్రహ్మగారిని, కన్యావరమ్ - కన్య కొరకై వరుని గురించి, పరిప్రష్టుమ్ - అడిగి తెలుసుకొనుటకు, అపావృతమ్ - ప్రకాశముతో నిండియుండే, బ్రహ్మలోకమ్ - బ్రహ్మలోకమును గురించి, గతః - వెళ్లినవాడు, గాంధర్వే - సంగీతము, ఆవర్తమానే - అంతటా ప్రవర్తిల్లుచుండగా, అలబ్ధక్షణః - లభించని అవకాశము గలవాడై, క్షణమ్ - క్షణకాలమును, స్థితః - నిలిచియుండెను.

ఆ రేవతునకు వందమంది ఉత్తములగు పుత్రులు కలిగిరి. వారిలో కకుద్మి పెద్దవాడు. కకుద్మి తన కుమార్తెయగు రేవతికి వరును గురించి బ్రహ్మగారిని అడిగి తెలుసుకొనుటకై ఆమెను తీసుకొని ప్రకాశముతో నిండియుండే బ్రహ్మలోకమునకు వెళ్లెను. అచట అపుడు సంగీతోత్సవము జరుగుచుండుటచే ఆయనకు బ్రహ్మగారితో మాటలాడుటకు అవకాశము చిక్కనందు వలన, అచటనే కొద్ది సేపు నిలిచియుండెను.

తదంత ఆద్యమానమ్య స్వాభిప్రాయం న్యవేదయత్ ।
తచ్ఛ్రుత్వా భగవాన్ బ్రహ్మా ప్రహస్య తమువాచ హ ॥ 31

తద్-అంతే - ఆ సంగీతము పూర్తి అయినప్పుడు, ఆద్యమ్ - సృష్టికర్తయగు బ్రహ్మగారిని, ఆనమ్య - సాష్టాంగ నమస్కారమును చేసి, స్వ-అభిప్రాయమ్ - తన అభిప్రాయమును, న్యవేదయత్ - విన్నవించెను, భగవాన్ - పూజనీయుడగు, బ్రహ్మ - బ్రహ్మ గారు, తత్ - ఆ మాటను, శ్రుత్వా - విని, ప్రహస్య - నవ్వి, తమ్ - ఆ కకుద్మిని గురించి, ఉవాచ హ - పలికెనట.

ఆ సంగీతము ముగిసిన పిదప కకుద్మి తన అభిప్రాయమును సృష్టికర్తయగు బ్రహ్మదేవునకు విన్నవించెను. అపుడు పూజనీయుడగు ఆ బ్రహ్మగారు నవ్వి కకుద్మితో నిట్లనిరి.

అహో రాజన్నిరుద్ధాస్తే కాలేన హృది యే కృతాః ।
తత్పుత్రపౌత్రనప్తౄణాం గోత్రాణి చ న శృణ్మహే ॥ 32

అహో - అయ్యో!, రాజన్ - ఓ మహారాజా!, తే - వారు, కాలేన - కాలముచే, నిరుద్ధాః - సంహరించబడినవారు, యే - ఎవరైతే, తే - నీచే, హృది - హృదయమునందు, కృతాః - చేయబడినారో, తత్-పుత్రపౌత్రనప్తౄణామ్ - వారి కొడుకులు మనుమలు మరియు మునిమనుమల, గోత్రాణి చ - పేర్లను కూడ, న శృణ్మహే - వినము.

అయ్యో! మహారాజా! నీవు వరులుగా భావన చేసిన వారినందరినీ కాలము కబళించి వేసినది. ఇప్పుడు వారి కొడుకులు, మనుమలు మరియు మునిమనుమల పేర్లు కూడ వినబడవు.

కాలోఽభియాతస్త్రిణవచతుర్యుగవికల్పితః ।
తద్గచ్ఛ దేవదేవాంశో బలదేవో మహాబలః ।
కన్యారత్నమిదం రాజన్నరరత్నాయ దేహి భోః ॥ 33

త్రిణవచతుర్యుగవికల్పితః - ఇరవై ఏడు మహాయుగములచే విభాగము చేయబడిన, కాలః - కాలము, అభియాతః - గడచినది, తత్ - అందువలన, గచ్ఛ - వెళ్లుము, మహాబలః - గొప్ప బలము గల, బలదేవః - బలదేవుడు, దేవదేవ-అంశః - దేవదేవుడగు నారాయణుని అంశయే, భోః రాజన్ - ఓ రాజా!, ఇదమ్ - ఈ, కన్యారత్నమ్ - కన్యలలో శ్రేష్ఠురా

లగు రేవతిని, నరరత్నాయ - మానవులలో శ్రేష్ఠుడగు బలదేవుని కొరకు, దేహి - ఇమ్ము.

ఓ రాజా! ఇరవై ఏడు మహాయుగముల కాలము (భూలోకములో) గడచిపోయినది. కావున, నీవు వెళ్లుము. దేవదేవుడగు నారాయణుడు అంశచే మహాబలశాలియగు బలదేవుడై అవతరించినాడు. ఆయన మానవులలో శ్రేష్ఠుడు. ఆయనకు కన్యలలో శ్రేష్ఠురాలగు ఈ రేవతినిచ్చి వివాహము చేయుము.

భువో భారావతారాయ భగవాన్ భూతభావనః ।
అవతీర్ణో నిజాంశేన పుణ్యశ్రవణకీర్తనః ॥ 34

భూతభావనః - ప్రాణులను సృష్టించి పాలించువాడు, పుణ్యశ్రవణకీర్తనః - పవిత్రమైన శ్రవణ కీర్తనములు గలవాడు అగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, నిజ-అంశేన - తన అంశచే, భువః - భూమియొక్క, భార-అవతారాయ - బరువును దించివేయుట కొరకై, అవతీర్ణః - అవతరించినవాడు.

ప్రాణులను సృష్టించి పాలించే శ్రీహరి భగవానుడు భూభారమును తొలగించుట కొరకై తన అంశచే అవతరించి యున్నాడు. ఆయన లీలలను విని కీర్తించువారలు పావనులగుదురు.

ఇత్యాదిష్టోఽభివంద్యాజం నృపస్స్వపురమాగతః ।
త్యక్తం పుణ్యజనత్రాసాద్భ్రాతృభిర్దిక్ష్వవస్థితైః ॥ 35

ఇతి - ఈ విధముగా, ఆదిష్టః - ఆదేశించబడిన, నృపః - కకుద్మి మహారాజు, అజమ్ - స్వయంభువుడగు బ్రహ్మగారిని, అభివంద్య - నమస్కరించి, పుణ్యజనత్రాసాత్ - యక్షుల వలని భయము వలన, దిక్షు - దిక్కులయందు, అవస్థితైః - చెల్లాచెదరైయున్న, భ్రాతృభిః - సోదరులచే, త్యక్తమ్ - విడిచిపెట్టబడిన, స్వపురమ్ - తన నగరమును గురించి, ఆగతః - మరలి వచ్చినవాడు.

ఈ విధముగా ఆదేశించబడిన కకుద్మి మహారాజు స్వయంభువు డగు బ్రహ్మగారికి నమస్కరించి, తన నగరము (కుశస్థలి) నకు తిరిగి వచ్చెను. ఇంతలో యక్షులకు భయపడిన అతని సోదరులు (వంశమునకు చెందినవారు) ఆ నగరమును విడిచిపెట్టి నలుదిక్కులకు పారిపోయిరి.

సుతాం దత్త్వానవద్యాంగీం బలాయ బలశాలినే ।
బదర్యాఖ్యం గతో రాజా తప్తుం నారాయణాశ్రమమ్ ।। 36

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే నవమస్కంధే తృతీయోఽధ్యాయః ।।

రాజా - కకుద్మి మహారాజు, అనవద్య-అంగీమ్ - నిర్దుష్టమైన అవయవములు గల, సుతామ్ - కుమార్తెను, బలశాలినే - బలశాలియగు, బలాయ - బలదేవుని కొరకు, దత్త్వా - ఇచ్చి, బదరీ-ఆఖ్యమ్ - బదరి అనే పేరు గల, నారాయణ-ఆశ్రమమ్ - నరనారాయణుల ఆశ్రమమును గురించి, తప్తుమ్ - తపస్సును చేయుటకై, గతః - వెళ్లినవాడు.

కకుద్మి మహారాజు తన కుమార్తెయగు సర్వాంగసుందరియైన రేవతిని బలశాలియగు బలదేవునకిచ్చి వివాహము చేసెను. అపుడాయన తపస్సును చేయుటకై బదరీవనమునందలి నరనారాయణాశ్రమమునకు వెళ్లెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
సుకన్యా రేవతుల వృత్తాంతమును వర్ణించే
మూడవ అధ్యాయము ముగిసినది (3).



# అథ చతుర్థోఽధ్యాయః

## నాభాగుని చరితము - అంబరీషోపాఖ్యానము

శ్రీశుక ఉవాచ।
నాభాగో నభగాపత్యం యం తతం భ్రాతరః కవిమ్ ।
యవిష్ఠం వ్యభజన్ దాయం బ్రహ్మచారిణమాగతమ్ ॥ 1

నాభాగః - నాభాగుడు, నభగ-అపత్యమ్ - నభగుని పుత్రుడు, కవిమ్ - విద్వాంసుడైనట్టియు, యవిష్ఠమ్ - కనిష్ఠుడైనట్టియు, బ్రహ్మచారిణమ్ - బ్రహ్మచారియైనట్టియు, ఆగతమ్ - తిరిగివచ్చిన, యమ్ - ఏ నాభాగుని, భ్రాతరః - సోదరులు, తతమ్ - తండ్రిని, దాయమ్ - వాటానుగా, వ్యభజన్ - పంచి యిచ్చిరో.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- నభగుడి కనిష్ఠ పుత్రుడు నాభాగుడు. ఆతడు గురుకులములో బ్రహ్మచారిగా ఉంటూ విద్యనభ్యసించి పండితుడై ఇంటికి తిరిగి వచ్చెను. ఆతని అన్నలు ఆస్తిలో వాటాగా ఆతనికి తండ్రిని అప్పజెప్పిరి.

భ్రాతరోఽభాంక్త కిం మహ్యం భజామ పితరం తవ ।
త్వాం మమార్యాస్తతాభాంక్షుర్మా పుత్రక తదాదృథాః ॥ 2

భ్రాతరః - అన్నలారా!, మహ్యమ్ - నా కొరకు, కిమ్ - దేనిని, అభాంక్త - పంచి యిచ్చితిరి?, తవ - నీకు, పితరమ్ - తండ్రిని, భజామ - భాగముగా యిచ్చుచున్నాము, తత - ఓ తండ్రీ!, ఆర్యాః - పూజనీయులగు అన్నలు, త్వామ్ - నిన్ను, మమ - నాకు, అభాంక్షుః - భాగముగా యిచ్చిరి, పుత్రక - వెర్రివాడవైన ఓ పుత్రా!, తత్ - ఆ విభాగమును, మా ఆదృథాః - ఆదరించకుము.

అన్నలారా! నాకు ఏమి పంచి యిచ్చితిరి? అని నాభాగుడ ప్రశ్నించగా, నీకు తండ్రిని పంచి యిచ్చితిమని వారు చెప్పిరి. అపుడ నాభాగుడు తండ్రితో, తండ్రీ! పూజనీయులగు అన్నలు నాకు నిన్ను భాగముగా యిచ్చినారు, అని చెప్పెను. ఓ పుత్రా! నీవు వెర్రివాడవు. వారి మాటకు అంగీకరించకుము, అని తండ్రి చెప్పెను.

ఇమే అంగిరసస్సత్రమాసతేఽద్య సుమేధసః ।
షష్ఠం షష్ఠముపేత్యాహః కవే ముహ్యంతి కర్మణి ।। 3

సుమేధసః - మంచి బుద్ధిమంతులగు, అంగిరసః - ఆంగిరసగోత్రీయులు, అద్య - ఈ కాలమునందు, సత్రమ్ - సత్రయాగమును, ఆసతే - అనుష్ఠించుచున్నారు, కవే - ఓ విద్వాంసుడా!, షష్ఠమ్ - ఆరవ, షష్ఠమ్ - ఆరవ, అహః - దినమును, ఉపేత్య - చేరుకొని, కర్మణి - కర్మవిషయములో, ముహ్యంతి - మోహమును పొందుచున్నారు.

మంచి బుద్ధిశాలురగు ఆంగిరస గోత్రీయులు ఈ కాలమునందు సత్రయాగము ననుష్ఠించుచున్నారు. విద్వాంసుడవగు ఓ పుత్రా! వారు ప్రతి ఆరవ దినము వచ్చునప్పటికి కర్మవిషయములో వ్యామోహమును పొందుచున్నారు.

తాంస్త్వం శంసయ సూక్తే ద్వే వైశ్వదేవే మహాత్మనః ।
తే స్వర్యంతో ధనం సత్రపరిశేషితమాత్మనః ।। 4

దాస్యంతి తేఽథ తాన్ గచ్ఛ తథా స కృతవాన్ యథా ।
తస్మై దత్త్వా యయుస్స్వర్గం తే సత్రపరిశేషితమ్ ।। 5

మహాత్మనః - మహాత్ములగు, తాన్ - వారిని గురించి, త్వమ్ - నీవు, ద్వే - రెండు, వైశ్వదేవే - విశ్వేదేవతలకు చెందిన, సూక్తే - సూక్తములను, శంసయ - పఠింప జేయుము, తే - వారు, స్వః - స్వర్గమును గురించి, యంతః - వెళ్లుచున్నవారై, సత్రపరిశేషితమ్ - సత్రయాగమునందు మిగిలిపోయిన, ఆత్మనః - తమ, ధనమ్ - ధనమును, తే - నీ కొరకు, దాస్యంతి - ఈయగలరు, అథ - కావున, తాన్ - వారిని గురించి, గచ్ఛ - వెళ్లుము, సః - ఆతడు, యథా - తండ్రి ఎట్లు చెప్పెనో, తథా -

అదే విధముగా, కృతవాన్ - చేసినవాడు, తే - వారు, సత్రపరిశేషితమ్ - సత్రయాగములో మిగిలిపోయిన ధనమును, తస్మై - వాని కొరకు, దత్త్వా - ఇచ్చి, స్వర్గమ్ - స్వర్గమును గురించి, యయుః - వెళ్లిరి.

మహాత్ములగు ఆ ఆంగిరసులచే నీవు విశ్వేదేవతలకు చెందిన రెండు సూక్తములను పఠింప జేయుము. వారు స్వర్గమునకు వెళ్లబోయే ముందు, సత్రయాగములో మిగిలిపోయిన తమ ధనమును నీకిచ్చెదరు. కావున, వారి వద్దకు వెళ్లుము -- అని తండ్రి చెప్పగా, నాభాగుడు తండ్రి చెప్పిన విధముగనే చేసెను. ఆ ఆంగిరసులు సత్రయాగములో మిగిలిపోయిన ధనమును ఆతనికిచ్చి స్వర్గమునకు వెళ్లిరి.

తం కశ్చిత్స్వీకరిష్యంతం పురుషః కృష్ణదర్శనః ।
ఉవాచోత్తరతోఽభ్యేత్య మమేదం వాస్తుకం వసు ॥ 6

స్వీకరిష్యంతమ్ - ధనమును స్వీకరించబోతున్న, తమ్ - ఆ నాభాగుని గురించి, కృష్ణదర్శనః - నల్లని శరీరము గల, కశ్చిత్ - ఒకానొక, పురుషః - పురుషుడు, ఉత్తరతః - ఉత్తరము వైపునుండి, అభి-ఏత్య - ఎదురుగా వచ్చి, ఉవాచ - పలికెను, ఇదమ్ - ఈ, వాస్తుకమ్ - యజ్ఞభూమియందున్న, వసు - సంపద, మమ - నాది.

యజ్ఞభూమియందలి ఆ ధనమును నాభాగుడు స్వీకరించబోవుచుండగా ఉత్తరము వైపునుండి నల్లని శరీరము గల ఒకానొక పురుషుడు ఎదురుగా వచ్చి, ఈ యజ్ఞభూమియందలి సంపద నాది, అని నాభాగునితో పలికెను.

మమేదమృషిభిర్దత్తమితి తర్హి స్మ మానవః ।
స్యాన్నౌ తే పితరి ప్రశ్నః పృష్టవాన్ పితరం తథా ॥ 7

మమ - నాకు, ఇదమ్ - ఇది, ఋషిభిః - మహర్షులచే, దత్తమ్ - ఈయబడినది, ఇతి - అని, తర్హి - అప్పుడు, మానవః - మనువంశీయుడగు నాభాగుడు, స్మ - పలికెను, నౌ - మనిద్దరికి, తే - నీయొక్క, పితరి - తండ్రియందు, ప్రశ్నః - ప్రశ్న, స్యాత్ - ఉండును, తథా - అదే విధముగా, పితరమ్ - తండ్రిని, పృష్టవాన్ - ప్రశ్నించెను.

ఈ సంపదను మహర్షులు నాకు ఇచ్చినారని అప్పుడు మనువంశీయుడగు నాభాగుడు చెప్పెను. మన ఈ వివాదము విషయములో నీ తండ్రిని ప్రశ్నించవలెనని ఆ పురుషుడు చెప్పెను. ఆయన చెప్పినట్లుగనే, నాభాగుడు తండ్రిని ప్రశ్నించెను.

యజ్ఞవాస్తుగతం సర్వముచ్ఛిష్టమృషయః క్వచిత్ ।
చక్రుర్విభాగం రుద్రాయ స దేవస్సర్వమర్హతి ॥ 8

క్వచిత్ - ఒకప్పుడు, ఋషయః - మహర్షులు; యజ్ఞవాస్తుగతమ్ - యజ్ఞభూమియందున్న, ఉచ్ఛిష్టమ్ - మిగిలిపోయిన, సర్వమ్ - సర్వమును, రుద్రాయ - రుద్రుని కొరకు, విభాగమ్ - విభాగమును, చక్రుః - చేసిరి, సః - ఆ, దేవః - రుద్రదేవుడు, సర్వమ్ - సర్వమును, అర్హతి - తగును.

ఒకప్పుడు మహర్షులు యజ్ఞభూమియందు మిగిలిపోయిన సర్వము రుద్రునకు చెందునని విభాగము చేసిరి. కావున, ఆ రుద్రదేవుడు సర్వమును తీసుకొనుటకు అర్హుడు, అని తండ్రి చెప్పెను.

నాభాగస్తం ప్రణమ్యాహ తవేశ కిల వాస్తుకమ్ ।
ఇత్యాహ మే పితా బ్రహ్మన్ శిరసా త్వాం ప్రసాదయే ॥ 9

నాభాగః - నాభాగుడు, తమ్ - ఆ రుద్రుని, ప్రణమ్య - ప్రణమిల్లి, ఆహ - పలికెను, ఈశ - ఓ ఈశ్వరా!, వాస్తుకమ్ - యజ్ఞభూమియందున్నది, తవ కిల - నిశ్చయముగా నీదే, ఇతి - అని, మే - నాయొక్క, పితా - తండ్రి, ఆహ - చెప్పెను, బ్రహ్మన్ - ఓ భగవానుడా!, త్వామ్ - నిన్ను, శిరసా - శిరస్సుతో, ప్రసాదయే - ప్రసన్నునిగా చేసుకొనెదను.

నాభాగుడు ఆ రుద్రునకు ప్రణమిల్లి ఇట్లు పలికెను -- ఓ ఈశ్వరా! యజ్ఞభూమియందున్న సంపద నిశ్చయముగా నీదేనని నా తండ్రి చెప్పినాడు. ఓ భగవానుడా! నేను శిరసు వంచి ప్రణమిల్లుచున్నాను. నాపై ప్రసన్నుడవు కమ్ము.

యత్తే పితాఽవదద్ధర్మం త్వం చ సత్యం ప్రభాషసే ।
దదామి తే మంత్రదృశే జ్ఞానం బ్రహ్మ సనాతనమ్ ॥ 10

మంత్రదృశే - వైశ్వదేవ సూక్తములను తెలుసుకున్న, తే - నీ కొరకు, సనాతనమ్ - కాలమునకు అతీతమైనది, బ్రహ్మ - గొప్ప, జ్ఞానమ్ - జ్ఞానమును, దదామి - ఇచ్చుచున్నాను, యత్ - ఏలయనగా, తే - నీయొక్క, పితా - తండ్రి, ధర్మమ్ - ధర్మమును, అవదత్ - చెప్పెను, త్వం చ - నీవు కూడ, సత్యమ్ - సత్యమును, ప్రభాషసే - పలుకుచున్నావు.

నీ తండ్రి ధర్మమును చెప్పినాడు. నీవు కూడ సత్యమును పలుకుచున్నావు. కావున, వైశ్వదేవసూక్తములను తెలుసుకున్న నీకు కాలమునకు అతీతమైన గొప్ప జ్ఞానమును (బ్రహ్మతత్త్వమును) ఉపదేశించెదను.

గృహాణ ద్రవిణం దత్తం మత్సత్రే పరిశేషితమ్ ।
ఇత్యుక్త్వాంతర్హితో రుద్రో భగవాన్ సత్యవత్సలః ॥ 11

సత్రే - సత్రయాగమునందు, పరిశేషితమ్ - మిగిలిపోయినది, మత్ - నాచే, దత్తమ్ - ఈయబడినది అగు, ద్రవిణమ్ - ధనమును, గృహాణ - తీసుకొనుము, ఇతి - అని, ఉక్త్వా - పలికి, సత్యవత్సలః - సత్యమునందు ప్రేమ గల, భగవాన్ రుద్రః - రుద్ర భగవానుడు, అంతర్హితః - అంతర్ధానమైనవాడు.

రుద్రభగవానునకు సత్యమునందు ప్రీతి మెండు. సత్రయాగమునందు మిగిలిపోయిన ధనమును నేను నీకు ఇచ్చుచున్నాను, తీసుకొనుము, అని పలికి ఆయన అంతర్ధానము జెందెను.

య ఏతత్సంస్మరేత్ప్రాతస్సాయం చ సుసమాహితః ।
కవిర్భవతి మంత్రజ్ఞో గతిం చైవ తథాఽఽత్మనః ॥ 12

యః - ఎవడైతే, ఏతత్ - దీనిని, ప్రాతః - ఉదయము, సాయం చ - సాయంకాలము కూడ, సుసమాహితః - చక్కని ఏకాగ్రత గలవాడై, సంస్మరేత్ - చక్కగా స్మరించునో అట్టివాడు, కవిః - విద్వాంసుడు,

మంత్రజ్ఞః - మంత్రవేత్త, భవతి - అగును, తథా - మరియు, ఆత్మనః - తనయొక్క, గతిం చ ఏవ - స్వరూపమును కూడ.

ఎవడైతే ఈ వృత్తాంతమును ఉదయము మరియు సాయంకాలము పూర్తి ఏకాగ్రతతో చక్కగా స్మరించునో, అట్టివాడు విద్వాంసుడు మరియు మంత్రవేత్త అగుటయే గాక, తన స్వరూపమగు పరబ్రహ్మను కూడ (ఆత్మరూపముగా) పొందును.

నాభాగాదంబరీషోఽభూన్మహాభాగవతః కృతీ ।
నాస్పృశద్బ్రహ్మశాపోఽపి యం న ప్రతిహతః క్వచిత్ ।। 13

నాభాగాత్ - నాభాగుని వలన, అంబరీషః - అంబరీషుడు, అభూత్ - కలిగెను, మహాభాగవతః - గొప్ప భగవద్భక్తుడు, కృతీ - పుణ్యాత్ముడు, యమ్ - ఎవనినైతే, క్వచిత్ - దేనియందైననూ (ఏ కాలమునందైననూ), న ప్రతిహతః - మొక్కవోని, బ్రహ్మశాపః అపి - బ్రాహ్మణశాపము కూడ, న అస్పృశత్ - స్పృశించలేదో.

నాభాగుని పుత్రుడు అంబరీషుడు. ఆయన గొప్ప భగవద్భక్తుడు. ఆయన ఎంతటి పుణ్యాత్ముడంటే -- ఎన్నడైననూ దేని విషయములోనైననూ మొక్కవోని బ్రాహ్మణ (దుర్వాసుని) శాపము కూడ ఆయనను ఏమీ చేయలేక పోయెను.

రాజోవాచ ।
భగవన్ శ్రోతుమిచ్ఛామి రాజర్షేస్తస్య ధీమతః ।
న ప్రాభూద్యత్ర నిర్ముక్తో బ్రహ్మదండో దురత్యయః ।। 14

భగవన్ - పూజనీయుడవగు ఓ మహర్షీ!, ధీమతః - బుద్ధిశాలియైనట్టియు, రాజ-ఋషేః - రాజర్షియగు, తస్య - ఆ అంబరీషునియొక్క (చరితమును), శ్రోతుమ్ - వినుటకు, ఇచ్ఛామి - కోరుచున్నాను, యత్ర - ఎవనియందైతే, దురత్యయః - అతిక్రమించ శక్యము కాని, బ్రహ్మదండః - బ్రాహ్మణుని శాపము, నిర్ముక్తః - విడిచిపెట్టబడినదై, న ప్ర-అభూత్ - సమర్థము కాలేదో.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను -- పూజనీయుడవగు ఓ శుక మహర్షీ! అంబరీషుడు రాజర్షి, బుద్ధిశాలి. ఆయన గాథను నేను వినగోరుచు న్నాను. ఎందుకంటే, అతిక్రమించ శక్యము కాని బ్రాహ్మణుని శాపము ఆయనపై ప్రయోగించబడిననూ ఆయనను ఏమీ చేయలేక పోయెను.

శ్రీశుక ఉవాచ ।
అంబరీషో మహాభాగస్సప్తద్వీపవతీం మహీమ్ ।
అవ్యయాం చ శ్రియం లబ్ధ్వా విభవం చాతులం భువి ।। **15**

మహాభాగః - గొప్ప భాగ్యవంతుడగు, అంబరీషః - అంబరీషుడు, సప్తద్వీపవతీమ్ - ఏడు ఖండములు గల, మహీమ్ - భూమిని, భువి - భూలోకమునందు, అవ్యయామ్ - తరిగిపోని, శ్రియం చ - సంపదను, అతులమ్ - సాటిలేని, విభవం చ - ఐశ్వర్యమును కూడ, లబ్ధ్వా - పొంది.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- అంబరీషుడు గొప్ప భాగ్యవం తుడు. ఆయన ఏడు ఖండములతో కూడిన భూమండలముపై సాటిలేని ఈశ్వరభావమును పొందెను. ఆయన సంపద భూలోకములో తరిగి పోనిది.

మేనేఽతిదుర్లభం పుంసాం సర్వం తత్స్వప్నసమ్మితమ్ ।
విద్వాన్ విభవనిర్వాణం తమో విశతి యత్పుమాన్ ।। **16**

పుంసామ్ - మానవులకు, అతిదుర్లభమ్ - మిక్కిలి పొంద శక్యము కాని, తత్ - ఆ, సర్వమ్ - సర్వమును, స్వప్నసమ్మితమ్ - కలతో సమమైనదిగా, మేనే - తెలుసుకొనెను, విభవనిర్వాణమ్ - సంపద ఆరిపో వుటను, విద్వాన్ - తెలిసినవాడు, యత్ - దేని నిమిత్తముగా, పుమాన్ - మానవుడు, తమః - నరకమును, విశతి - ప్రవేశించునో.

మానవులకు మిక్కిలి దుర్లభమైన ఆ సర్వము కలవంటిది (కల్ల) మాత్రమేనని అంబరీషుడు తెలుసుకొనెను. ఏ సంపదల కొరకై మానవుడు పాపమును చేసి నరకమును పొందుచున్నాడో, ఆ సంపదలు ఆరిపోయే దీపమువంటివేననే వివేకము ఆయనకు ఉండెను.

వాసుదేవే భగవతి తద్భక్తేషు చ సాధుషు ।
ప్రాప్తో భావం పరం విశ్వం యేనేదం లోష్టవత్స్మృతమ్ ।। 17

వాసుదేవే భగవతి - వాసుదేవ భగవానునియందు, తద్-భక్తేషు - ఆయన భక్తులైన, సాధుషు చ - సత్పురుషులయందు కూడ, పరమ్ - అతిశయించిన, భావమ్ - భక్తిని, ప్రాప్తః - పొందినవాడు, యేన - దేనిచే, ఇదమ్ - ఈ, విశ్వమ్ - జగత్తు, లోష్టవత్ - మట్టిబెడ్డ వంటిదిగా, స్మృతమ్ - భావించబడునో.

అంబరీషునకు వాసుదేవ భగవానునియందు మరియు వాసుదేవుని భక్తులగు సత్పురుషులయందు అతిశయించిన భక్తి ఉండెడిది. అట్టి భక్తి ఉన్నవానికి ఈ జగత్తు మట్టిబెడ్డవలె విలువ లేనిదిగా కన్పట్టును.

స వై మనః కృష్ణపదారవిందయోర్వచాంసి వైకుంఠగుణానువర్ణనే ।
కరౌ హరేర్మందిరమార్జనాదిషు శ్రుతిం చకారాచ్యుతసత్కథోదయే।।18

సః - ఆయన, మనః - మనస్సును, కృష్ణపద-అరవిందయోః - శ్రీకృష్ణుని పాదపద్మములయందు, వచాంసి - వాక్కులను, వైకుంఠగుణ-అనువర్ణనే - శ్రీహరియొక్క గుణములను వర్ణించుటయందు, కరౌ - చేతులను రెండింటినీ, హరేః - శ్రీహరియొక్క, మందిరమార్జన-ఆదిషు - మందిరమును తుడుచుట మొదలగువాటియందు, శ్రుతిమ్ - చెవిని, అచ్యుతసత్-కథా-ఉదయే - శ్రీహరియొక్క చక్కని గాథలను వినుటయందు, వై - నిశ్చయముగా, చకార - చేసెను.

ఆ అంబరీషుడు మనస్సును శ్రీకృష్ణుని పాదపద్మములయందు, వాక్కులను శ్రీహరియొక్క గుణములను వర్ణించుటయందు, చేతులను రెండింటినీ శ్రీహరి మందిరమును తుడుచుట పుష్పములను కోయుట మొదలగు పనులయందు, చెవిని శ్రీహరియొక్క చక్కని గాథలను వినుటయందు నిశ్చయముగా లగ్నము చేసెను.

ముకుందలింగాలయదర్శనే దృశౌ తద్భృత్యగాత్రస్పర్శేఽంగసంగమమ్ ।
ఘ్రాణం చ తత్పాదసరోజసౌరభే శ్రీమత్తులస్యా రసనాం తదర్పితే ।। 19

దృశౌ - కన్నులను రెండింటినీ, ముకుందలింగ-ఆలయదర్శనే - మోక్షప్రదాతయగు శ్రీహరియొక్క మూర్తుల ఆలయములను చూచుట యందు, అంగసంగమమ్ - శరీరముతోడి సంస్పర్శను, తద్-భృత్యగాత్ర స్పర్శే - ఆ శ్రీహరియొక్క భక్తుల శరీరమును స్పృశించుటయందు, ఘ్రాణం చ - ముక్కును కూడ, శ్రీమత్-తులస్యాః - శోభాయుక్తమైన తులసియొక్క, తత్-పాదసరోజసౌరభే - ఆ శ్రీహరి పాదపద్మముల పరిమళమునందు, రసనామ్ - నాలుకను, తద్-అర్పితే - ఆ శ్రీహరికి నివేదించబడిన ఆహారమునందు.

అంబరీషుడు కన్నులను రెండింటినీ మోక్షప్రదాతయగు శ్రీహరియొక్క మూర్తుల ఆలయములను దర్శించుటయందు, త్వగింద్రియమును ఆ శ్రీహరి భక్తుల అంగముతోడి స్పర్శ (ఆలింగనాదులు) యందు, ముక్కును ఆయన పాదములయందు అర్పించబడిన తులసి పరిమళము నాఘ్రాణించుటయందు, నాలుకను ఆ శ్రీహరికి అర్పించిన నైవేద్యమును రుచి చూచుటయందు సంలగ్నము చేసెను.

పాదౌ హరేః క్షేత్రపదానుసర్పణే శిరో హృషీకేశపదాభివందనే ।
కామం చ దాస్యే న తు కామకామ్యయా యథోత్తమశ్లోకజనాశ్రయా రతిః॥

పాదౌ - పాదములను రెండింటినీ, హరేః - శ్రీహరియొక్క, క్షేత్ర పద-అనుసర్పణే - క్షేత్రములకు పాదయాత్రయందు, శిరః - తలను, హృషీకేశపద-అభివందనే - ఇంద్రియాధిపతియగు శ్రీహరియొక్క పాదములను అభివాదము చేయుటయందు, కామం చ - భోగ్యవస్తువును, దాస్యే - సేవయందు, కామకామ్యయా తు - భోగ్యవస్తువునందలి కామనచేనైతే, న - కాదు, యథా - ఏ విధముగానైతే, ఉత్తమశ్లోకజన-ఆశ్రయా - పవిత్రకీర్తియగు శ్రీహరియొక్క భక్తులను ఆశ్రయించి ఉండే, రతిః - ప్రేమయో.

అంబరీషుడు పాదములను రెండింటినీ శ్రీహరి క్షేత్రములకు పాదయాత్రను చేయుటయందు, తలను ఇంద్రియాధిపతియగు శ్రీహరి పాదములకు అభివాదమును చేయుటయందు లగ్నము చేసెను. ఆయన చందనాది భోగ్యవస్తువులను శ్రీహరి సేవయందు వినియోగించెనే గాని, వాటి

యందలి ఇచ్చుచే వాటిని స్వీకరించలేదు. ఇట్టి సేవచే సాధకుని ప్రేమకు పవిత్రకేర్తియగు శ్రీహరి భక్తులే కేంద్రబిందువులగుదురు.

ఏవం సదా కర్మకలాపమాత్మనః పరేఽధియజ్ఞే భగవత్యధోక్షజే ।
సర్వాత్మభావం విదధన్మహీమిమాం తన్నిష్ఠవిప్రాభిహితశ్శశాస హ ॥21

ఏవమ్ - ఈ విధముగా, సదా - అన్ని కాలములలో, ఆత్మనః - తనయొక్క, సర్వ-ఆత్మభావమ్ - సర్వము ఆత్మరూపమేననే భావన గల, కర్మకలాపమ్ - కర్మసమూహమును, పరే - ప్రకృతికి అతీతుడైనట్టియు, అధియజ్ఞే - యజ్ఞపురుషుడైనట్టియు, అధోక్షజే - ప్రమాణములకు గోచరుడు కాని, భగవతి - శ్రీహరి భగవానునియందు, విదధత్ - సమర్పించువాడై, తత్-నిష్ఠవిప్ర-అభిహితః - ఆ శ్రీహరియందు నిష్ఠ గల వేదవేత్తలచే శిక్షణచేయబడినవాడై, ఇమామ్ - ఈ, మహీమ్ - భూమిని, శశాస హ - పాలించెనట.

అంబరీషుడీ విధముగా సర్వకాలములలో సర్వము ఆత్మరూపమే అనే భావన గలవాడై, తన కర్మలనన్నింటినీ యజ్ఞపురుషుడగు శ్రీహరి భగవానునకు సమర్పించెను. ప్రకృతికి అతీతుడగు శ్రీహరి ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరుడు కాడు. అంబరీషుడు ఆ శ్రీహరియందు నిష్ఠ గల వేద వేత్తల వద్ద శిక్షణను పొంది, ఈ భూమిని పాలించెను.

ఈజేఽశ్వమేధైరధియజ్ఞమీశ్వరం మహావిభూత్యోపచితాంగదక్షిణైః ।
తతైర్వసిష్ఠాసితగౌతమాదిభిర్ధన్వన్యభిస్రోతమసౌ సరస్వతీమ్ ॥ 22

అసౌ - ఈ అంబరీషుడు, ధన్వని - ధన్వ అనే ఎడారి ప్రదేశమునందు, సరస్వతీం అభిస్రోతమ్ - సరస్వతీనదికి అభిముఖముగా ప్రవాహమునకు ఎదురుగా, అధియజ్ఞమ్ - యజ్ఞపురుషుడైనట్టియు, ఈశ్వరమ్ - జగన్నాథుడగు శ్రీహరిని, మహావిభూత్యా - గొప్ప సంపదచే, ఉపచిత-అంగదక్షిణైః - వర్ధిల్ల జేయబడిన అంగములు మరియు దక్షిణలు కలిగినట్టియు, వసిష్ఠ-అసితగౌతమ-ఆదిభిః - వసిష్ఠుడు అసితుడు గౌతముడు మొదలగువారిచే, తతైః - విస్తరింప జేయబడిన, అశ్వమేధైః - అశ్వమేధ యాగములచే, ఈజే - ఆరాధించెను.

ఈ అంబరీషుడు ధన్వ అనే ఎడారియందు సరస్వతీనది ప్రవాహమునకు ఎదురుగా (ఆ నది ఒడ్డున) అనేకములగు అశ్వమేధ యాగములను చేసి, యజ్ఞేశ్వరుడు మరియు జగన్నాథుడు అగు శ్రీహరిని ఆరాధించెను. గొప్ప సంపదను వెచ్చించి ఆయన ఆ యజ్ఞములలోని అంగములన్నియు పరిపూర్ణములగునట్లు చేసి అధికమగు దక్షిణలనిచ్చెను. వసిష్ఠుడు, అసితుడు, గౌతముడు మొదలగు మహర్షులు ఆ యజ్ఞములను విస్తృతముగా నిర్వహింప జేసిరి.

యస్య క్రతుషు గీర్వాణైస్సదస్యా ఋత్విజో జనాః ।
తుల్యరూపాశ్చానిమిషా వ్యదృశ్యంత సువాససః ॥ 23

యస్య - ఏ అంబరీషునియొక్క, క్రతుషు - యజ్ఞములయందు, సువాససః - చక్కని వస్త్రములు గల, సదస్యాః - సభాసధులు, ఋత్విజః - ఋత్విక్కులు, జనాః - జనులు, గీర్వాణైః - దేవతలతో, తుల్యరూపాః - సమానమైన రూపములు గలవారు, అనిమిషాః చ - రెప్పపాటు లేనివారుగ, వ్యదృశ్యంత - కన్పట్టిరి.

అంబరీషుని యజ్ఞములయందు సభాసదులు, ఋత్విక్కులు, జనులు మంచి వస్త్రములను ధరించినవారై దేవతలతో సమానమైన రూపమును కలిగియుండిరి. పైగా, వారు కనురెప్పపాటు మాని చూచుచుండుటచే, దేవతలను పోలియున్నట్లు కన్పట్టిరి.

స్వర్గో న ప్రార్థితో యస్య మనుజైరమరప్రియః ।
శృణ్వద్భిరుపగాయద్భిరుత్తమశ్లోకచేష్టితమ్ ॥ 24

ఉత్తమశ్లోకచేష్టితమ్ - పవిత్రకీర్తియగు శ్రీహరియొక్క లీలను, శృణ్వద్భిః - వినునట్టియు, ఉపగాయద్భిః - గానము చేసే, యస్య - ఏ అంబరీషునియొక్క, మనుజైః - ప్రజలచే, అమరప్రియః - దేవతలకు ప్రియమైన, స్వర్గః - స్వర్గము, న ప్రార్థితః - కోరబడలేదో.

అంబరీషుని రాజ్యములోని జనులు పవిత్రకీర్తియగు శ్రీహరియొక్క లీలలను విని గానము చేసెడివారు. దేవతలకు ప్రీతిపాత్రమైన స్వర్గమునందు వారికి ప్రీతి లేకుండెను.

సమర్ధయంతి తాన్ కామాస్స్వారాజ్యపరిభావితాః ।
దుర్లభా నాపి సిద్ధానాం ముకుందం హృది పశ్యతః ।। 25

ముకుందమ్ - మోక్షప్రదాతయగు శ్రీహరిని, హృది - హృదయమునందు, పశ్యతః - చూచే, తాన్ - వారిని, స్వారాజ్యపరిభావితాః - స్వయంప్రకాశమగు ఆత్మానందముచే తిరస్కరించబడే, కామాః - భోగ్యవస్తువులు, సిద్ధానామ్ - సిద్ధపురుషులకు, దుర్లభాః అపి - దుర్లభములే అయిననూ, న సమర్థయంతి - హర్షమును కలుగుజేయుట లేదు.

వారు మోక్షప్రదాతయగు శ్రీహరిని ఆత్మరూపముగా దర్శించెదరు. వారి అనుభవరూపమగు ఆత్మానందము ముందు విషయభోగముల ఆనందము దిగదుడుపు. సిద్ధపురుషులకు దుర్లభములైన భోగములు కూడ వారికి హర్షమును కలిగించుట లేదు.

స ఇత్థం భక్తియోగేన తపోయుక్తేన పార్థివః ।
స్వధర్మేణ హరిం ప్రీణన్ సంగాన్ సర్వాన్ శనైర్జహౌ ।। 26

సః - ఆ, పార్థివః - అంబరీష మహారాజు, ఇత్థమ్ - ఈ విధముగా, తపః-యుక్తేన - తపస్సుతో కూడిన, భక్తియోగేన - భక్తియోగముతో, స్వధర్మేణ - తన ధర్మమునునుష్ఠించుటచే, హరిమ్ - శ్రీహరిని, ప్రీణన్ - ప్రసన్నుని చేయువాడై, సర్వాన్ - సకలములైన, సంగాన్ - సంసారాసక్తులను, శనైః - మెల్లమెల్లగా, జహౌ - విడిచిపెట్టెను.

ఆ అంబరీష మహారాజు ఈ విధముగా తపస్సుతో కూడియున్న భక్తియోగముతో మరియు స్వధర్మము (ప్రజాపాలనము) ను అనుష్ఠించుట ద్వారా శ్రీహరిని ప్రసన్నుని చేసుకొనెను. ఆయన సంసారమునందలి ఆసక్తులనన్నింటినీ మెల్లమెల్లగా విడిచిపెట్టెను.

గృహేషు దారేషు సుతేషు బంధుషు ద్విపోత్తమస్యందనవాజిపత్తిషు ।
అక్షయ్యరత్నాభరణాయుధాదిష్వనంతకోశేష్వకరోదసన్మతిమ్ ।। 27

గృహేషు - ఇంటియందు, దారేషు - భార్యయందు, సుతేషు - పుత్రులయందు, బంధుషు - బంధువులయందు, ద్విప-ఉత్తమస్యందనవా

జిపత్తిషు - గొప్ప ఏనుగులు రథములు గుఱ్ఱములు మరియు పదాతిసై
న్యము అనువాటియందు, అక్షయ్యరత్న-ఆభరణ-ఆయుధ-ఆదిషు - తరి
గిపోని రత్నములు ఆభరణములు ఆయుధములు మొదలగువాటియందు,
అనంతకోశేషు - అంతము లేని ఖజానాలయందు, అసత్-మతిమ్ - మిథ్య
అనే నిశ్చయమును, అకరోత్ - చేసెను.

ఇల్లు, భార్య, సంతానము, బంధువులు, గొప్ప ఏనుగులు, రథము
లు, గుఱ్ఱములు, సైన్యము, తరిగిపోని రత్నములు, ఆభరణములు, ఆయు
ధములు, వస్త్రములు మొదలైనవి, అంతము లేని ఖజానాలు అనునవి
మిథ్య అనే దృఢమగు నిశ్చయమును అంబరీషుడు కలిగియుండెను.

తస్మా అదాద్ధరిశ్చక్రం ప్రత్యనీకభయావహమ్ ।
ఏకాంతభక్తిభావేన ప్రీతో భృత్యాభిరక్షణమ్ ।। 28

ఏకాంతభక్తిభావేన - అనన్యమగు భక్తిభావముచే, ప్రీతః - ప్రీతిని
జెందిన, హరిః - శ్రీహరి, తస్మై - వాని కొరకు, ప్రత్యనీకభయ-ఆవహమ్
- శత్రుపక్షము వారికి భయమును గొల్పునట్టియు, భృత్య-అభిరక్షణమ్ -
భక్తులను రక్షించే, చక్రమ్ - చక్రమును, అదాత్ - ఇచ్చెను.

అంబరీషుని అనన్యమగు భక్తిభావముచే ప్రసన్నుడైన శ్రీహరి
ఆయనకు చక్రమునిచ్చెను (ఆయన రక్షణకు చక్రమును నియోగించెను).
ఆ చక్రము శత్రుపక్షము వారికి భయమును గొల్పి, భక్తులను రక్షించును.

ఆరిరాధయిషుః కృష్ణం మహిష్యా తుల్యశీలయా ।
యుక్తస్సాంవత్సరం వీరో దధార ద్వాదశీవ్రతమ్ ।। 29

వీరః - వీరుడగు అంబరీషుడు, తుల్యశీలయా - సమానమైన
శీలము గల, మహిష్యా - భార్యతో, యుక్తః - కూడినవాడై, కృష్ణమ్ -
శ్రీకృష్ణుని, ఆరిరాధయిషుః - ఆరాధించ గోరువాడై, సాంవత్సరమ్ -
సంవత్సర కాలము నడిచే, ద్వాదశీవ్రతమ్ - ద్వాదశీవ్రతమును, దధార -
పూనెను.

వీరుడగు అంబరీషుని భార్య కూడ ఆయనతో సమానమైన శీలము గలదియే. ఆయన శ్రీకృష్ణుని ఆరాధించ గోరి, ఆమెతో గూడి సంవత్సర కాలము ద్వాదశీ వ్రతము (ఏకాదశినాడు ఉపవసించి ద్వాదశి నాడు ఉదయమే ఉపవాసమును సమాప్తి చేసే వ్రతము) ను పూనెను.

వ్రతాంతే కార్తికే మాసి త్రిరాత్రం సముపోషితః ।
స్నాతః కదాచిత్కాలింద్యాం హరిం మధువనేఽర్చయత్ ॥ 30

కార్తికే మాసి - కార్తీక మాసమునందు, వ్రత-అంతే - వ్రతము యొక్క అంతమునందు, త్రిరాత్రమ్ - మూడు దినములను, ఉప-ఉషితః - ఉపవసించినవాడై, కదాచిత్ - ఒక (ద్వాదశి) నాడు, కాలింద్యామ్ - యమునా నదియందు, స్నాతః - స్నానము చేసినవాడై, హరిమ్ - శ్రీహరిని, మధువనే - మధువనమునందు, అర్చయత్ - పూజించెను.

ఆయన కార్తీకమాసములో వ్రతముయొక్క అంతమునందు మూడు రోజులు ఉపవసించెను. ద్వాదశినాడు యమునానదిలో స్నానమును చేసినవాడై, ఆయన మధువనములో శ్రీహరిని అర్చించెను.

మహాభిషేకవిధినా సర్వోపస్కరసంపదా ।
అభిషిచ్యాంబరాకల్పైర్గంధమాల్యార్హణాదిభిః ॥ 31

తద్గతాంతరభావేన పూజయామాస కేశవమ్ ।
బ్రాహ్మణాంశ్చ మహాభాగాన్ సిద్ధార్థానపి భక్తితః ॥ 32

సర్వ-ఉపస్కరసంపదా - అన్ని పూజాసామగ్రుల సంపద గల, మహాభిషేకవిధినా - సామ్రాజ్యపట్టాభిషేకముయొక్క విధితో, కేశవమ్ - శ్రీహరిని, అభిషిచ్య - అభిషేకించి, తద్-గత-అంతరభావేన - శ్రీహరిని పొందిన అంతఃకరణమునందలి భక్తిభావముతో, అంబర-ఆకల్పైః - వస్త్రములతో ఆభరణములతో, గంధమాల్య-అర్హణ-ఆదిభిః - గంధము మాలలు అర్ఘ్యోదకము మొదలగువాటితో, పూజయామాస - పూజించెను, సిద్ధ-అర్థాన్ అపి - సిద్ధించిన కామనలు గలవారే అయిననూ, మహాభాగాన్ - మహాత్ములైన, బ్రాహ్మణాన్ చ - బ్రహ్మవేత్తలను కూడ, భక్తితః - భక్తితో.

ఆయన శ్రీహరిని సామ్రాజ్యపట్టాభిషేకవిధితో అభిషేకించెను. ఆ అభిషేకము సకలసామగ్రులతో సంపన్నమాయెను. తరువాత ఆయన తన అంతఃకరణమును భక్తిభావముతో శ్రీహరిపై నిలిపెను. వస్త్రములు, ఆభరణములు, గంధము, మాలలు, అర్ఘ్యోదకము మొదలగువాటితో ఆయన శ్రీహరిని పూజించెను. మరియు, ఆయన మహాత్ములైన బ్రహ్మవేత్తలను కూడ -- ఆ బ్రహ్మవేత్తలు సర్వము సిద్ధించినవారే అయిననూ -- భక్తితో పూజించెను.

గవాం రుక్మవిషాణీనాం రూప్యాంఘ్రీణాం సువాససామ్ ।
పయఃశీలవయోరూపవత్సోపస్కరసంపదామ్ ॥ 33

ప్రాహిణోత్సాధు విప్రేభ్యో గృహేషు న్యర్బుదాని షట్ ।
భోజయిత్వా ద్విజానగ్రే స్వాద్వన్నం గుణవత్తమమ్ ॥ 34

అగ్రే - ముందుగా, ద్విజాన్ - బ్రాహ్మణులను, స్వాదు - రుచికరమైనట్టియు, గుణవత్-తమమ్ - మిక్కిలి పుష్టికరమైన, అన్నమ్ - ఆహారమును, భోజయిత్వా - భుజింపజేసి, రుక్మవిషాణీనామ్ - బంగరు కొమ్ములు కలిగినట్టియు, రూప్య-అంఘ్రీణామ్ - వెండి గిట్టలు కలిగినట్టియు, సువాససామ్ - చక్కని వస్త్రములు కలిగినట్టియు, పయః-శీలవయః-రూపవత్స-ఉపస్కరసంపదామ్ - పాలు శీలము వయస్సు రూపము దూడ సామగ్రి అనువాటి సంపద గల, గవామ్ - ఆవులయొక్క, షట్ - ఆరు, న్యర్బుదాని - పది కోట్లను, (సాధు) విప్రేభ్యః - (దానమునకు యోగ్యులైన) వేదవేత్తల కొరకు, గృహేషు - ఇళ్లయందు, సాధు - చక్కగా, ప్రాహిణోత్ - పంపించెను.

ఆయన ముందుగా దానయోగ్యులైన బ్రాహ్మణులకు రుచికరమైన మరియు మిక్కిలి పుష్టికరమైన ఆహారమును ఏర్పాటు చేసెను. తరువాత అరవై కోట్ల ఆవులను దూడతో సహా వారిళ్లకు చక్కగా పంపించెను. సాధుస్వభావము గలవై వయస్సులోనున్న ఆ ఆవుల కొమ్ములకు బంగారము, గిట్టలకు వెండి తొడగబడెను. చక్కని రూపము గల ఆ ఆవులపై చక్కని వస్త్రములు కప్పబడెను. వాటితో బాటుగా గంటలు, పాలు పితికే గిన్నెలు మొదలగు సామగ్రి కూడ ఈయబడెను.

లబ్ధకామైరనుజ్ఞాతః పారణాయోపచక్రమే ।
తస్య తర్హ్యతిథిస్సాక్షాద్దుర్వాసా భగవానభూత్ ।। 35

లబ్ధకామైః - పొందబడిన దక్షిణలు గల వేదవేత్తలచే, అనుజ్ఞాతః - అనుమతి ఈయబడినవాడై, పారణాయ - వ్రతమునకు అంతమునందు చేసే భోజనము కొరకు, ఉపచక్రమే - సంసిద్ధుడాయెను, తర్హి - అదే సమయమునందు, భగవాన్ - పూజనీయుడగు, దుర్వాసాః - దూర్వాస మహర్షి, అతిథిః - అతిథియై, సాక్షాత్ అభూత్ - ప్రత్యక్షమాయెను.

వేదవేత్తలు దక్షిణలను పొంది, వ్రతము అంతమైనది గనుక భోజనము చేయుడని అనుమతినీయగా, అంబరీషుడు అందుకు సంసిద్ధుడగుచుండెను. ఇంతలో, పూజనీయుడగు దూర్వాస మహర్షి అతిథిగా ప్రత్యక్షమాయెను.

తమానర్చాతిథిం భూపః ప్రత్యుత్థానాసనార్హణైః ।
యయాచేऽభ్యవహారాయ పాదమూలముపాగతః ।। 36

భూపః - అంబరీష మహారాజు, తమ్ - ఆ, అతిథిమ్ - అతిథిని, ప్రతి-ఉత్థాన-ఆసన-అర్హణైః - ఎదురుగా లేచి నిలబడుట ఆసనము మరియు పూజాద్రవ్యములతో, ఆనర్చ - పూజించెను, పాదమూలమ్ - పాదముల మూలమును, ఉపాగతః - చేరినవాడై, అభ్యవహారాయ - భోజనము కొరకు, యయాచే - కోరెను.

అంబరీష మహారాజు ఆ అతిథిని చూచి లేచి నిలబడి ఎదురేగి ఆసనముపై కూర్చుండబెట్టి పూజాద్రవ్యములతో పూజించెను. మహారాజు ఆయన పాదములకు ప్రణమిల్లి భోజనమునకు రండని కోరెను.

ప్రతినంద్య స తద్యాచ్ఞాం కర్తుమావశ్యకం గతః ।
నిమమజ్జ బృహద్ధ్యాయన్ కాళిందీసలిలే శుభే ।। 37

సః - ఆ మహర్షి, తద్-యాచ్ఞామ్ - ఆయన కోరికను, ప్రతినంద్య - అంగీకరించి, ఆవశ్యకమ్ - మాధ్యాహ్నిక నిత్యకర్మను, కర్తుమ్ - చేయుటకు, గతః - వెళ్లినవాడు, శుభే - మంగళకరమగు, కాళిందీసలిలే -

యమునానదీ జలములయందు, బృహత్ - పరబ్రహ్మను, ధ్యాయన్ - ధ్యానించుచున్నవాడై, నిమమజ్జ - మునిగెను.

ఆ మహర్షి అంబరీషుని కోరికను స్వీకరించి మాధ్యాహ్నిక నిత్యకర్మను నిర్వర్తించుటకై వెళ్లెను. ఆయన మంగళకరమగు యమునానదిలో స్నానము చేసి పరబ్రహ్మను ధ్యానించుచుండెను.

ముహూర్తార్ధావశిష్టాయాం ద్వాదశ్యాం పారణం ప్రతి ।
చింతయామాస ధర్మజ్ఞో ద్విజైస్తద్ధర్మసంకటే ॥ 38

ద్వాదశ్యామ్ - ద్వాదశి, ముహూర్త-అర్ధ-అవశిష్టాయామ్ - సగము ముహూర్తము మిగిలియుండగా, ధర్మజ్ఞః - ధర్మము తెలిసిన అంబరీషుడు, తద్-ధర్మసంకటే - ఆ ధర్మసంకటము విషయములో, పారణం ప్రతి - వ్రతాంతమునందు చేసే భోజనమును గురించి, ద్విజైః - వేదవేత్తలతో, చింతయామాస - సంప్రదించెను.

ద్వాదశి అరగంట మాత్రమే మిగిలియుండెను. ద్వాదశి వెళ్లిపోయే లోపులో వ్రతమును భోజనముతో ముగించవలెను. కాని, అతిథికి పెట్టకుండా తినరాదు. అంబరీషుడు ధర్మము తెలిసినవాడే అయినా, ఈ ధర్మసంకటమును గురించి వేదవేత్తలతో సంప్రదించెను.

బ్రాహ్మణాతిక్రమే దోషో ద్వాదశ్యాం యదపారణే ।
యత్కృత్వా సాధు మే భూయాదధర్మో వా న మాం స్పృశేత్ ॥ 39

యత్ - ఏలయనగా, బ్రాహ్మణ-అతిక్రమే - బ్రాహ్మణుని యెడల అపచారమునందు, ద్వాదశ్యామ్ - ద్వాదశియందు, అపారణే - వ్రతాంత భోజనమును చేయకపోవుటయందు, దోషః - దోషము, యత్ - దేనిని, కృత్వా - చేసి, మే - నాకు, సాధు - మంచి, భూయాత్ - కలుగును? అధర్మః - అధర్మము, మామ్ - నన్ను, న వా స్పృశేత్ - స్పృశించకుండును?

బ్రాహ్మణుడు రాకుండా భోజనము చేసి ఆయన యెడల అపచారము చేయుట తప్పు. ద్వాదశివేళ మించకుండా వ్రతాంత భోజనమును

చేయకుండుట కూడ తప్పే. ఈ సంకటములో అధర్మము తగలకుండా నాకు మంచి కలిగే ఉపాయమేమి?

అంభసా కేవలేనాథ కరిష్యే వ్రతపారణమ్ ।
ప్రాహురబ్భక్షణం విప్రా హ్యశితం నాశితం చ తత్ ॥ 40

విప్రాః - ఓ వేదవేత్తలారా!, అథ - లేదా, కేవలేన అంభసా - నీటితో మాత్రమే, వ్రతపారణమ్ - వ్రతసమాప్తిని, కరిష్యే - చేసెదను, హి - ఆలోచింపగా, తత్ - అట్టి, అబ్-భక్షణమ్ - నీటిని త్రాగుట, అశితమ్ - భోజనము, చ - మరియు, అశితం న - భోజనము కాదు అని, ప్రాహుః - చెప్పెదరు.

ఓ వేదవేత్తలారా! లేదా, నేను కేవలము నీటిని మాత్రమే త్రాగి వ్రతమును సమాప్తము చేసెదను. ఎందుకంటే, అట్లు నీటిని మాత్రమే త్రాగుట భోజనము చేసినట్లు కాదు, భోజనమును మానినట్లు కూడ కాదు.

ఇత్యపః ప్రాశ్య రాజర్షిశ్చింతయన్మనసాఽచ్యుతమ్ ।
ప్రత్యచష్ట కురుశ్రేష్ఠ ద్విజాగమనమేవ సః ॥ 41

కురుశ్రేష్ఠ - కురువంశీయులలో శ్రేష్ఠుడవగు ఓ రాజా!, ఇతి - అని, రాజర్షిః - రాజర్షియగు, సః - ఆ అంబరీషుడు, అపః - నీళ్లను, ప్రాశ్య - త్రాగి, మనసా - మనస్సుతో, అచ్యుతమ్ - శ్రీహరిని, చింతయన్ - స్మరించుచున్నవాడై, ద్విజ-ఆగమనం ఏవ - వేదవేత్తయగు దూర్వాసుని రాకను మాత్రమే, ప్రతి-అచష్ట - ఎదురు చూచెను.

కురువంశీయులలో శ్రేష్ఠుడవగు ఓ పరీక్షిన్మహారాజా! రాజర్షియగు ఆ అంబరీషుడు నీటిని త్రాగి మనస్సులో శ్రీహరిని స్మరించెను. ఆయన వేదవేత్తయగు దూర్వాసుని రాక కొరకు ఎదురు చూచుచుండెను.

దుర్వాసా యమునాకూలాత్కృతావశ్యక ఆగతః ।
రాజ్ఞాఽభినందితస్తస్య బుబుధే చేష్టితం ధియా ॥ 42

దుర్వాసాః - దూర్వాస మహర్షి, కృత-ఆవశ్యకః - చేయబడిన నిత్యకర్మలు గలవాడై, యమునాకూలాత్ - యమునానది ఒడ్డునుండి,

ఆగతః - వచ్చినవాడు, రాజ్ఞా - అంబరీష మహారాజుచే, అభినందితః - నమస్కరించబడిన వాడు, తస్య - ఆ రాజుయొక్క, చేష్టితమ్ - చేసిన పనిని, ధియా - బుద్ధిచే, బుబుధే - తెలుసుకొనెను.

దూర్వాస మహర్షి నిత్యకర్మలను పూర్తి చేసుకొని యమునానదీ తీరమునుండి తిరిగి వచ్చెను. అంబరీష మహారాజు ఆయనకు నమస్కరించెను. రాజు నీటిని త్రాగిన విషయమును మహర్షి తన బుద్ధిచే గ్రహించెను.

మన్యునా ప్రచలద్గాత్రో భ్రుకుటీకుటిలాననః ।
బుభుక్షితశ్చ సుతరాం కృతాంజలిమభాషత ॥ 43

మన్యునా - కోపముతో, ప్రచలద్-గాత్రః - వణికిపోవుచున్న దేహము గలవాడు, భ్రుకుటీకుటిల-ఆననః - కనుబొమల విరుపుచే వికటమైన మోము గలవాడు, చ - మరియు, సుతరామ్ - మిక్కిలి, బుభుక్షితః - ఆకలి గొన్నవాడు అగు దూర్వాసుడు, కృత-అంజలిమ్ - ఒగ్గబడిన దోసిలి గల రాజును గురించి, అభాషత - పలికెను.

అంబరీష మహారాజు దోసిలి యొగ్గి నిలబడి యుండెను. కాని, దూర్వాసుడు కోపముతో వణికిపోవుచుండెను. ఆయన ముఖము కనుబొమల విరుపుతో వికటముగా నుండెను. పైగా, ఆయన మిక్కిలి ఆకలి గొని యుండెను. ఆయన రాజుతో నిట్లనెను.

అహో అస్య నృశంసస్య శ్రియోన్మత్తస్య పశ్యత ।
ధర్మవ్యతిక్రమం విష్ణోరభక్తస్యేశమానినః ॥ 44

అహో - ఆహా!, నృశంసస్య - క్రూరుడైనట్టియు, శ్రియా - సంపదచే, ఉన్మత్తస్య - మదించి ఉన్నట్టియు, విష్ణోః - విష్ణువునకు, అభక్తస్య - భక్తుడు కానట్టియు, ఈశమానినః - తాను ప్రభువుననే గర్వము కల, అస్య - వీనియొక్క, ధర్మవ్యతిక్రమమ్ - ధర్మమునుల్లంఘించుటను, పశ్యత - చూడుడు.

ఆహా! ఈ క్రూరుడు సంపదచే మదించి తాను ప్రభువుననే గర్వముతో ధర్మమునుల్లంఘించినాడు. చూడుడు. ఈతడు విష్ణుభక్తుడు కాడు.

యో మామతిథిమాయాతమాతిథ్యేన నిమంత్ర్య చ ।
అదత్త్వా భుక్తవాంస్తస్య సద్యస్తే దర్శయే ఫలమ్ ॥ 45

యః - ఏ ఈతడు, అతిథిమ్ - అతిథిగా, ఆయాతమ్ - వచ్చిన, మామ్ - నన్ను, ఆతిథ్యేన - అతిథిసత్కారముచే, నిమంత్ర్య చ - ఆహ్వానించి, అదత్త్వా - ఈయకుండా, భుక్తవాన్ - భుజించినవాడు, తే - నీ కొరకు, తస్య - దాని, ఫలమ్ - ఫలమును, సద్యః - వెంటనే, దర్శయే - చూపించెదను.

నేను అతిథినై ఈతని వద్దకు వచ్చితిని. పైగా, ఈతడు నన్ను అతిథిసత్కారము కొరకు ఆహ్వానించినాడు. నాకు భోజనము పెట్టకుండానే తాను భుజించినాడు. ఓయీ! నీవు చేసినదానికి ఫలితమును నేను నీకు వెంటనే చూపించెదను.

ఏవం బ్రువాణ ఉత్కృత్య జటాం రోషవిదీపితః ।
తయా స నిర్మమే తస్మై కృత్యాం కాలానలోపమామ్ ॥ 46

ఏవమ్ - ఈ విధముగా, బ్రువాణః - పలుకుచున్నవాడై, రోషవిదీపితః - కోపముతో మండిపడిన, సః - ఆ మహర్షి, జటామ్ - జటను, ఉత్కృత్య - ఊడపెరికి, తయా - దానితో, తస్మై - ఆ అంబరీషుని కొరకు, కాల-అనల-ఉపమామ్ - ప్రళయకాలాగ్నిని పోలిన, కృత్యామ్ - క్షుద్రదేవతను, నిర్మమే - నిర్మించెను.

కోపముతో మండి పడిన ఆ మహర్షి ఇట్లు పలుకుతూ జటను ఊడపెరికి దానితో, అంబరీషుని చంపుట కొరకై ఒక క్షుద్రదేవతను నిర్మించెను. ఆ దేవత ప్రళయకాలాగ్నిని పోలి యుండెను.

తామాపతంతీం జ్వలతీమసిహస్తాం పదా భువమ్ ।
వేపయంతీం సముద్వీక్ష్య న చచాల పదాన్నృపః ॥ 47

ఆపతంతీమ్ - మీదకు వచ్చి పడుచున్నట్టియు, జ్వలతీమ్ - మండుచున్నట్టియు, అసిహస్తామ్ - కత్తి చేతియందు కలిగినట్టియు, పదా - కాలితో, భువమ్ - నేలను, వేపయంతీమ్ - కంపింపజేయుచున్న, తామ్

- ఆ క్షుద్రదేవతను, సముద్వీక్ష్య - పట్టి పట్టి చూచి, నృపః - అంబరీష మహారాజు, పదాత్ - అడుగునుండి, న చచాల - కదలలేదు.

ఆ క్షుద్రదేవత మండుతూ కత్తి చేతబట్టి కాలి అడుగులతో నేలను కంపింపజేస్తూ అంబరీష మహారాజుపైకి దూసుకువచ్చెను. కాని, ఆ రాజు ఆమెవైపు పట్టి పట్టి చూచెనే గాని, ఒక్క అడుగైననూ కదలలేదు.

ప్రాగ్దిష్టం భృత్యరక్షాయాం పురుషేణ మహాత్మనా ।
దదాహ కృత్యాం తాం చక్రం క్రుద్ధాహిమివ పావకః ।। 48

మహాత్మనా - దేశకాలములకు అతీతమైన ఆత్మయే స్వరూపముగా గల, పురుషేణ - పురుషోత్తమునిచే, ప్రాక్ - ఇదివరలో, భృత్యరక్షాయామ్ - భక్తుని రక్షణయందు, దిష్టమ్ - ఆదేశించబడిన, చక్రమ్ - చక్రము, తామ్ - ఆ, కృత్యామ్ - క్షుద్రదేవతను, క్రుద్ధ-అహిమ్ - కోపించిన పామును, పావకః ఇవ - కార్చిచ్చు వలె, దదాహ - కాల్చివేసెను.

దేశకాలములకు అతీతమైన ఆత్మయే స్వరూపముగా గల పురుషోత్తముడు ఇదివరలో తన భక్తుడగు అంబరీషుని రక్షణకై చక్రమును ఆదేశించి యుండెను. ఇప్పుడా చక్రము ఆ క్షుద్రదేవతను, కోపముతో బుసలు కొట్టే పామును కార్చిచ్చు వలె కాల్చివేసెను.

తదభిద్రవదుద్వీక్ష్య స్వప్రయాసం చ నిష్ఫలమ్ ।
దుర్వాసా దుద్రువే భీతో దిక్షు ప్రాణపరీప్సయా ।। 49

అభిద్రవత్ - వేగముగా వచ్చుచున్న, తత్ - ఆ చక్రమును, నిష్ఫలమ్ - వ్యర్థమైన, స్వప్రయాసం చ - తన ప్రయత్నమును కూడ, ఉద్వీక్ష్య - గమనించి, దుర్వాసాః - దూర్వాస మహర్షి, భీతః - భయపడినవాడై, ప్రాణపరీప్సయా - ప్రాణములను రక్షించుకునే కోరికతో, దిక్షు - దిక్కులయందు, దుద్రువే - పరుగెత్తెను.

తాను చేసిన ప్రయత్నము విఫలమై చక్రము తన వైపునకు దూసుకువచ్చుటను గాంచిన దూర్వాస మహర్షి తన ప్రాణములను రక్షించుకొనగోరి, నలువైపులకు పరుగులు దీసెను.

తమన్వధావద్భగవద్రథాంగం దావాగ్నిరుద్ధూతశిఖో యథాహిమ్ ।
తథానుషక్తం మునిరీక్షమాణో గుహాం వివిక్షుః ప్రససార మేరోః ॥ 50

ఉద్ధూతశిఖః - ఎగసిపడే మంటలు గల, దావ-అగ్నిః - కార్చిచ్చు, అహిం యథా - పామును వలె, భగవద్-రథ-అంగమ్ - శ్రీహరి భగవానుని చక్రము, తమ్ - ఆ మహర్షిని, అను-అధావత్ - వెనువెంట పరుగెత్తెను, మునిః - ఆ మహర్షి, తథా - ఆ విధముగా, అనుషక్తమ్ - తనను వెంటాడుచున్న చక్రమును, ఈక్షమాణః - చూచుచున్నవాడై, మేరోః - మేరు పర్వతముయొక్క, గుహామ్ - గుహను, వివిక్షుః - ప్రవేశించ గోరువాడై, ప్రససార - పరుగెత్తెను.

ఎగసిపడే మంటలతో కార్చిచ్చు పామును వెంటాడినట్లుగా, శ్రీహరి భగవానుని ఆ చక్రము ఆ మహర్షిని వెంట పరుగెత్తెను. ఆ విధముగా తననే వెంటాడుచున్న ఆ చక్రమును చూచి ఆ మహర్షి మేరు పర్వతముయొక్క గుహలో ప్రవేశించగోరి పరుగు దీసెను.

దిశో నభః క్ష్మాం వివరాన్ సముద్రాంల్లోకాన్ సపాలాంస్త్రిదివం గతస్సః ।
యతో యతో ధావతి తత్ర తత్ర సుదర్శనం దుష్ప్రసహం దదర్శ ॥ 51

సః - ఆ మహర్షి, దిశః - దిక్కులను, నభః - ఆకాశమును, క్ష్మామ్ - భూమిని, వివరాన్ - పాతాళములను, సముద్రాన్ - సముద్రములను, సపాలాన్ - లోకపాలకులతో కూడియున్న, లోకాన్ - లోకములను, త్రిదివమ్ - స్వర్గమును, గతః - వెళ్లినవాడు, యతః యతః - ఎక్కడెక్కడికైతే, ధావతి - పరుగెత్తునో, తత్ర తత్ర - అక్కడక్కడ, దుష్ప్రసహమ్ - సుతరాము సహించ శక్యము కాని, సుదర్శనమ్ - సుదర్శన చక్రమును, దదర్శ - కనుగొనెను.

దిక్కులు, ఆకాశము, భూలోకము, పాతాళలోకములు, సముద్రములు, యముడు మొదలగు లోకపాలకులతో కూడియున్న నరకము మొదలగు లోకములు, స్వర్గము అనే స్థానములన్నింటికి ఆ మహర్షి వెళ్లెను. కాని, ఆయన ఎచటకు వెళ్లినను, అచట ఆయనకు ఆ చక్రమే ప్రత్యక్షమాయెను.

అలబ్ధనాథస్స యదా కుతశ్చిత్సంత్రస్తచిత్తశ్శరణమేషమాణః ।
దేవం విరించం సమగాద్విధాతస్త్రాహ్యాత్మయోనేఽజితతేజసో మామ్ ॥52

సంత్రస్తచిత్తః - చాల భయపడిన చిత్తము గలవాడు, శరణమ్ - శరణమును, ఏషమాణః - కోరుచున్న, సః - ఆ మహర్షి, యదా - ఎప్పుడైతే, కుతశ్చిత్ - ఎక్కడనైననూ, అలబ్ధనాథః - పొందబడని రక్షకుడు గలవాడో (అప్పుడు), విరించం దేవమ్ - బ్రహ్మదేవుని, సమగాత్ - చేరెను, విధాతః - ఓ బ్రహ్మా!, ఆత్మయోనే - ఓ స్వయంభువా!, మామ్ - నన్ను, అజితతేజసః - అపరాజితుడగు శ్రీహరియొక్క చక్రమునుండి, త్రాహి - రక్షించుము.

ఆ మహర్షి చిత్తములో చాల భయపడిపోయెను. ఆయన తనకు శరణునిచ్చువాని కొరకు చూచుచుండెను. కాని, ఆయనకు ఎక్కడైననూ రక్షించువాడు దొరకలేదు. అపుడాయన బ్రహ్మదేవుని వద్దకు వెళ్లి ఇట్లు పలికెను -- స్వయంభువుడవగు ఓ బ్రహ్మా! పరాజయమునెరుంగని శ్రీహరి యొక్క చక్రమునుండి నన్ను కాపాడుము.

బ్రహ్మోవాచ ।
స్థానం మదీయం సహవిశ్వమేతత్క్రీడావసానే ద్విపరార్ధసంజ్ఞే।
భ్రూభంగమాత్రేణ హి సందిధక్షోః కాలాత్మనో యస్య తిరోభవిష్యతి ॥53

ద్విపరార్ధసంజ్ఞే - ద్విపరార్ధము అనే పేరు గల కాలమునందు, క్రీడా-అవసానే - జగత్తు అనే క్రీడ సమాప్తము కాగా, సందిధక్షోః - దహించగోరే, కాల-ఆత్మనః - కాలస్వరూపుడగు, యస్య - ఏ శ్రీహరియొక్క, భ్రూభంగమాత్రేణ - కనువిరుపు మాత్రముచే, సహవిశ్వమ్ - జగత్తుతో కూడియున్న, ఏతత్ - ఈ, మదీయమ్ - నాదైన, స్థానమ్ - లోకము, తిరోభవిష్యతి - అంతర్ధానము కాగలదో.

బ్రహ్మగారు ఇట్లు పలికెను --- ద్విపరార్ధము (బ్రహ్మమానముతో వంద యేళ్లు) కాలము పూర్తి అయినప్పుడు జగత్తు అనే శ్రీహరి భగవానుని క్రీడ అంతమగును. కాలస్వరూపుడగు శ్రీహరి అప్పుడు ఈ జగత్తును

దహించగోరి కనుబొమలను విరువగా, అంతమాత్రము చేతనే ఈ సకలజగత్తు మరియు నా ఈ లోకము కూడ అంతర్ధానమగును.

అహం భవో దక్షభృగుప్రధానాః
ప్రజేశభూతేశసురేశముఖ్యాః ।
సర్వే వయం యన్నియమం ప్రపన్నా
మూర్ధ్న్యర్పితం లోకహితం వహామః ॥ 54

అహమ్ - నేను, భవః - రుద్రుడు, దక్షభృగుప్రధానాః - దక్షుడు భృగువు మొదలగువారు, ప్రజేశభూతేశసురేశముఖ్యాః - ప్రజాపతులు భూతనాథులు మరియు దేవనాయకులు మొదలగువారు, వయమ్ - మేము, సర్వే - అందరము, యత్-నియమమ్ - ఏ శ్రీహరియొక్క ఆజ్ఞను, ప్రపన్నాః - పొందినవారమై, మూర్ధ్ని - శిరస్సునందు, అర్పితమ్ - ఉంచబడిన ఆ ఆజ్ఞను, లోకహితమ్ - లోకములకు క్షేమము కలుగునట్లుగా, వహామః - దాల్చెదమో.

నేను, రుద్రుడు, దక్షుడు భృగువు మొదలగు ప్రజాపతులు, భూతనాథులు, దేవనాయకులు మొదలైన మేమందరము ఆ శ్రీహరి ఆజ్ఞను తలదాల్చి లోకములకు హితమును చేయుటకై ఆ ఆజ్ఞను పాలించుచుందుము.

ప్రత్యాఖ్యాతో విరించేన విష్ణుచక్రోపతాపితః ।
దుర్వాసాశ్శరణం యాతశ్శర్వం కైలాసవాసినమ్ ॥ 55

విరించేన - బ్రహ్మగారిచే, ప్రత్యాఖ్యాతః - స్వీకరించబడనివాడు, విష్ణుచక్ర-ఉపతాపితః - విష్ణుచక్రముచే చాల తాపమును కలిగించబడినవాడు అగు, దుర్వాసాః - దూర్వాస మహర్షి, కైలాసవాసినమ్ - కైలాసమునందు నివసించే, శర్వమ్ - రుద్రుని, శరణమ్ - శరణును, యాతః - పొందినవాడు.

విష్ణుచక్రముచే తపింపజేయబడే దూర్వాస మహర్షిని బ్రహ్మగారు స్వీకరించలేదు. అపుడా మహర్షి కైలాసవాసియగు రుద్రుని శరణు వేడెను.

శ్రీరుద్ర ఉవాచ ।
వయం న తాత ప్రభవామ భూమ్ని యస్మిన్ పరేఽన్యేఽప్యజజీవకోశాః ।
భవంతి కాలే న భవంతి హీదృశాస్సహస్రశో యత్ర వయం భ్రమామః।।56

తాత - వత్సా!, భూమ్ని - అనంతుడగు శ్రీహరి విషయములో, వయమ్ - మేము, న ప్రభవామః - సమర్థులము కాము, యస్మిన్ - ఏ, పరే - పరమాత్మయందు, అన్యే - ఇతరములైన, ఈదృశాః - ఇటువంటి, అజజీవకోశాః అపి - బ్రహ్మగారు అనే జీవునకు ఉపాధులైన బ్రహ్మాండములు కూడ, కాలే - కాలమునందు, సహస్రశః - అనంతములుగా, భవంతి - ప్రకటమగునో, న భవంతి హి - విలీనమగునో, యత్ర - ఏ బ్రహ్మాండములయందు, వయమ్ - మేము, భ్రమామః - తిరుగాడుచున్నా మో.

శ్రీరుద్రుడు ఇట్లు పలికెను --- వత్సా! అనంతుడగు శ్రీహరి విషయములో మేము (దేనికైననూ) సమర్థులము కాము. బ్రహ్మగారు అనే జీవునకు ఈ బ్రహ్మాండము ఉపాధి. ఇటువంటి బ్రహ్మాండములు కూడ అనంతసంఖ్యలో ఆ పరమేశ్వరునియందు సృష్టికాలమునందు ప్రకటమై ప్రళయకాలమునందు విలీనమగుచుండును. మేమూ బ్రహ్మాండములలో తిరుగాడుచుందుము.

అహం సనత్కుమారశ్చ నారదో భగవానజః ।
కపిలోఽపాంతరతమో దేవలో ధర్మ ఆసురిః ।। 57

మరీచిప్రముఖాశ్చాన్యే సిద్ధేశాః పారదర్శనాః ।
విదామ న వయం సర్వే యన్మాయాం మాయయాఽఽవృతాః ।। 58

అహమ్ - నేను, సనత్కుమారః చ - సనత్కుమారుడు, నారదః - నారదుడు, భగవాన్ అజః - స్వయంభువుడగు బ్రహ్మదేవుడు, కపిలః - కపిలుడు, అపాంతరతమః - అపాంతరతముడు, దేవలః - దేవలుడు, ధర్మః - ధర్ముడు, ఆసురిః - ఆసురి, మరీచిప్రముఖాః - మరీచి మొదలైన, అన్యే - ఇతరులైన, పారదర్శనాః - సర్వమును తెలుసుకున్న, సిద్ధ-ఈశాః - సిద్ధేశ్వరులగు, వయమ్ - మేము, సర్వే - అందరము, మాయయా -

అవిద్యచే, ఆవృతాః - కప్పివేయబడినవారమై, యత్-మాయామ్ - ఏ పరమేశ్వరుని మాయను, న విదామ - తెలియకున్నామో.

నేను, సనత్కుమారుడు, నారదుడు, స్వయంభువుడగు బ్రహ్మదేవుడు, కపిలుడు, అపాంతరతముడు (వ్యాసుడు), దేవలుడు, ధర్ముడు, ఆసురి, మరీచి మొదలైన ఇతరులగు సర్వజ్ఞులైన సిద్ధేశ్వరులము మేము అందరము ఆ పరమాత్మయొక్క మాయచే కప్పివేయబడి యున్నాము. మేము ఆ పరమాత్మయొక్క మాయను తెలియ లేకున్నావు.

తస్య విశ్వేశ్వరస్యేదం శస్త్రం దుర్విషహం హి నః ।
తమేవ శరణం యాహి హరిస్తే శం విధాస్యతి ॥ 59

తం ఏవ - ఆ శ్రీహరినే, శరణమ్ - శరణమును, యాహి - పొందుము, హి - ఏలయనగా, విశ్వ-ఈశ్వరస్య - జగన్నాథుడగు, తస్య - ఆ శ్రీహరియొక్క, ఇదమ్ - ఈ, శస్త్రమ్ - ఆయుధము, నః - మాకు, దుర్విషహమ్ - సహించ శక్యము కానిది, తే - నీకు, హరిః - శ్రీహరి, శమ్ - మంగళమును, విధాస్యతి - కలిగించగలడు.

నీవా శ్రీహరినే శరణు వేడుము. ఏలయనగా, జగన్నాథుడగు ఆ శ్రీహరియొక్క ఈ ఆయుధము మాకు సహించ శక్యము కానిది. నీకు శ్రీహరియే మంగళమును కలిగించగలడు.

తతో నిరాశో దుర్వాసాః పదం భగవతో యయౌ ।
వైకుంఠాఖ్యం యదధ్యాస్తే శ్రీనివాసశ్శ్రియా సహ ॥ 60

తతః - అక్కడనుండి, నిరాశః - ఆశను కోల్పోయిన, దుర్వాసాః - దూర్వాస మహర్షి, భగవతః - శ్రీహరి భగవానునియొక్క, వైకుంఠ-ఆఖ్యమ్ - వైకుంఠము అనే పేరు గల, పదమ్ - ధామమును గురించి, యయౌ - వెళ్లెను, యత్ - దేనినైతే, శ్రీనివాసః - శ్రీనివాసుడు, శ్రియా సహ - శ్రీదేవితో గూడి, అధి-ఆస్తే - అధిష్ఠించి యున్నాడో.

నిరాశను చెందిన దూర్వాస మహర్షి ఆ కైలాసమునుండి శ్రీహరి భగవానుని ధామమునకు వెళ్లెను. ఆ ధామమునకు వైకుంఠము అని పేరు. దానిని శ్రీనివాసుడు శ్రీదేవితో గూడి అధిష్ఠించి యుండును.

సందహ్యమానోఽజితశస్త్రవహ్నినా తత్పాదమూలే పతితస్సవేపథుః ।
ఆహాచ్యుతానంత సదీప్సిత ప్రభో కృతాగసం మాఽవ హి విశ్వభావన ॥61

అజితశస్త్రవహ్నినా - అపరాజితుడగు శ్రీహరియొక్క ఆయుధ ముయొక్క మంటచే, సందహ్యమానః - తగులపెట్టబడుచున్న ఆ మహర్షి, సవేపథుః - వణకుతో కూడినవాడై, తత్-పాదమూలే - ఆ శ్రీహరియొక్క పాదమూలమునందు, పతితః - పడినవాడై, ఆహ - పలికెను, అచ్యుత - ఓ అచ్యుతా!, అనంత - ఓ అనంతా!, సద్-ఈప్సిత - సత్పురుషులచే కోర బడువాడా!, విశ్వభావన - జగత్తును రక్షించువాడా!, కృతాగసమ్ - చేయ బడిన అపరాధము గల, మా హి - నన్ను కూడ, అవ - రక్షించుము.

అపరాజితుడగు శ్రీహరియొక్క చక్రమునుండి పుట్టిన అగ్ని ఆ మహర్షిని అధికముగా తగులబెట్టుచుండెను. ఆయన వణికిపోతూ శ్రీహరి పాదమూలమునందు పడి ఇట్లు పలికెను -- ఓ అచ్యుతా! అనంతా! సత్పు రుషులు నిన్నే కోరెదరు. నేను అపరాధమును చేసితిని. జగత్తును రక్షించే నీవు నన్ను కూడ రక్షించుము.

**అజానతా తే పరమానుభావం కృతం మయాఘం భవతః ప్రియాణామ్ ।**
**విధేహి తస్యాపచితిం విధాతర్ముచ్యేత యన్నామ్న్యుదితే నారకోఽపి ॥62**

విధాతః - ఓ ప్రభూ!, తే - నీయొక్క, పరమ-అనుభావమ్ - సర్వాతిశాయియగు మహిమను, అజానతా - తెలియని, మయా - నాచే, భవతః - నీయొక్క, ప్రియాణామ్ - ప్రియభక్తులకు, అఘమ్ - దుఃఖము, కృతమ్ - చేయబడినది, తస్య - దానికి, అపచితిమ్ - ప్రాయశ్చిత్తమును, విధేహి - చేయుము, యత్-నామ్ని - ఏ నీయొక్క పేరు, ఉదితే - ఉచ్చ రించబడగా, నారకః అపి - నరకములోనుండే జీవుడు కూడ, ముచ్యేత - మోక్షమును పొందునో.

ఓ ప్రభూ! సర్వాతిశాయియగు నీ మహిమ తెలియక నేను నీ ప్రియభక్తులకు దుఃఖమును కలిగించితిని. దానికి ప్రాయశ్చిత్తమును విధించుము. నరకములోనున్న జీవుడు కూడ నీ పేరును ఉచ్చరించినచో, మోక్షమును పొందును.

శ్రీభగవానువాచ ।
అహం భక్తపరాధీనో హ్యస్వతంత్ర ఇవ ద్విజ ।
సాధుభిర్గ్రస్తహృదయో భక్తైర్భక్తజనప్రియః ।। 63

ద్విజ - ఓ మహర్షీ!, అహమ్ - నేను, భక్తపరాధీనః - భక్తులకు వశమై యుండువాడను, అస్వతంత్రః ఇవ - స్వతంత్రుడను కానా యన్నట్లు ఉండెదను, హి - ఏలయనగా, సాధుభిః - సత్పురుషులగు, భక్తైః - భక్తులచే, గ్రస్తహృదయః - పట్టుకొనబడిన హృదయము గలవాడను, భక్తజనప్రియః - భక్తజనులకు ప్రియుడను (భక్తజనులు ప్రియులైన వాడను).

శ్రీహరి భగవానుడిట్లు పలికెను --- ఓ మహర్షీ! నేను భక్తులకు వశమై యుండెదను. నాకు భక్తుల విషయములో స్వాతంత్ర్యము లేదా యన్నట్లు ఉన్నది. ఏలయనగా సత్పురుషులగు భక్తులు నా చిత్తమును తమ వశము చేసుకున్నారు. భక్తజనులకు ప్రియుడనగు నాకు కూడ భక్తజనులు ప్రియులు.

నాహమాత్మానమాశాసే మద్భక్తైస్సాధుభిర్వినా ।
శ్రియం చాత్యంతికీం బ్రహ్మన్ యేషాం గతిరహం పరా ।। 64

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, మద్-భక్తైః - నా భక్తులైన, సాధుభిః వినా - సత్పురుషులు లేకుండా, అహమ్ - నేను, ఆత్మానమ్ - నన్ను, చ - మరియు, ఆత్యంతికీమ్ - నాతో విభాగమే లేని, శ్రియమ్ - శ్రీదేవిని, న ఆశాసే - కోరను, యేషామ్ - ఎవరికైతే, అహమ్ - నేను, పరా - సర్వోత్తమమైన, గతిః - ఆశ్రయమునో.

ఓ మహర్షీ! సత్పురుషులగు నా భక్తులకు సర్వాతిశాయియగు ఆశ్రయము నేనే. వారు లేకుండా నేను నన్ను గాని, నాతో విభాగమే లేని శ్రీదేవిని గాని కోరను.

యే దారాగారపుత్రాప్తాన్ ప్రాణాన్ విత్తమిమం పరమ్ ।
హిత్వా మాం శరణం యాతాః కథం తాంస్త్యక్తుముత్సహే ॥ 65

యే - ఎవరైతే, ప్రాణాన్ - జీవనమునకు హేతువులైన (ప్రాణములను), దార-ఆగారపుత్ర-ఆప్తాన్ - భార్య ఇల్లు పుత్రులు బంధువులను, విత్తమ్ - సంపదను, ఇమమ్ - ఈ లోకమును, పరమ్ - పరలోకమును, హిత్వా - విడిచిపెట్టి, మామ్ - నన్ను, శరణమ్ - శరణును, యాతాః - పొందినారో, తాన్ - వారిని, త్యక్తుమ్ - విడిచిపెట్టుటకు, కథమ్ - ఎట్లు, ఉత్సహే - సమర్థుడనగుదును?

ఎవరైతే జీవనహేతువులైన భార్య-ఇల్లు-పుత్రులు-బంధువులను, ప్రాణములపై ఆసక్తిని, సంపదను, ఇహపరలోకములను కూడ విడిచిపెట్టి నన్నే శరణు వేడెదరో, అట్టి భక్తులను నేను ఎట్లు విడిచిపెట్ట గల్గుదును?

మయి నిర్బద్ధహృదయాస్సాధవస్సమదర్శనాః ।
వశీకుర్వంతి మాం భక్త్యా సత్స్త్రియస్సత్పతిం యథా ॥ 66

మయి - నాయందు, నిర్బద్ధహృదయాః - స్థిరము చేయబడిన హృదయము గలవారు, సమదర్శనాః - సర్వమునందు సమమైన ఈశ్వరుని దర్శించువారు, సాధవః - సత్పురుషులు, మామ్ - నన్ను, సత్-స్త్రియః - మంచి యువతులు, సత్-పతిం యథా - మంచి భర్తను వలె, వశీకుర్వంతి - వశము చేసుకొనుచున్నారు.

సత్పురుషులు వారి హృదయమును స్థిరముగా నాపై నిలిపెదరు. వారు సర్వమునందు సమముగా వ్యాపించియున్న ఈశ్వరుని దర్శించెదరు. అట్టి సత్పురుషులు, మంచి యువతి తన భర్తను వలె, నన్ను వశము చేసుకొనెదరు.

మత్సేవయా ప్రతీతం చ సాలోక్యాదిచతుష్టయమ్ ।
నేచ్ఛంతి సేవయా పూర్ణాః కుతోఽన్యత్కాలవిద్రుతమ్ ॥ 67

సేవయా - సేవచే, పూర్ణాః - సంతుష్టులైన భక్తులు, మత్-సేవయా - నా సేవచే, ప్రతీతమ్ - సంప్రాప్తమైన, సాలోక్య-ఆదిచతుష్టయం చ - సాలోక్యసామీప్యసారూప్యసాయుజ్యములనే నాలుగింటిని కూడ, న ఇచ్ఛంతి - కోరరు, కాలవిద్రుతమ్ - కాలముచే నష్టమయ్యే, అన్యత్ - ఇతరమును గురించి, కుతః - చెప్పునదేమున్నది?

నా సేవచే సంతుష్టులయ్యే భక్తులు నా సేవచే లభించే సాలోక్య (శ్రీహరితో సమానమైన లోకములో నివసించుట)-సామీప్య (శ్రీహరికి సమీపములోనుండుట)-సారూప్య (శ్రీహరితో సమానమైన రూపమును కలిగియుండుట)-సాయుజ్య (శ్రీహరిలో విలీనమగుట) ములనే నాలుగు రకముల మోక్షమును కూడ ఇష్టపడరు. కాలముచే కబళించి వేయబడే స్వర్గాది లోకములను వారు కోరరని వేరుగా చెప్పవలయునా?

సాధవో హృదయం మహ్యం సాధూనాం హృదయం త్వహమ్ ।
మదన్యత్తే న జానంతి నాహం తేభ్యో మనాగపి ॥ 68

సాధవః - సత్పురుషులు, మహ్యమ్ - నా కొరకు, హృదయమ్ - హృదయము, అహం తు - నేనైతే, సాధూనామ్ - సత్పురుషుల, హృదయమ్ - హృదయము, తే - వారు, మత్ - నాకంటె, అన్యత్ - ఇతరమును, న జానంతి - గుర్తించరు, అహమ్ - నేను, తేభ్యః - వారికంటె, మనాక్ అపి - కొంచెమైననూ, న - గుర్తించను.

సత్పురుషులకు నేను హృదయము (అత్యంతప్రియుడను). సత్పురుషులు నాకు హృదయము (అత్యంతప్రియులు). వారు నాకంటె భిన్నముగా ఇతరమును చూడనే చూడరు. వారికంటె ప్రియమైనది ఇతరము నాకు కొంచెమైననూ లేదు.

ఉపాయం కథయిష్యామి తవ విప్ర శృణుష్వ తత్ ।
అయం హ్యాత్మాభిచారస్తే యతస్తం యాతు వై భవాన్ ।
సాధుషు ప్రహితం తేజః ప్రహర్తుః కురుతేఽశివమ్ ॥ 69

విప్ర - ఓ మహర్షీ!, తవ - నీకు, ఉపాయమ్ - ఉపాయమును, కథయిష్యామి - చెప్పగలను, తత్ - దానిని, శృణుష్వ - వినుము, తే - నీకు, అయమ్ - ఈ, ఆత్మాభిచారః - తనకు తానే చేసుకున్న పీడ, యతః - ఎవని నిమిత్తముగా కలిగినదో, భవాన్ - నీవు, తం వై - వానినే, యాతు - శరణు పొందుము, సాధుషు - సత్పురుషులయందు, ప్రహితమ్ - ప్రయోగించబడిన, తేజః - తేజస్సు, ప్రహర్తుః - ప్రయోగించినవానికే, అశివమ్ - అనర్థమును, కురుతే - చేయును.

ఓ మహర్షీ! నీకు నేను ఉపాయమును చెప్పెదను. దానిని వినుము. నీవు ఎవని నిమిత్తముగా నీకు నీవే పీడను కొని తెచ్చుకున్నావో, ఆయననే నీవు శరణు వేడుము. ఒకడు తన శక్తిని సత్పురుషులపై ప్రయోగిస్తే, అది ఆ ప్రయోగించినవానికే అనర్థమును కలిగించును.

తపో విద్యా చ విప్రాణాం నిశ్శ్రేయసకరే ఉభే ।
తే ఏవ దుర్వినీతస్య కల్పేతే కర్తురన్యథా ।। 70

తపః - తపస్సు, విద్యా - ఉపాసన అనే, ఉభే చ - రెండు కూడ, విప్రాణామ్ - వినయవంతులగు మహర్షులకు, నిశ్శ్రేయసకరే - మోక్షము నిచ్చునవి, దుర్వినీతస్య - వినయము లేని, కర్తుః - సాధకునకు, తే ఏవ - అవియే, అన్యథా - అనర్థకరములుగా, కల్పేతే - సమర్థములగును.

తపస్సు, ఉపాసన అనే రెండు వినయము గల మహర్షులకు మోక్షసాధనములు. కాని, వినయము లేని సాధకునకు ఆ రెండు అనర్థమును కలిగించుటకు సమర్థము లగుచున్నవి.

బ్రహ్మంస్తద్గచ్ఛ భద్రం తే నాభాగతనయం నృపమ్ ।
క్షమాపయ మహాభాగం తతశ్శాంతిర్భవిష్యతి ।। 71

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే నవమస్కంధే చతుర్థోఽధ్యాయః ।।

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, తత్ - అందువలన, గచ్ఛ - వెళ్లుము, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళమగు గాక!, నాభాగతనయమ్ - నాభాగుని పుత్రుడైనట్టియు, మహాభాగమ్ - గొప్ప భాగ్యశాలి అగు, నృపమ్ - అంబ

రీష మహారాజును గురించి, క్షమాపయ - క్షమించునట్లు చేయుము, తతః - దాని వలన, శాంతిః - శాంతి, భవిష్యతి - కలుగగలదు.

ఓ మహర్షీ! కావున వెళ్లుము. నీకు మంగళమగు గాక! నాభాగుని పుత్రుడగు అంబరీష మహారాజు నిన్ను క్షమించునట్లు చేసుకొనుము. ఆయన గొప్ప భాగ్యశాలి. ఆయన క్షమించుట వలన నీకు తాపశాంతి కలుగగలదు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
నాభాగ వృత్తాంతమును అంబరీషోపాఖ్యానమును వర్ణించే
నాల్గవ అధ్యాయము ముగిసినది (4).

* * * * *

# అథ పంచమోఽధ్యాయః

## అంబరీషోపాఖ్యానము - అంబరీషుడు దూర్వాసుని విష్ణుచక్రమునుండి విడిపించుట

శ్రీశుక ఉవాచ।
ఏవం భగవతాఽఽదిష్టో దుర్వాసాశ్చక్రతాపితః ।
అంబరీషముపావృత్య తత్పాదౌ దుఃఖితోఽగ్రహీత్ ॥ 1

చక్రతాపితః - చక్రముచే తపింప జేయబడిన, దుర్వాసాః - దూర్వాస మహర్షి, ఏవమ్ - ఈ విధముగా, భగవతా - శ్రీహరి భగవానుని చే, ఆదిష్టః - ఆదేశించ బడినవాడై, అంబరీషమ్ - అంబరీషుని గురించి, ఉపావృత్య - దగ్గరకు తిరిగి వచ్చి, దుఃఖితః - దుఃఖితుడై, తత్-పాదౌ - ఆయన పాదములను, అగ్రహీత్ - పట్టుకొనెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- చక్రముచే తపింప జేయబడిన దూర్వాస మహర్షిని శ్రీహరి భగవానుడు ఈ విధముగా ఆదేశించగా, దుఃఖి తుడైయున్న ఆ మహర్షి అంబరీషుని వద్దకు తిరిగి వచ్చి, ఆయన పాదము లను పట్టుకొనెను.

తస్య సోద్యమనం వీక్ష్య పాదస్పర్శవిలజ్జితః ।
అస్తావీత్తద్ధరేరస్త్రం కృపయా పీడితో భృశమ్ ॥ 2

పాదస్పర్శవిలజ్జితః - పాదములను పట్టుకొనుటచే బిడియపడిన, సః - ఆ అంబరీషుడు, తస్య - ఆ మహర్షియొక్క, ఉద్యమనమ్ - హడావి డిని, వీక్ష్య - చూచి, కృపయా - కృపచే, భృశమ్ - మిక్కిలి, పీడితః - పీడించబడినవాడై, హరేః - శ్రీహరియొక్క, తత్ - ఆ, అస్త్రమ్ - ఆయు ధమగు చక్రమును, అస్తావీత్ - స్తుతించెను.

దూర్వాస మహర్షి తన పాదములను పట్టుకొనగా అంబరీషుడు బిడియపడెను. ఆయన ఆ మహర్షియొక్క హడావిడిని చూచి కృపచే మనస్సులో చాల కష్టపడెను. అపుడాయన శ్రీహరియొక్క ఆయుధమగు ఆ చక్రమును స్తుతించెను.

అంబరీష ఉవాచ ।
త్వమగ్నిర్భగవాన్ సూర్యస్త్వం సోమో జ్యోతిషాం పతిః ।
త్వమాపస్త్వం క్షితిర్వ్యోమ వాయుర్మాత్రేంద్రియాణి చ ॥ 3

త్వమ్ - నీవు, అగ్నిః - అగ్నివి, భగవాన్ - పూజనీయుడగు, సూర్యః - సూర్యుడవు, త్వమ్ - నీవు, జ్యోతిషామ్ - నక్షత్రములకు, పతిః - ప్రభువగు, సోమః - చంద్రుడవు, త్వమ్ - నీవు, ఆపః - జలములు, త్వమ్ - నీవు, క్షితిః - భూమి, వ్యోమ - ఆకాశము, వాయుః - వాయువు, చ - మరియు, మాత్రా-ఇంద్రియాణి - శబ్దాది సూక్ష్మభూతములు మరియు ఇంద్రియములు.

అంబరీషుడిట్లు పలికెను --- పృథివి-జలములు-అగ్ని-వాయువు-ఆకాశము అనే అయిదు స్థూల భూతములు, శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములనే అయిదు సూక్ష్మభూతములు, శ్రోత్ర-త్వక్-చక్షుః-జిహ్వా-ఘ్రాణములనే ఇంద్రియములు, పూజనీయుడగు సూర్యుడు, నక్షత్రాధిపతియగు చంద్రుడు నీ రూపములే.

సుదర్శన నమస్తుభ్యం సహస్రారాచ్యుతప్రియ ।
సర్వాస్త్రఘాతిన్ విప్రాయ స్వస్తి భూయా ఇడస్పతే ॥ 4

సుదర్శన - ఓ సుదర్శనమా!, తుభ్యమ్ - నీ కొరకు, నమః - నమస్కారము, సహస్ర-అర - వేయి ఆకులు (పళ్లు) గలదానా!, అచ్యుత ప్రియ - శ్రీహరికి ప్రియమైనదానా!, సర్వ-అస్త్రఘాతిన్ - సకలములైన అస్త్రములను వినాశము చేయుదానా!, ఇడస్పతే - భూమిని రక్షించుదానా!, విప్రాయ - మహర్షి కొరకు, స్వస్తి - మంగళమును చేయుదానవు, భూయాః - అగుదువు గాక!

ఓ సుదర్శనమా! నీకు నమస్కారము. శ్రీహరికి ప్రియమైన నీకు వేయి ఆకులు (పళ్లు) గలవు. నీవు సకలములైన అస్త్రములను వినష్టము చేసి భూమిని రక్షించెదవు. ఈ మహర్షికి మంగళమును కలిగించుము.

త్వం ధర్మస్త్వమృతం సత్యం త్వం యజ్ఞోఽఖిలయజ్ఞభుక్ ।
త్వం లోకపాలస్సర్వాత్మా త్వం తేజః పౌరుషం పరమ్ ॥ 5

త్వమ్ - నీవు, ధర్మః - ధర్మము, అమృతమ్ - మధురమైన, సత్యమ్ - సత్యవచనము, త్వమ్ - నీవు, యజ్ఞః - యజ్ఞము, అఖిలయజ్ఞ భుక్ - సకలయజ్ఞముల భోక్తవు, త్వమ్ - నీవు, లోకపాలః - లోకములను పాలించుదానవు, సర్వ-ఆత్మా - సర్వముయొక్క సారము, త్వమ్ - నీవు, పరమ్ - సర్వాతిశాయియగు, పౌరుషమ్ - పురుషోత్తమునకు చెందిన, తేజః - తేజస్సు.

ధర్మము నీవే. మధురమైన సత్యవచనము నీవే. యజ్ఞము నీ రూపమే. యజ్ఞముల ఫలములకు భోక్తవు నీవే. లోకములను పాలించేది నీవే. సర్వముయొక్క సారము నీవే. పురుషోత్తముని సర్వాతిశాయియగు తేజస్సు నీవే.

నమస్సునాభాఖిలధర్మసేతవే హ్యధర్మశీలాసురధూమకేతవే ।
త్రైలోక్యగోపాయ విశుద్ధవర్చసే మనోజవాయాద్భుతకర్మణే గృణే ॥6

సునాభ - చక్కని నాభి గల ఓ చక్రమా!, అఖిలధర్మసేతవే - సకలధర్మములకు సేతువు అయినట్టియు, అధర్మశీల-అసురధూమకేతవే - అధర్మమే స్వభావముగా గల రాక్షసులకు అగ్ని (తోకచుక్క) అయినట్టియు, త్రైలోక్యగోపాయ - ముల్లోకములను రక్షించునట్టియు, విశుద్ధవర్చసే - మిక్కిలి స్వచ్ఛమైన తేజస్సు కలిగినట్టియు, మనః-జవాయ - మనోవేగము కలిగినట్టియు, అద్భుతకర్మణే - అద్భుతమైన కర్మలు గల నీ కొరకు, నమః - నమస్కారమును, గృణే హి - చేయుచున్నాను.

ఓ చక్రమా! చక్కని నడిమి తూము గల నీవు సకలధర్మములను నిలబెట్టెదవు. అధర్మస్వభావము గల రాక్షసులను నీవు అగ్నివలె దహించెదవు, తోకచుక్క వలె అనర్థమును కలిగించెదవు. ముల్లోకములను రక్షించే

నీ తేజస్సు స్వచ్ఛమైనది. నీవు మనోవేగముతో అద్భుతమైన కర్మలను చేయుదువు. నీకు నమస్కారమును చేయుచున్నాను.

త్వత్తేజసా ధర్మమయేన సంహృతం తమః ప్రకాశశ్చ ధృతో మహాత్మనామ్,
దురత్యయస్తే మహిమా గిరాం పతే త్వద్రూపమేతత్సదసత్పరావరమ్ ॥7

గిరామ్ - వాక్కులకు, పతే - ప్రభువగు ఓ చక్రమా!, ధర్మమయేన - ధర్మరూపమగు, త్వత్-తేజసా - నీ తేజస్సుచే, మహాత్మనామ్ - మహాత్ములకు, తమః - చీకటి, సంహృతమ్ - తొలగించ బడినది, చ - మరియు, ప్రకాశః - ప్రకాశము, ధృతః - చేయబడినది, తే - నీయొక్క, మహిమా - మహిమ, దురత్యయః - అపారము, సద్-అసత్ - మూర్త-అమూర్త రూపమైనట్టియు, పర-అవరమ్ - కార్యకారణరూపమైన, ఏతత్ - ఈ జగత్తు, త్వద్-రూపమ్ - నీ రూపమే.

వాక్కులకు ప్రభువగు ఓ చక్రమా! ధర్మరూపమగు నీ తేజస్సు మహాత్ముల చీకటి (ఆపద, అజ్ఞానము) ని పోగొట్టి, వెలుతురు (అభివృద్ధి, జ్ఞానము) ను కలిగించును. నీ మహిమ అపారము. మూర్త (పృథివి-జలము-అగ్నులు)-అమూర్త (వాయు-ఆకాశములు) రూపమైనట్టియు, కార్య కారణరూపమైన ఈ జగత్తు వాస్తవములో నీ రూపమే.

యదా విసృష్టస్త్వమనంజనేన వై బలం ప్రవిష్టోఽజిత దైత్యదానవమ్ ।
బాహూదరోర్వంఘ్రిశిరోధరాణి వృశ్చన్నజస్రం ప్రధనే విరాజసే ॥ 8

అజిత - పరాజయము లేనిదానా!, అనంజనేన - నిరంజనుడగు శ్రీహరిచే, యదా - ఎప్పుడైతే, త్వమ్ - నీవు, విసృష్టః - విడిచిపెట్టబడితివో అప్పుడు, దైత్యదానవమ్ - దైత్యులు దానవులు గల, బలమ్ - సైన్యమును, అజస్రమ్ - నిరంతరముగా, బాహు-ఉదర-ఊరు-అంఘ్రిశిరః-ధరాణి - చేతులను ఉదరములను తొడలను కాళ్లను తలలను, వృశ్చన్ - ఛేదించుదానవై, ప్రధనే - యుద్ధమునందు, వై - నిశ్చయముగా, విరాజసే - అధికముగా ప్రకాశించెదవు.

పరాజయము లేని ఓ చక్రమా! నిరంజనుడగు (రాగద్వేషాది దోషములు లేని) శ్రీహరి నిన్ను దైత్యుల (దితి సంతానము) మరియు దానవుల

(దనువు సంతానము) సైన్యముపై ప్రయోగించినప్పుడు నీవు నిరంతరముగా చేతులను ఉదరములను తొడలను కాళ్లను తలలను నరుకుతూ, యుద్ధమునందు నిశ్చయముగా అధిక ప్రకాశమును కలిగియుండెదవు.

స త్వం జగత్త్రాణఖలప్రహాణయే నిరూపితస్సర్వసహో గదాభృతా ।
విప్రస్య చాస్మత్కులదైవహేతవే విధేహి భద్రం తదనుగ్రహో హి నః ।। 9

(జగత్-త్రాణ - జగత్తును రక్షించే ఓ చక్రమా!), సః - అట్టి, సర్వసహః - సర్వమును సహించే, త్వమ్ - నీవు, జగత్-త్రాణఖలప్రహాణయే - జగత్తును రక్షించుటకై దుష్టులను నశింప జేయుటకై, గదాభృతా - గదాధారియగు శ్రీహరిచే, నిరూపితః - నియోగించ బడితివి, అస్మత్-కులదైవహేతవే - మా వంశమునకు భాగ్యము లభించుట కొరకై, విప్రస్య - మహర్షికి, భద్రమ్ - కల్యాణమును, విధేహి - చేయుము, హి - ఏలయనగా, తత్ - అది, నః - మాకు, అనుగ్రహః - అనుగ్రహము.

జగత్తును రక్షించే ఓ చక్రమా! సర్వమును సహించే నిన్ను గదాధారియగు శ్రీహరి దుష్టులను సంహరించి జగత్తును రక్షించుటకై నియోగించినాడు. మా వంశమునకు భాగ్యమును లభింప జేయుట కొరకై ఈ మహర్షికి కల్యాణమును కలిగించుము. ఏలయనగా, మహర్షిని రక్షించుటయే మాకు అనుగ్రహము అగును.

యద్యస్తి దత్తమిష్టం వా స్వధర్మో వా స్వనుష్ఠితః ।
కులం నో విప్రదైవం చేద్ద్విజో భవతు విజ్వరః ।। 10

దత్తమ్ - దానము చేయబడినది గాని, ఇష్టం వా - యజ్ఞము చేయబడినది గాని, సు-అనుష్ఠితః - చక్కగా అనుష్ఠించబడిన, స్వధర్మః వా - స్వధర్మము గాని, అస్తి యది - ఉన్నచో, నః - మాయొక్క, కులమ్ - వంశము, విప్రదైవం చేత్ - వేదవేత్తలే దైవముగా గలది అయినచో, ద్విజః - ఈ వేదవేత్త, విజ్వరః - తొలగిన తాపము (ఉపద్రవము) గలవాడు, భవతు - అగుగాక!

నేను దానమును గాని, యజ్ఞమును గాని చేసియున్నచో, నేను స్వధర్మమును చక్కగా అనుష్ఠించి యున్నచో, మా వంశము వేదవేత్తలే

దైవముగా గలది అయినచో, ఈ వేదవేత్త తాపము (ఉపద్రవము) నుండి విముక్తుడగుగాక!

యది నో భగవాన్ ప్రీత ఏకస్సర్వగుణాశ్రయః ।
సర్వభూతాత్మభావేన ద్విజో భవతు విజ్వరః ।। 11

ఏకః - అద్వితీయుడు, సర్వగుణ-ఆశ్రయః - సకలగుణములకు నిధానమైనవాడు అగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, నః - మాయొక్క, సర్వభూత-ఆత్మభావేన - సకలప్రాణులయందు ఆత్మరూపములే అనే భావనచే, ప్రీతః యది - సంతుష్టుడైనచో, ద్విజః - ఈ వేదవేత్త, విజ్వరః - తొలగిన తాపము (ఉపద్రవము) గలవాడు, భవతు - అగుగాక!

అద్వితీయుడగు శ్రీహరి భగవానుడు సకలగుణములకు నిధానము. సకలప్రాణులయందు మేము ఆత్మభావమునే కలిగియున్నాము. అట్టి మాపై ఆయనకు ప్రీతి ఉన్నచో, ఈ వేదవేత్త తాపము (ఉపద్రవము) నుండి విముక్తుడగుగాక!

శ్రీశుక ఉవాచ ।
ఇతి సంస్తువతో రాజ్ఞో విష్ణుచక్రం సుదర్శనమ్ ।
అశామ్యత్సర్వతో విప్రం ప్రదహద్రాజయాచ్ఞయా ।। 12

రాజ్ఞః - అంబరీష మహారాజు, ఇతి - ఈ విధముగా, సంస్తువతః - చక్కగా స్తుతించుచుండగా, విప్రమ్ - వేదవేత్తయగు దూర్వాసుని, సర్వతః - అన్ని వైపులనుండియు, ప్రదహత్ - అధికముగా దహించి వేయుచున్న, సుదర్శనమ్ - సుదర్శనమనే, విష్ణుచక్రమ్ - విష్ణువుయొక్క చక్రము, రాజయాచ్ఞయా - రాజుయొక్క కోరికచే, అశామ్యత్ - శాంతించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- అంబరీష మహారాజు ఈ విధముగా చక్కగా స్తుతించెను. సుదర్శనమనే విష్ణుచక్రము ఆ మహర్షిని అన్ని వైపులా అధికముగా దహించి వేయుచుండెను. కాని, అంబరీషుడు కోరుటను బట్టి అది శాంతించెను.

స ముక్తోఽస్త్రాగ్నితాపేన దుర్వాసాస్స్వస్తిమాంస్తతః ।
ప్రశశంస తముర్వీశం యుంజానః పరమాశిషః ॥ 13

తతః - తరువాత, సః - ఆ, దుర్వాసాః - దూర్వాస మహర్షి, అస్త్ర-అగ్నితాపేన - చక్రముయొక్క అగ్ని వలని తాపముచే, ముక్తః - విడిచి పెట్టబడినవాడై, స్వస్తిమాన్ - సంతాపము లేనివాడై, పరమ-ఆశిషః - గొప్ప ఆశీస్సులను, యుంజానః - పలుకుచున్నవాడై, తమ్ - ఆ, ఉర్వీ -ఈశమ్ - అంబరీష మహారాజును, ప్రశశంస - గొప్పగా కొనియాడెను.

తరువాత దూర్వాస మహర్షికి చక్రముయొక్క అగ్ని వలని తాపము దూరమయ్యెను. అపుడాయన స్తిమితపడి ఆ మహారాజునకు గొప్ప ఆశీర్వచనములను చేస్తూ, ఆయనను గొప్పగా కొనియాడెను.

దుర్వాసా ఉవాచ ।
అహో అనంతదాసానాం మహత్త్వం దృష్టమద్య మే ।
కృతాగసోఽపి యద్రాజన్ మంగలాని సమీహసే ॥ 14

రాజన్ - ఓ రాజా!, అహో - ఆశ్చర్యము!, అద్య - ఈనాడు, మే - నాచే, అనంతదాసానామ్ - అనంతుడగు శ్రీహరి భక్తులయొక్క, మహత్త్వమ్ - మహిమ, దృష్టమ్ - చూడబడినది, యత్ - ఏలయనగా, కృత-ఆగసః అపి - చేయబడిన తప్పు గలవానికి కూడ, మంగలాని - కల్యాణములను, సమీహసే - చక్కగా చేయుచున్నావో.

దూర్వాస మహర్షి ఇట్లు పలికెను --- ఓ మహారాజా! ఆశ్చర్యము! తప్పు చేసిన నాకు నీవు చక్కగా కల్యాణములను చేయుచున్నావు. నాకీనాడు అనంతుడగు శ్రీహరి భక్తులయొక్క మహిమ అనుభవమునకు వచ్చుచున్నది.

దుష్కరః కో ను సాధూనాం దుస్త్యజో వా మహాత్మనామ్ ।
యైస్సంగృహీతో భగవాన్ సాత్వతామృషభో హరిః ॥ 15

సాధూనామ్ - సత్పురుషులకు, దుష్కరః - చేయశక్యము కాని ది, కః ను - ఏమి ఉండును?, మహాత్మనామ్ - మహాత్ములకు, దుస్త్యజః -

విడిచిపెట్ట శక్యము కానిది, వా - ఏమి ఉండును?, యైః - ఎవరిచేనైతే, సాత్వతామ్ - భక్తులకు, ఋషభః - పాలకుడైన, భగవాన్ హరిః - శ్రీహరి భగవానుడు, సంగృహీతః - చక్కగా (హృదయమునందు) స్థాపించబడినాడో.

ఎవరైతే భక్తపాలకుడగు శ్రీహరి భగవానుని తమ హృదయము నందు దృఢముగా నిలిపి యుంచెదరో, అట్టి సత్పురుషులైన మహాత్ములు చేయలేనిది గాని, విడిచిపెట్టలేనిది గాని ఏమి ఉండును?

యన్నామశ్రుతిమాత్రేణ పుమాన్ భవతి నిర్మలః ।
తస్య తీర్థపదః కిం వా దాసానామవశిష్యతే ।। 16

యత్-నామశ్రుతిమాత్రేణ - ఎవ్వాని నామమును విన్నంత మాత్రాన, పుమాన్ - వ్యక్తి, నిర్మలః - పవిత్రుడు, భవతి - అగునో, తీర్థ పదః - గంగాతీర్థమునకు ఆశ్రయమైన పాదములు గల, తస్య - ఆ శ్రీహరి యొక్క, దాసానామ్ - భక్తులకు, కిం వా అవశిష్యతే - ఏమి మిగిలియుండును?

శ్రీహరి పాదములు గంగాది తీర్థములకు ఆశ్రయము. ఆయన నామమును విన్నంత మాత్రాన వ్యక్తి పవిత్రుడగును. అట్టి శ్రీహరి భక్తులకు కర్తవ్యము ఏమి మిగిలియుండును?

రాజన్ననుగృహీతోఽహం త్వయాఽతికరుణాత్మనా ।
మదఘం పృష్ఠతః కృత్వా ప్రాణా యన్మేఽభిరక్షితాః ।। 17

రాజన్ - ఓ రాజా!, అతికరుణాత్మనా - మిక్కిలి దయ గల మనస్సు గల, త్వయా - నీచే, అహమ్ - నేను, అనుగృహీతః - అనుగ్రహించ బడితిని, యత్ - ఏలయనగా, మద్-అఘమ్ - నా పాపమును, పృష్ఠతః కృత్వా - విస్మరించి, మే - నాయొక్క, ప్రాణాః - ప్రాణములు, అభిరక్షితాః - కాపాడ బడినవి.

ఓ మహారాజా! మిక్కిలి దయామయుడవగు నీవు నన్ను అనుగ్రహించితివి. ఏలయనగా, నీవు నా పాపమును విస్మరించి నా ప్రాణములను కాపాడితివి.

రాజా తమకృతాహారః ప్రత్యాగమనకాంక్షయా ।
చరణావుపసంగృహ్య ప్రసాద్య సమభోజయత్ ॥ 18

ప్రతి-ఆగమనకాంక్షయా - (మహర్షి) తిరిగి వచ్చుననే ఆకాంక్షతో, అకృత-ఆహారః - చేయబడని భోజనము గల, రాజా - అంబరీష మహారాజు, తమ్ - ఆ మహర్షిని, చరణౌ - పాదములను, ఉపసంగృహ్య - నమస్కరించి, ప్రసాద్య - ప్రసన్నుని చేసుకొని, సమభోజయత్ - చక్కగా భుజింప జేసెను.

మహర్షి తిరిగి వచ్చుననే ఆకాంక్షతో అంబరీష మహారాజు భోజనము చేయలేదు. ఆయన ఆ మహర్షి పాదములకు నమస్కరించి, ఆయనను ప్రసన్నునిగా చేసి, ఆయనచే సుష్ఠుగా భోజనము చేయించెను.

సోఽశిత్వాఽఽదృతమానీతమాతిథ్యం సార్వకామికమ్ ।
తృప్తాత్మా నృపతిం ప్రాహ భుజ్యతామితి సాదరమ్ ॥ 19

ఆదృతమ్ - ఆదరముతో కూడినట్టియు, సార్వకామికమ్ - సర్వోత్తమమైన రసాదులతో సంపన్నమైనట్టియు, ఆనీతమ్ - అందించబడిన, ఆతిథ్యమ్ - అన్నము మొదలగు ఆతిథ్యమును, అశిత్వా - భుజించి, సః - ఆ మహర్షి, తృప్త-ఆత్మా - సంతుష్టి చెందిన మనస్సు గలవాడై, నృపతిమ్ - అంబరీష మహారాజును గురించి, భుజ్యతామ్ - భుజించబడుగాక!, ఇతి - అని, సాదరమ్ - సాదరముగా, ప్రాహ - పలికెను.

సర్వోత్తమమగు రసాదులతో సంపన్నమైన ఆహారము మొదలగు ఆతిథ్యమును అంబరీష మహారాజు సాదరముగా ఆ మహర్షికి సమర్పించెను. ఆయన ఆహారమును భుజించి మనస్సులో సంతుష్టుడై సాదరముగా మహారాజును కూడ, భోజనము చేయుడని పలికెను.

ప్రీతోఽస్మ్యనుగృహీతోఽస్మి తవ భాగవతస్య వై ।
దర్శనస్పర్శనాలాపైరాతిథ్యేనాత్మమేధసా ॥ 20

భాగవతస్య - భగవద్భక్తుడవైన, తవ - నీయొక్క, దర్శనస్పర్శన -ఆలాపైః - దర్శనముచే స్పృశించుటచే మాటలాడుటచే, ఆత్మమేధసా - పరమాత్మయందు బుద్ధి గల, అతిథ్యేన - ఆతిథ్యముచే, వై - నిశ్చయముగా, ప్రీతః - ప్రీతి జెందినవాడను, అస్మి - అగుచున్నాను, అనుగృహీతః - అనుగ్రహించ బడినవాడను, అస్మి - అగుచున్నాను.

భగవద్భక్తుడవగు నిన్ను చూచి, స్పృశించి, నీతో మాటలాడుట వలన నేను అనుగ్రహించ బడితిని. నీవు పరమాత్మయందు బుద్ధి నిలిపి ఇచ్చిన ఆతిథ్యముచే నిశ్చయముగా ప్రీతిని జెందితిని.

కర్మావదాతమేతత్తే గాయంతి స్వఃస్త్రియో ముహుః ।
కీర్తిం పరమపుణ్యాం చ కీర్తయిష్యతి భూరియమ్ ॥ 21

తే - నీయొక్క, ఏతత్ - ఈ, అవదాతమ్ - విశుద్ధమైన, కర్మ - కర్మను, స్వఃస్త్రియః - స్వర్గస్త్రీలు, ముహుః - పలుమార్లు, గాయంతి - గానము చేయుదురు, ఇయమ్ - ఈ, భూః చ - భూమి కూడ, పరమపుణ్యామ్ - మిక్కిలి పవిత్రమైన, కీర్తిమ్ - కీర్తిని, కీర్తయిష్యతి - గానము చేయగలదు.

నీయొక్క ఈ పవిత్రమైన కర్మ (మహర్షిని కాపాడుట) ను స్వర్గస్త్రీలు పలుమార్లు గానము చేయుదురు. ఈ భూలోకము కూడ మిక్కిలి పవిత్రమైన నీ కీర్తిని గానము చేయగలదు.

శ్రీశుక ఉవాచ ।
ఏవం సంకీర్త్య రాజానం దుర్వాసాః పరితోషితః ।
యయౌ విహాయసాఽఽమంత్ర్య బ్రహ్మలోకమహైతుకమ్ ॥ 22

పరితోషితః - చాల సంతోషమును పొందిన, దుర్వాసాః - దూర్వాస మహర్షి, ఏవమ్ - ఈ విధముగా, రాజానమ్ - అంబరీష మహారాజును, సంకీర్త్య - బాగా కీర్తించి, ఆమంత్ర్య - సెలవు దీసుకొని, విహా

యసా - ఆకాశమార్గముచే, అహైతుకమ్ - కేవలకర్మచే పొందబడని, బ్రహ్మలోకమ్ - బ్రహ్మలోకమును గురించి, యయౌ - వెళ్లెను.

దూర్వాస మహర్షి చాల సంతోషించి అంబరీష మహారాజును ఈ విధముగా చాల స్తుతించి, ఆయన వద్ద సెలవు తీసుకొని బ్రహ్మలోకమునకు వెళ్లెను. కేవలకర్మచే బ్రహ్మలోకమును పొందుట శక్యము కాదు.

సంవత్సరోఽత్యగాత్తావద్యావతా నాగతో గతః ।
మునిస్తద్దర్శనాకాంక్షో రాజాఽబ్భక్షో బభూవ హ ॥ 23

గతః - వెళ్లిన, మునిః - మహర్షి, యావతా - ఎంతవరకైతే, న ఆగతః - తిరిగి రాలేదో, తావత్ - అంతవరకు, సంవత్సరః - సంవత్సరము, అతి-అగాత్ - గడచిపోయెను, తద్-దర్శన-ఆకాంక్షః - ఆయన దర్శనము కొరకు ఎదురు చూచే, రాజా - అంబరీష మహారాజు, అబ్-భక్షః - నీటిని త్రాగువాడు, బభూవ హ - ఆయెనట.

వెళ్లిన మహర్షి తిరిగి వచ్చు సరికి ఒక సంవత్సరము కాలము గడచి పోయెను. ఆయన రాక కొరకు ఎదురు చూచుచున్న అంబరీష మహారాజు ఆ కాలములో కేవలము నీటిని మాత్రమే త్రాగెను.

గతే చ దుర్వాససి సోఽంబరీషో ద్విజోపయోగాతిపవిత్రమాహరత్,
ఋషేర్విమోక్షం వ్యసనం చ బుద్ధ్వా మేనే స్వవీర్యం చ పరానుభావమ్.24

దుర్వాససి - దూర్వాస మహర్షి, గతే చ - వెళ్లగా, సః - ఆ, అంబరీషః - అంబరీషుడు, ద్విజ-ఉపయోగ-అతిపవిత్రమ్ - మహర్షి విని యోగించుటచే మిక్కిలి పవిత్రమైన ఆహారమును, అహరత్ - ఆరగించెను, ఋషేః - మహర్షియొక్క, వ్యసనమ్ - ఆపదను, విమోక్షం చ - విముక్తిని కూడ, బుద్ధ్వా - గమనించి, స్వవీర్యం చ - తన ధైర్యమును కూడ, పర-అనుభావమ్ - పరమాత్మయొక్క మహిమనుగా, మేనే - తలచెను.

దూర్వాస మహర్షి వెళ్లిన తరువాత, ఆయన తినుటచే పవిత్రమైన ఆహారమును ఆ అంబరీషుడు ఆరగించెను. ఆ మహర్షి ఆ విధముగా ఆప

దలో పడి గట్టెక్కుటను గమనించి, తాను ధైర్యముగా ఉండుట మరియు ఆ సర్వము పరమాత్మయొక్క మహిమయేనని ఆ మహారాజు తలపోసెను.

ఏవంవిధానేకగుణస్స రాజా పరాత్మని బ్రహ్మణి వాసుదేవే,
క్రియాకలాపైస్సముువాహ భక్తిం యయాఽఽవిరించ్యాన్నిరయాంశ్చకార।25

ఏవంవిధ-అనేకగుణః - ఈ విధమైన అనేకగుణములు గల, సః - ఆ, రాజా - అంబరీష మహారాజు, పర-ఆత్మని - ప్రకృతికి అతీతమై ఆత్మ రూపముగా నున్నట్టియు, వాసుదేవే - శ్రీకృష్ణ రూపముగా అవతరించిన, బ్రహ్మణి - పరబ్రహ్మయందు, క్రియాకలాపైః - క్రియల సముదాయము లచే, భక్తిమ్ - భక్తిని, సమువాహ - చక్కగా చేసెను, యయా - ఏ భక్తిచే, ఆవిరించ్యాన్ - బ్రహ్మలోకము వరకు గల భోగములను, నిరయాన్ - నర కములుగా, చకార - చేసెనో.

ఈ విధముగా అనేకగుణములకు నిధియగు ఆ అంబరీష మహా రాజు పలువిధముల క్రియల ద్వారా, ప్రకృతికి అతీతమగు ఆత్మరూపమై శ్రీకృష్ణ రూపమును దాల్చిన పరబ్రహ్మయందు మంచి భక్తిని చేసెను. ఆ భక్తియొక్క ప్రభావముచే ఆయన బ్రహ్మలోకము వరకు గల భోగములను నరకముతో సమానమైనవాటినిగా తలపోసెను.

అథాంబరీషస్తనయేషు రాజ్యం సమానశీలేషు విసృజ్య ధీరః ।
వనం వివేశాత్మని వాసుదేవే మనో దధద్ధ్వస్తగుణప్రవాహః ॥ 26

అథ - తరువాత, ధీరః - వివేకి, ఆత్మని - ఆత్మరూపుడగు, వాసు దేవే - వాసుదేవునియందు, మనః - మనస్సును, దధత్ - నిలుపువాడు, ధ్వస్తగుణప్రవాహః - నశించిన సత్త్వరజస్తమోగుణముల ప్రవాహము గల వాడు అగు, అంబరీషః - అంబరీషుడు, సమానశీలేషు - తనతో సమాన మైన సచ్ఛీలము గల, తనయేషు - పుత్రులయందు, రాజ్యమ్ - రాజ్యము ను, విసృజ్య - అప్పజెప్పి, వనమ్ - అడవిని, వివేశ - ప్రవేశించెను.

తరువాత ఆత్మానాత్మవివేకియగు అంబరీషుడు ఆత్మరూపుడగు వాసుదేవునియందు మనస్సును నిలిపి సత్త్వరజస్తమోగుణముల ప్రవా

హము (సంసారము) నకు అతీతుడాయెను. ఆయన రాజ్యమును పుత్రుల కప్పజెప్పి అడవిని ప్రవేశించెను.

ఇత్యేతత్పుణ్యమాఖ్యానమంబరీషస్య భూపతేః ।
సంకీర్తయన్ననుధ్యాయన్ భక్తో భగవతో భవేత్ ॥ 27

అంబరీషస్య భూపతేః - అంబరీష మహారాజుయొక్క, ఇతి - ఈ విధమైన, ఏతత్ - ఈ, పుణ్యమ్ - పవిత్రమైన, ఆఖ్యానమ్ - గాథను, సంకీర్తయన్ - చక్కగా కీర్తించువాడు, అనుధ్యాయన్ - తరువాత స్మరించువాడు, భగవతః - భగవానుని, భక్తః - భక్తుడు, భవేత్ - అగును.

అంబరీష మహారాజుయొక్క ఈ విధమైన ఈ పవిత్రమగు గాథను చక్కగా కీర్తించి ధ్యానించు సాధకునియందు భగవద్భక్తి నెలకొనును.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
అంబరీషోపాఖ్యానమునందు దూర్వాస మహర్షిని
అంబరీషుడు విష్ణుచక్రమునుండి విడిపించుటను
వర్ణించే అయిదవ అధ్యాయము ముగిసినది (5).

* * * * *

# అథ షష్ఠోఽధ్యాయః

## మాంధాత చరితము - సౌభరి చరితము

శ్రీశుక ఉవాచ।
విరూపః కేతుమాన్ శంభురంబరీషసుతాస్త్రయః ।
విరూపాత్పృషదశ్వోఽభూత్తత్పుత్రస్తు రథీతరః ॥ 1

విరూపః - విరూపుడు, కేతుమాన్ - కేతుమంతుడు, శంభుః - శంభుడు, త్రయః - ముగ్గురు, అంబరీషసుతాః - అంబరీషుని పుత్రులు, విరూపాత్ - విరూపుని వలన, పృషదశ్వః - పృషదశ్వుడు, అభూత్ - కలిగెను, తత్-పుత్రః తు - ఆయన పుత్రుడైతే, రథీతరః - రథీతరుడు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- అంబరీషునకు విరూపుడు, కేతుమంతుడు, శంభుడు అనే ముగ్గురు పుత్రులు ఉండిరి. విరూపుని పుత్రుడు పృషదశ్వుడు కాగా, పృషదశ్వుని పుత్రుడు రథీతరుడు.

రథీతరస్యాప్రజస్య భార్యాయాం తంతవేఽర్థితః ।
అంగిరా జనయామాస బ్రహ్మవర్చస్వినస్సుతాన్ ॥ 2

అప్రజస్య - సంతానము లేని, రథీతరస్య - రథీతరునియొక్క, భార్యాయామ్ - భార్యయందు, తంతవే - వంశ పరంపర కొరకై, అర్థితః - ప్రార్థించబడిన, అంగిరాః - అంగిరసుడు, బ్రహ్మవర్చస్వినః - బ్రహ్మవర్చస్సు గల, సుతాన్ - పుత్రులను, జనయామాస - కనెను.

రథీతరునకు సంతానము కలుగలేదు. అపుడాయన వంశపరంపరను నిలబెట్టుడని కోరగా అంగిరసుడు ఆయన భార్యయందు బ్రహ్మవర్చస్సు గల పుత్రులను కనెను.

ఏతే క్షేత్రే ప్రసూతా వై పునస్త్వాంగిరసాస్స్మృతాః ।
రథీతరాణాం ప్రవరాః క్షత్రోపేతా ద్విజాతయః ॥ 3

రథీతరాణామ్ - రథీతర వంశీయులలో, ప్రవరాః - శ్రేష్ఠులగు, ఏతే పునః - వీరైతే, క్షేత్రే - రథీతరుని భార్యయందు, ప్రసూతాః - జన్మించినవారే, ఆంగిరసాః - అంగిరస గోత్రీయులుగా, స్మృతాః వై - ప్రసిద్ధముగా చెప్పబడినవారు, క్షత్ర-ఉపేతాః - క్షత్రియగోత్రముతో కూడియున్న, ద్విజాతయః - బ్రాహ్మణులు (రెండు వంశములు గలవారు).

రథీతరవంశీయులలో శ్రేష్ఠులైన వీరైతే రథీతరుని భార్యకు కలిగిన సంతానమే అయినా, ఆంగిరస గోత్రీయులుగా ప్రసిద్ధికెక్కినారు. ఈ విధముగా వీరు క్షత్రియగోత్రముతో కూడుకున్న బ్రాహ్మణులై రెండు వంశములు గలవారైనారు.

క్షువతస్తు మనోర్జజ్ఞే ఇక్ష్వాకుర్ఘ్రాణతస్సుతః ।
తస్య పుత్రశతజ్యేష్ఠా వికుక్షినిమిదండకాః ।। 4

మనోః - మనువు, క్షువతః - తుమ్ముచుండగా, ఘ్రాణతః - ముక్కునుండి, ఇక్ష్వాకుః - ఇక్ష్వాకువు, జజ్ఞే - పుట్టెను, తస్య - ఆయన యొక్క, పుత్రశతజ్యేష్ఠాః - పుత్రుల వందలో జ్యేష్ఠులు, వికుక్షినిమిదండకాః - వికుక్షి నిమి మరియు దండకుడు.

మనువు తుమ్ముచుండగా ఆయన ముక్కునుండి ఇక్ష్వాకువు పుట్టెను. ఆ ఇక్ష్వాకువునకు వందమంది పుత్రులు ఉండిరి. వారిలో వికుక్షి, నిమి, దండకుడు పెద్దవారు.

తేషాం పురస్తాదభవన్నార్యావర్తే నృపా నృప ।
పంచవింశతిః పశ్చాచ్చ త్రయో మధ్యే పరేऽన్యతః ।। 5

నృప - ఓ మహారాజా, ఆర్యావర్తే - ఆర్యావర్తమునందు, పురస్తాత్ - తూర్పు దిక్కునందు, పశ్చాత్ చ - పశ్చిమదిక్కునందు కూడ, తేషామ్ - వారిలో, పంచవింశతిః - ఇరవై అయిదు మంది, నృపాః - రాజులు, మధ్యే - మధ్యయందు, త్రయః - ముగ్గురు, పరే - ఇతరులు, అన్యతః - మిగిలిన దిక్కులయందు, అభవన్ - ఉండిరి.

ఓ పరీక్షిన్మహారాజా! ఆ వంద మందిలో ఇరవై అయిదు మంది ఆర్యావర్తములోని తూర్పు దిక్కునందు, ఇరవై అయిదు మంది పశ్చిమ దిక్కునందు, ముగ్గురు మధ్యభాగమునందు, మిగిలినవారు (నలభై ఏడ్గురు) మిగిలిన దిక్కులయందు రాజులుగా నుండిరి.

స ఏకదాఽష్టకాశ్రాద్ధ ఇక్ష్వాకుస్సుతమాదిశత్ ।
మాంసమానీయతాం మేధ్యం వికుక్షే గచ్ఛ మా చిరమ్ ॥ 6

ఏకదా - ఒకనాడు, సః - ఆ, ఇక్ష్వాకుః - ఇక్ష్వాకువు, అష్టకాశ్రాద్ధే - అష్టకాశ్రాద్ధమునందు, సుతమ్ - కుమారుని, ఆదిశత్ - ఆదేశించెను, వికుక్షే - ఓ వికుక్షీ!, మేధ్యమ్ - పవిత్రమగు, మాంసమ్ - మాంసము, ఆనీయతామ్ - తీసుకురాబడు గాక!, గచ్ఛ - వెళ్లుము, మా చిరమ్ - విలంబము వద్దు.

ఒకనాడు ఆ ఇక్ష్వాకువు అష్టకాశ్రాద్ధమును చేయుచూ పుత్రుని ఇట్లు ఆదేశించెను -- ఓ వికుక్షీ! తొందరగా వెళ్లి పవిత్రమైన మాంసమును తీసుకురమ్ము.

తథేతి స వనం గత్వా మృగాన్ హత్వా క్రియార్హణాన్ ।
శ్రాంతో బుభుక్షితో వీరశ్శశం చాదదపస్మృతిః ॥ 7

తథా - సరే!, ఇతి - అని, సః - ఆ, వీరః - వీరుడగు వికుక్షి, వనమ్ - అడవిని గురించి, గత్వా - వెళ్లి, క్రియా-అర్హణాన్ - శ్రాద్ధక్రియకు యోగ్యములైన, మృగాన్ - పశువులను, హత్వా - చంపి, శ్రాంతః - అలసినవాడై, బుభుక్షితః చ - ఆకలి గొన్నవాడై, అపగతస్మృతిః - తొలగిన స్మరణము గలవాడై, శశమ్ - కుందేటిని, ఆదత్ - తినెను.

సరే! అని పలికి వీరుడగు ఆ వికుక్షి అడవికి వెళ్లి, శ్రాద్ధమునకు యోగ్యములైన పశువులను చంపెను. ఆతడు అలసిపోయెను, పైగా ఆకలి గొనియుండెను. శ్రాద్ధము సంగతి మరచి ఆతడు కుందేటిని తినెను.

శేషం నివేదయామాస పిత్రే తేన చ తద్గురుః ।
చోదితః ప్రోక్షణాయాహ దుష్టమేతదకర్మకమ్ ॥ 8

శేషమ్ - మిగిలిన మాంసమును, పిత్రే - తండ్రి కొరకు, నివేద యామాస - సమర్పించెను, తేన - ఆ ఇక్ష్వాకువుచే, ప్రోక్షణాయ - శ్రాద్ధ సంస్కారము కొరకు, చోదితః - ప్రేరితుడైన, తద్-గురుః - ఆయన గురు వగు వసిష్ఠుడు, ఆహ - పలికెను, ఏతత్ - ఇది, దుష్టమ్ - చెడ్డది, అకర్మ కమ్ - కర్మకు అనర్హము.

ఆతడు మిగిలిన మాంసమును తండ్రికి సమర్పించెను. అపుడు ఇక్ష్వాకువు తన గురువగు వసిష్ఠుని శ్రాద్ధసంస్కారము కొరకు ప్రేరేపించ గా, ఆయన ఇట్లనెను -- ఇది చెడ్డది, శ్రాద్ధకర్మకు అనర్హము.

జ్ఞాత్వా పుత్రస్య తత్కర్మ గురుణాభిహితం నృపః ।
దేశాన్నిస్సారయామాస సుతం త్యక్తవిధిం రుషా ।। 9

గురుణా - గురువగు వసిష్ఠునిచే, అభిహితమ్ - చెప్పబడిన, పుత్రస్య - పుత్రునియొక్క, తత్ - ఆ, కర్మ - పనిని గురించి, జ్ఞాత్వా - తెలిసి, నృపః - ఇక్ష్వాకు మహారాజు, త్యక్తవిధిమ్ - విడిచిపెట్టబడిన శాస్త్ర నియమము గల, సుతమ్ - పుత్రుని, రుషా - కోపముతో, దేశాత్ - దేశ మునుండి, నిస్సారయామాస - బహిష్కరించెను.

ఇక్ష్వాకుని పుత్రుడగు వికుక్షి శాస్త్రనియమమును విడిచిపెట్టి చేసిన ఆ పనిని గురించి గురువగు వసిష్ఠుడు చెప్పగా తెలుసుకున్న ఇక్ష్వా కువు కోపముతో తన పుత్రుని దేశమునుండి బహిష్కరించెను.

స తు విప్రేణ సంవాదం జాపకేన సమాచరత్ ।
త్యక్త్వా కలేవరం యోగీ స తేనావాప యత్పరమ్ ।। 10

సః తు - ఆ ఇక్ష్వాకువైతే, జాపకేన - జ్ఞానమునిచ్చిన, విప్రేణ - వసిష్ఠ మహర్షితో, సంవాదమ్ - తత్త్వవిచారమును, సమాచరత్ - చక్కగా చేసెను, సః - ఆయన, యోగీ - యోగియై, కలేవరమ్ - దేహమును, త్యక్త్వా - విడిచిపెట్టి, తేన - దానిచే, యత్ - ఎయ్యది, పరమ్ - పరబ్ర హ్మయో దానిని, అవాప - పొందెను.

యోగియగు ఆ ఇక్ష్వాకువు జ్ఞానదాతయగు వసిష్ఠునితో తత్త్వవిచారమును చక్కగా చేసెను. దాని ప్రభావముచే ఆయన జ్ఞానయోగనిష్ఠ గలవాడై దేహత్యాగమును చేసి పరబ్రహ్మను పొందెను.

పితర్యుపరతేఽభ్యేత్య వికుక్షిః పృథివీమిమామ్ ।
శాసదీజే హరిం యజ్ఞైశ్శశాద ఇతి విశ్రుతః ॥ 11

పితరి - తండ్రియగు ఇక్ష్వాకువు, ఉపరతే - మరణించగా, వికుక్షిః - వికుక్షి, అభ్యేత్య - తిరిగివచ్చి, ఇమామ్ - ఈ, పృథివీమ్ - పృథివిని, శాసత్ - శాసించువాడై, హరిమ్ - శ్రీహరిని, యజ్ఞైః - యజ్ఞములతో, ఈజే - ఆరాధించెను, శశాదః - శశాదుడు, ఇతి - అని, విశ్రుతః - ప్రసిద్ధి గాంచినవాడు.

తండ్రియగు ఇక్ష్వాకువు మరణించిన పిదప వికుక్షి తిరిగి రాజ్యమునకు వచ్చి పృథివిని పాలిస్తూ యజ్ఞములతో శ్రీహరిని ఆరాధించెను. ఆయనకు శశాదుడు (కుందేటిని తిన్నవాడు) అనే పేరు ప్రసిద్ధి గాంచెను.

పురంజయస్తస్య సుత ఇంద్రవాహ ఇతీరితః ।
కకుత్స్థ ఇతి చాప్యుక్తశ్శృణు నామాని కర్మభిః ॥ 12

తస్య - ఆ వికుక్షియొక్క, సుతః - పుత్రుడు, పురంజయః - పురంజయుడు, ఇంద్రవాహః - ఇంద్రవాహుడు, ఇతి - అని, ఈరితః - పిలువబడినవాడు, కకుత్స్థః - కకుత్స్థుడు, ఇతి చ అపి - అని కూడ, ఉక్తః - పిలువబడినవాడు, నామాని - పేర్లు, కర్మభిః - కర్మలచే, శృణు - వినుము.

ఆ వికుక్షియొక్క పుత్రుడు పురంజయుడు. ఆయనను ఇంద్రవాహుడు అనియు, కకుత్స్థుడు అనియు కూడ పిలిచెడివారు. ఆయన చేసిన కర్మలను బట్టి ఈ పేర్లు వచ్చినవి. ఆ వివరములను వినుము.

కృతాంత ఆసీత్సమరో దేవానాం సహ దానవైః ।
పార్ష్ణిగ్రాహో వృతో వీరో దేవైర్దైత్యపరాజితైః ॥ 13

దేవానామ్ - దేవతలకు, దానవైః సహ - రాక్షసులతో, కృత -అంతః - జగత్తును అంతము చేసే (కృత-అంతే - కృతయుగాంతమునందు), సమరః - యుద్ధము, ఆసీత్ - జరిగెను, దైత్యపరాజితైః - రాక్షసులచే ఓడించబడిన, దేవైః - దేవతలచే, వీరః - వీరుడగు పురంజయుడు, పార్ష్ణి గ్రాహః - సహాయకుడుగా, వృతః - ఎన్నుకొనబడినవాడు.

కృతయుగాంతమునందు దేవతలకు రాక్షసులతో జగత్తును అంతము చేసే యుద్ధము జరిగెను. ఆ యుద్ధములో దేవతలు రాక్షసుల చేతిలో ఓడి, వీరుడగు పురంజయుని సహాయకునిగా ఎన్నుకొనిరి.

వచనాద్దేవదేవస్య విష్ణోర్విశ్వాత్మనః ప్రభోః ।
వాహనత్వే వృతస్తస్య బభూవేంద్రో మహావృషః ॥ 14

దేవదేవస్య - దేవదేవుడైనట్టియు, విశ్వ-ఆత్మనః - జగత్తునకు ఆత్మయైనట్టియు, ప్రభోః - జగన్నాథుడైన, విష్ణోః - విష్ణువుయొక్క, వచనాత్ - వచనము వలన, తస్య - ఆ పురంజయునకు, వాహనత్వే - వాహనభావమునందు, వృతః - ఎన్నుకొనబడిన, ఇంద్రః - ఇంద్రుడు, మహావృషః - పెద్ద యెద్దు, బభూవ - ఆయెను.

ఇంద్రుడు తనకు వాహనము కావలెనని పురంజయుడు కోరెను. దేవదేవుడు, జగత్తునకు ఆత్మ, జగన్నాథుడు అగు విష్ణువు చెప్పగా, ఇంద్రుడు పెద్ద యెద్దు ఆయెను.

స సన్నద్ధో ధనుర్దివ్యమాదాయ విశిఖాన్ శితాన్ ।
స్తూయమానస్సమారుహ్య యుయుత్సుః కకుది స్థితః ॥ 15

యుయుత్సుః - యుద్ధమును చేయగోరే, సః - ఆ పురంజయుడు, సన్నద్ధః - కవచమును వేసుకున్నవాడై, దివ్యమ్ - దేవలోకమునకు చెందిన, ధనుః - ధనుస్సును, శితాన్ - వాడియైన, విశిఖాన్ - బాణములను, ఆదాయ - తీసుకొని, స్తూయమానః - స్తుతించబడుచున్నవాడై, సమారుహ్య - (ఎద్దును) అధిరోహించి, కకుది - మూపురమునందు, స్థితః - ఉన్నవాడు.

ఆ పురంజయుడు యుద్ధమును చేయగోరి కవచమును వేసుకొని దేవలోకమునకు చెందిన ధనుస్సును మరియు వాడి బాణములను తీసుకొని ఎద్దుపై మూపురము వద్ద కూర్చుండెను. దేవతలు ఆయనను స్తుతించుచుండిరి.

తేజసాఽఽప్యాయితో విష్ణోః పురుషస్య పరాత్మనః ।
ప్రతీచ్యాం దిశి దైత్యానాం న్యరుణత్త్రిదశైః పురమ్ ॥ 16

పురుషస్య - పూర్ణుడైనట్టియు, పర-ఆత్మనః - ప్రకృతికి అతీతమగు ఆత్మయై ఉన్న, విష్ణోః - విష్ణువుయొక్క, తేజసా - తేజస్సుచే, ఆప్యాయితః - వర్ధిల్ల జేయబడినవాడై, ప్రతీచ్యాం దిశి - పడమర దిక్కునందు, దైత్యానామ్ - రాక్షసుల, పురమ్ - నగరమును, త్రిదశైః - దేవతలతో గూడి, న్యరుణత్ - ముట్టడించెను.

పూర్ణుడు, ప్రకృతికి అతీతముగా ఆత్మరూపుడై యున్నవాడు అగు విష్ణువుయొక్క తేజస్సు పురంజయుని వర్ధిల్ల జేసెను. ఆయన దేవతలతో గూడి పశ్చిమదిక్కునందున్న రాక్షసుల నగరమును ముట్టడించెను.

తైస్తస్య చాభూత్ప్రధనం తుములం లోమహర్షణమ్ ।
యమాయ భల్లైరనయద్దైత్యాన్ యేఽభియయుర్మృధే ॥ 17

తైః - వారితో, అస్య - ఈ పురంజయునకు, తుములమ్ - సంకులమైనట్టియు, లోమహర్షణమ్ - రోమములు నిక్కబొడుచుకొనునట్లు చేసే, ప్రధనమ్ - యుద్ధము, అభూత్ చ - జరిగెను, దైత్యాన్ - రాక్షసులను, భల్లైః - బాణములతో, యమాయ - యముని కొరకు, అనయత్ - పంపించెను, మృధే - యుద్ధమునందు, యే - ఎవరైతే, అభియయుః - ఎదురేగిరో.

ఆ రాక్షసులతో పురంజయునకు సంకులమైన యుద్ధము జరిగెను. చూచువారలకు ఆ యుద్ధము రోమాంచమును కలిగించెను. ఆ యుద్ధములో తనను ఎదిరించిన రాక్షసులను ఆయన బాణములతో యముని వద్దకు పంపెను.

తస్యేషుపాతాభిముఖం యుగాంతాగ్నిమివోల్బణమ్ ।
విసృజ్య దుద్రువుర్దైత్యా హన్యమానాస్స్వమాలయమ్ ।। 18

హన్యమానాః - కొట్టబడుచున్న, దైత్యాః - రాక్షసులు, యుగ-అంత-అగ్నిం ఇవ - ప్రళయకాలమునందలి అగ్ని వలె, ఉల్బణమ్ - సహించ శక్యము కాని, తస్య - ఆ పురంజయునియొక్క, ఇషుపాత-అభిముఖమ్ - బాణము పడుటకు ఎదురుగ నుండుటను, విసృజ్య - విడిచిపెట్టి, స్వమ్ - తమదైన, ఆలయమ్ - నివాసమును గురించి, దుద్రువుః - పరుగెత్తిరి.

బాణములచే కొట్టబడుచున్న రాక్షసులకు ఆ పురంజయుని బాణములకు ఎదురుగా నిలబడుట ప్రళయకామునందలి అగ్నికి ఎదురుగా నిలబడుట వలె దుస్సహమాయెను. వారాయన ఎదుట పడకుండా తప్పించుకొని తమ నివాసము (పాతాళము) నకు పారిపోయిరి.

జిత్వా పురం ధనం సర్వం సశ్రీకం వజ్రపాణయే ।
ప్రత్యయచ్ఛత్స రాజర్షిరితి నామభిరాహృతః ।। 19

సః - ఆ, రాజర్షిః - రాజర్షియగు పురంజయుడు, సశ్రీకమ్ - సంపదలతో కూడియున్న, పురమ్ - నగరమును, సర్వమ్ - సకలమైన, ధనమ్ - ధనమును, జిత్వా - జయించి, వజ్రపాణయే - వజ్రపాణియగు ఇంద్రుని కొరకు, ప్రతి-అయచ్ఛత్ - సమర్పించెను, ఇతి - అనే కారణముగా, నామభిః - పేర్లతో, ఆహృతః - వ్యవహరించ బడినవాడు.

రాజర్షియగు ఆ పురంజయుడు సంపదలతో కూడియున్న రాక్షసుల నగరమును, వారి సకలధనమును జయించి వజ్రపాణియగు ఇంద్రునకు సమర్పించెను. పురమును జయించుటచే పురంజయుడనియు, ఎద్దు మూపురముపై కూర్చుండుటచే కకుత్స్థుడనియు, ఇంద్రుడు వాహనముగా గలవాడగుటచే ఇంద్రవాహుడనియు పేర్లతో ఆయన వ్యవహరించబడెను.

పురంజయస్య పుత్రోఽభూదనేనాస్తత్సుతః పృథుః ।
విశ్వరంధిస్తతశ్చంద్రో యువనాశ్వశ్చ తత్సుతః ।। 20

పురంజయస్య - పురంజయునకు, అనేనాః - అనేనసుడనే, పుత్రః - పుత్రుడు, అభూత్ - కలిగెను, తత్-సుతః - ఆయన పుత్రుడు, పృథుః - పృథువు, తతః - ఆయన వలన, విశ్వరంధిః - విశ్వరంధి, చంద్రః - చంద్రుడు, తత్-సుతః చ - ఆయన పుత్రుడు, యువనాశ్వః - యువనాశ్వుడు.

పురంజయుని పుత్రుడు అనేనసుడు. అనేనసుని పుత్రుడు పృథువు. పృథుని పుత్రుడు విశ్వరంధి. విశ్వరంధి పుత్రుడు చంద్రుడు. చంద్రుని పుత్రుడు యువనాశ్వుడు.

శాబస్తస్తత్సుతో యేన శాబస్తీ నిర్మితా పురీ ।
బృహదశ్వస్తు శాబస్తిస్తతః కువలయాశ్వకః ॥ 21

తత్-సుతః - ఆ యవనాశ్వుని పుత్రుడు, శాబస్తః - శాబస్తుడు, యేన - ఎవనిచేనైతే, శాబస్తీ పురీ - శాబస్తీ నగరము, నిర్మితా - నిర్మించబడినదో, శాబస్తిః తు - శాబస్తుని పుత్రుడైతే, బృహదశ్వః - బృహదశ్వుడు, తతః - ఆయన వలన, కువలయాశ్వకః - కువలయాశ్వకుడు.

ఆ యవనాశ్వుని పుత్రుడు శాబస్తుడు. ఆయన శాబస్తీ నగరమును నిర్మించెను. ఆయన పుత్రుడు బృహదశ్వుడు కాగా, బృహదశ్వుని పుత్రుడు కువలయాశ్వకుడు.

యః ప్రియార్థముతంకస్య ధుంధునామాసురం బలీ ।
సుతానామేకవింశత్యా సహస్రైరహనద్వృతః ॥ 22

బలీ - బలవంతుడగు, యః - ఏ కువలయాశ్వకుడు, ఉతంకస్య - ఉత్తంక మహర్షికి, ప్రియ-అర్థమ్ - ప్రీతిని కలిగించుట కొరకై, సుతానామ్ - పుత్రులయొక్క, ఏకవింశత్యా సహస్రైః - ఇరవై ఒక్క వేలతో, వృతః - చుట్టువారబడినవాడై, ధుంధునామ-అసురమ్ - ధుంధువు అని ప్రసిద్ధి గాంచిన రాక్షసుని, అహనత్ - సంహరించెనో.

ఆ కువలయాశ్వకుడు బలశాలి. ఆయన ఉత్తంక మహర్షికి ప్రీతిని కలిగించుట కొరకై తన ఇరవై ఒక్క వేల పుత్రులతో చుట్టువారబడినవాడై ధుంధువు అని ప్రసిద్ధి గాంచిన రాక్షసుని సంహరించెను.

ధుంధుమార ఇతి ఖ్యాతస్తత్సుతాస్తే చ జజ్వలుః ।
ధుంధోర్ముఖాగ్నినా సర్వే త్రయ ఏవావశేషితాః ।। 23

ధుంధుమారః - ధుంధుమారుడు, ఇతి - అని, ఖ్యాతః - ప్రసిద్ధిని చెందినవాడు, తే - ఆ, తత్-సుతాః చ - ఆయన పుత్రులైతే, సర్వే - అందరు, ధుంధోః - ధుంధువుయొక్క, ముఖ-అగ్నినా - నోటినుండి వచ్చిన అగ్నిచే, జజ్వలుః - మసి అయిరి, త్రయః ఏవ - ముగ్గురు మాత్ర మే, అవశేషితాః - మిగిలియున్నవారు.

కువలయాశ్వకుడు ధుంధుమారుడు (ధుంధువును చంపినవాడు) అని ఖ్యాతిని పొందెను. ఆయన పుత్రులు ఇరవై ఒక్క వేలమందిలో ముగ్గు రుని మినహాయించి మిగిలినవారు అందరు ధుంధువు నోటినుండి వెలువడే అగ్నిలో కాలిపోయిరి.

దృఢాశ్వః కపిలాశ్వశ్చ భద్రాశ్వ ఇతి భారత ।
దృఢాశ్వపుత్రో హర్యశ్వో నికుంభస్తత్సుతస్స్మృతః ।। 24

భారత - ఓ భరత వంశీయుడా!, దృఢాశ్వః - దృఢాశ్వుడు, కపి లాశ్వః - కపిలాశ్వుడు, భద్రాశ్వః చ - భద్రాశ్వుడు, ఇతి - అనేవారు, దృఢాశ్వపుత్రః - దృఢాశ్వుని పుత్రుడు, హర్యశ్వః - హర్యశ్వుడు, తత్-సుతః - ఆయన పుత్రుడు, నికుంభః - నికుంభుడు అని. స్మృతః - చెప్పబ డినవాడు.

భరత వంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! దృఢాశ్వుడు, కపిలా శ్వుడు, భద్రాశ్వుడు అనునవి వారి ముగ్గురి పేర్లు. దృఢాశ్వుని పుత్రుడు హర్యశ్వుడు కాగా, హర్యశ్వుని పుత్రుడు నికుంభుడు.

బర్హణాశ్వో నికుంభస్య కృశాశ్వోఽథాస్య సేనజిత్ ।
యువనాశ్వోఽభవత్తస్య సోఽనపత్యో వనం గతః ।। 25

భార్యాశతేన నిర్విణ్ణ ఋషయోఽస్య కృపాలవః ।
ఇష్టిం స్మ వర్తయాంచక్రురైంద్రీం తే సుసమాహితాః ।। 26

నికుంభస్య - నికుంభునకు, బర్హణాశ్వః - బర్హణాశ్వుడు, అథ - తరువాత, కృశాశ్వః - కృశాశ్వుడు, అస్య - వీనికి, సేనజిత్ - సేనజిత్తు, తస్య - వానికి, యువనాశ్వః - యువనాశ్వుడు, అభవత్ - కలిగెను, అన పత్యః - సంతానము లేని, సః - ఆయన, నిర్విణ్ణః - దుఃఖితుడై, భార్యా శతేన - వందమంది భార్యలతో, వనమ్ - అడవిని గురించి, గతః - వెళ్లిన వాడు, కృపాలవః - దయామయులగు, తే - ఆ, ఋషయః - మహర్షులు, సుసమాహితాః - చాల ఏకాగ్రమగు చిత్తము గలవారై, అస్య - వీనికి, ఐంద్రీమ్ - ఇంద్రదేవతాకమైన, ఇష్టిమ్ - యాగమును, వర్తయాంచక్రుః స్మ - చేయించిరి.

నికుంభుని పుత్రుడు బర్హణాశ్వుడు. బర్హణాశ్వుని పుత్రుడు కృశాశ్వుడు. కృశాశ్వుని పుత్రుడు సేనజిత్తు. సేనజిత్తు పుత్రుడు యువనాశ్వుడు. సంతానము లేని యువనాశ్వుడు దుఃఖితుడై వందమంది భార్యలతో గూడి వానప్రస్థాశ్రమము (అడవికి తపస్సునకై వెళ్లుట) లోనికి వెళ్లెను. అచట దయామయులగు మహర్షులు చాల ఏకాగ్రమగు చిత్తముతో ఈయనచే ఇంద్రదేవతాకమైన యాగమును చేయించిరి.

రాజా తద్యజ్ఞసదనం ప్రవిష్టో నిశి తర్షితః ।
దృష్ట్వా శయానాన్ విప్రాంస్తాన్ పపౌ మంత్రజలం స్వయమ్ ।। 27

రాజా - యువనాశ్వ మహారాజు, నిశి - రాత్రియందు, తర్షితః - దప్పిక గొన్నవాడై, తత్ - ఆ, యజ్ఞసదనమ్ - యజ్ఞశాలను, ప్రవిష్టః - ప్రవేశించినవాడై, శయానాన్ - నిద్రించుచున్న, తాన్ - ఆ, విప్రాన్ - వేద వేత్తలను, దృష్ట్వా - చూచి, స్వయమ్ - తానే, మంత్రజలమ్ - మంత్రించిన నీటిని, పపౌ - త్రాగెను.

యువనాశ్వ మహారాజునకు రాత్రి చాల దాహము వేసెను. ఆయన యజ్ఞశాలలో ప్రవేశించి చూడగా, అచట వేదవేత్తలు నిద్రించుచుండిరి. అపుడాయన తానే మంత్రించిన నీటిని తీసుకొని త్రాగెను.

ఉత్థితాస్తే నిశామ్యాథ వ్యుదకం కలశం ప్రభో ।
పప్రచ్ఛుః కస్య కర్మేదం పీతం పుంసవనం జలమ్ ॥ 28

ప్రభో - ఓ మహారాజా!, ఉత్థితాః - నిద్ర లేచిన, తే - ఆ మహర్షులు, వి-ఉదకమ్ - నీరు లేని, కలశమ్ - కలశమును, నిశామ్య - చూచి, అథ - అప్పుడు, పప్రచ్ఛుః - ప్రశ్నించిరి, ఇదమ్ - ఇది, కస్య - ఎవని, కర్మ - పని?, పుంసవనమ్ - పుత్రసంతానమును కలిగించే, జలమ్ - నీరు, పీతమ్ - త్రాగబడినది.

ఓ పరీక్షిన్మహారాజా! ఆ మహర్షులు నిద్ర లేచి నీరు లేని కలశమును చూచి వెంటనే ఇట్లు ప్రశ్నించిరి -- ఇది యెవరి పని? పుత్రసంతానమును కలిగించే నీటిని త్రాగినదెవరు?

రాజ్ఞా పీతం విదిత్వాఽథ ఈశ్వరప్రహితేన తే ।
ఈశ్వరాయ నమశ్చక్రురహో దైవబలం బలమ్ ॥ 29

అథ - అప్పుడు, ఈశ్వరప్రహితేన - ఈశ్వరునిచే ప్రేరితుడైన, రాజ్ఞా - మహారాజుచే, పీతమ్ - త్రాగబడినదిగా, విదిత్వా - తెలుసుకొని, తే - ఆ మహర్షులు, ఈశ్వరాయ - ఈశ్వరుని కొరకు, నమః - నమస్కారమును, చక్రుః - చేసిరి, అహో - ఆశ్చర్యము!, దైవబలమ్ - దైవము యొక్క బలము, బలమ్ - బలము.

అప్పుడు ఈశ్వరునిచే ప్రేరితుడైన మహారాజే ఆ నీటిని త్రాగినాడని తెలిసి ఆ మహర్షులు ఆశ్చర్యపడి, ఆహా! దైవబలమే బలము, అంటూ ఈశ్వరుని కొరకు నమస్కారమును చేసిరి.

తతః కాల ఉపావృత్తే కుక్షిం నిర్భిద్య దక్షిణమ్ ।
యువనాశ్వస్య తనయశ్చక్రవర్తీ జజాన హ ॥ 30

తతః - తరువాత, కాలే - కాలము, ఉపావృత్తే - ప్రాప్తము కాగా, యువనాశ్వస్య - యువనాశ్వునియొక్క, దక్షిణమ్ - కుడివైపు, కుక్షిమ్ - ఉదరమును, నిర్భిద్య - పగులగొట్టి, చక్రవర్తీ - చక్రవర్తియగు, తనయః - పుత్రుడు, జజాన హ - పుట్టెనట.

తరువాత కాలము సంప్రాప్తమైనప్పుడు యువనాశ్వుని ఉదరమును కుడివైపు పగులగొట్టి పుత్రుడు పుట్టెను. ఆతడు చక్రవర్తి ఆయెను.

కం ధాస్యతి కుమారోఽయం స్తన్యం రోరూయతే భృశమ్ ।
మాం ధాతా వత్స మా రోదీరితీంద్రో దేశినీమదాత్ ॥ 31

అయమ్ - ఈ, కుమారః - పిల్లవాడు, స్తన్యమ్ - చనుబాలను గురించి, భృశమ్ - మిక్కిలి, రోరూయతే - అధికముగా ఏడ్చుచున్నాడు, కమ్ - దేనిని, ధాస్యతి - త్రాగగలడు?, మామ్ - నన్ను, ధాతా - త్రాగగలడు, వత్స - బాబూ!, మా రోదీః - ఏడ్వవద్దు, ఇతి - అని, ఇంద్రః - ఇంద్రుడు, దేశినీమ్ - చూపుడు వ్రేలును, అదాత్ - ఇచ్చెను.

ఈ పిల్లవాడు చనుబాల గురించి అధికముగా వెక్కి వెక్కి ఏడ్చుచున్నాడు. ఈ బాలుడు ఏమి త్రాగవలెను? (అని మహర్షులు పలికిరి). నన్ను (నా వ్రేలిని) త్రాగగలడు. బాబూ! ఏడ్వకుము, అంటూ ఇంద్రుడు తన చూపుడు వ్రేలిని ఆ బాలుని నోటియందు ఉంచెను. (ఇంద్రుడు మాం ధాతా - నన్ను త్రాగగలడు, అని చెప్పుట వలన ఆ బాలకునకు మాంధాత అనే పేరు కలిగెను).

న మమార పితా తస్య విప్రదేవప్రసాదతః ।
యువనాశ్వోఽథ తత్రైవ తపసా సిద్ధిమన్వగాత్ ॥ 32

తస్య - ఆ పిల్లవానియొక్క, పితా - తండ్రియగు, యువనాశ్వః - యువనాశ్వుడు, విప్రదేవప్రసాదతః - మహర్షుల మరియు దేవతల అనుగ్రహము వలన, న మమార - మరణించలేదు, అథ - తరువాత, తత్ర ఏవ - అచటనే, తపసా - తపస్సుచే, సిద్ధిమ్ - సిద్ధిని, అను-అగాత్ - పొందెను.

ఆ పిల్లవాని తండ్రియగు యువనాశ్వుడు దేవతల మరియు మహర్షుల అనుగ్రహము వలన మరణించలేదు. ఆయన అచటనే తపస్సును చేసి మోక్షమును పొందెను.

త్రసద్దస్యురితీంద్రోఽంగ విదధే నామ తస్య వై ।
యస్మాత్త్రసంతి హ్యుద్విగ్నా దస్యవో రావణాదయః ॥ 33

అంగ - ఓయీ!, ఇంద్రః - ఇంద్రుడు, తస్య - ఆ బాలకునకు, త్రసద్దస్యుః - త్రసద్దస్యువు. ఇతి - అని, నామ - పేరును, విదధే వై - పెట్టెను, యస్మాత్ - ఎవనివలనైతే, రావణ-ఆదయః - రావణుడు మొదలగుగా గల, దస్యవః - ప్రజోపద్రవకారులు, ఉద్విగ్నాః - ఆందోళన చెందువారై, త్రసంతి - భయపడుదురో.

ఓ రాజా! ఇంద్రుడు ఆ బాలకునకు త్రసద్దస్యువు అని పేరు పెట్టెను. ఏలయనగా, ప్రజలకు ఉపద్రవమును కలిగించే రావణుడు మొదలగువారు అతని కారణముగా ఆందోళన చెంది భయపడెదరు.

యౌవనాశ్వోఽథ మాంధాతా చక్రవర్త్యవనీం ప్రభుః ।
సప్తద్వీపవతీమేకశ్శశాసాచ్యుతతేజసా ॥ 34

అథ - తరువాత, యౌవనాశ్వః - యువనాశ్వుని పుత్రుడు, ప్రభుః - సమర్థుడు అగు, మాంధాతా చక్రవర్తీ - మాంధాత చక్రవర్తి, ఏకః - ఒక్కడే, సప్తద్వీపవతీమ్ - ఏడు ఖండములను కలిగియున్న, అవనీమ్ - భూమిని, అచ్యుతతేజసా - శ్రీహరి తేజస్సుచే, శశాస - శాసించెను.

తరువాత యువనాశ్వుని పుత్రుడగు మాంధాత చక్రవర్తి శ్రీహరి యొక్క తేజస్సుచే సమర్థుడాయెను. ఆయన ఏకచ్ఛత్రాధిపతియై ఏడు ఖండములతో కూడియున్న భూమిని శాసించెను.

ఈజే చ యజ్ఞం క్రతుభిరాత్మవిద్భూరిదక్షిణైః ।
సర్వదేవమయం దేవం సర్వాత్మకమతీంద్రియమ్ ॥ 35

ఆత్మవిత్ - ఆత్మవేత్తయగు మాంధాత, భూరిదక్షిణైః - అధికమగు దక్షిణలు గల, క్రతుభిః చ - యజ్ఞములతో కూడ, యజ్ఞమ్ - యజ్ఞరూపుడైనట్టియు, సర్వదేవమయమ్ - సర్వదేవతారూపుడైనట్టియు, సర్వాత్మకమ్ - సర్వమునకు ఆత్మయైనట్టియు, అతి-ఇంద్రియమ్ - ఇంద్రియములకు అతీతుడైన, దేవమ్ - స్వయంప్రకాశుడైన శ్రీహరిని, ఈజే - ఆరాధించెను.

మాంధాత ఆత్మజ్ఞానియే అయిననూ, యజ్ఞస్వరూపుడగు శ్రీహరిని అధికమగు దక్షిణలు గల యజ్ఞములతో ఆరాధించెను. సర్వదేవతాస్వరూపుడగు శ్రీహరి సర్వమునకు ఆత్మ. స్వయంప్రకాశస్వరూపుడగు శ్రీహరి ఇంద్రియగోచరుడు కాడు.

ద్రవ్యం మంత్రో విధిర్యజ్ఞో యజమానస్తథర్త్విజః ।
ధర్మో దేశశ్చ కాలశ్చ సర్వమేతద్యదాత్మకమ్ ॥ 36

ద్రవ్యమ్ - ద్రవ్యము, మంత్రః - మంత్రము, విధిః - విధి, యజ్ఞః - యజ్ఞము, యజమానః - యజమానుడు, తథా - అదే విధముగా, ఋత్విజః - ఋత్విక్కులు, ధర్మః - ధర్మము, దేశః చ - దేశము, కాలః చ - కాలము, ఏతత్ - ఈ, సర్వమ్ - సర్వము, యద్-ఆత్మకమ్ - ఎవ్వాని స్వరూపమో.

పురోడాశము మొదలైన ద్రవ్యము, మంత్రము, విధి, యజ్ఞము, యజమానుడు, ఋత్విక్కులు, ధర్మము, దేశకాలములు అనే ఈ సర్వము ఆ శ్రీహరి స్వరూపమే.

యావత్సూర్య ఉదేతి స్మ యావచ్చ ప్రతితిష్ఠతి ।
సర్వం తద్యౌవనాశ్వస్య మాంధాతుః క్షేత్రముచ్యతే ॥ 37

యావత్ - ఎక్కడనైతే, సూర్యః - సూర్యుడు, ఉదేతి స్మ - ఉదయించునో, యావత్ చ - ఎక్కడనైతే, ప్రతితిష్ఠతి - అస్తమించునో, తత్ - ఆ, సర్వమ్ - సర్వము, యౌవనాశ్వస్య - యువనాశ్వుని పుత్రుడగు, మాంధాతుః - మాంధాతయొక్క, క్షేత్రమ్ - క్షేత్రమని, ఉచ్యతే - చెప్పబడుచున్నది.

ఎక్కడనైతే సూర్యుడు ఉదయిస్తాడో, ఎక్కడ అస్తమిస్తాడో, ఆ రెండు స్థానముల మధ్యనున్న భూభాగమంతయు మాంధాతయొక్క సామ్రాజ్యమేనని పెద్దలు చెప్పెదరు.

శశబిందోర్దుహితరి బిందుమత్యామధాన్నృపః ।
పురుకుత్సమంబరీషం ముచుకుందం చ యోగినమ్ ।
తేషాం స్వసారః పంచాశత్సౌభరిం వవ్రిరే పతిమ్ ॥ 38

శశబిందోః - శశబిందువుయొక్క, దుహితరి - కుమార్తెయగు, బిందుమత్యామ్ - బిందుమతియందు, నృపః - మాంధాత మహారాజు, పురుకుత్సమ్ - పురుకుత్సుని, అంబరీషమ్ - అంబరీషుని, యోగినమ్ - యోగియగు, ముచుకుందం చ - ముచుకుందుని కూడ, అధాత్ - కనెను, తేషామ్ - వారియొక్క, స్వసారః - చెల్లెళ్లు, పంచాశత్ - ఏభైమంది, సౌభరిమ్ - సౌభరిని, పతిమ్ - భర్తనుగా, వవ్రిరే - వరించిరి.

మాంధాత శశబిందువు కుమార్తెయగు బిందుమతియందు పురుకుత్సుడు, అంబరీషుడు మరియు యోగి ముచుకుందుడు అనే ముగ్గురు పుత్రులను, ఏభైమంది అమ్మాయిలను కనెను. ఆ అమ్మాయిలు సౌభరిని భర్తగా వరించిరి.

యమునాంతర్జలే మగ్నస్తప్యమానః పరంతపః ।
నిర్వృతిం మీనరాజస్య వీక్ష్య మైథునధర్మిణః ॥ 39

జాతస్పృహో నృపం విప్రః కన్యామేకామయాచత ।
సోఽప్యాహ గృహ్యతాం బ్రహ్మన్ కామం కన్యా స్వయంవరే ॥ 40

యమునా-అంతః-జలే - యమునానది లోపల నీటియందు, మగ్నః - మునిగియున్నవాడు, తప్యమానః - తపస్సును చేయుచున్నవాడు, పరంతపః - శత్రువులను తపింప జేయువాడు, విప్రః - వేదవేత్తయగు సౌభరి, మైథునధర్మిణః - సంభోగధర్మమునందున్న, మీనరాజస్య - చేపల రాజుయొక్క, నిర్వృతిమ్ - సుఖమును, వీక్ష్య - చూచి, జాతస్పృహః - పుట్టిన కామన గలవాడై, నృపమ్ - రాజును, ఏకామ్ - ఒక, కన్యామ్ - కన్యను గురించి, అయాచత - కోరెను, సః అపి - ఆ మాంధాత మహారాజు కూడ, ఆహ - పలికెను, బ్రహ్మన్ - ఓ మహర్షీ!, స్వయంవరే - స్వయంవరమునందు, కామమ్ - యథేచ్ఛగా, కన్యా - కన్య, గృహ్యతామ్ - స్వీకరించబడుగాక!

సౌభరి మహర్షి యమునానది నీటియందు మునిగి తపస్సు చేయుచుండగా, సంభోగధర్మమునందున్న చేపల రాజుయొక్క సుఖానుభవము ఆయన కంటబడెను. దానిచే ఆయనయందు కామన పుట్టి, మాంధాత మహారాజును తనకు ఒక కన్యను ఇచ్చి వివాహము చేయుమని కోరెను. అపుడా మహారాజు ఇట్లు పలికెను -- ఓ మహర్షీ! స్వయంవరములో మీకు నచ్చిన కన్యను మీరు స్వీకరించుడు.

స విచింత్యాప్రియం స్త్రీణాం జరఠోఽయమసమ్మతః ।
వలీపలిత ఏజత్క ఇత్యహం ప్రత్యుదాహృతః ।। 41

జరఠః - ముసలివాడు, వలీపలితః - ముడుతలు పడిన దేహము మరియు నెరిసిన జుట్టు గలవాడు, ఏజత్-కః - వణికే తల గలవాడు, అయమ్ - ఈతడు, స్త్రీణామ్ - యువతులకు, అసమ్మతః - ప్రియమైనవాడు కాడు, ఇతి - అని, అప్రియమ్ - ప్రియము కానివానినిగా, విచింత్య - తలచి, అహమ్ - నేను, ప్రతి-ఉదాహృతః - బదులు ఈయబడినవాడను, సః - ఆ సౌభరి (తలపోసెను).

ఆ సౌభరి ఇట్లు తలపోసెను -- వీడు దేహము ముడతలు పడి జుట్టు నెరసియున్న ముసలివాడు; తల వణుకుతో ప్రీతిని కలిగించని ఈతనిని యువతలు ఇష్టపడరు; అని తలచి ఈ మహారాజు నాకు ఇట్టి బదులు (స్వయంవరమని) చెప్పినాడు.

సాధయిష్యే తథాఽఽత్మానం సురస్త్రీణామపీప్సితమ్ ।
కిం పునర్మనుజేంద్రాణామితి వ్యవసితః ప్రభుః ।। 42

సురస్త్రీణాం అపి - దేవతాస్త్రీలకు కూడ, ఈప్సితమ్ - ఇష్టమయ్యేవానినిగా, ఆత్మానమ్ - నన్ను, తథా - ఆ విధముగా, సాధయిష్యే - తయారు చేసుకొనెదను, మనుజ-ఇంద్రాణామ్ - మహారాజుల (స్త్రీలకు), కిం పునః - చెప్పునదేమున్నది?, ఇతి - అని, ప్రభుః - సర్వసమర్థుడగు సౌభరి, వ్యవసితః - నిశ్చయించుకున్నవాడు.

దేవతాస్త్రీలు కూడ నన్ను ఇష్టపడే విధముగా నన్ను నేను మార్చుకొనెదను. ఇక మహారాజుల స్త్రీలు నన్ను ఇష్టపడెదరని వేరుగా

చెప్పవలయునా? -- ఈ విధముగా సర్వసమర్థుడగు సౌభరి నిశ్చయించు కొనెను.

మునిః ప్రవేశితః క్షత్త్రా కన్యాంతఃపురమృద్ధిమత్ ।
వృతశ్చ రాజకన్యాభిరేకః పంచాశతా వరః ।। 43

మునిః - సౌభరి మహర్షి, ఋద్ధిమత్ - సమృద్ధితో కూడియున్న, కన్యా-అంతఃపురమ్ - రాజకన్యల అంతఃపురమును, క్షత్త్రా - ద్వారపాలకునిచే, ప్రవేశితః - ప్రవేశపెట్ట బడినవాడు, రాజకన్యాభిః - రాజకన్యలచే, పంచాశతా - ఏభైమందిచే, ఏకః - ఒకే ఒక, వరః - వరుడుగా, వృతః చ - వరించబడినవాడు కూడా.

సౌభరి మహర్షిని ద్వారపాలకుడు సమృద్ధితో నిండియున్న రాజకన్యల అంతఃపురములోనికి ప్రవేశపెట్టెను. ఏభైమంది రాజకన్యలు ఆయనను ఒక్కనినే భర్తగా వరించిరి.

తాసాం కలిరభూద్భూయాంస్తదర్థేఽపోహ్య సౌహృదమ్ ।
మమానురూపో నాయం వ ఇతి తద్గతచేతసామ్ ।। 44

అయమ్ - ఈతడు, మమ - నాకు, అనురూపః - తగ్గవాడు, వః - మీకు, న - కాదు, ఇతి - అంటూ, తద్-గతచేతసామ్ - ఆయనయందు లగ్నమైన మనస్సులు గల, తాసామ్ - వారలకు, తద్-అర్థే - ఆతని విషయమునందు, సౌహృదమ్ - ప్రేమను, అపోహ్య - పోనాడి, భూయాన్ - పెద్ద, కలిః - కలహము, అభూత్ - కలిగెను.

ఈతడు నాకు తగ్గవాడే గాని, నీకు కాదు -- అంటూ ఆ రాజకుమార్తెలు తమ మధ్యనుండే ప్రేమను విడిచిపెట్టి భర్త విషయమై అధికముగా కలహించుకొనిరి. వారి మనస్సు ఆయనపైన మాత్రమే లగ్నమై యుండెను.

స బహ్వృచస్తాభిరపారణీయతపశ్శ్రియానర్ఘ్యపరిచ్ఛదేషు ।
గృహేషు నానోపవనామలాంభస్సరస్సు సౌగంధికకాననేషు ।। 45

మహార్హశయ్యాసనవస్త్రభూషణస్నానానులేపాభ్యవహారమాల్యకైః,
స్వలంకృతస్త్రీపురుషేషు నిత్యదా రేమేఽనుగాయద్ద్విజభృంగవందిషు।46

బహు-ఋచః - ఋగ్వేదాధ్యాయియగు, సః - ఆ మహర్షి, తాభిః - ఆ రాజకుమార్తెలతో గూడి, అపారణీయతపః-శ్రియా - అంతు లేని తపస్సుయొక్క సమృద్ధిచే, అనర్ఘ్యపరిచ్ఛదేషు - అమూల్యమైన ఉపకరణములు కలిగినట్టియు, సు-అలంకృతస్త్రీపురుషేషు - చక్కగా అలంకరించుకున్న స్త్రీలు పురుషులు కలిగినట్టియు, అనుగాయద్-ద్విజభృంగవందిషు - గానము చేసే పక్షులు తుమ్మెదలు వందులు గల, గృహేషు - ప్రాసాదమునందు, సౌగంధికకాననేషు - చెంగల్వల గుంపులు గల, నానా-ఉపవన-అమల-అంభః-సరస్సు - పలురకములైన ఉద్యానములయందు స్వచ్ఛమైన జలములు గల సరస్సులయందు, మహా-అర్హశయ్యా-ఆసనవస్త్రభూషణస్నాన-అనులేప-అభ్యవహారమాల్యకైః - మిక్కిలి విలువైన శయ్యలు ఆసనములు వస్త్రములు భూషణములు స్నానములు అనులేపనములు భోజనములు మరియు మాలలతో, నిత్యదా - సర్వకాలములయందు, రేమే - రమించెను.

ఋగ్వేదాధ్యాయియగు ఆ సౌభరి మహర్షి అంతు లేని తన తపస్సుయొక్క సమృద్ధి కారణముగా ఆ రాజకుమార్తెలతో గూడి మిక్కిలి విలువైన ఉపకరణములతో కూడియున్న ప్రాసాదమునందు రమించెను. ఆ ప్రాసాదమునందలి స్త్రీపురుషులు చక్కగా అలంకరించుకొని యుండెడివారు. ఆయన తన భార్యలతో గూడి సర్వకాలములలో మిక్కిలి విలువైన శయ్యలను, ఆసనములను, వస్త్రములను, భూషణములను, స్నానములను, అనులేపములను, భోజనములను, మాలలను అనుభవించెను. పలువిధముల ఉద్యానములయందు చెంగల్వల గుంపులతో ప్రకాశించే స్వచ్ఛజలముల సరస్సులలో క్రీడించెను. ప్రాసాదమునందు వందిమాగధులు, ఉద్యానములయందు పక్షులు, చెంగల్వల సరస్సులయందు తుమ్మెదలు ఆయన వెనుక గానము చేసెడివి.

యద్గార్హస్థ్యం తు సంవీక్ష్య సప్తద్వీపవతీపతిః ।
విస్మితః స్తంభమజహాత్సార్వభౌమశ్రియాన్వితమ్ ।। 47

సప్తద్వీపవతీపతిః తు - ఏడు ఖండముల పృథివికి ప్రభువైన మాంధాత కూడ, సౌర్వభౌమశ్రియా - చక్రవర్తియొక్క సమృద్ధితో, అన్వితమ్ - కూడియున్న, యద్-గార్హస్థ్యమ్ - ఏ సౌభరియొక్క గృహస్థజీవితమును, సంవీక్ష్య - బాగా చూచి, విస్మితః - ఆశ్చర్యపడినవాడై, స్తంభమ్ - గర్వమును, అజహాత్ - విడిచిపెట్టెనో.

ఏడు ఖండముల పృథివికి ప్రభువగు మాంధాత కూడ చక్రవర్తియొక్క సమృద్ధితో కూడియున్న ఆ సౌభరియొక్క గృహస్థజీవితమును చూచి ఆశ్చర్యపడి (తాను సార్వభౌముడననే) గర్వమును విడిచిపెట్టెను.

ఏవం గృహేష్వభిరతో విషయాన్ వివిధైస్సుఖైః ।
సేవమానో న చాతుష్యదాజ్యస్తోకైరివానలః ॥ 48

ఏవమ్ - ఈ విధముగా, గృహేషు - ఇంటియందు, అభిరతః - ఆసక్తుడైయున్న సౌభరి, వివిధైః - పలువిధములైన, సుఖైః - భోగసాధనములైన ఇంద్రియములతో, విషయాన్ - శబ్దాది విషయభోగములను, సేవమానః - సేవించుచున్నవాడై, అజ్యస్తోకైః - నేతిచుక్కలతో, అనలః ఇవ - అగ్ని వలె, న అతుష్యత్ చ - సుతరాము సంతోషమును పొందలేదు.

ఈ విధముగా సౌభరి గృహస్థ భోగములయందు తగుల్కొని, కన్ను-ముక్కు మొదలగు భోగసాధనములగు ఇంద్రియముల ద్వారా రూపము-గంధము మొదలగు విషయభోగములననుభవించెను. నేతిచుక్కలను వేయుచున్నచో, మంట చల్లారదు. అదే విధముగా, ఇంద్రియభోగములనెంత అనుభవించిననూ, ఆయనకు సంతుష్టి కలుగలేదు.

స కదాచిదుపాసీన ఆత్మాపహ్నవమాత్మనః ।
దదర్శ బహ్వృచాచార్యో మీనసంగసముత్థితమ్ ॥ 49

బహు-ఋచ-ఆచార్యః - ఋగ్వేదాచార్యుడగు, సః - ఆ సౌభరి, కదాచిత్ - ఒకనాడు, ఉపాసీనః - కూర్చున్నవాడై, ఆత్మనః - మనస్సునకు, మీనసంగసముత్థితమ్ - చేపల కలయిక నిమిత్తముగా ఉద్భవించిన, ఆత్మాపహ్నవమ్ - తపస్సునకు హానిని, దదర్శ - తెలుసుకొనెను.

ఋగ్వేదాచార్యుడగు సౌభరి ఒకనాడు ప్రశాంతముగా కూర్చుని యుండెను. చేపల కలయికను చూచిన కారణముగా తన మనస్సునకు ఆసక్తి కలిగి తపస్సునకు హాని కలిగినదని ఆయన గ్రహించెను.

అహో ఇమం పశ్యత మే వినాశం తపస్వినస్సచ్చరితవ్రతస్య ।
అంతర్జలే వారిచరప్రసంగాత్ప్రచ్యావితం బ్రహ్మ చిరం ధృతం యత్ ॥50

అహో - అయ్యో!, తపస్వినః - తపశ్శాలి అయినట్టియు, సత్-చరితవ్రతస్య - మంచి నడవడియే నిష్ఠగా గల, మే - నాయొక్క, ఇమమ్ - ఈ, వినాశమ్ - వినాశమును, పశ్యత - చూడుడు, యత్ - ఏలయనగా, అంతః-జలే - నీటి లోపల, వారిచరప్రసంగాత్ - చేపల కలయిక నిమిత్తముగా, చిరమ్ - చిరకాలము, ధృతమ్ - ధరించబడిన, బ్రహ్మ - తపస్సు, ప్రచ్యావితమ్ - జారిపోవునట్లు చేయబడినదో.

అయ్యో! జనులారా! మంచి నడవడియే నిష్ఠగా తపస్సును చేసిన నాకు పట్టిన ఈ వినాశమును చూడుడు. నేను నీటి లోపల చేపల కలయికను చూచి, చిరకాలము పట్టుతో చేసిన తపస్సునుండి జారిపోయితిని.

సంగం త్యజేత మిథునవ్రతినాం ముముక్షుః
సర్వాత్మనా న విసృజేద్బహిరింద్రియాణి ।
ఏకశ్చరన్ రహసి చిత్తమనంత ఈశే
యుంజీత తద్వ్రతిషు సాధుషు చేత్ప్రసంగః ॥ 51

ముముక్షుః - మోక్షమును కోరువాడు, మిథునవ్రతినామ్ - దాంపత్యధర్మము గలవారల, సంగమ్ - సంగమును, సర్వ-ఆత్మనా - అన్ని విధములుగా, త్యజేత - విడిచి పెట్టవలెను, ఇంద్రియాణి - ఇంద్రియములను, బహిః - బయటకు, న విసృజేత్ - విడిచిపెట్టరాదు, ఏకః - ఒంటరియై, రహసి - ఏకాంతమునందు, చరన్ - సంచరించువాడై, చిత్తమ్ - చిత్తమును, అనంతే - అనంతుడగు, ఈశే - ఈశ్వరునియందు, యుంజీత - నిలుపవలెను, ప్రసంగః చేత్ - సంగము ఉన్నచో, తద్-వ్రతిషు - ఆ భగవానుని ఉపాసన గల, సాధుషు - సాధువులయందు.

మోక్షమును కోరే సాధకుడు దాంపత్యధర్మము గలవారల సంగమును విడిచిపెట్టవలెను. సాధకుడు ఇంద్రియములను బాహ్యమునందలి విషయములయందు ప్రవర్తిల్లనీయరాదు. సాధకుడు ఏకాంతములో ఒంటరియై మనస్సును అనంతుడగు ఈశ్వరునియందు లగ్నము చేయవలెను. సాధకుడు సంగము చేస్తే, ఆ భగవంతుని ఉపాసించే సత్పురుషులతో మాత్రమే చేయవలెను.

ఏకస్తపస్వ్యహమథాంభసి మత్స్యసంగాత్
పంచాశదాసముత పంచసహస్రసర్గః ।
నాంతం వ్రజామ్యుభయకృత్యమనోరథానాం
మాయాగుణైర్హృతమతిర్విషయేఽర్థభావః ॥ 52

ఏకః - ఒంటరివాడను, తపస్వీ - తపస్సు చేసుకొనువాడను అగు, అహమ్ - నేను, అంభసి - నీటియందు, మత్స్యసంగాత్ - చేపల కలయిక నిమిత్తముగా, అథ - తరువాత, పంచాశత్ - ఏభై, ఉత - మరియు, పంచసహస్రవర్గః - అయిదు వేల గుంపు, ఆసమ్ - అయితిని, ఉభయకృత్యమనోరథానామ్ - ఇహపరలోకముల కర్మలకు సంబంధించిన కోరికలయొక్క, అంతమ్ - అంతమును, న వ్రజామి - పొందకున్నాను, మాయాగుణైః - మాయాశక్తియొక్క మూడు గుణములచే, హృతమతిః - అపహరించబడిన వివేకబుద్ధి గలవాడను, విషయే-అర్థభావః - ఇంద్రియ భోగములయందు పురుషార్థబుద్ధి గలవాడను.

నేను ముందులో ఒంటరిగా తపస్సు చేసుకొనెడివాడను. ఇంతలో నీటియందు చేపల కలయికను చూసి, తరువాత ఏభైమంది భార్యలతో మరియు అయిదు వేలమంది పుత్రులు-పుత్రికలు-పరిచారకలు మొదలగు వారితో తాదాత్మ్యమును పొంది ఏభైగను, అయిదు వేలుగను అయితిని. మాయాశక్తియొక్క మూడు గుణములచే నా వివేకము అపహరించబడుటచే, ఇహపరముల కర్మలకు చెందిన కోరికల అంతమును నేనింకనూ చేరలేకున్నాను. ఇంద్రియభోగములే పురుషార్థమనే బుద్ధిని కలిగియున్నాను.

ఏవం వసన్ గృహే కాలం విరక్తో న్యాసమాస్థితః ।
వనం జగామానుయయుస్తత్పత్న్యః పతిదేవతాః ॥ 53

ఏవమ్ - ఈ విధముగా, కాలమ్ - చాల కాలము, గృహే - ఇంటి యందు, వసన్ - నివసించువాడై, విరక్తః - విరక్తుడై, న్యాసమ్ - త్యాగము ను, ఆస్థితః - ఆశ్రయించినవాడై, వనమ్ - అడవిని గురించి, జగామ - వెళ్లెను, పతిదేవతాః - భర్తయే దైవముగా గల, తత్-పత్న్యః - ఆయన భార్యలు, అనుయయుః - వెంట వెళ్లిరి.

ఈ విధముగా సౌభరి చాల కాలము గృహములోనుండి, తరువాత భోగములను త్యజించి అడవికి (తపస్సు కొరకై) వెళ్లెను. ఆయన భార్య లకు భర్తయే దైవము. వారు కూడ ఆయన వెంట వెళ్లిరి.

తత్ర తప్త్వా తపస్తీక్ష్ణమాత్మకర్శనమాత్మవాన్ ।
సహైవాగ్నిభిరాత్మానం యుయోజ పరమాత్మని ।। 54

ఆత్మవాన్ - వివేకియగు ఆ సౌభరి, తత్ర - ఆ అడవియందు, తీక్ష్ణమ్ - తీక్ష్ణమైనట్టియు, ఆత్మకర్శనమ్ - దేహమును కృశింపజేసే, తపః - తపస్సును, తప్త్వా - చేసి, అగ్నిభిః సహ - అగ్నులతో కూడ, ఆత్మానమ్ - తనను, పరమాత్మని - పరమాత్మయందు, యుయోజ - విలీనము చేసెను.

వివేకియగు ఆ సౌభరి ఆ అడవియందు కఠోరమైన తపస్సును చేయగా, ఆయన దేహము చిక్కిపోయెను. ఆయన అగ్నులను తన యందు ఆరోపించుకొని జీవభావమును పరమాత్మయందు విలీనము చేసెను (మోక్షమును పొందెను).

తాస్స్వపత్యుర్మహారాజ నిరీక్ష్యాధ్యాత్మికీం గతిమ్ ।
అన్వీయుస్తత్ప్రభావేణ అగ్నిం శాంతమివార్చిషః ।। 55

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే నవమస్కంధే షష్ఠోఽధ్యాయః ।।

మహారాజ - ఓ మహారాజా!, తాః - ఆ భార్యలు, స్వపత్యుః - తమ భర్తయొక్క, ఆధ్యాత్మికీమ్ - పరమాత్మయందు లయమగుట అనే, గతిమ్ - మహాఫలమును, నిరీక్ష్య - చూచి, తత్-ప్రభావేణ - ఆయన

యొక్క మహిమచే, శాంతమ్ - చల్లారిన, అగ్నిమ్ - అగ్నిని, అర్చిషః ఇవ - జ్వాలలు వలె, అను-ఈయుః - అనుసరించిరి.

ఓ పరీక్షిన్మహారాజా! తమ భర్తయగు సౌభరి పరమాత్మయందు లయమై మోక్షమును పొందుటను ఆయన భార్యలు చూచిరి. ఆయన మహిమచే, చల్లారిన అగ్నియందు జ్వాలలు విలీనమయ్యే తీరున, వారు కూడ ఆయనను అనుసరించిరి (మోక్షమును పొందిరి).

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
మాంధాత చరితమును, సౌభరి చరితమును వర్ణించే
ఆరవ అధ్యాయము ముగిసినది (6).

* * * * *

# అథ సప్తమోऽధ్యాయః

## త్రిశంకు చరితము - హరిశ్చంద్రుని వృత్తాంతము

శ్రీశుక ఉవాచ।
మాంధాతుః పుత్రప్రవరో యోऽంబరీషః ప్రకీర్తితః ।
పితామహేన ప్రవృతో యౌవనాశ్వశ్చ తత్సుతః ।
హారీతస్తస్య పుత్రోऽభూన్మాంధాతృప్రవరా ఇమే ॥ 1

మాంధాతుః - మాంధాతయొక్క, పుత్రప్రవరః - పుత్రులలో శ్రేష్ఠుడగు, యః - ఏ, అంబరీషః - అంబరీషుడు, ప్రకీర్తితః - కీర్తించ బడి నాడో ఆతడు, పితామహేన - తాతయగు యువనాశ్వునిచే, ప్రవృతః - పుత్రునిగా స్వీకరించబడినవాడు, తత్-సుతః - ఆ అంబరీషుని పుత్రుడు, యౌవనాశ్వః - యౌవనాశ్వుడు, తస్య - ఆ యౌవనాశ్వునకు, హారీతః - హారీతుడనే, పుత్రః - పుత్రుడు, అభూత్ - కలిగెను, ఇమే - వీరు, మాంధాతృప్రవరాః - మాంధాతయొక్క వంశమునకు గోత్రమును ప్రవర్తిల్ల జేసిన వారు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- మాంధాతయొక్క పుత్రులలో అంబరీషుడు సర్వోత్తముడని నేను వర్ణించి యున్నాను. అంబరీషుని తాత గారైన యువనాశ్వుడు ఆయనను పుత్రునిగా స్వీకరించెను. అంబరీషుని పుత్రుడు యౌవనాశ్వుడు. యౌవనాశ్వుని పుత్రుడు హారీతుడు. వీరు మాంధాతయొక్క వంశమునకు గోత్రప్రవర్తకులైనారు.

నర్మదా భ్రాతృభిర్దత్తా పురుకుత్సాయ యోరగైః ।
తయా రసాతలం నీతో భుజగేంద్రప్రయుక్తయా ॥ 2

యా - ఏ, నర్మదా - నర్మద, భ్రాతృభిః - సోదరులైన, ఉరగైః - నాగులచే, పురుకుత్సాయ - పురుకుత్సుని కొరకు, దత్తా - ఈయబడినదో,

భుజగ-ఇంద్రప్రయుక్తయా - నాగరాజుచే ఆజ్ఞాపించబడిన, తయా - ఆమెచే, రసాతలమ్ - రసాతలమును గురించి, నీతః - కొనిపోబడినవాడు.

నాగులు తమ సోదరియగు నర్మదను పురుకుత్సునకిచ్చి వివాహ మును చేసిరి. నాగరాజగు వాసుకి ఆజ్ఞచే ఆమె తన భర్తను రసాతలము నకు తీసుకొని వెళ్లెను.

గంధర్వానవధీత్తత్ర వధ్యాన్ వై విష్ణుశక్తిధృక్ ।
నాగాల్లబ్ధవరస్సర్పాదభయం స్మరతామిదమ్ ॥ 3

విష్ణుశక్తిధృక్ - విష్ణువుయొక్క శక్తిని ధరించిన ఆ పురుకుత్సుడు, తత్ర - అచట, వధ్యాన్ వై - నిశ్చయముగా వధకు అర్హులైన, గంధర్వాన్ - గంధర్వులను, అవధీత్ - వధించెను, నాగాత్ - నాగరాజగు వాసుకినుండి, లబ్ధవరః - పొందబడిన వరము గలవాడు, ఇదమ్ - దీనిని, స్మరతామ్ - స్మరించువారలకు, సర్పాత్ - పామునుండి, అభయమ్ - అభయము.

ఆ పురుకుత్సుడు ఆ రసాతలములో విష్ణువుయొక్క శక్తిని ధరించి నిశ్చయముగా వధకు అర్హులైన గంధర్వులను వధించెను. ఈ వృత్తాంత మును స్మరించువారలకు సర్పభయము ఉండదు అని, నాగరాజగు వాసుకి ఆయనకు వరమునిచ్చెను.

త్రసద్దస్యుః పౌరుకుత్సో యోఽనరణ్యస్య దేహకృత్ ।
హర్యశ్వస్తత్సుతస్తస్మాదరుణోఽథ త్రిబంధనః ॥ 4

త్రసద్దస్యుః - త్రసద్దస్యువు, పౌరుకుత్సః - పురుకుత్సుని పుత్రు డు, యః - ఎవడైతే, అనరణ్యస్య - అనరణ్యునకు, దేహకృత్ - దేహముని చ్చినవాడో, తత్-సుతః - ఆయన పుత్రుడు, హర్యశ్వః - హర్యశ్వుడు, తస్మాత్ - ఆతనినుండి, అరుణః - అరుణుడు, అథ - ఆతనినుండి, త్రిబం ధనః - త్రిబంధనుడు.

పురుకుత్సువు పుత్రుడు త్రసద్దస్యువు. త్రసద్దస్యుని పుత్రుడు అన రణ్యుడు. అనరణ్యుని పుత్రుడు హర్యశ్వుడు. హర్యశ్వుని పుత్రుడు అరుణు డు. అరుణుని పుత్రుడు త్రిబంధనుడు.

తస్య సత్యవ్రతః పుత్రస్త్రిశంకురితి విశ్రుతః ।
ప్రాప్తశ్చండాలతాం శాపాద్గురోః కౌశికతేజసా ॥ 5

సశరీరో గతస్స్వర్గమద్యాపి దివి దృశ్యతే ।
పాతితోఽవాక్శిరా దేవైస్తేనైవ స్తంభితో బలాత్ ॥ 6

తస్య - ఆ త్రిబంధనుని, పుత్రః - పుత్రుడు, సత్యవ్రతః - సత్యవ్రతుడు, త్రిశంకుః - త్రిశంకుడు, ఇతి - అని, విశ్రుతః - ప్రసిద్ధి చెందినవాడు, గురోః - గురువగు వసిష్ఠునియొక్క, శాపాత్ - శాపము వలన, చండాలతామ్ - చండాలత్వమును, ప్రాప్తః - పొందినవాడు, కౌశికతేజసా - విశ్వామిత్రుని తపశ్శక్తిచే, సశరీరః - శరీరముతో కూడినవాడై, స్వర్గమ్ - స్వర్గమును గురించి, గతః - వెళ్లినవాడు, అద్య అపి - ఇప్పుడు కూడ, దివి - స్వర్గమునందు, దృశ్యతే - కనబడుచున్నాడు, దేవైః - దేవతలచే, అవాక్-శిరాః - తల క్రిందుగా, పాతితః - పడవేయబడినవాడు, తేన ఏవ - ఆ విశ్వామిత్రుని చేతనే, బలాత్ - తపోబలము వలన, స్తంభితః - నిలబెట్టబడినవాడు.

ఆ త్రిబంధనుని పుత్రుడు సత్యవ్రతుడు. ఆయన త్రిశంకుడు అనే పేరుతో ప్రసిద్ధిని గాంచినాడు. గురువగు వసిష్ఠుని శాపము వలన ఆయన కసాయి యైనాడు. కాని, ఆయన విశ్వామిత్ర మహర్షియొక్క తపోబలముచే బొందితోనే స్వర్గమును చేరినాడు. అప్పుడు దేవతలు ఆయనను తల క్రిందుగా త్రోసివేయగా, విశ్వామిత్రుడు తపోబలముచే ఆయనను రోదసియందు నిలబెట్టినాడు. ఇప్పటికీ ఆయన అచట అట్లే కనబడును.

త్రైశంకవో హరిశ్చంద్రో విశ్వామిత్రవసిష్ఠయోః ।
యన్నిమిత్తమభూద్యుద్ధం పక్షిణోర్బహువార్షికమ్ ॥ 7

త్రైశంకవః - త్రిశంకుని పుత్రుడు, హరిశ్చంద్రః - హరిశ్చంద్రుడు, యత్-నిమిత్తమ్ - ఎవని కారణముగా, పక్షిణోః - పక్షిరూపమును పొందిన, విశ్వామిత్రవసిష్ఠయోః - విశ్వామిత్ర వసిష్ఠులకు, బహువార్షికమ్ - చాల సంవత్సరముల కాలము కొనసాగిన, యుద్ధమ్ - యుద్ధము, అభూత్ - జరిగెనో.

త్రిశంకుని పుత్రుడు హరిశ్చంద్రుడు. ఆయన కారణముగనే విశ్వామిత్ర వసిష్ఠులు (పరస్పర శాపములచే) పక్షుల రూపమును పొంది చాల సంవత్సరములు యుద్ధమును చేసిరి.

సోఽనపత్యో విషణ్ణాత్మా నారదస్యోపదేశతః ।
వరుణం శరణం యాతః పుత్రో మే జాయతాం ప్రభో ॥ 8

అనపత్యః - సంతానము లేని, సః - ఆ హరిశ్చంద్రుడు, విషణ్ణ-ఆత్మా - ఖేదమును పొందిన మనస్సు గలవాడై, నారదస్య - నారద మహర్షియొక్క, ఉపదేశతః - ఉపదేశమును బట్టి, వరుణమ్ - వరుణుని, శరణం యాతః - శరణు పొందినవాడు, ప్రభో - ఓ ప్రభూ!, మే - నాకు, పుత్రః - పుత్రుడు, జాయతామ్ - పుట్టుగాక!

హరిశ్చంద్రునకు సంతానము కలుగలేదు. అపుడాయన నారదుని ఉపదేశమును బట్టి వరుణుని -- ఓ ప్రభూ! నాకు పుత్రుడు కలుగునట్లు చేయుము -- అని శరణు వేడెను.

యది వీరో మహారాజ తేనైవ త్వాం యజే ఇతి ।
తథేతి వరుణేనాస్య పుత్రో జాతస్తు రోహితః ॥ 9

మహారాజ - ఓ మహారాజా!, వీరః యది - పుత్రుడు జన్మించినచో, తేన ఏవ - ఆ వీరునితోనే, త్వామ్ - నిన్ను, యజే - ఆరాధించెదను, ఇతి - అని, తథా - అటులనే, ఇతి - అని, వరుణేన - వరుణుని ద్వారా, అస్య - ఈయనకు, రోహితః - రోహితుడనే, పుత్రః తు - పుత్రుడైతే, జాతః - పుట్టినవాడు.

ఓ పరీక్షిన్మహారాజా! నాకు పుత్రుడు జన్మించినచో, నేను వానిని నీకు సమర్పించి, ఆ విధముగా నిన్ను ఆరాధించగలను, అని హరిశ్చంద్రుడు చెప్పెను. తథాస్తు, అని వరుణుడు అనుగ్రహించగా, ఆయనకు రోహితుడనే పుత్రుడు పుట్టెను.

జాతస్సుతో హ్యనేనాంగ మాం యజస్వేతి సోఽబ్రవీత్ ।
యదా పశుర్నిర్దశస్స్యాదథ మేధ్యో భవేదితి ॥ 10

అంగ - ఓయీ!, సుతః - పుత్రుడు, జాతః హి - పుట్టినాడు గదా!, అనేన - వీనితో, మామ్ - నన్ను, యజస్వ - ఆరాధించుము, ఇతి - అని, సః - ఆ వరుణుడు, అబ్రవీత్ - పలికెను, యదా - ఎప్పుడైతే, పశుః - పశువుగా నిర్దేశించబడిన పుత్రుడు, నిర్దశః - పదిరోజుల వయస్సు దాటినవాడు ఏనో, అథ - అప్పుడు, మేధ్యః - పవిత్రుడు, భవేత్ - అగును, ఇతి - అని.

ఓయీ! పుత్రుడు పుట్టినాడు గదా! వీనితో నన్ను ఆరాధించుము -- అని వరుణుడు హరిశ్చంద్రునితో పలికెను. పశువుగా నిర్దేశించబడిన ఈ బాలకునకు పది రోజుల వయస్సు దాటిన తరువాత యజ్ఞమునకు యోగ్యుడు అగును, అని హరిశ్చంద్రుడు చెప్పెను.

నిర్దశే చ స ఆగత్య యజస్వేత్యాహ సోఽబ్రవీత్ ।
దంతాః పశోర్యజ్జాయేరన్నథ మేధ్యో భవేదితి ।। 11

నిర్దశే చ - పది రోజులు కాగానే, సః - ఆ వరుణుడు, ఆగత్య - వచ్చి, యజస్వ - ఆరాధించుము, ఇతి - అని, ఆహ - పలికెను, సః - ఆ హరిశ్చంద్రుడు, అబ్రవీత్ - పలికెను, యత్ - ఎప్పుడైతే, పశోః - పశువునకు, దంతాః - పళ్లు, జాయేరన్ - వచ్చునో, అథ - అప్పుడు, మేధ్యః - పవిత్రుడు, భవేత్ - అగును, ఇతి - అని.

పిల్లవానికి పది రోజులు దాటగానే వరుణుడు వచ్చి, ఇప్పుడు యజ్ఞమును చేయుమని హరిశ్చంద్రునితో చెప్పెను. అప్పుడు ఆయన ఇట్లు బదులిడెను -- పిల్లవానికి దంతములు వచ్చిన తరువాతనే యజ్ఞమునకు యోగ్యుడు అగును.

జాతా దంతా యజస్వేతి స ప్రత్యాహాథ సోఽబ్రవీత్ ।
యదా పతంత్యస్య దంతా అథ మేధ్యో భవేదితి ।। 12

దంతాః - పళ్లు, జాతాః - వచ్చినవి, యజస్వ - యజ్ఞమును చేయుము, ఇతి - అని, సః - ఆ వరుణుడు, ప్రతి-ఆహ - రాజునుద్దేశించి పలికెను, సః - ఆ రాజు, అబ్రవీత్ - పలికెను, యదా - ఎప్పుడైతే, అస్య

- వీని, దంతాః - పళ్లు, పతంతి - పడిపోవునో, అథ - అప్పుడు, మేధ్యః - పవిత్రుడు, భవేత్ - అగును, ఇతి - అని.

పిల్లవానికి పళ్లు వచ్చినవి, ఇప్పుడు యజ్ఞమును చేయుము, అని వరుణుడు రాజునుద్దేశించి పలికెను. పాల పళ్లు ఊడిపోయిన తరువాతనే ఈ బాలకుడు యజ్ఞమునకు అర్హుడగునని ఆ రాజు చెప్పెను.

పశోర్నిపతితా దంతా యజస్వేత్యాహ సోఽబ్రవీత్ ।
యదా పశోః పునర్దంతా జాయంతేఽథ పశుశ్శుచిః ।। 13

పశోః - పశువుగా నిర్దేశించబడిన బాలకునియొక్క, దంతాః - పళ్లు, నిపతితాః - ఊడినవి, యజస్వ - యజ్ఞమును చేయుము, ఇతి - అని, సః - ఆ వరుణుడు, అబ్రవీత్ - పలికెను, యదా - ఎప్పుడైతే, పశోః - పశువుగా నిర్దేశించబడిన బాలకునకు, పునః - మరల, దంతాః - పళ్లు, జాయంతే - వచ్చునో, అథ - అప్పుడు, పశుః - పశువు, శుచిః - పవిత్రము.

పశువుగా నిర్దేశించబడిన ఈ బాలకునకు పాలపళ్లు ఊడినవి గావున, ఇప్పుడు యజ్ఞమును చేయుమని వరుణుడు (కొంత కాలము తరువాత) రాజుతో పలికెను. ఈ బాలకునకు మరల కొత్త పళ్లు వచ్చినప్పుడు మాత్రమే ఈతడు యజ్ఞమునకు యోగ్యుడగునని రాజు పలికెను.

పునర్జాతా యజస్వేతి స ప్రత్యాహాథ సోఽబ్రవీత్ ।
సాన్నాహికో యదా రాజన్ రాజన్యోఽథ పశుశ్శుచిః ।। 14

పునః - మరల, జాతాః - పుట్టినవి, యజస్వ - యజ్ఞమును చేయుము, ఇతి - అని, సః - ఆ వరుణుడు, ప్రత్యాహ - రాజును ఉద్దేశించి పలికెను, సః - ఆ రాజు, అబ్రవీత్ - పలికెను, రాజన్ - ఓ దిక్పాలకా!, రాజన్యః - రాజకుమారుడు, యదా - ఎప్పుడైతే, సాన్నాహికః - కవచమును దాల్చువాడు అగునో, అథ - అప్పుడు, శుచిః - పవిత్రుడగు, పశుః - పశువు.

దంతములు తిరిగి వచ్చినవి గనుక, ఇప్పుడు యజ్ఞమును చేయుము -- అని వరుణుడు రాజునుద్దేశించి పలికెను. అపుడా హరిశ్చంద్ర మహారాజు ఇట్లు పలికెను -- ఓ వరుణ దిక్పాలకా! ఈ బాలకుడు రాజకుమారుడు. కావున, కవచమును ధరించినప్పుడు మాత్రమే యజ్ఞపశువుయొక్క యోగ్యతను పొందును.

ఇతి పుత్రానురాగేణ స్నేహయంత్రితచేతసా ।
కాలం వంచయతా తం తముక్తో దేవస్తమైక్షత ।। 15

పుత్ర-అనురాగేణ - పుత్రునియందలి అనురాగముచే, స్నేహయంత్రితచేతసా - ఆసక్తిచే నియంత్రించబడే మనస్సు కలిగినట్టియు, తం తమ్ - ఆయా, కాలమ్ - కాలమును, వంచయతా - తప్పించుకొనుచున్న రాజుచే, ఇతి - ఈ విధముగా, ఉక్తః - పలుకబడిన, దేవః - వరుణదేవుడు, తమ్ - ఆ కాలమును, ఐక్షత - ఎదురు చూచెను.

పుత్రునియందలి అనురాగము ఆసక్తిగా మారి హరిశ్చంద్ర మహారాజుయొక్క మనస్సును వశము చేసుకొనెను. కావుననే, ఆయన ఆయా కాలములు (పది రోజులు ఇత్యాది) వచ్చినప్పుడు వాటిని తప్పించుకొనుచుండెను. ఈ విధముగా రాజు పలుకగా, వరుణ దేవుడు యజ్ఞకాలమును గురించి ఎదురు చూచెను.

రోహితస్తదభిజ్ఞాయ పితుః కర్మ చికీర్షితమ్ ।
ప్రాణప్రేప్సుర్ధనుష్పాణిరరణ్యం ప్రత్యపద్యత ।। 16

రోహితః - రోహితుడు, పితుః - తండ్రికి, చికీర్షితమ్ - చేయగోరబడిన, తత్ - ఆ, కర్మ - యజ్ఞకర్మను గురించి, అభిజ్ఞాయ - తెలుసుకొని, ప్రాణప్రేప్సుః - ప్రాణములను పొందగోరువాడై, ధనుష్-పాణిః - ధనుస్సు చేతియందు గలవాడై, అరణ్యమ్ - అడవిని గురించి, ప్రత్యపద్యత - చేరుకొనెను.

తండ్రి చేయగోరే ఆ యజ్ఞమును గురించి రోహితుడు తెలుసుకొనెను. ఆతడు తన ప్రాణములను రక్షించుకొనగోరి, ధనుస్సును చేతబట్టి అడవికి వెళ్లెను.

పితరం వరుణగ్రస్తం శ్రుత్వా జాతమహోదరమ్ ।
రోహితో గ్రామమేయాయ తమింద్రః ప్రత్యషేధత ॥ 17

వరుణగ్రస్తమ్ - వరుణునిచే పీడించబడినట్టియు, జాతమహా-ఉదరమ్ - కలిగిన పెద్ద పొట్ట కలిగిన, పితరమ్ - తండ్రిని గురించి, శ్రుత్వా - విని, రోహితః - రోహితుడు, గ్రామమ్ - గ్రామమును గురించి, ఏయాయ - బయలు దేరెను, ఇంద్రః - ఇంద్రుడు, తమ్ - వానిని, ప్రత్యషేధత - వారించెను.

హరిశ్చంద్ర మహారాజును వరుణుడు పీడించెను. ఆయనకు నీరు పట్టి పొట్ట పెద్దది అయెను. ఈ విషయమును విని రోహితుడు గ్రామమునకు తిరిగి వచ్చుటకు సంసిద్ధుడగుచుండగా, ఇంద్రుడాతనిని వారించెను.

భూమేః పర్యటనం పుణ్యం తీర్థక్షేత్రనిషేవణైః ।
రోహితాయాదిశచ్ఛక్రసోఽప్యరణ్యేఽవసత్సమామ్ ॥ 18

తీర్థక్షేత్రనిషేవణైః - తీర్థములను క్షేత్రములను సేవించుటలచే, పుణ్యమ్ - పుణ్యమునిచ్చే, భూమేః - భూమియొక్క, పరి-అటనమ్ - సంచారమును, శక్రః - ఇంద్రుడు, రోహితాయ - రోహితుని కొరకు, ఆదిశత్ - ఆదేశించెను, సః అపి - ఆ రోహితుడు కూడ, సమామ్ - ఒక సంవత్సరమును, అరణ్యే - అడవియందు, అవసత్ - నివసించెను.

తీర్థములను, క్షేత్రములను సేవిస్తూ భూమిని పర్యటించుట పుణ్యప్రదమగునని ఇంద్రుడు రోహితుని ఆదేశించెను. ఆ రోహితుడు ఒక సంవత్సరకాలము అడవిలోనే ఉండిపోయెను.

ఏవం ద్వితీయే తృతీయే చతుర్థే పంచమే తథా ।
అభ్యేత్యాభ్యేత్య స్థవిరో విప్రో భూత్వాఽఽహ వృత్రహా ॥ 19

ఏవమ్ - ఈ విధముగా, ద్వితీయే - రెండవ, తృతీయే - మూడవ, చతుర్థే - నాల్గవ, తథా - అదే విధముగా, పంచమే - అయిదవ సంవత్సరమునందు, వృత్రహా - ఇంద్రుడు, స్థవిరః - ముసలి, విప్రః - బ్రాహ్మ

ఋడుగా, భూత్వా - అయి, అభ్యేత్య అభ్యేత్య - మరల మరల వచ్చి, ఆహ - చెప్పెను.

ఇదే విధముగా రెండవ, మూడవ, నాల్గవ, ఐదవ సంవత్సరముల పిదప కూడ వృత్రశత్రువగు ఇంద్రుడు ముసలి బ్రాహ్మణుని రూపములో మరల మరల వచ్చి రోహితుని అటులనే ఆదేశించెను.

షష్ఠం సంవత్సరం తత్ర చరిత్వా రోహితః పురీమ్ ।
ఉపవ్రజన్నజీగర్తాదక్రీణాన్మధ్యమం సుతమ్ ।। 20

రోహితః - రోహితుడు, షష్ఠమ్ - ఆరవ, సంవత్సరమ్ - సంవత్సరమును, తత్ర - ఆ అడవియందు, చరిత్వా - గడిపి, పురీమ్ - నగరమును గురించి, ఉపవ్రజన్ - తిరిగి వచ్చుచున్నవాడై, అజీగర్తాత్ - అజీగర్తునినుండి, మధ్యమమ్ - మధ్యముడగు, సుతమ్ - పుత్రుని, అక్రీణాత్ - కొనుగోలు చేసెను.

రోహితుడు ఆరవ సంవత్సరమును కూడ ఆ అడవిలో గడిపి, తరువాత నగరమునకు తిరిగివచ్చుచుండెను. అపుడాతడు అజీగర్తుని నుండి ఆయన మధ్యమపుత్రుని కొనుగోలు చేసెను.

శునశ్శేపం పశుం పిత్రే ప్రదాయ సమవందత ।
తతః పురుషమేధేన హరిశ్చంద్రో మహాయశాః ।। 21

ముక్తోదరోఽయజద్దేవాన్ వరుణాదీన్మహత్కథః ।
విశ్వామిత్రోఽభవత్తస్మిన్ హోతా చాధ్వర్యురాత్మవాన్ ।। 22

జమదగ్నిరభూద్బ్రహ్మా వసిష్ఠోఽయాస్యసామగః ।
తస్మై తుష్టో దదావింద్రశ్శాతకౌంభమయం రథమ్ ।। 23

శునశ్శేపమ్ - శునశ్శేపుని, పశుమ్ - యజ్ఞపశువునుగా, పిత్రే - తండ్రి కొరకు, ప్రదాయ - సమర్పించి, సమవందత - నమస్కరించెను, మహాయశాః - గొప్ప కీర్తి గల, హరిశ్చంద్రః - హరిశ్చంద్రుడు, తతః - అప్పుడు, పురుషమేధేన - పురుషమేధమనే యజ్ఞముతో, వరుణ-ఆదీన్ - వరుణుడు మొదలుగా గల, దేవాన్ - దేవతలను, అయజత్ - ఆరాధించె

ను, ముక్త-ఉదరః - విడిచిపెట్టబడిన జలోదర వ్యాధి గలవాడు, మహత్-కథః - గొప్ప చరితము గలవాడు, తస్మిన్ - ఆ యజ్ఞమునందు, విశ్వామిత్రః - విశ్వామిత్రుడు, హోతా - హోత, అభవత్ - ఆయెను, ఆత్మవాన్ - మనోనిగ్రహము గల, జమదగ్నిః - జమదగ్ని, అధ్వర్యుః - అధ్వర్యుడు, వసిష్ఠః - వసిష్ఠుడు, బ్రహ్మ - బ్రహ్మ, అయాస్య (ః)- అయాస్యుడు, సామగః - సామగానము చేసే ఉద్గాత, తుష్టః - సంతోషించిన, ఇంద్రః - ఇంద్రుడు, తస్మై - ఆ హరిశ్చంద్రుని కొరకు, శాతకౌంభమయమ్ - బంగారముతో చేసిన, రథమ్ - రథమును, దదౌ - ఇచ్చెను.

రోహితుడు శునశ్శేపుని యజ్ఞపశువునుగా తండ్రికి సమర్పించి నమస్కరించెను. ఆపుడా హరిశ్చంద్ర మహారాజు పురుషమేధమనే యజ్ఞమును చేసి వరుణుడు, అగ్ని మొదలగు దేవతలనారాధించి, జలోదర వ్యాధినుండి విముక్తుడాయెను. ఈ విధముగా హరిశ్చంద్రుని కీర్తి, వృత్తాంతము చాల గొప్పవి. ఆ యజ్ఞమునందు విశ్వామిత్రుడు హోత కాగా, మనోనిగ్రహములో దిట్టయగు జమదగ్ని అధ్వర్యుడు, వసిష్ఠుడు బ్రహ్మ, అయాస్యుడు సామమును గానము చేసే ఉద్గాత అయిరి. ఇంద్రుడు సంతోషించి హరిశ్చంద్రునకు బంగరు రథమునిచ్చెను.

శునశ్శేపస్య మాహాత్మ్యముపరిష్టాత్ప్రచక్ష్యతే ।
సత్యసారాం ధృతిం దృష్ట్వా సభార్యస్య చ భూపతేః ।। 24

విశ్వామిత్రో భృశం ప్రీతో దదావవిహతాం గతిమ్ ।

శునశ్శేపస్య - శునశ్శేపునియొక్క, మాహాత్మ్యమ్ - మహిమ, ఉపరిష్టాత్ - తరువాత, ప్రచక్ష్యతే - చెప్పబడగలదు, సభార్యస్య - భార్యతో కూడియున్న, భూపతేః - హరిశ్చంద్ర మహారాజుయొక్క, సత్యసారామ్ - సత్యమే సారముగా గల, ధృతిమ్ - ధైర్యమును, దృష్ట్వా - చూచి, విశ్వామిత్రః - విశ్వామిత్రుడు, భృశమ్ - మిక్కిలి, ప్రీతః - ప్రీతిని పొందినవాడై, అవిహతామ్ - మొక్కవోని, గతిమ్ - జ్ఞానమును, దదౌ - ఇచ్చెను.

శునశ్శేపుని మాహాత్మ్యమును తరువాత చెప్పగలను. హరిశ్చంద్రుడు మరియు ఆయన భార్య కూడ సత్యమునే ధైర్యముతో పాలించిరి. అదియే వారి బలము. ఈ విషయమును చూచిన విశ్వామిత్ర మహర్షి మిక్కిలి ప్రీతిని పొంది, ఆయనకు ఆత్మజ్ఞానమునిచ్చెను. ఆత్మజ్ఞానము మోక్షఫలమును ఇచ్చును.

మనః పృథివ్యాం తామద్భిస్తేజసాపోఽనిలేన తత్ ॥ 25

ఖే వాయుం ధారయంస్తచ్చ భూతాదౌ తం మహాత్మని ।
తస్మిన్ జ్ఞానకలాం ధ్యాత్వా తయాఽజ్ఞానం వినిర్దహన్ ॥ 26

మనః - మనస్సును, పృథివ్యామ్ - పృథివీతత్త్వమునందు, తామ్ - ఆ పృథివిని, అద్భిః - జలములతో, ఆపః - జలములను, తేజసా - అగ్నితో, తత్ - ఆ అగ్నిని, అనిలేన - వాయువుతో, వాయుమ్ - వాయువును, ఖే - ఆకాశమునందు, తత్ చ - ఆ ఆకాశమును కూడ, భూత-ఆదౌ - పంచభూతములకు కారణమగు అహంకారమునందు, తమ్ - ఆ అహంకారమును, మహాత్మని - మహత్తత్త్వమునందు, ధారయన్ - ఏకము చేసి, తస్మిన్ - ఆ మహత్తత్త్వమునందు, జ్ఞానకలామ్ - జ్ఞానము యొక్క అంశను, ధ్యాత్వా - ధ్యానము చేసి, తయా - ఆ జ్ఞానముచే, అజ్ఞానమ్ - అజ్ఞానమును, వినిర్దహన్ - నిశ్శేషముగా దహించువాడు.

ఆ హరిశ్చంద్ర మహారాజు మనస్సును పృథివీతత్త్వమునందు, పృథివిని జలములయందు, జలతత్త్వమును అగ్నియందు, అగ్నిని వాయువునందు, వాయువును ఆకాశమునందు, ఆకాశమును పంచభూతములకు కారణమగు సమష్టి-అహంకారమునందు, ఆ అహంకారమును మహత్తత్త్వము (సమష్టి బుద్ధిశక్తి) నందు విలీనము చేసెను. ఆయన ఆ మహత్తత్త్వమునందు ఆత్మజ్ఞానమును ధ్యానించి, దానిచే అజ్ఞానమును నిశ్శేషముగా దహించెను.

హిత్వా తాం స్వేన భావేన నిర్వాణసుఖసంవిదా ।
అనిర్దేశ్యాప్రతర్క్యేణ తస్థౌ విధ్వస్తబంధనః ॥ 27

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే నవమస్కంధే సప్తమోఽధ్యాయః ॥

నిర్వాణసుఖసంవిదా - దుఃఖలేశము లేని ఆనందఘనమగు జ్ఞానముచే, తామ్ - ఆ జ్ఞానవృత్తిని, హిత్వా - విడిచిపెట్టి, విధ్వస్తబంధనః - నశింప జేయబడిన అజ్ఞానముయొక్క బంధము గలవాడై, అనిర్దేశ్య-అప్రతర్క్యేణ - మాటలతో చెప్పుటకు మనస్సుతో ఊహించుటకు శక్యము కాని, స్వేన - తన స్వరూపమైన, భావేన - అఖండసద్రూపముగా, తస్థౌ - నిలిచియుండెను.

ఆ ఆత్మజ్ఞానము దుఃఖలేశము లేని ఆనందఘనము. దానియందు జ్ఞానవృత్తిరూపము కూడ విలీనమగును. దానిని ఆత్మరూపముగా తెలుసుకున్న హరిశ్చంద్రునకు అజ్ఞానబంధము నశించెను. మాటలచే వర్ణించ శక్యము కానిది, మనస్సుతో ఊహించ శక్యము కానిది అగు ఆ అఖండసద్రూపమునందు ఆయన విలీనుడై పరబ్రహ్మరూపుడాయెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
త్రిశంకు చరితమును, హరిశ్చంద్రుని వృత్తాంతమును
వర్ణించే ఏడవ అధ్యాయము ముగిసినది (7).

* * * * *

# అథ అష్టమోఽధ్యాయః

## సగరుని చరితము

శ్రీశుక ఉవాచ।
హరితో రోహితసుతశ్చంపస్తస్మాద్వినిర్మితా ।
చంపాపురీ సుదేవోఽతో విజయో యస్య చాత్మజః ।। 1

హరితః - హరితుడు, రోహితసుతః - రోహితుని పుత్రుడు, తస్మాత్ - వాని వలన, చంపః - చంపుడు, చంపాపురీ - చంపాపురి, వినిర్మితా - నిర్మించ బడినది, అతః - వీనినుండి, సుదేవః - సుదేవుడు, యస్య చ - ఎవనికైతే, విజయః - విజయుడు, ఆత్మజః - పుత్రుడో.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- రోహితుని పుత్రుడు హరితుడు. హరితుని పుత్రుడు చంపుడు. ఆయన చంపాపురిని నిర్మించెను. చంపుని పుత్రుడు సుదేవుడు. సుదేవుని పుత్రుడు విజయుడు.

భరుకస్తత్సుతస్తస్మాద్వృకస్తస్యాపి బాహుకః ।
సోఽరిభిర్హృతభూ రాజా సభార్యో వనమావిశత్ ।। 2

తత్-సుతః - ఆయన పుత్రుడు, భరుకః - భరుకుడు, తస్మాత్ - ఆయన వలన, వృకః - వృకుడు, తస్య అపి - ఆయనకు కూడ, బాహుకః - బాహుకుడు, సః - ఆ, రాజా - రాజు, అరిభిః - శత్రువులచే, హృతభూః - అపహరించబడిన భూమి గలవాడు, సభార్యః - భార్యతో గూడినవాడై, వనమ్ - అడవిని, ఆవిశత్ - ప్రవేశించెను.

ఆ విజయుని పుత్రుడు భరుకుడు. భరుకుని పుత్రుడు వృకుడు. వృకుని పుత్రుడు బాహుకుడు. బాహుక మహారాజుయొక్క రాజ్యమును శత్రువులు లాగుకొనగా, ఆయన భార్యతో గూడి అడవికి వెళ్లెను.

వృద్ధం తం పంచతాం ప్రాప్తం మహిష్యను మరిష్యతీ ।
ఔర్వేణ జానతాఽఽత్మానం ప్రజావంతం నివారితా ॥ 3

వృద్ధమ్ - వృద్ధుడైనట్టియు, పంచతాం ప్రాప్తమ్ - మరణించిన, తమ్ - ఆయనను, మహిషీ - భార్య, అను - అనుసరించి, మరిష్యతీ - మరణించ బోవుచున్నది, ఆత్మానమ్ - దేహమును, ప్రజావంతమ్ - శిశువు కలిగియున్నదానినిగా, జానతా - తెలుసుకున్న, ఔర్వేణ - ఔర్వునిచే, నివారితా - వారించ బడినది.

బాహుకుడు వృద్ధుడై మరణించెను. ఆయన భార్య ఆయన వెంట మరణించుటకు సిద్ధమాయెను. కాని, ఆమె గర్భవతి యని తెలుసుకున్న ఔర్వ మహర్షి ఆమెను వారించెను.

ఆజ్ఞాయాస్యై సపత్నీభిర్గరో దత్తోఽంధసా సహ ।
సహ తేనైవ సంజాతస్సగరాఖ్యో మహాయశాః ॥ 4

ఆజ్ఞాయ - తెలుసుకొని, సపత్నీభిః - సవతులచే, అస్యై - ఈమె కొరకు, అంధసా సహ - అన్నముతో బాటుగా, గరః - విషము, దత్తః - ఈయబడినది, మహాయశాః - గొప్ప కీర్తిగల, సగరః - సగరుడు, తేన సహ ఏవ - దానితో బాటుగనే, సంజాతః - పుట్టినవాడు.

ఈమె గర్భవతి అనే విషయము తెలిసి సవతులు ఆమెకు అన్నములో విషమును కలిపి పెట్టిరి. అయిననూ, పిల్లవాడు ఆ విషముతో కూడియే పుట్టి సగరుడు (గరముతో, అనగా విషముతో కూడినవాడు) అని ప్రఖ్యాతి గాంచి, గొప్ప కీర్తిని పొందెను.

సగరశ్చక్రవర్త్యాసీత్సాగరో యత్సుతైః కృతః ।
యస్తాలజంఘాన్ యవనాన్ శకాన్ హైహయబర్బరాన్ ॥ 5

నావధీద్గురువాక్యేన చక్రే వికృతవేషిణః ।

సగరః - సగరుడు, చక్రవర్తీ - చక్రవర్తి, ఆసీత్ - అయెను, యత్-సుతైః - ఎవని పుత్రులచే, సాగరః - సముద్రము, కృతః - చేయబడినదో, యః - ఎవడైతే, తాలజంఘాన్ - తాలజంఘులను, యవనాన్ - యవను

లను, శకాన్ - శకులను, హైహయబర్బరాన్ - హైహయులను బర్బరుల ను, గురువాక్యేన - గురువగు ఔర్వునియొక్క వచనముచే, న అవధీత్ - సంహరించలేదో, వికృతవేషిణః - వికృతమగు వేషము గలవారినిగా, చక్రే - చేసెనో.

సగరుడు చక్రవర్తి ఆయెను. ఆయన పుత్రులు సముద్రమును త్రవ్వెరి. గురువగు ఔర్వునియొక్క వచనముచే సగరుడు తాలజంఘుల ను, యవనులను, హైహయులను, బర్బరులను సంహరించకుండా, వారిని వికృతవేషము గలవారుగా చేసెను.

ముండాన్ శ్మశ్రుధరాన్ కాంశ్చిన్ముక్తకేశార్ధముండితాన్ ॥ 6

అనంతర్వాససః కాంశ్చిదబహిర్వాససోఽపరాన్ ।

కాంశ్చిత్ - కొందరిని, ముండాన్ - బోడిగుండువారినిగా, శ్మశ్రు ధరాన్ - గెడ్డము గలవారినిగా, ముక్తకేశ-అర్ధముండితాన్ - విరబోసుకున్న జుట్టు గలవారినిగా సగము గుండు గలవారినిగా, కాంశ్చిత్ - కొందరిని, అనంతర్వాససః - కప్పుకొనే వస్త్రము మాత్రమే గలవారినిగా, అపరాన్ - ఇతరులను, అబహిర్వాససః - కప్పుకొనే వస్త్రము లేనివారినిగా.

కొందరిని బోడిగుండులను, మరికొందరు గెడ్డమును, కొందరు విరబోసిన జుట్టును, మరికొందరు సగము గుండును కలిగియుండునట్లుగా ఆయన చేసెను. వారిలో కొందరికి పై వస్త్రము మాత్రమే ఉండునట్లు, మరికొందరికి పై వస్త్రము లేని విధముగా ఆయన చేసెను.

సోఽశ్వమేధైరయజత సర్వవేదసురాత్మకమ్ ॥ 7

ఔర్వోపదిష్టయోగేన హరిమాత్మానమీశ్వరమ్ ।

సః - ఆ సగరుడు, సర్వవేదసుర-ఆత్మకమ్ - సకలవేదముల మరియు దేవతల రూపములోనున్నట్టియు, ఆత్మానమ్ - ఆత్మరూపుడైన ట్టియు, ఈశ్వరమ్ - జగన్నాథుడైన, హరిమ్ - శ్రీహరిని, ఔర్వ-ఉపదిష్ట యోగేన - ఔర్వ మహర్షిచే ఉపదేశించబడిన పద్ధతిచే, అశ్వమేధైః - అశ్వ మేధయాగములతో, అయజత - ఆరాధించెను.

సకలప్రాణులలో ఆత్మరూపుడైయున్న శ్రీహరియే సకలవేదముల రూపములో మరియు దేవతల రూపములో ప్రకటమైనాడు. సగరుడు జగన్నాథుడగు ఆ శ్రీహరిని అశ్వమేధయాగములను చేసి ఆరాధించెను. ఆ రాజు ఔర్వమహర్షి బోధించిన పద్ధతిలో ఆ యాగములననుష్ఠించెను.

తస్యోత్సృష్టం పశుం యజ్ఞే జహారాశ్వం పురందరః ॥ 8

తస్య - ఆ సగరునియొక్క, యజ్ఞే - యజ్ఞమునందు, ఉత్సృష్టమ్ - విడిచిపెట్టబడిన, పశుమ్ - యజ్ఞపశువైన, అశ్వమ్ - గుఱ్ఱమును, పురందరః - ఇంద్రుడు, జహార - అపహరించెను.

ఆ సగరుడు అశ్వమేధమును చేస్తూ యజ్ఞపశువగు గుఱ్ఱమును (సంచారము కొరకై) విడిచిపెట్టెను. దానిని ఇంద్రుడు అపహరించెను.

సుమత్యాస్తనయా దృప్తాః పితురాదేశకారిణః ।
హయమన్వేషమాణాస్తే సమంతాన్న్యఖనన్మహీమ్ ॥ 9

సుమత్యాః - సుమతియొక్క, తనయాః - పుత్రులు, దృప్తాః - గర్వించినవారు, పితుః - తండ్రియొక్క, ఆదేశకారిణః - ఆదేశమును చేయువారు, హయమ్ - గుఱ్ఱమును, అన్వేషమాణాః - వెదుకుచున్న, తే - వారు, మహీమ్ - భూమిని, సమంతాత్ - అన్ని వైపులా, న్యఖనన్ - త్రవ్విరి.

సుమతి (సగరుని ఒక భార్య) పుత్రులు గర్వించినవారు. వారు తండ్రి ఆదేశమును పాలించువారై గుఱ్ఱమును వెదుకుతూ భూమిని అన్ని వైపులా త్రవ్విరి.

ప్రాగుదీచ్యాం దిశి హయం దదృశుః కపిలాంతికే ।
ఏష వాజిహరశ్చోర ఆస్తే మీలితలోచనః ॥ 10

హన్యతాం హన్యతాం పాప ఇతి షష్టిసహస్రిణః ।
ఉదాయుధా అభియయురున్మిమేష తదా మునిః ॥ 11

ప్రాగ్-ఉదీచ్యాం దిశి - ఈశాన్య దిక్కునందు, కపిల-అంతికే - కపిల భగవానుని సమీపమునందు, హయమ్ - గుఱ్ఱమును, దదృశుః -

చూచిరి, ఏషః - ఈతడు, వాజిహరః - గుఱ్ఱమును అపహరించిన, చౌరః - చోరుడు, మీలితలోచనః - మూయబడిన కన్నులు గలవాడై, ఆస్తే - ఉన్నాడు, పాపః - పాపి, హన్యతామ్ - చంపబడుగాక!, హన్యతామ్ - చంపబడుగాక!, ఇతి - అని, షష్టిసహస్రిణః - అరవై వేల మంది, ఉద్-ఆయుధాః - పైకెత్తబడిన ఆయుధములు గలవారై, అభియయుః - ఎదురుగా వెళ్లిరి, తదా - అప్పుడు, మునిః - మహర్షి, ఉన్మిమేష - కన్నులను తెరిచి చూచెను.

అరవై వేలమంది సగరపుత్రులు ఈశాన్యదిక్కునందు కపిలభగవానుని సమీపములో గుఱ్ఱమును చూచిరి. గుఱ్ఱమును అపహరించిన చోరుడు వీడే; (కపటియై) కన్నులను మూసుకొని యున్నాడు; ఈ పాపిని చంపుడు! చంపుడు! అంటూ వారు ఆయుధములను పైకెత్తి ఆయనకు యెదురుగా వెళ్లిరి. అపుడా కపిల మహర్షి కన్నులను తెరచి చూచెను.

స్వశరీరాగ్నినా తావన్మహేంద్రహృతచేతసః ।
మహద్వ్యతిక్రమహతా భస్మసాదభవన్ క్షణాత్ ॥ 12

మహేంద్రహృతచేతసః - మహేంద్రునిచే వ్యామోహితము చేయబడిన బుద్ధి కలిగినవారు, మహద్-వ్యతిక్రమహతాః - మహాత్ముని యెడల అపరాధముచే హతులైనవారు అగు ఆ సగరపుత్రులు, స్వశరీర-అగ్నినా తావత్ - తమ శరీరములయందలి అగ్నిచే మాత్రమే, (తావత్ - పూర్తిగా), క్షణాత్ - క్షణకాలములో, భస్మసాత్ - బూడిదగా, అభవన్ - అయిరి.

మహేంద్రుడు చేసిన మోసము (గుఱ్ఱమును కపిలుని ప్రక్కన కట్టివేయుట) చే ఆ సగరపుత్రులు వ్యామోహితులై మహాత్ముడగు కపిలుని యెడల అపరాధమును చేసిరి. ఆ అపరాధమే వారిని చంపినది. వారి దేహములలోని అగ్నియే వారిని పూర్తిగా క్షణములో బూడిదగా చేసినది.

న సాధువాదో మునికోపభర్జితా నృపేంద్రపుత్రా ఇతి సత్త్వధామని ।
కథం తమో రోషమయం విభావ్యతే జగత్పవిత్రాత్మని ఖే రజో భువః ॥13

నృప-ఇంద్రపుత్రాః - సగరమహారాజుయొక్క పుత్రులు, మునికోపభర్జితాః - కపిల మహర్షియొక్క కోపముచే దహించబడినవారలు, ఇతి -

అని, సాధువాదః - మంచి మాట, న - కాదు, సత్త్వధామని - సత్త్వగుణ మునకు నిలయమైనట్టియు, జగత్-పవిత్ర-ఆత్మని - జగత్తును పావనము చేసే రూపము కల కపిల భగవానునియందు, రోషమయమ్ - క్రోధముతో నిండిన, తమః - తమోగుణము, ఖే - ఆకాశమునందు, భువః - భూమి యొక్క, రజః - దుమ్ము, కథమ్ - ఏ విధముగా, విభావ్యతే - భావన చేయబడును?

సగరమహారాజుయొక్క పుత్రులు కపిల మహర్షియొక్క కోపా గ్నిచే దహించబడినారు అనే మాట సరిగాదు. సత్త్వగుణనిధానమగు కపిల భగవానుడు జగత్తును పావనము చేసే రూపము గలవాడు. ఆయన యందు తమోగుణప్రధానమగు క్రోధము ఉండునని ఊహించగలమా? (లేము). భూమియొక్క దుమ్ముతో ఆకాశమునకు సంసర్గమును భావన చేయ గలమా? (లేము).

యస్యేరితా సాంఖ్యమయీ దృఢేహ నౌః
    యయా ముముక్షుస్తరతే దురత్యయమ్ ।
భవార్ణవం మృత్యుపథం విపశ్చితః
    పరాత్మభూతస్య కథం పృథఙ్మతిః ॥ 14

యస్య - ఏ కపిల మహర్షిచే, ఇహ - ఈ లోకమునందు, సాంఖ్య మయీ - సాంఖ్యరూపమైన, దృఢా - దృఢమైన, నౌః - నావ, ఈరితా - ప్రవర్తిల్ల జేయబడినదో, యయా - ఏ నావచే, ముముక్షుః - మోక్షమును కోరువాడు, దురత్యయమ్ - తరించ శక్యము కాని, మృత్యుపథమ్ - మృత్యువునకు మార్గమైన, భవ-అర్ణవమ్ - సంసారసముద్రమును, తరతే - తరించునో, విపశ్చితః - సర్వజ్ఞుడైనట్టియు, పర-ఆత్మభూతస్య - పర మాత్మ స్వరూపుడైన మహర్షికి, పృథక్-మతిః - భేదబుద్ధి, కథమ్ - ఎట్లు?

కపిల మహర్షి సాంఖ్యము రూపములో దృఢమైన నావను ఈ లోకములో ప్రవర్తిల్ల జేసెను. మోక్షమును కోరే సాధకుడు ఆ నావతో దాట శక్యము కాని మృత్యుమార్గమైన సంసారమనే సముద్రమును తరించ గల్గును. కపిల మహర్షి సర్వజ్ఞుడు, పరమాత్మ స్వరూపుడు. ఆయనకు శత్రుమిత్రులనే భేదబుద్ధి ఎట్లు ఉండును? (ఉండదు).

యోఽసమంజస ఇత్యుక్తస్స కేశిన్యాం నృపాత్మజః ।
తస్య పుత్రోంఽశుమాన్నామ పితామహహితే రతః ।। 15

యః - ఎవడైతే, అసమంజసః - అసమంజసుడు, ఇతి - అని, ఉక్తః - పిలువబడినాడో, సః - ఆతడు, కేశిన్యామ్ - కేశినియందు, నృప-ఆత్మజః - సగర మహారాజుయొక్క పుత్రుడు, తస్య - ఆయనయొక్క, పుత్రః - పుత్రుడు, అంశుమాన్ నామ - అంశుమంతుడు అని ప్రసిద్ధి గాంచినవాడు, పితామహహితే - తాతయొక్క హితమునందు, రతః - ప్రీతి గలవాడు.

సగర మహారాజునకు కేశిని అనే మరో భార్యయందు అసమంజసుడు అనే పుత్రుడు కలిగెను. అసమంజసుని పుత్రుడు అంశుమంతుడనే పేరుతో ప్రసిద్ధి గాంచెను. అంశుమంతుడు తన తాతయగు సగరునకు హితమును చేయుటయందు ప్రీతిని కలిగి యుండెను.

అసమంజస ఆత్మానం దర్శయన్నసమంజసమ్ ।
జాతిస్మరః పురా సంగాద్యోగీ యోగాద్విచాలితః ।। 16

అసమంజసః - అసమంజసుడు, ఆత్మానమ్ - తనను, అసమంజసమ్ - ప్రతికూలునిగా, దర్శయన్ - ప్రదర్శించువాడు, జాతిస్మరః - పూర్వజన్మస్మృతి గలవాడు, పురా - పూర్వజన్మయందు, యోగీ - యోగి, సంగాత్ - సంగము వలన, యోగాత్ - యోగమునుండి, విచాలితః - విచలితుడుగా చేయబడినవాడు.

అసమంజసుడు పూర్వజన్మలో యోగియై సంగము (బంధుమిత్రాదులయందలి ఆసక్తి) కారణముగా యోగాభ్యాసమునుండి విచలితుడైనాడు. ఆ పూర్వజన్మస్మృతి ఆయనకు గలదు. కావుననే, ఆయన తన పేరుకు తగ్గట్లుగా జనులకు తాను ప్రతికూలుడనే భావమును కలిగించెను.

ఆచరన్ గర్హితం లోకే జ్ఞాతీనాం కర్మ విప్రియమ్ ।
సరయ్వాం క్రీడతో బాలాన్ ప్రాస్యదుద్వేజయన్ జనమ్ ।। 17

లోకే - లోకమునందు, గర్హితమ్ - నిందించబడినట్టియు, జ్ఞాతీ నామ్ - బంధువులకు, విప్రియమ్ - ప్రియము కాని, కర్మ - పనిని, ఆచ రన్ - చేయువాడు, జనమ్ - జనమును ఉద్దేశించి, ఉద్వేజయన్ - భయ మును గొల్పువాడై, క్రీడతః - ఆటలాడుచున్న, బాలాన్ - పిల్లలను, సర య్వామ్ - సరయూ నదియందు, ప్రాస్యత్ - పారవేసెను.

అసమంజసుడు లోకములో నిందించబడే పనులను, బంధువులకు ప్రియము కాని పనులను చేసెడివాడు. ఆటలాడుచున్న పిల్లలను సరయూ నదిలో పారవేస్తూ, జనులకు భయమును గొల్పెడివాడు.

ఏవంవృత్తః పరిత్యక్తః పిత్రా స్నేహమపోహ్య వై ।
యోగైశ్వర్యేణ బాలాంస్తాన్ దర్శయిత్వా తతో యయౌ ।। 18

ఏవంవృత్తః - ఈ విధమైన ప్రవర్తన గల అసమంజసుడు, పిత్రా - తండ్రిచే, స్నేహమ్ - ప్రేమను, వై - నిశ్చయముగా, అపోహ్య - త్రోసిపు చ్చి, పరిత్యక్తః - విడిచి పెట్టబడినవాడు, తాన్ - ఆ, బాలాన్ - పిల్లలను, యౌగ-ఐశ్వర్యేణ - యోగ మహిమచే, దర్శయిత్వా - చూపించి, తతః - ఆ అయోధ్యా నగరమునుండి, యయౌ - వెళ్లెను.

ఇటువంటి ప్రవర్తన గల అసమంజసుని సగర మహారాజు పుత్రప్రే మను త్రోసిపుచ్చి దేశమునుండి బహిష్కరించెను. యోగమహిమ గల ఆ అసమంజసుడు తాను నదిలో పారవేసిన పిల్లలను మరల వారి తల్లిదండ్రు లకు అప్పజెప్పి, తాను అయోధ్యను వీడి అడవికి వెళ్లిపోయెను.

అయోధ్యావాసినస్సర్వే బాలకాన్ పునరాగతాన్ ।
దృష్ట్వా విసిస్మిరే రాజన్ రాజా చాప్యన్వతప్యత ।। 19

అయోధ్యావాసినః - అయోధ్యలో నివసించే జనులు, సర్వే - అందరు, పునః - తిరిగి, ఆగతాన్ - వచ్చిన, బాలకాన్ - పిల్లలను, దృష్ట్వా - చూచి, విసిస్మిరే - విస్మయమును చెందిరి, రాజన్ - ఓ రాజా!, రాజా చ అపి - సగర మహారాజు కూడ, అను-అతప్యత - పశ్చాత్తాప మును పొందెను.

ఓ పరీక్షిన్మహారాజా! అయోధ్యానగరప్రజలు అందరు తిరిగి వచ్చిన పిల్లలను చూచి విస్మయమును చెందిరి. సగర మహారాజు కూడ (అసమంజసుని బహిష్కరించినందుకు) పశ్చాత్తాపమును పొందెను.

అంశుమాంశ్చోదితో రాజ్ఞా తురంగాన్వేషణే యయౌ ।
పితృవ్యఖాతానుపథం భస్మాంతి దదృశే హయమ్ ॥ 20

అంశుమాన్ - అంశుమంతుడు, తురంగ-అన్వేషణే - గుర్రమును వెదుకుటయందు, రాజ్ఞా - మహారాజుచే, చోదితః - ఆదేశించ బడినవాడై, పితృవ్యఖాత-అనుపథమ్ - పినతండ్రులు త్రవ్విన త్రవ్వకముల వెంట ఉండే దారిని, యయౌ - వెళ్లెను, భస్మ-అంతి - బూడిద సమీపమునందు, హయమ్ - గుర్రమును, దదృశే - చూచెను.

గుర్రమును వెదుకుమని సగర మహారాజు అంశుమంతుని ఆదేశించెను. ఆయన తన పినదండ్రులు త్రవ్విన మార్గము వెంట వెళ్లగా, బూడిదకు సమీపమునందున్న గుర్రము కనబడెను.

తత్రాసీనం మునిం వీక్ష్య కపిలాఖ్యమధోక్షజమ్ ।
అస్తౌత్సమాహితమనాః ప్రాంజలిః ప్రణతో మహాన్ ॥ 21

తత్ర - అచట, ఆసీనమ్ - కూర్చున్నట్టియు, కపిల-ఆఖ్యమ్ - కపిలుడు అనే పేరు గల, మునిమ్ - మహర్షియైన, అధోక్షజమ్ - శ్రీహరిని, వీక్ష్య - చూచి, మహాన్ - గొప్పవాడగు అంశుమంతుడు, ప్రాంజలిః - దోసిలి యొగ్గినవాడై, ప్రణతః - నమస్కరించినవాడై, సమాహితమనాః - ఏకాగ్రమగు చిత్తము గలవాడై, అస్తౌత్ - స్తుతించెను.

అచట కపిలమహర్షిగా అవతరించియున్న శ్రీహరి కూర్చుండియుండెను. అంశుమంతుడు గొప్పవాడు. ఆయన దోసిలి యొగ్గి నమస్కరించి, ఏకాగ్రమగు చిత్తముతో ఆ మహర్షిని స్తుతించెను.

అంశుమానువాచ ।
న పశ్యతి త్వాం పరమాత్మనోఽజనో న బుధ్యతేఽద్యాపి సమాధియుక్తిభిః ।
కుతోఽపరే తస్య మనశ్శరీరధీవిసర్గసృష్టా వయమప్రకాశాః ॥ 22

అజనః - స్వయంభువుడగు బ్రహ్మగారు, ఆత్మనః - తనకంటె, పరమ్ - అతీతుడవగు, త్వామ్ - నిన్ను, అద్యాపి - ఇప్పటికి కూడ, సమాధియుక్తిభిః - సమాధిచే యుక్తులచే, న పశ్యతి - చూచుట లేదు, న బుధ్యతే - తెలియుట లేదు, అపరే - ఇతరులమగు, వయమ్ - మేము, మనః-శరీరధీవిసర్గసృష్టాః - మనస్సు శరీరము బుద్ధి అనువాటిచే వివిధసర్గములయందు సృష్టించబడినవారము, అప్రకాశాః - అజ్ఞానులము, కుతః - ఎందువలన (తెలియుదుము)?

అంశుమంతుడిట్లు పలికెను --- స్వయంభువుడగు బ్రహ్మగారైననూ తనకంటె అతీతుడవైన నిన్ను ఈ నాటికీ సమాధియందు చూడలేకున్నారు, యుక్తులతో తెలియలేకున్నారు. అట్టిచో, ఆ బ్రహ్మగారి మనస్సు-శరీరము-బుద్ధుల ద్వారా సృష్టించబడిన దేవతలు-పశువులు-మానవులు అనే వివిధసృష్టులలో అంతర్గతులమై అజ్ఞానులమగు మేము నిన్ను తెలియజాలమని వేరుగా చెప్పవలయునా?

యే దేహభాజస్త్రిగుణప్రధానా గుణాన్ విపశ్యంత్యుత వా తమశ్చ ।
యన్మాయయా మోహితచేతసస్తే విదుస్స్వసంస్థం న బహిఃప్రకాశాః ॥23

త్రిగుణప్రధానాః - మూడు గుణముల అధీనములోనున్నవారు, యత్-మాయయా - ఎవని మాయచే, మోహితచేతసః - మోహపెట్టబడిన బుద్ధి గలవారు, బహిఃప్రకాశాః - బాహ్యవిషయములయందు జ్ఞానము గలవారు అగు, యే - ఏ, దేహభాజః - దేహధారులు గలరో, తే - వారు, స్వసంస్థమ్ - తమయందు ఉన్న నిన్ను, న విదుః - తెలియకున్నారు, గుణాన్ - త్రిగుణకార్యములగు శబ్దాది విషయములను, ఉత వా - లేదా, తమః చ - అజ్ఞానమును, విపశ్యంతి - చూచుచున్నారు.

సత్త్వరజస్తమోగుణముల అధీనములోనుండి శ్రీహరియొక్క మాయచే మోహితమైన బుద్ధి గల జనులు దేహముతో తాదాత్మ్యమును పొందినవారై బాహ్యవిషయములను తెలియుచుందురే గాని, తమయందే ఆత్మరూపముగానున్న నిన్ను గుర్తించలేరు. వారికి జాగ్రత్స్వప్నములయందు బాహ్యమునందలి శబ్దాది విషయములు, నిద్రయందు అజ్ఞానము మాత్రమే అనుభవమునకు వచ్చుచుండును.

తం త్వామహం జ్ఞానఘనం స్వభావప్రధ్వస్తమాయాగుణభేదమోహైః ।
సనందనాద్యైర్మునిభిర్విభావ్యం కథం హి మూఢః పరిభావయామి ॥ 24

జ్ఞానఘనమ్ - కేవల జ్ఞానస్వరూపుడవైనట్టియు, స్వభావప్రధ్వస్త మాయాగుణభేదమోహైః - ఆత్మనిష్ఠచే నశింపజేయబడిన మాయాశక్తి యొక్క గుణములచే చేయబడిన భేదముయొక్క వ్యామోహము గల, సనందన-ఆద్యైః - సనందనుడు సనకుడు మొదలైన, మునిభిః - మహర్షు లచే, విభావ్యమ్ - ధ్యానించబడే, తమ్ - అట్టి, త్వామ్ - నిన్ను, మూఢః - మూఢుడనగు, అహం హి - నేనైతే, కథమ్ - ఏ విధముగా, పరిభావ యామి - ధ్యానించెదను (విచారముచే తెలియుదును)?

మాయాశక్తియొక్క సత్త్వరజస్తమోగుణములు భేదబుద్ధిని కలి గించి జనులను వ్యామోహములో పడవేయుచుండును. కాని, సనక సనం దనాదులు ఆత్మస్వరూపమునందలి నిష్ఠచే ఆ వ్యామోహమును నశింపజే సుకున్నారు. అట్టి జ్ఞానులు నిన్ను ధ్యానించెదరు. శుద్ధ జ్ఞప్తి స్వరూపుడ వగు అట్టి నిన్ను మూఢుడనగు నేను ఎట్లు ధ్యానించ (విచారము చేసి తెలి యు) గల్గుదును?

ప్రశాంతమాయాగుణకర్మలింగమనామరూపం సదసద్విముక్తమ్,
జ్ఞానోపదేశాయ గృహీతదేహం నమామహే త్వాం పురుషం పురాణమ్।25

ప్రశాంతమాయాగుణకర్మలింగమ్ - చల్లారిన మాయాశక్తియొక్క గుణములు కర్మలు మరియు దేహములు కలిగినట్టియు, అనామరూపమ్ - నామరూపములు లేనట్టియు, సద్-అసద్-విముక్తమ్ - పుణ్యాపాపముల (కార్యకారణభావము) నుండి విముక్తుడవైనట్టియు, జ్ఞాన-ఉపదేశాయ - జ్ఞానమును ఉపదేశించుట కొరకు, గృహీతదేహమ్ - స్వీకరించబడిన దేహము కలిగినట్టియు, పురాణమ్ - కాలమునకు అతీతుడవైనట్టియు, పురుషమ్ - పూర్ణుడవగు, త్వామ్ - నిన్ను, నమామహే - నమస్కరించు చున్నాము.

జీవులు మాయాశక్తియొక్క గుణములకు అధీనులై కర్మలను చేసి దేహములను పొందుచుందురు. కాని, పుణ్యాపాపములనుండి విముక్తుడ

వగు నీయందు మాయాశక్తి, దాని గుణములు, తత్ప్రయుక్తములగు కర్మలు, వాటిచే ఈయబడే దేహములు అనునవి లేవు. కార్యకారణములకు, నామరూపములకు అతీతుడవగు నీవు జ్ఞానమును ఉపదేశించుటకై దేహమును స్వీకరించి (అవతరించి) నావు. కాలాతీతుడవు, పూర్ణుడవు అగు నిన్ను మేము నమస్కరించుచున్నాము.

త్వన్మాయారచితే లోకే వస్తుబుద్ధ్యా గృహాదిషు ।
భ్రమంతి కామలోభేర్ష్యామోహవిభ్రాంతచేతసః ॥ 26

త్వత్-మాయారచితే - నీ మాయాశక్తిచే నిర్మించబడిన, లోకే - లోకమునందు, కామలోభ-ఈర్ష్యామోహవిభ్రాంతచేతసః - కామము లోభము ఈర్ష్య మరియు వ్యామోహము అనువాటిచే అధికముగా భ్రమింప జేయబడిన బుద్ధులు గల జనులు, గృహ-ఆదిషు - ఇల్లు మొదలగువాటి యందు, వస్తుబుద్ధ్యా - యథార్థములనే ధారణతో, భ్రమంతి - తిరుగాడు చున్నారు.

ఈ లోకము నీ మాయాశక్తిచే రచించబడినది. కామము, లోభము, ఈర్ష్య, మోహము (వివేకము లేకుండుట) అనువాటిచే జనుల బుద్ధులు విశేషముగా భ్రమకు లోనగుచుండును. అట్టి జనులు ఇల్లు-వాకిలి-ధనము మొదలగునవి శాశ్వతమని భావిస్తూ (సంసారములో) తిరుగాడుచుందురు.

అద్య నస్సర్వభూతాత్మన్ కామకర్మేంద్రియాశయః ।
మోహపాశో దృఢశ్ఛిన్నో భగవంస్తవ దర్శనాత్ ॥ 27

సర్వభూత-ఆత్మన్ - సకలప్రాణులకు ఆత్మరూపుడవైన, భగవన్ - ఓ భగవానుడా!, కామకర్మ-ఇంద్రియ-ఆశయః - కామనలకు కర్మలకు ఇంద్రియములకు మూలమైన, దృఢః - దృఢమగు, నః - మాయొక్క, మోహపాశః - వ్యామోహమనే పాశము, అద్య - ఈ నాడు, తవ - నీయొక్క, దర్శనాత్ - దర్శనము వలన, ఛిన్నః - తెగిపోయినది.

ఓ భగవానుడా! సకలప్రాణుల ఆత్మవు నీవే. మాకు ఉండే వ్యామోహమనే పాశము కామనలకు, వాటిచే ప్రేరితములైన కర్మలకు,

వాటికి ఆశ్రయమగు ఇంద్రియములకు మూలమై యున్నది. ఈ నాడు నిన్ను దర్శించుటచే దృఢమగు ఆ మోహపాశము తెగిపోయినది.

శ్రీశుక ఉవాచ ।
ఇత్థం గీతానుభావస్తం భగవాన్ కపిలో మునిః ।
అంశుమంతమువాచేదమనుగృహ్యా ధియా నృప ।। 28

నృప - ఓ రాజా!, ఇత్థమ్ - ఈ విధముగా, గీత-అనుభావః - గానము చేయబడిన మహిమ గల, భగవాన్ - భగవానుడగు, కపిలః మునిః - కపిల మహర్షి, అంశుమంతమ్ - అంశుమంతుని, ధియా - సంకల్పముతో, అనుగృహ్యా - అనుగ్రహించి, ఇదమ్ - ఈ మాటను, ఉవాచ - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! కపిల మహర్షి మహిమను అంశుమంతుడు ఈ విధముగా కీర్తించెను. అప్పుడు భగవానుడు ఆయనను అనుగ్రహించ సంకల్పించి, ఇట్లు పలికెను.

శ్రీభగవానువాచ ।
అశ్వోఽయం నీయతాం వత్స పితామహపశుస్తవ ।
ఇమే చ పితరో దగ్ధా గంగాంభోఽర్హంతి నేతరత్ ।। 29

వత్స - ఓ కుమారా!, అయమ్ - ఈ, తవ - నీ, పితమహపశుః - తాతగారి యజ్ఞపశువైన, అశ్వః - గుర్రము, నీయతామ్ - తీసుకపోబడు గాక!, ఇమే - ఈ, పితరః చ - తండ్రులైతే, దగ్ధాః - దహించబడినవారలు, గంగా-అంభః - గంగాజలమును, అర్హంతి - తగుదురు, ఇతరత్ - ఇతరమును, న - కాదు.

శ్రీభగవానుడిట్లు పలికెను --- ఓ కుమారా! ఈ గుర్రము నీ తాతగారి యజ్ఞపశువు. దీనిని తీసుకు వెళ్లుము. నీ తండ్రులు ఇచట దహించబడి బూడిదయైనారు. వీరికి గంగాజలములతో తర్పణములను చేయుట యోగ్యముగా నుండును. వీరి ఉద్ధారమునకు మరియొక ఉపాయము లేదు.

తం పరిక్రమ్య శిరసా ప్రసాద్య హయమానయత్ ।
సగరస్తేన పశునా క్రతుశేషం సమాపయత్ ॥ 30

తమ్ - ఆ కపిల మహర్షిని, పరిక్రమ్య - ప్రదక్షిణము చేసి, శిరసా - శిరస్సుతో, ప్రసాద్య - ప్రసన్నము చేసుకొని, హయమ్ - గుర్రమును, ఆనయత్ - తీసుకు వచ్చెను, తేన - ఆ, పశునా - యజ్ఞపశువుతో, సగరః - సగరుడు, క్రతుశేషమ్ - అశ్వమేధ యాగముయొక్క మిగిలిన కర్మను, సమాపయత్ - పూర్తి చేసెను.

అంశుమంతుడు ఆ కపిల మహర్షికి ప్రదక్షిణము చేసి తల వంచి నమస్కరించి ప్రసన్నుని చేసుకొనెను. అపుడాతడు గుర్రమును తీసుకువచ్చెను. సగరుడా యజ్ఞపశువుతో అశ్వమేధ యాగములో మిగిలియున్న కర్మకాండను పూర్తి చేసెను.

రాజ్యమంశుమతి న్యస్య నిస్స్పృహో ముక్తబంధనః ।
ఔర్వోపదిష్టమార్గేణ లేభే గతిమనుత్తమామ్ ॥ 31

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే నవమస్కంధే అష్టమోఽధ్యాయః ॥

రాజ్యమ్ - రాజ్యమును, అంశుమతి - అంశుమంతునియందు, న్యస్య - ఉంచి, నిస్స్పృహః - కోరికలు లేనివాడై, ముక్తబంధనః - విడిచి పెట్టబడిన బంధము గలవాడై, ఔర్వ-ఉపదిష్టమార్గేణ - ఔర్వ మహర్షిచే ఉపదేశించబడిన ఉపాయముచే, అనుత్తమామ్ - సర్వోత్తమమైన, గతిమ్ - గతిని, లేభే - పొందెను.

సగరుడు రాజ్యమును అంశుమంతునకు అప్పజెప్పెను. ఆయనకు కోరికలేమియు లేవు. ఆయన ఔర్వుడు ఉపదేశించిన ఉపాయమునను్ఠించి, అజ్ఞానబంధమునుండి విముక్తుడై సర్వోత్తమమైన గతి (మోక్షము) ని పొందెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో సగరుని వృత్తాంతమును వర్ణించే ఎనిమిదవ అధ్యాయము ముగిసినది (8).

* * * * *

# అథ నవమోఽధ్యాయః

## గంగావతరణము

శ్రీశుక ఉవాచ।
అంశుమాంశ్చ తపస్తేపే గంగాఽఽనయనకామ్యయా ।
కాలం మహాంతం నాశక్నోత్తతః కాలేన సంస్థితః ॥ 1

అంశుమాన్ చ - అంశుమంతుడు కూడ, గంగా-ఆనయనకామ్యయా - గంగను తీసుకువచ్చే కోరికతో, మహాంతమ్ - పెద్ద, కాలమ్ - కాలమును, తపః - తపస్సును, తేపే - చేసెను, న అశక్నోత్ - సమర్థుడు కాలేదు, తతః - తరువాత, కాలేన - కాలముచే, సంస్థితః - మరణించినవాడు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- సగరుడే కాకుండా అంశుమంతుడు కూడ గంగను తీసుకువచ్చే కోరికతో చాల కాలము తపస్సు చేసెను. అయిననూ, ఆయన ఆ పనిని చేయలేకపోయెను. తరువాత కొంత కాలమునకు ఆయన మరణించెను.

దిలీపస్తత్సుతస్తద్వదశక్తః కాలమేయివాన్ ।
భగీరథస్తస్య పుత్రస్తేపే స సుమహత్తపః ॥ 2

తత్-సుతః - ఆ అంశుమంతుని పుత్రుడగు, దిలీపః - దిలీపుడు, తద్వత్ - ఆ తండ్రి వలెనే, అశక్తః - సమర్థుడు కాలేదు, కాలమ్ - మృత్యువును, ఏయివాన్ - పొందినవాడు, తస్య - ఆయనయొక్క, పుత్రః - పుత్రుడగు, సః - ఆ, భగీరథః - భగీరథుడు, సుమహత్ - చాల గొప్ప, తపః - తపస్సును, తేపే - చేసెను.

ఆ అంశుమంతుని పుత్రుడగు దిలీపుడు గంగను తీసుకు వచ్చుటలో సమర్థుడు కాలేదు. ఆయన మృత్యువును పొందెను. దిలీపుని పుత్రుడగు భగీరథుడు సుప్రసిద్ధుడు. ఆయన చాల గొప్ప తపస్సును చేసెను.

దర్శయామాస తం దేవీ ప్రసన్నా వరదాస్మి తే ।
ఇత్యుక్తస్స్వమభిప్రాయం శశంసావనతో నృపః ॥ 3

ప్రసన్నా - ప్రసన్నురాలైన, దేవీ - గంగాదేవి, తమ్ - ఆ భగీరథుని గురించి, దర్శయామాస - దర్శనమిచ్చెను, తే - నీ కొరకు, వరదా - వరమునిచ్చుదానను, అస్మి - అగుచున్నాను, ఇతి - అని, ఉక్తః - పలుకబడిన, నృపః - భగీరథ మహారాజు, అవనతః - తల వంచినవాడై, స్వమ్ - తనదైన, అభిప్రాయమ్ - అభిప్రాయమును, శశంస - చెప్పెను.

గంగాదేవి ప్రసన్నురాలై ఆ భగీరథునకు దర్శనమిచ్చి, నీకు నేను వరమునిచ్చెదనని పలికెను. అపుడా భగీరథ మహారాజు వినయముగా తన అభిప్రాయము (తాతల ఉద్ధారము) ను విన్నవించెను.

కోఽపి ధారయితా వేగం పతంత్యా మే మహీతలే ।
అన్యథా భూతలం భిత్త్వా నృప యాస్యే రసాతలమ్ ॥ 4

నృప - ఓ మహారాజా!, మహీతలే - భూతలముపై, పతంత్యాః - పడుచున్న, మే - నాయొక్క, వేగమ్ - వేగమును, కః అపి - ఎవడైననూ, ధారయితా - ధరించగలడు, అన్యథా - అట్లు గానిచో, భూతలమ్ - భూమి పైభాగమును, భిత్త్వా - పగులగొట్టి, రసాతలమ్ - రసాతలమును గురించి, యాస్యే - వెళ్లగలను.

ఓ మహారాజా! నేను భూతలముపై పడుచుండగా ఎవరో ఒకరు నన్ను ధరించవలెను. లేనిచో, నేను భూతలమును పగులగొట్టి రసాతలమునకు వెళ్లిపోగలను.

కిం చాహం న భువం యాస్యే నరా మయ్యామృజంత్యఘమ్ ।
మృజామి తదఘం కుత్ర రాజంస్తత్ర విచింత్యతామ్ ॥ 5

రాజన్ - ఓ రాజా!, కిం చ - ఇంకా ఏమంటే, అహమ్ - నేను, భువమ్ - భూలోకమును గురించి, న యాస్యే - వెళ్లను, నరాః - మానవులు, అఘమ్ - పాపమును, మయి - నాయందు, ఆమృజంతి - కడిగెదరు, తత్ - ఆ, అఘమ్ - పాపమును, కుత్ర - దేనియందు, మృజామి - కడుగుకొనెదను?, తత్ర - ఆ విషయమునందు, విచింత్యతామ్ - విచారము చేయబడుగాక!

ఓ రాజా! ఇంకో విషయము గలదు. నేను భూలోకములో ప్రవహించినచో, జనులు వారి పాపములను నాయందు కడిగెదరు గనుక, నేను భూలోకమునకు వెళ్లను. ఆ పాపమును నేను ఎక్కడ కడుగవలెను? ఆ విషయమును కూడ నీవు ఆలోచించుము.

భగీరథ ఉవాచ ।
సాధవో న్యాసినశ్శాంతా బ్రహ్మిష్ఠా లోకపావనాః ।
హరంత్యఘం తేఽంగసంగాత్తేష్వాస్తే హ్యఘభిద్ధరిః ।। 6

సాధవః - సత్పురుషులు, న్యాసినః - సర్వసంగపరిత్యాగులు, శాంతాః - శాంతస్వభావులు, బ్రహ్మిష్ఠాః - బ్రహ్మనిష్ఠ గలవారు, లోకపావనాః - జనులను పవిత్రము చేయువారు, తే - నీయొక్క, అఘమ్ - పాపమును, అంగసంగాత్ - దేహముతోడి స్పర్శ వలన, హరంతి - పోగొట్టెదరు, హి - ఏలయనగా, తేషు - వారియందు, అఘభిత్ - పాపములను పోగొట్టే, హరిః - శ్రీహరి, ఆస్తే - ఉండును.

భగీరథుడిట్లు పలికెను --- సర్వసంగములను పరిత్యజించి శాంతస్వభావులై బ్రహ్మనిష్ఠులైన సత్పురుషులు జనులను పావనము చేయుచుందురు. వారు నీయందు స్నానమును చేసినప్పుడు నీ పాపము పోవును. ఎందుకంటే, పాపములను పోగొట్టే శ్రీహరి వారియందు ఉండును.

ధారయిష్యతి తే వేగం రుద్రస్త్వాత్మా శరీరిణామ్ ।
యస్మిన్నోతమిదం ప్రోతం విశ్వం శాటీవ తంతుషు ।। 7

శరీరిణామ్ - ప్రాణులకు, ఆత్మా - ఆత్మయగు, రుద్రః తు - రుద్రుడైతే, తే - నీయొక్క, వేగమ్ - వేగమును, ధారయిష్యతి -

ధరించగలడు, యస్మిన్ - ఏ రుద్రునియందు, ఇదమ్ - ఈ, విశ్వమ్ - జగత్తు, తంతుషు - దారములయందు, శాటీ ఇవ - వస్త్రము వలె, ఓతం ప్రోతమ్ - పడుగు పేకవలె వ్యాపించబడి యున్నదో.

రుద్రుడు ప్రాణుల ఆత్మ. ఈ జగత్తు ఆయనయందు, వస్త్రము దారములయందు వలె, పడుగు-పేక వలె వ్యాపించబడి యున్నది. ఆయన నీ వేగమును ధరించగలడు.

ఇత్యుక్త్వా స నృపో దేవం తపసాఽతోషయచ్ఛివమ్ ।
కాలేనాల్పీయసా రాజంస్తస్యేశస్సమతుష్యత ॥ 8

ఇతి - అని, ఉక్త్వా - పలికి, సః - ఆ, నృపః - భగీరథ మహారాజు, తపసా - తపస్సుతో, శివం దేవమ్ - శివదేవుని, అతోషయత్ - ప్రీతుని చేసెను, రాజన్ - ఓ రాజా!, అల్పీయసా - అల్పమైన, కాలేన - కాలముచే, ఈశః - శివుడు, తస్య - ఆయనకు, సమతుష్యత - బాగా సంతుష్టుడాయెను.

ఓ పరీక్షిన్మహారాజా! ఆ భగీరథ మహారాజు తపస్సు చేసి శివదేవుని సంతోషపెట్టెను. తక్కువ సమయములోనే శివుడు ఆ భగీరథుని యెడల సంతుష్టుడాయెను.

తథేతి రాజ్ఞాభిహితం సర్వలోకహితశ్శివః ।
దధారావహితో గంగాం పాదపూతజలాం హరేః ॥ 9

రాజ్ఞా - భగీరథ మహారాజుచే, అభిహితమ్ - చెప్పబడిన దానిని, తథా - అటులనే, ఇతి - అని, సర్వలోకహితః - సకలప్రాణులకు హితము చేసే, శివః - శివుడు, అవహితః - సావధానుడై, హరేః - శ్రీహరి యొక్క, పాదపూతజలామ్ - పాదములచే పవిత్రము చేయబడిన నీరు గల, గంగామ్ - గంగను, దధార - ధరించెను.

భగీరథ మహారాజు గంగావతరణమును గురించి చెప్పగా, సకల ప్రాణులకు హితమును చేసే శివుడు సరేయని భగీరథుని కోరికను అంగీక

రించెను. శ్రీహరియొక్క పాదములచే పావనము చేయబడిన నీరు గల గంగను ఆయన సావధానుడై ధరించెను.

భగీరథస్స రాజర్షిర్నిన్యే భువనపావనీమ్ ।
యత్ర స్వపితౄణాం దేహా భస్మీభూతాస్స్మ శేరతే ॥ 10

రాజర్షిః - రాజర్షియగు, సః - ఆ, భగీరథః - భగీరథుడు, భువన పావనీమ్ - లోకములను పవిత్రము చేసే గంగను, నిన్యే - నడిపించెను, యత్ర - ఎక్కడనైతే, భస్మీభూతాః - బూడిదగా చేయబడిన, స్వపితౄణామ్ - తన పూర్వజుల, దేహాః - దేహములు, శేరతే స్మ - పడియుండెనో.

రాజర్షియగు ఆ భగీరథుడు లోకములను పావనము చేసే గంగను, బూడిదరైయె పడియున్న తన పూర్వజుల దేహములు ఉన్నచోటికి తీసుకు పోయెను.

రథేన వాయువేగేన ప్రయాంతమనుధావతీ ।
దేశాన్ పునంతీ నిర్దగ్ధానాసించత్సగరాత్మజాన్ ॥ 11

వాయువేగేన - వాయువుయొక్క వేగమువంటి వేగము గల, రథేన - రథముతో, ప్రయాంతమ్ - వెళ్లుచున్న భగీరథుని, అనుధావతీ - వెంట పరుగెత్తుచున్న గంగ, దేశాన్ - దేశములను, పునంతీ - పావనము చేయుచున్నదియై, నిర్దగ్ధాన్ - దహించబడిన, సగర-ఆత్మజాన్ - సగర పుత్రులను, ఆసించత్ - తడిపెను.

వాయువేగముతో రథముపై భగీరథుడు వెళ్లుచుండగా, ఆయన వెంట పరుగెడుతూ గంగ దేశములను పావనము చేసెను. దహించబడి బూడిదరైయెన సగరపుత్రులను ఆమె ముంచెత్తెను.

యజ్జలస్పర్శమాత్రేణ బ్రహ్మదండహతా అపి ।
సగరాత్మజా దివం జగ్ముః కేవలం దేహభస్మభిః ॥ 12

కేవలమ్ - కేవలము, దేహభస్మభిః - దేహముయొక్క భస్మలతో, యత్-జలస్పర్శమాత్రేణ - ఏ గంగయొక్క నీటితో స్పర్శమాత్రముచే,

సగర-ఆత్మజాః - సగరపుత్రులు, బ్రహ్మదండహతాః అపి - మహర్షి శాపముచే బూడిద చేయబడినవారే అయిననూ, దివమ్ - స్వర్గమును గురించి, జగ్మః - వెళ్లిరి.

సగరుని పుత్రులు మహర్షియొక్క శాపముచే బూడిదగా చేయబడివారు. అయిననూ, కేవలము వారి దేహముల బూడిదను గంగ స్పృశించినంత మాత్రాన వారు స్వర్గమును పొందిరి.

భస్మీభూతాంగసంగేన స్వర్యాతాస్సగరాత్మజాః ।
కిం పునశ్శ్రద్ధయా దేవీం యే సేవంతే ధృతవ్రతాః ।। 13

భస్మీభూత-అంగసంగేన - బూడిదయైన అవయవములతోడి స్పర్శచే, సగర-ఆత్మజాః - సగరుని పుత్రులు, స్వః - స్వర్గమును గురించి, యాతాః - వెళ్లిరి, యే - ఎవరైతే, ధృతవ్రతాః - ధరించబడిన వ్రతముగలవారై, దేవీమ్ - గంగాదేవిని, శ్రద్ధయా - శ్రద్ధతో, సేవంతే - సేవించెదరో, కిం పునః - చెప్పునదేమున్నది?

సగర పుత్రుల అవయవములు బూడిదయై ఉండెను. ఆ బూడిదకు గంగాజలములతో స్పర్శ కలుగగా, వారు స్వర్గమును పొందిరి. ఎవరైతే వ్రతనిష్ఠను పూని శ్రద్ధతో గంగాదేవిని సేవిస్తారో, వారు స్వర్గమును పొందెదరని వేరుగా చెప్పవలయునా?

న హ్యేతత్పరమాశ్చర్యం స్వర్ధున్యా యదిహోదితమ్ ।
అనంతచరణాంభోజప్రసూతాయా భవచ్ఛిదః ।। 14

అనంతచరణ-అంభోజప్రసూతాయాః - అనంతుని పాదపద్మములనుండి పుట్టినట్టియు, భవచ్ఛిదః - సంసారమును తొలగించునట్టియు, స్వర్ధున్యాః - స్వర్గనదియగు గంగకు, ఇహ - ఇచట, యత్ - ఏది, ఉదితమ్ - చెప్పబడినదో, ఏతత్ - ఇది, పరమ-ఆశ్చర్యమ్ - పెద్ద ఆశ్చర్యము, న హి - కానే కాదు.

స్వర్గమునందు ప్రవహించే గంగానది అనంతుని పాదపద్మముల నుండి పుట్టినది. సంసారబంధమును తొలగించే గంగానది విషయములో ఇచట చెప్పిన మహిమ పెద్ద ఆశ్చర్యము కానే కాదు.

సన్నివేశ్య మనో యస్మిన్ శ్రద్ధయా మునయోఽమలాః ।
త్రైగుణ్యం దుస్త్యజం హిత్వా సద్యో యాతాస్తదాత్మతామ్ ॥ 15

అమలాః - పవిత్రులైన, మునయః - మహర్షులు, శ్రద్ధయా - శ్రద్ధతో, యస్మిన్ - ఏ అనంతునియందు, మనః - మనస్సును, సన్నివేశ్య - చక్కగా నిలిపి, దుస్త్యజమ్ - విడిచిపెట్ట శక్యము కాని, త్రైగుణ్యమ్ - త్రిగుణాత్మకమగు సంసారమును, హిత్వా - విడిచి, సద్యః - వెంటనే, తద్-ఆత్మతామ్ - ఆ అనంతునితో ఐక్యమును, యాతాః - పొందిరో.

పవిత్రహృదయులగు మహర్షులు శ్రద్ధతో మనస్సును అనంతునిపై చక్కగా నిలిపెదరు. విడిచి పెట్ట శక్యము కాని త్రిగుణాత్మకమైన సంసారమును విడిచిపెట్టి, వారు జీవించి యుండగనే ఆ అనంతునితో ఐక్యమగుదురు.

శ్రుతో భగీరథాజ్జజ్ఞే తస్య నాభోఽపరోఽభవత్ ।
సింధుద్వీపస్తతస్తస్మాదయుతాయుస్తతోఽభవత్ ॥ 16

ఋతుపర్ణో నలసఖో యోఽశ్వవిద్యామయాన్నలాత్ ।
దత్త్వాఽక్షహృదయం చాస్మై సర్వకామస్తు తత్సుతః ॥ 17

భగీరథాత్ - భగీరథుని వలన, శ్రుతః - శ్రుతుడు, జజ్ఞే - జన్మించెను, తస్య - వానికి, నాభః - నాభుడు, అభవత్ - కలిగెను, అపరః - మరియొకడు, తతః - వాని వలన, సింధుద్వీపః - సింధుద్వీపుడు, తస్మాత్ - వాని వలన, అయుతాయుః - అయుతాయువు, తతః - వాని వలన, ఋతుపర్ణః - ఋతుపర్ణుడు, అభవత్ - కలిగెను, నలసఖః - నలుని మిత్రుడగు, యః - ఏ ఋతుపర్ణుడైతే, అస్మై - ఈ నలుని కొరకు, అక్షహృదయమ్ - పాచికల విద్యను, దత్త్వా - ఇచ్చి, నలాత్ - నలునినుండి, అశ్వవిద్యామ్ - గుర్రముల విద్యను, అయాత్ - పొందెనో, తత్-సుతః తు - వాని పుత్రుడైతే, సర్వకామః - సర్వకాముడు.

భగీరథుని పుత్రుడు శ్రుతుడు. శ్రుతుని పుత్రుడు నాభుడు. ఈ నాభుడు ఇదివరలో చెప్పినవాడు కాదు, మరియొకడు. నాభుని పుత్రుడు సింధుద్వీపుడు. సింధుద్వీపుని పుత్రుడు అయుతాయువు. అయుతా యువు పుత్రుడు ఋతుపర్ణుడు. ఈ ఋతుపర్ణుడే నలునకు మిత్రుడై ఆయ నకు పాచికల విద్యను నేర్పి, తాను ఆయన వద్దనుండి గుర్రముల విద్యను నేర్చెను. ఋతుపర్ణుని పుత్రుడు సర్వకాముడు.

తతస్సుదాసస్తత్పుత్రో మదయంతీపతిర్నృప ।
ఆహుర్మిత్రసహం యం వై కల్మాషాంఘ్రిముత క్వచిత్ ।
వసిష్ఠశాపాద్రక్షోఽభూదనపత్యస్స్వకర్మణా ॥ 18

నృప - ఓ మహారాజా!, తతః - వాని వలన, సుదాసః - సుదాసుడు, తత్-పుత్రః - ఆయన పుత్రుడు, మదయంతీపతిః - మదయంతికి భర్త, యం వై - ఎవనినైతే, మిత్రసహమ్ - మిత్రసహునిగను, ఉత - మరియు, క్వచిత్ - ఒకప్పుడు, కల్మాషాంఘ్రిమ్ - కల్మాషాంఘ్రిగను, ఆహుః - పిలిచెదరో, అనపత్యః - సంతానము లేని ఆ మిత్రసహుడు, స్వకర్మణా - తన పనిచే, వసిష్ఠశాపాత్ - వసిష్ఠుని శాపము వలన, రక్షః - రాక్షసుడు, అభూత్ - అయెను.

ఓ పరీక్షిన్మహారాజా! ఆ సర్వకాముని పుత్రుడు సుదాసుడు. సుదాసుని పుత్రుని మిత్రసహుడనియు, ఒకప్పుడు కల్మాషాంఘ్రి అని కూడ పిలిచెదరు. ఆయన భార్య మదయంతి. ఆయనకు సంతానము లేకుండెను. ఆయన చేసిన పని వలన వసిష్ఠుడు శాపమీయగా, ఆయన రాక్షసుడాయెను.

రాజోవాచ ।
కింనిమిత్తో గురోశ్శాపస్సౌదాసస్య మహాత్మనః ।
ఏతద్వేదితుమిచ్ఛామః కథ్యతాం న రహో యది ॥ 19

మహాత్మనః - మహాత్ముడగు, సౌదాసస్య - సుదాసుని పుత్రునకు, గురోః - గురువగు వసిష్ఠుని, శాపః - శాపము, కింనిమిత్తః - ఏది కారణముగా గలది?, ఏతత్ - దీనిని, వేదితుమ్ - తెలియుటకు, ఇచ్ఛామః -

కోరుచున్నాము, రహః - రహస్యము, న యది - కానిచో, కథ్యతామ్ - చెప్పబడుగాక!

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- మహాత్ముడగు సౌదాసుడు (సుదాసుని పుత్రుడగు మిత్రసహుడు) గురువగు వసిష్ఠుని శాపమును పొందుటకు కారణమేమి? ఈ విషయమును తెలియాలనే కోరిక మాకు గలదు. అది రహస్యము కాని పక్షములో, చెప్పుడు.

శ్రీశుక ఉవాచ ।
సౌదాసో మృగయాం కంచిచ్చరన్ రక్షో జఘాన హ ।
ముమోచ భ్రాతరం సోఽథ గతః ప్రతిచికీర్షయా ॥ 20

సౌదాసః - సౌదాసుడు, మృగయాం చరన్ - వేటాడుచున్నవాడై, కంచిత్ - ఒకానొక, రక్షః - రాక్షసుని, జఘాన హ - చంపెనట, భ్రాతరమ్ - (వాని) సోదరుని, ముమోచ - విడిచిపెట్టెను, అథ - అప్పుడు, సః - ఆతడు, ప్రతిచికీర్షయా - కక్ష తీర్చుకోవాలనే కోరికతో, గతః - వెళ్లినవాడు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- సౌదాసుడు వేటాడుతూ ఒక రాక్షసుని చంపెనట. కాని, ఆయన ఆ రాక్షసుని సోదరుని విడిచి పెట్టెను. ఆతడు తరువాత కక్ష తీర్చుకొనుటకై (సౌదాసుని ఇంటికి) వెళ్లెను.

స చింతయన్నఘం రాజ్ఞస్సూదరూపధరో గృహే ।
గురవే భోక్తుకామాయ పక్త్వా నిన్యే నరామిషమ్ ॥ 21

రాజ్ఞః - సౌదాస మహారాజుయొక్క, అఘమ్ - పాపకార్యమును గురించి, చింతయన్ - తలపోయువాడై, సూదరూపధరః - వంటవాని రూపమును దాల్చినవాడై, గృహే - ఇంటియందు, నర-ఆమిషమ్ - నర మాంసమును, పక్త్వా - వండి, భోక్తుకామాయ - భోజనమును చేయగోరే, గురవే - గురువు కొరకు, నిన్యే - తీసుకువచ్చెను.

సౌదాస మహారాజు తన సోదరుని చంపుట అనే పాపకృత్యమును గురించి తలపోస్తూ, ఆ రాక్షసుడు ఆ రాజు ఇంట్లో వంటవాడు రూపములో

ప్రవేశించెను. ఒకనాడు గురువగు వసిష్ఠుడు భోజనమును చేయగోరెను. అపుడా రాక్షసుడు నరమాంసమును వండి తెచ్చెను.

పరివేక్ష్యమాణం భగవాన్ విలోక్యాభక్ష్యమంజసా ।
రాజానమశపత్క్రుద్ధో రక్షో హ్యేవం భవిష్యసి ॥ 22

పరివేక్ష్యమాణమ్ - వడ్డించబడ బోవుచున్న, అభక్ష్యమ్ - తినదగని పదార్థమును, విలోక్య - చూచి, భగవాన్ - పూజనీయుడగు వసిష్ఠుడు, అంజసా - వెంటనే, క్రుద్ధః - కోపించినవాడై, రాజానమ్ - సౌదాస మహారాజును, అశపత్ - శపించెను, ఏవమ్ - ఈ విధమగు చర్యచే, రక్షః - రాక్షసుడవు, భవిష్యసి - కాగలవు, హి - నిశ్చయము.

తినరాని నరమాంసమును వడ్డించుచుండగా చూచి, పూజనీయుడగు వసిష్ఠుడు వెంటనే కోపించి ఆ సౌదాస మహారాజును ఇట్లు శపించెను -- నరమాంసమును వడ్డించుట అనే ఈ పనిచే నీవు నిశ్చయముగా రాక్షసుడవు కాగలవు.

రక్షఃకృతం తద్విదిత్వా చక్రే ద్వాదశవార్షికమ్ ।
సోఽప్యపోఽంజలినాఽఽదాయ గురుం శప్తుం సముద్యతః ॥ 23

తత్ - ఆ పనిని, రక్షః-కృతమ్ - రాక్షసునిచే చేయబడినదానినిగా, విదిత్వా - తెలుసుకొని, ద్వాదశవార్షికమ్ - పన్నెండు సంవత్సరముల అవధి గలదానినిగా, చక్రే - చేసెను, సః అపి - ఆ మహారాజు కూడ, అంజలినా - దోసిలితో, అపః - నీళ్లను, ఆదాయ - తీసుకొని, గురుమ్ - గురువును, శప్తుమ్ - శపించుటకు, సముద్యతః - సంసిద్ధుడైనవాడు.

ఆ పని రాక్షసుడు చేసినదని తెలిసి వసిష్ఠుడు ఆ శాపమునకు పన్నెండు సంవత్సరములను అవధిగా చేసెను. ఆ సౌదాస మహారాజు కూడ దోసిలితో నీటిని తీసుకొని, గురువగు వసిష్ఠుని శపించుటకు సంసిద్ధుడాయెను.

వారితో మదయంత్యాఽపో రుశతీః పాదయోర్జహౌ ।
దిశః ఖమవనీం సర్వం పశ్యన్ జీవమయం నృపః ॥ 24

మదయంత్యా - మదయంతిచే, వారితః - వారించబడిన, నృపః - ఆ రాజు, దిశః - దిక్కులను, ఖమ్ - ఆకాశమును, అవనీమ్ - భూమిని, సర్వమ్ - సర్వమును, జీవమయమ్ - ప్రాణులతో నిండియున్నదానినిగా, పశ్యన్ - చూచువాడై, రుశతీః - తీక్ష్ణములైన, అపః - నీళ్లను, పాదయోః - రెండు కాళ్లయందు, జహౌ - విడిచిపెట్టెను.

గురువును శపించవద్దని సౌదాస మహారాజును ఆయన భార్య వారించెను. దోసిలిలో కోపాగ్నితో తీక్ష్ణములైన జలములు ఉండెను. ఆకాశము, దిక్కులు, భూమి అంతా ప్రాణులతో నిండియుండుటను చూచి ఆ రాజు ఆ నీటిని తన రెండు కాళ్లపైననే పోసుకొనెను. (భార్య మాటకు విలువనిచ్చుటచే ఆయన మిత్రసహుడైనాడు. మిత్రసహుడు అనగా భార్య మాటను మన్నించువాడు).

రాక్షసం భావమాపన్నః పాదే కల్మాషతాం గతః ।
వ్యవాయకాలే దదృశే వనౌకోదంపతీ ద్విజౌ ॥ 25

రాక్షసమ్ - రాక్షసునకు చెందిన, భావమ్ - రూపమును, ఆపన్నః - పొందినవాడు, పాదే - కాలియందు, కల్మాషతామ్ - నల్లదనమును, గతః - పొందినవాడు, వన-ఓకః-దంపతీ - అడవిలో నివసించే దంపతులైన, ద్విజౌ - బ్రాహ్మణులను, వ్యవాయకాలే - సంభోగసమయమునందు, దదృశే - చూచెను.

ఆ మహారాజు రాక్షసుడాయెను. ఆయన పాదములు నల్లగా ఆయెను (కావుననే, ఆయన కల్మాషపాదుడు అనబడినాడు). ఆయన ఒక నాడు అడవిలో నివసించే బ్రాహ్మణదంపతులను సంభోగ సమయములో చూచెను.

క్షుధార్తో జగృహే విప్రం తత్పత్న్యాఽఽహాఽకృతార్థవత్ ।
న భవాన్ రాక్షసస్సాక్షాదిక్ష్వాకూణాం మహారథః ॥ 26

క్షుధా - ఆకలిచే, ఆర్తః - పీడించబడిన సౌదాసుడు, విప్రమ్ - బ్రాహ్మణుని, జగృహే - పట్టుకొనెను, తత్-పత్నీ - ఆయన భార్య, అకృతార్థవత్ - దీనురాలు వలె, ఆహ - పలికెను, భవాన్ - నీవు, సాక్షాత్ -

యథార్థముగా, రాక్షసః - రాక్షసుడవు, న - కావు, ఇక్ష్వాకూణామ్ - ఇక్ష్వాకు వంశపురాజులలో, మహారథః - మహారథుడవు.

రాక్షసరూపములోనున్న సౌదాసుడు ఆకలిచే పీడించబడి ఆ బ్రాహ్మణుని పట్టుకొనెను. దీనురాలగు ఆతని భార్య ఇట్లు పలికెను -- నీవు యథార్థముగా రాక్షసుడవు కావు. నీవు ఇక్ష్వాకువంశపు రాజులలో ఒకడివి, మహారథుడవు.

మదయంత్యాః పతిర్వీర నాధర్మం కర్తుమర్హసి ।
దేహి మేఽపత్యకామాయా అకృతార్థం పతిం ద్విజమ్ ॥ 27

వీర - ఓ వీరుడా!, మదయంత్యాః - మదయంతియొక్క, పతిః - భర్తవు, అధర్మమ్ - అధర్మమును, కర్తుమ్ - చేయుటకు, న అర్హసి - తగవు, అపత్యకామాయాః - సంతానమును కోరే, మే - నాకు, అకృతార్థమ్ - దీనుడైనట్టియు, ద్విజమ్ - బ్రాహ్మణుడైన, పతిమ్ - భర్తను, దేహి - ఇమ్ము.

ఓ వీరుడా! నీవు మదయంతి భర్తవు. నీవు అధర్మమును చేయదగవు. నా భర్త దీనుడు, బ్రాహ్మణుడు. సంతానమును కోరే నాకు నా భర్తను ఇమ్ము.

దేహోఽయం మానుషో రాజన్ పురుషస్యాఖిలార్థదః ।
తస్మాదస్య వధో వీర సర్వార్థవధ ఉచ్యతే ॥ 28

రాజన్ - ఓ రాజా!, అయమ్ - ఈ, మానుషః - మనుష్యజాతికి చెందిన, దేహః - దేహము, పురుషస్య - వ్యక్తికి, అఖిల-అర్థదః - సకలపురుషార్థములనిచ్చునది, వీర - ఓ వీరుడా!, తస్మాత్ - అందువలన, అస్య - దీనియొక్క, వధః - వధ, సర్వ-అర్థవధః - సకలపురుషార్థముల వినాశమని, ఉచ్యతే - చెప్పబడుచున్నది.

ఓ రాజా! నీవు వీరుడవు. ఈ మనుష్యదేహము సకలపురుషార్థములనిచ్చే సాధనము. కావున, దీనిని సంహరించుట యనగా సకలపురుషార్థములను వినాశము చేయుటయేనని పెద్దలు చెప్పుచున్నారు.

ఏష హి బ్రాహ్మణో విద్వాంస్తపశ్శీలగుణాన్వితః ।
ఆరిరాధయిషుర్బ్రహ్మ మహాపురుషసంజ్ఞితమ్ ।
సర్వభూతాత్మభావేన భూతేష్వంతర్హితం గుణైః ॥ 29

ఏషః హి - ఈతడైతే, బ్రాహ్మణః - బ్రాహ్మణుడు, విద్వాన్ - విద్వాంసుడు, తపః-శీలగుణ-అన్వితః - తపస్సు సచ్ఛీలము మరియు గుణములతో కూడియున్నవాడు, మహాపురుషసంజ్ఞితమ్ - పురుషోత్తముడని పిలువబడునట్టియు, భూతేషు - ప్రాణులయందు, గుణైః - సత్త్వరజస్తమోగుణములచే, అంతర్హితమ్ - దాగియున్న, బ్రహ్మ - పరబ్రహ్మను, సర్వభూత-ఆత్మభావేన - సకలప్రాణులయందు ఆత్మ అనే భావముతో, ఆరిరాధయిషుః - ఆరాధించ గోరువాడు.

ఈతడు బ్రాహ్మణుడు, విద్వాంసుడు. ఈతనియందు తపస్సు, సచ్ఛీలము, సద్గుణములు నిండా యున్నవి. ఈతడు సకలప్రాణులయందు ఆత్మభావము గలవాడై పరబ్రహ్మను ఆరాధించ గోరుచున్నాడు. సకలప్రాణులలో ఆత్మరూపముగా ఉన్ననూ, సత్త్వరజస్తమోగుణములచే కప్పివేయబడియున్న ఆ పరబ్రహ్మనే మహాత్ములు పురుషోత్తముడని పిలిచెదరు.

సోఽయం బ్రహ్మర్షివర్యస్తే రాజర్షిప్రవరాద్విభో ।
కథమర్హతి ధర్మజ్ఞ వధం పితురివాత్మజః ॥ 30

విభో - ఓ రాజా!, ధర్మజ్ఞ - ధర్మము తెలిసినవాడా!, రాజర్షిప్రవరాత్ - రాజర్షులలో శ్రేష్ఠుడవగు, తే - నీ వలన, సః - అట్టి, బ్రహ్మర్షివర్యః - బ్రహ్మర్షులలో శ్రేష్ఠుడగు, అయమ్ - ఈతడు, పితుః - తండ్రి వలన, ఆత్మజః ఇవ - పుత్రుడు వలె, వధమ్ - వధను, కథమ్ - ఎట్లు, అర్హతి - తగును?

ఓ రాజా! నీవు ధర్మము తెలిసినవాడవు. రాజర్షులలో శ్రేష్ఠుడవగు నీవు అట్టి బ్రహ్మర్షులలో శ్రేష్ఠుడగు ఈయనను వధించుట తగునా? (తగదు). తండ్రి పుత్రుని వధించుట తగునా? (తగదు).

తస్య సాధోరపాపస్య భ్రూణస్య బ్రహ్మవాదినః ।
కథం వధం యథా బభ్రోర్మన్యతే సన్మతో భవాన్ ॥ 31

సత్-మతః - సత్పురుషులచే అంగీకరించబడే, భవాన్ - నీవు, సాధోః - సత్పురుషుడైనట్టియు, అపాపస్య - పాపము లేనట్టియు, భ్రూణస్య - శ్రోత్రియుడైనట్టియు, బ్రహ్మవాదినః - వేదవేత్తయగు, (బ్రహ్మ వాదినః - వేదవేత్తయొక్క, భ్రూణస్య - పుత్రుడైన), తస్య - ఆ బ్రాహ్మణు నియొక్క, వధమ్ - వధను, బభ్రోః యథా - గోవుయొక్క వలె, కథమ్ - ఏ విధముగా, సాధు - మంచిదిగా, మన్యతే - తలచుచున్నావు?

నీవు సత్పురుషులచే కొనియాడబడేవాడవు. ఈతడు సత్పురుషుడు, పాపమునెరుగని వాడు, శ్రోత్రియుడు, వేదవేత్త, వేదవేత్తయొక్క కొడుకు. ఇట్టి బ్రాహ్మణుని వధించుట గోవును వధించుట వంటిది. ఇది మంచి పనియని నీవు ఎట్లు తలచెదవు? (అట్లు తలచుట సంభవము కాదు).

యద్యయం క్రియతే భక్షస్తర్హి మాం ఖాద పూర్వతః ।
న జీవిష్యే వినా యేన క్షణం చ మృతకం యథా ।। 32

అయమ్ - ఈయన, భక్షః - ఆహారముగా, క్రియతే యది - చేయబడే పక్షములో, తర్హి - అప్పుడు, పూర్వతః - ముందుగా, మృతకం యథా - మరణించినవానితో సమానమైన, మామ్ - నన్ను, ఖాద - తినుము, యేన వినా - ఎవరు లేనిచో, క్షణం చ - క్షణకాలమైననూ, న జీవిష్యే - జీవించి యుండనో.

ఈయన లేనిదే నేను క్షణకాలమైననూ జీవించి యుండను. నేను మరణించినదానితో సమానము. కావున, నీవు ఈయనను తినే పక్షములో, ముందుగా నన్ను తినుము.

ఏవం కరుణభాషిణ్యా విలపంత్యా అనాథవత్ ।
వ్యాఘ్రః పశుమివాఖాదత్సౌదాసశ్శాపమోహితః ।। 33

ఏవమ్ - ఈ విధముగా, కరుణభాషిణ్యాః - దీనముగా మాటలాడుచున్న ఆమె, అనాథవత్ - అనాథవలె, విలపంత్యాః - ఏడ్చుచుండగా, శాపమోహితః - శాపముచే మోహమును పొందియున్న, సౌదాసః - సౌదాసుడు, వ్యాఘ్రః - పులి, పశుం ఇవ - పశువును వలె, అఖాదత్ - తినెను.

ఈ విధముగా ఆమె అనాథ వలె దీనముగా పలుకుతూ ఏడ్చు చుండెను. కాని, శాపముచే మోహితుడై యున్న సౌదాసుడు, పెద్దపులి పశువును వలె, ఆ బ్రాహ్మణుని తినివేసెను.

బ్రాహ్మణీ వీక్ష్య దిధిషుం పురుషాదేన భక్షితమ్ ।
శోచంత్యాత్మానముర్వీశమశపత్కుపితా సతీ ॥ 34

దిధిషుమ్ - తనతో కలియగోరుచున్నట్టియు, పురుషాదేన - నర మాంస భక్షకునిచే, భక్షితమ్ - భక్షించబడిన భర్తను, వీక్ష్య - చూచి, సతీ - పతివ్రతయగు, బ్రాహ్మణీ - ఆ బ్రాహ్మణస్త్రీ, ఆత్మానమ్ - తనను గురించి, శోచంతీ - దుఃఖించుచున్నదై, కుపితా - కోపించినదై, ఉర్వీ-ఈశమ్ - సౌదాస మహారాజును, అశపత్ - శపించెను.

తనతో రమించగోరుచున్న తన భర్తను నరమాంస భక్షకుడు తినుచుండగా చూచి, పతివ్రతయగు ఆ బ్రాహ్మణస్త్రీ తన స్థితికి చాల శోకించెను. ఆమె కోపించి, ఆ సౌదాస మహారాజునకు శాపమునిచ్చెను.

యస్మాన్మే భక్షితః పాప కామార్తాయాః పతిస్త్వయా ।
తవాపి మృత్యురాధానాదకృతప్రజ్ఞ దర్శితః ॥ 35

పాప - ఓ పాపీ!, అకృతప్రజ్ఞ - ఓ దుర్బుద్ధీ!, కామ-అర్తాయాః - కామనచే పీడించబడిన, మే - నాయొక్క, పతిః - భర్త, త్వయా - నీచే, యస్మాత్ - ఎందువలనైతే, భక్షితః - భక్షించబడినాడో అందువలన, తవ అపి - నీకు కూడ, మృత్యుః - మరణము, ఆధానాత్ - సంభోగము వలన, దర్శితః - భావన చేయబడినది.

ఓ పాపీ! నీవు దుర్బుద్ధివి. కామనచే పీడించబడిన నా భర్తను నీవు తినివేసితివి. కావున, నేను నీకు కూడ మరణము సంభోగము వలననే కలుగునని భావించెదను (శపించుచున్నాను).

ఏవం మిత్రసహం శప్త్వా పతిలోకపరాయణా ।
తదస్థీని సమిద్ధేऽగ్నౌ ప్రాస్య భర్తుర్గతిం గతా ॥ 36

పతిలోకపరాయణా - భర్తయొక్క లోకమే ఏకైక లక్ష్యముగా గల ఆ బ్రాహ్మణస్త్రీ, మిత్రసహమ్ - మిత్రసహుని, ఏవమ్ - ఈ విధముగా, శప్త్వా - శపించి, తద్-అస్థీని - ఆ భర్తయొక్క ఎముకలను, సమిద్ధే - బాగా ప్రజ్వరిల్ల జేయబడిన, అగ్నౌ - అగ్నియందు, ప్రాస్య - వేసి, భర్తుః - భర్తయొక్క, గతిమ్ - పుణ్యలోకమును గురించి, గతా - వెళ్లినది.

ఆ బ్రాహ్మణస్త్రీకి తన భర్త పొందిన పుణ్యలోకమే ఏకైకలక్ష్యము. ఆమె ఈ విధముగా మిత్రసహుని శపించి, అగ్నిని బాగా ప్రజ్వరిల్ల జేసి, దానియందు తన భర్తయొక్క ఎముకలను సమర్పించెను. తరువాత ఆమె భర్త పొందిన లోకమును పొందెను.

విశాపో ద్వాదశాబ్దాంతే మైథునాయ సముద్యతః ।
విజ్ఞాయ బ్రాహ్మణీశాపం మహిష్యా స నివారితః ।। 37

ద్వాదశ-అబ్ద-అంతే - పన్నెండు సంవత్సరములు గడచిన పిదప, విశాపః - తొలగిన శాపము గల రాజు, మైథునాయ - సంభోగము కొరకు, సముద్యతః - సంసిద్ధుడాయెను, బ్రాహ్మణీశాపమ్ - బ్రాహ్మణస్త్రీయొక్క శాపమును గురించి, విజ్ఞాయ - తెలుసుకొని, మహిష్యా - భార్యచే, సః - ఆ రాజు, నివారితః - వారించబడినవాడు.

పన్నెండు సంవత్సరముల తరువాత సౌదాస మహారాజునకు శాప విముక్తి కలిగెను. కాని, ఆయనకు బ్రాహ్మణస్త్రీ ఇచ్చిన శాపమును గురించి ఆయన భార్యకు తెలిసెను. కావుననే, ఆమె ఆయన రమించగో రగా నివారించెను.

తత ఊర్ధ్వం స తత్యాజ స్త్రీసుఖం కర్మణాఽప్రజః ।
వసిష్ఠస్తదనుజ్ఞాతో మదయంత్యాం ప్రజామధాత్ ।। 38

తతః - ఆ శాపముకంటె, ఊర్ధ్వమ్ - పైన, సః - ఆ సౌదాసుడు, స్త్రీసుఖమ్ - స్త్రీతోడి సుఖమును, తత్యాజ - విడిచి పెట్టెను, కర్మణా - చేసిన పనిచే, అప్రజః - సంతానము లేనివాడు, తద్-అనుజ్ఞాతః - ఆయ నచే ప్రార్థించబడిన, వసిష్ఠః - వసిష్ఠుడు, మదయంత్యామ్ - మదయంతి యందు, ప్రజామ్ - సంతానమును, అధాత్ - ఆధానము చేసెను.

ఆ శాపము తరువాత ఆ సౌదాస మహారాజు స్త్రీతోడి సుఖమును విడిచి పెట్టెను. బ్రాహ్మణుని తినివేయుట అనే కర్మచే ఆయన సంతానము లేనివాడాయెను. ఆయన ప్రార్థించగా, వసిష్ఠుడు మదయంతియందు సంతానమును కనెను.

సా వై సప్త సమా గర్భమబిభ్రన్న వ్యజాయత ।
జఘ్నేఽశ్మనోదరం తస్యాస్సోఽశ్మకస్తేన కథ్యతే ॥ 39

సా వై - ఆ మదయంతియైతే, సప్త - ఏడు, సమాః - సంవత్సరములను, గర్భమ్ - గర్భమును, అబిభ్రత్ - ధరించెను, న వ్యజాయత - పుట్టలేదు, అశ్మనా - రాయితో, తస్యాః - ఆమెయొక్క, ఉదరమ్ - ఉదరమును, జఘ్నే - కొట్టెను, తేన - దానిచే, సః - ఆ బాలకుడు, అశ్మకః - అశ్మకుడని, కథ్యతే - చెప్పబడుచున్నాడు.

ఆ మదయంతి ఏడు సంవత్సరములు గర్భమును ధరించిననూ, శిశువు పుట్టలేదు. అపుడామె ఉదరముపై కొట్టుకొనగా శిశువు జన్మించెను. కావుననే, ఆ శిశువునకు అశ్మకుడు అనే పేరు స్థిరమయ్యెను.

అశ్మకాన్మూలకో జజ్ఞే యః స్త్రీభిః పరిరక్షితః ।
నారీకవచ ఇత్యుక్తో నిఃక్షత్రే మూలకోఽభవత్ ॥ 40

అశ్మకాత్ - అశ్మకుని వలన, మూలకః - మూలకుడు, జజ్ఞే - పుట్టెను, యః - ఎవడైతే, స్త్రీభిః - స్త్రీలచే, పరిరక్షితః - అన్ని విధములుగా రక్షించబడినవాడు, నారీకవచః - నారీకవచుడు, ఇతి - అని, ఉక్తః - పిలువబడినవాడు, నిఃక్షత్రే - క్షత్రియులు నశించగా, మూలకః - వంశమునకు మూలపురుషుడు, అభవత్ - ఆయెను.

అశ్మకుని పుత్రుడు మూలకుడు. పరశురాముడు క్షత్రియవంశములను నశింప జేయుచుండగా, స్త్రీలు ఆ బాలకుని అన్ని విధములుగా రక్షించుటచే, ఆ బాలకుడు నారీకవచుడు (స్త్రీలు కవచముగా గలవాడు) అని పిలువబడెను. క్షత్రియులు నశించగా, క్షత్రియవంశమునకు మూలపురుషుడగుటచే, మూలకుడు అనే పేరు సార్థకమాయెను.

తతో దశరథస్తస్మాత్పుత్ర ఐడవిడస్తతః ।
రాజా విశ్వసహో యస్య ఖట్వాంగశ్చక్రవర్త్యభూత్ ॥ 41

తతః - ఆ మూలకునినుండి, దశరథః - దశరథుడు, తస్మాత్ - ఆ దశరథుని వలన, ఐడవిడః - ఐడవిడుడనే, పుత్రః - పుత్రుడు, తతః - ఆయన వలన, రాజా విశ్వసహః - విశ్వసహ మహారాజు, యస్య - ఏ విశ్వసహునకు, ఖట్వాంగః చక్రవర్తీ - ఖట్వాంగ చక్రవర్తి, అభూత్ - కలిగెనో.

ఆ మూలకుని పుత్రుడు దశరథుడు. దశరథుని పుత్రుడు ఐడవిడుడు. ఐడవిడుని పుత్రుడు విశ్వసహ మహారాజు. విశ్వసహుని పుత్రుడగు ఖట్వాంగుడు చక్రవర్తి ఆయెను.

యో దేవైరర్థితో దైత్యానవధీద్యుధి దుర్జయః ।
ముహూర్తమాయుర్ జ్ఞాత్వైత్య స్వపురం సందధే మనః ॥ 42

యుధి - యుద్ధమునందు, దుర్జయః - జయించ శక్యము కాని, యః - ఏ ఖట్వాంగుడైతే, దేవైః - దేవతలచే, అర్థితః - ప్రార్థించబడినవాడై, దైత్యాన్ - రాక్షసులను, అవధీత్ - సంహరించెనో, ఆయుః - ఆయుర్దాయము, ముహూర్తమ్ - సుమారు ఒక గంట అని, జ్ఞాత్వా - తెలుసుకొని, స్వపురమ్ - తన నగరమును గురించి, ఏత్య - వచ్చి, మనః - మనస్సును, సందధే - ఏకాగ్రము చేసెను.

ఖట్వాంగుని యుద్ధములో జయించుట శక్యము కాదు. దేవతలు ప్రార్థించగా ఆయన రాక్షసులను సంహరించెను. తన ఆయుర్దాయము కేవలము సుమారు ఒక గంట మాత్రమే ఉన్నదని తెలియగానే, ఆయన తన నగరమునకు తిరిగి వచ్చి మనస్సును భగవానునిపై లగ్నము చేసెను.

న మే బ్రహ్మకులాత్ప్రాణాః కులదైవాన్న చాత్మజాః ।
న శ్రియో న మహీ రాజ్యం న దారాశ్చాతివల్లభాః ॥ 43

కులదైవాత్ - వంశమునందు పూజించబడే, బ్రహ్మకులాత్ - వేదవేత్తల సమూహము కంటె, మే - నాకు, ప్రాణాః - ప్రాణములు, అతివ

ల్లభాః - మిక్కిలి ప్రియమైనవి, న - కావు, ఆత్మజాః చ - పుత్రులు కూడ, న - కారు, శ్రియః - సంపదలు, న - కావు, మహీ - భూమి, న - కాదు, రాజ్యమ్ - రాజ్యము, దారాః చ - భార్య కూడ, న - కారు.

(ఖట్వాంగుడు ఇట్లు తలపోసెను) -- వేదవేత్తల సమూహము మా కులదైవము. వారికంటె నాకు ప్రాణములు గాని, పుత్రులైననూ గాని, సంపదలు గాని, భూమి గాని, రాజ్యము గాని, భార్యయైననూ ఎక్కువ ప్రియమైనవి గావు.

న బాల్యేఽపి మతిర్మహ్యమధర్మే రమతే క్వచిత్ ।
నాపశ్యముత్తమశ్లోకాదన్యత్కించన వస్త్వహమ్ ॥ 44

మహ్యమ్ - నా కొరకు, బాల్యే అపి - బాల్యమునందు కూడ, మతిః - బుద్ధి, క్వచిత్ - ఏనాడైననూ, అధర్మే - అధర్మమునందు, న రమతే - రమించలేదు, ఉత్తమశ్లోకాత్ - పుణ్యకీర్తియగు శ్రీహరికంటె, అన్యత్ - భిన్నమైన, వస్తు - వస్తువును, కించిత్ - దేనినైననూ, అహమ్ - నేను, న అపశ్యమ్ - చూడలేదు.

నా బుద్ధి బాల్యమునందు కూడ ఏనాడైననూ అధర్మమునందు రమించలేదు. నేను ఏ వస్తువునైననూ పుణ్యకీర్తియగు శ్రీహరికంటె భిన్నముగా చూడలేదు.

దేవైః కామవరో దత్తో మహ్యం త్రిభువనేశ్వరైః ।
న వృణే తమహం కామం భూతభావనభావనః ॥ 45

త్రిభువన-ఈశ్వరైః - ముల్లోకములకు ప్రభువులైన, దేవైః - దేవతలచే, మహ్యమ్ - నా కొరకు, కామవరః - ఇచ్ఛకు అనుగుణమైన వరము, దత్తః - ఈయబడినది, భూతభావనభావనః - ప్రాణులకు రక్షకుడైన శ్రీహరియందు భావన (భక్తి) గల, అహమ్ - నేను, తమ్ - ఆ, కామమ్ - కోరికను, న వృణే - కోరుట లేదు.

ముల్లోకములకు ప్రభువులైన దేవతలు నాకు యథేచ్ఛగా కోరుకొనుమని వరమునిచ్చిరి. కాని, నా మనస్సు ప్రాణుల రక్షకుడగు శ్రీహరి యందే గలదు. కావున, నేను ఆ వరమును కోరుట లేదు.

యే విక్షిప్తేంద్రియధియో దేవాస్తే స్వహృది స్థితమ్ ।
న విందంతి ప్రియం శశ్వదాత్మానం కిముతాపరే ।। 46

విక్షిప్త-ఇంద్రియధియః - విషయభోగములచే ఆకర్షించబడిన ఇంద్రియములు మరియు బుద్ధి గల, యే - ఏ, దేవాః - దేవతలు గలరో తే - వారు, శశ్వత్ - సర్వకాలములయందు, స్వహృది - తమ హృదయమునందు, స్థితమ్ - ఉన్న, ప్రియమ్ - ప్రియమైన, ఆత్మానమ్ - ఆత్మరూపుడగు శ్రీహరిని, న విందంతి - పొందుట లేదు, అపరే - ఇతరులు (తెలియుట లేదని), కిం ఉత - వేరుగా చెప్పవలయునా?

దేవతలైననూ ఇంద్రియములు మరియు బుద్ధి భోగములచే ఆకర్షితములైనచో, తమ హృదయమునందే నిత్యము ప్రియమగు ఆత్మరూపుడై యున్న శ్రీహరిని తెలియజాలరు. ఇతరులు (మానవులు) తెలియలేరని వేరుగా చెప్పవలయునా?

అథేశమాయారచితేషు సంగం గుణేషు గంధర్వపురోపమేషు ।
రూఢం ప్రకృత్యాఽఽత్మని విశ్వకర్తుర్భావేన హిత్వా తమహం ప్రపద్యే ।।47

అథ - అందువలన, ఈశమాయారచితేషు - ఈశ్వరుని మాయాశక్తిచే నిర్మించబడినట్టియు, గంధర్వపుర-ఉపమేషు - గంధర్వనగరమును పోలిన, గుణేషు - గుణకార్యములగు శబ్దాది విషయములయందు, ప్రకృత్యా - స్వభావముచే, ఆత్మని - బుద్ధియందు, రూఢమ్ - పాదుకొని యున్న, సంగమ్ - ఆసక్తిని, విశ్వకర్తుః - జగత్కర్తయగు భగవానుని, భావేన - భక్తిచే, హిత్వా - విడిచిపెట్టి, తమ్ - ఆ భగవానుని, అహమ్ - నేను, ప్రపద్యే - శరణు వేడుచున్నాను.

ఈశ్వరుని మాయాశక్తిచే నిర్మితములైన సత్త్వరజస్తమోగుణకార్యములగు శబ్దాది విషయములు గంధర్వనగరము వలె కనబడేవే గాని వాస్తవముగా ఉన్నవి కావు. కాని, నైసర్గికమగు అజ్ఞానముచే బుద్ధియందు

వాటిపై ఆసక్తి గట్టిగా నెలకొని యున్నది. అందువలన, నేను జగత్కర్త యగు భగవానునియందలి భక్తిచే ఆ ఆసక్తిని విడిచిపెట్టి, ఆ భగవానునే శరణు వేడుచున్నాను.

ఇతి వ్యవసితో బుద్ధ్యా నారాయణగృహీతయా ।
హిత్వాఽన్యభావమజ్ఞానం తతస్స్వం భావమాశ్రితః ॥ 48

ఇతి - ఈ విధముగా, నారాయణగృహీతయా - నారాయణునిచే ఆకర్షించబడిన, బుద్ధ్యా - బుద్ధిచే, వ్యవసితః - నిశ్చయించుకున్నవాడై, అజ్ఞానమ్ - అజ్ఞానమైన, అన్యభావమ్ - భేదభావమును, హిత్వా - విడిచి పెట్టి, తతః - వెంటనే, స్వమ్ - తనదైన, భావమ్ - స్వరూపమైన భగవానుని, ఆశ్రితః - ఆశ్రయించినవాడు.

ఖట్వాంగుని బుద్ధి నారాయణునిచే ఆకర్షితమగుటచే ఆయన ఈ విధముగా నిశ్చయించుకొనెను. వెంటనే ఆయన అజ్ఞానకల్పితమగు భేద బుద్ధిని (అనాత్మలగు దేహాదులయందు ఆత్మబుద్ధిని) విడిచిపెట్టి, తన స్వరూపమైయున్న భగవానుని (జ్ఞానముచే) పొందెను.

యత్తద్బ్రహ్మ పరం సూక్ష్మమశూన్యం శూన్యకల్పితమ్ ।
భగవాన్ వాసుదేవేతి యం గృణంతి హి సాత్వతాః ॥ 49

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే నవమస్కంధే నవమోఽధ్యాయః ॥

యత్ - ఏ, బ్రహ్మ - బ్రహ్మ గలదో, తత్ - అది, పరమ్ - ప్రకృతికి అతీతము, సూక్ష్మమ్ - ఇంద్రియగోచరము కానిది, అశూన్యమ్ - శూన్యము కానిది, శూన్యకల్పితమ్ - శూన్యమా యన్నట్లు కల్పించబడినది, యం హి - ఏ పరబ్రహ్మనైతే, సాత్వతాః - సత్త్వగుణప్రధానులగు భక్తులు, భగవాన్ - భగవానుడు, వాసుదేవః - వాసుదేవుడు, ఇతి - అని, గృణంతి - వర్ణించుచున్నారో.

పరబ్రహ్మ ప్రకృతికి అతీతమైనది, ఇంద్రియగోచరము కానిది. అది శూన్యము కాదు. కాని, శూన్యమా యన్నట్లు కల్పించబడినది. సత్త్వ

గుణప్రధానులగు భక్తులు ఆ పరబ్రహ్మను భగవానుడనియు, వాసుదేవుడనియు వర్ణించుచున్నారు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
గంగావతరణ వృత్తాంతమును వర్ణించే తొమ్మిదవ
అధ్యాయము ముగిసినది (9).

* * * * *

# అథ దశమోఽధ్యాయః

## శ్రీరాముని చరితము

శ్రీశుక ఉవాచ।
ఖట్వాంగాద్దీర్ఘబాహుశ్చ రఘుస్తస్మాత్పృథుశ్రవాః ।
అజస్తతో మహారాజస్తస్మాద్దశరథోఽభవత్ ।। 1

ఖట్వాంగాత్ - ఖట్వాంగుని వలన, దీర్ఘబాహుః చ - దీర్ఘబాహువు, తస్మాత్ - ఆయన వలన, పృథుశ్రవాః - గొప్ప కీర్తి గల, రఘుః - రఘువు, తతః - ఆయన వలన, అజః మహారాజః - అజ మహారాజు, తస్మాత్ - ఆయన వలన, దశరథః - దశరథుడు, అభవత్ - కలిగెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఖట్వాంగుని పుత్రుడు దీర్ఘబాహువు. దీర్ఘబాహువు పుత్రుడు గొప్ప కీర్తి గల రఘువు. రఘువు పుత్రుడు అజమహారాజు. అజుని పుత్రుడు దశరథుడు.

తస్యాపి భగవానేష సాక్షాద్బ్రహ్మమయో హరిః ।
అంశాంశేన చతుర్ధాఽగాత్పుత్రత్వం ప్రార్థితస్సురైః ।
రామలక్ష్మణభరతశత్రుఘ్నా ఇతి సంజ్ఞయా ।। 2

తస్య అపి - ఆ దశరథ మహారాజునకు కూడ, సాక్షాత్ - సాక్షాత్తుగా, సురైః - దేవతలచే, ప్రార్థితః - ప్రార్థించబడిన, బ్రహ్మమయః - పరబ్రహ్మ స్వరూపుడగు, ఏషః - ఈ, హరిః భగవాన్ - శ్రీహరి భగవానుడు, అంశ-అంశేన - అంశలతో పూర్ణరూపముతో, రామలక్ష్మణభరతశత్రుఘ్నాః - రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు, ఇతి - అనే, సంజ్ఞయా - పేరుతో, చతుర్ధా - నాలుగు రూపములుగా, పుత్రత్వమ్ - పుత్రత్వమును, అగాత్ - పొందెను.

సాక్షాత్తు పరబ్రహ్మమైన ఈ శ్రీహరి భగవానుని దేవతలు ప్రార్థించగా, ఆయన తన అంశలతో కూడియున్న పూర్ణరూపముతో ఆ దశరథునకు పుత్రుడాయెను. రామ భరత లక్ష్మణశత్రుఘ్నులు అని వారి పేర్లు.

తస్యానుచరితం రాజన్నృషిభిస్తత్త్వదర్శిభిః ।
శ్రుతం హి వర్ణితం భూరి త్వయా సీతాపతేర్ముహుః ॥ 3

రాజన్ - ఓ రాజా!, సీతాపతేః - సీతాపతియగు, తస్య - ఆ శ్రీరామునియొక్క, అనుచరితమ్ - వృత్తాంతము, తత్త్వదర్శిభిః - తత్త్వవేత్తలగు, ఋషిభిః - మహర్షులచే, భూరి - అధికముగా, వర్ణితం హి - వర్ణించబడినది, త్వయా - నీచే, ముహుః - పలుమార్లు, శ్రుతమ్ - వినబడినది.

ఓ పరీక్షిన్మహారాజా! తత్త్వవేత్తలగు మహర్షులు సీతాపతియగు ఆ శ్రీరాముని వృత్తాంతమును విస్తారముగా వర్ణించిరి. నీవు కూడ పలుమార్లు వినియుంటివి.

గుర్వర్థే త్యక్తరాజ్యో వ్యచరదనువనం పద్మపద్భ్యాం ప్రియాయాః
పాణిస్పర్శాక్షమాభ్యాం మృజితపథరుజో యో హరీంద్రానుజాభ్యామ్।
వైరూప్యాచ్ఛూర్పణఖ్యాః ప్రియవిరహరుషాఽఽరోపితభ్రూవిజృంభ-
త్రస్తాబ్ధిర్బద్ధసేతుః ఖలదవదహనః కోసలేంద్రోఽవతాన్నః ॥ 4

యః - ఏ శ్రీరాముడైతే, గురు-అర్థే - తండ్రి ప్రయోజనమునందు, త్యక్తరాజ్యః - విడువబడిన రాజ్యము గలవాడై, ప్రియాయాః - ప్రియురాలగు సీతాదేవియొక్క, పాణిస్పర్శ-అక్షమాభ్యామ్ - చేతులతో స్పృశించుటను తట్టుకోలేని, పద్మపద్భ్యామ్ - పద్మములవంటి పాదములతో, అనువనమ్ - అనేకములగు అడవులను, వ్యచరత్ - సంచరించెనో, హరి-ఇంద్ర-అనుజాభ్యామ్ - వానరాధిపతియగు సుగ్రీవునిచే మరియు తమ్ముడగు లక్ష్మణునిచే, మృజితపథరుజః - తొలగించబడిన మార్గమునందలి శ్రమ కలిగినవాడు, శూర్పణఖ్యాః - శూర్పణఖకు, వైరూప్యాత్ - వికృతరూపమును చేయుట నిమిత్తముగా, ప్రియవిరహరుషా - ప్రియురాలి విరహముచే కలిగిన కోపముచే, ఆరోపితభ్రూవిజృంభత్రస్త-అబ్ధిః - కుటిలముగా చేయబడిన కనుబొమల సాగదీయుటలచే భయపడిన సముద్రుడు

కలిగినవాడు, బద్ధసేతుః - కట్టబడిన సేతువు గలవాడు, ఖలదవదహనః - దుష్టులు అనే అడవికి కార్చిచ్చు అయినవాడు అగు, కోశల-ఇంద్రః - కోసలాధిపతియగు శ్రీరాముడు, నః - మమ్ములను, అవతాత్ - రక్షించు గాక!

శ్రీరాముడు తండ్రి మాటను నిలబెట్టుటకై రాజ్యమును విడిచిపెట్టెను. ప్రియురాలగు సీత తన చేతులతో నొక్కిననూ నొచ్చుకొనే సుకుమారమైన పద్మములవంటి పాదములతో ఆయన అనేకవనములను సంచరించెను. ఆయనకు మార్గమునందు కలిగిన శ్రమను వానరాధిపతియగు సుగ్రీవుడు మరియు సోదరుడగు లక్ష్మణుడు తొలగించెడివారు. శూర్పణఖను వికృతరూపగా చేసినందువలన రావణుడు శ్రీరామునకు ప్రియురాలగు సీతతో వియోగమును కలిగించెను. దానిచే కోపమును పొందియున్న శ్రీరాముడు కనుబొమలను విరిచి సారించగా సముద్రుడు భయపడిపోయెను. తరువాత శ్రీరాముడు సేతువును కట్టి, రావణుడు మొదలగు దుష్టుల అడవికి కార్చిచ్చై తగులబెట్టెను. అట్టి కోసలాధిపతియగు శ్రీరాముడు మమ్ములను రక్షించు గాక!

విశ్వామిత్రాధ్వరే యేన మారీచాద్యా నిశాచరాః ।
పశ్యతో లక్ష్మణస్యైవ హతా నైర్ఋతపుంగవాః ॥ 5

విశ్వామిత్ర-అధ్వరే - విశ్వామిత్ర మహర్షియొక్క యజ్ఞమునందు, లక్ష్మణస్య - లక్ష్మణుడు, పశ్యతః ఏవ - చూచుచుండగనే, మారీచ-ఆద్యాః - మారీచుడు మొదలైన, నిశాచరాః - రాత్రులయందు సంచరించే, నైర్ఋతపుంగవాః - రాక్షస శ్రేష్ఠులు, యేన - ఏ శ్రీరామునిచే, హతాః - సంహరించబడినవారో.

విశ్వామిత్ర మహర్షియొక్క యజ్ఞములో లక్ష్మణుడు తేరిపార చూచుచుండగా, శ్రీరాముడు మారీచుడు, సుబాహుడు మొదలైన రాత్రిళ్లు సంచరించే రాక్షసవీరులను సంహరించెను.

యో లోకవీరసమితౌ ధనురైశముగ్రం
సీతాస్వయంవరగృహే త్రిశతోపనీతమ్ ।

ఆదాయ బాలగజలీల ఇవేక్షుయష్టిం
సజ్జీకృతం నృప వికృష్య బభంజ మధ్యే ॥ 6

నృప - ఓ మహారాజా!, యః - ఏ శ్రీరాముడైతే, సీతాస్వయంవ రగృహే - సీతాదేవియొక్క స్వయంవరముయొక్క ప్రాసాదమునందు, లోకవీరసమితౌ - లోకములోని వీరుల సమాజమునందు, త్రిశత-ఉపనీతమ్ - మూడు వందలమందిచే తీసుకురాబడినట్టియు, ఐశమ్ - ఈశ్వరునకు చెందినట్టియు, ఉగ్రమ్ - భయంకరమైన, ధనుః - ధనుస్సును, బాలగజ లీలః - గున్న ఏనుగుయొక్క విలాస వంటి విలాస గలవాడై, ఇక్షుయష్టిం ఇవ - చెరకు గడను వలె, ఆదాయ - తీసుకొని, సజ్జీకృతమ్ - ఎక్కించబ డిన నారిత్రాడు గల ఆ ధనుస్సును, వికృష్య - సాగదీసి, మధ్యే - మధ్య యందు, బభంజ - విరిచెనో.

ఓ పరీక్షిన్మహారాజా! లోకములోని వీరులు సీతాదేవి స్వయంవ రము జరిగే ప్రాసాదములో సమావేశమైరి. భయంకరమగు ఈశ్వరుని ధనుస్సును మూడువందల మంది తెచ్చి అచట ఉంచిరి. గున్న యేనుగు అవలీలగా చెరుకుగడను పట్టుకున్న విధముగా, ఆ శ్రీరాముడు ఆ ధను స్సును చేతిలోనికి తీసుకొని, నారిత్రాడు యెక్కించి లాగి, దానిని మధ్యలో విరిచెను.

జిత్వానురూపగుణశీలవయోఽంగరూపాం
సీతాభిధాం శ్రియమురస్యభిలబ్ధమానామ్ ।
మార్గే వ్రజన్ భృగుపతేర్వ్యనయత్ప్రరూఢం
దర్పం మహీమకృత యస్త్రిరరాజబీజామ్ ॥ 7

అనురూపగుణశీలవయః-అంగరూపామ్ - తనకు యోగ్యములైన గుణములు శీలము వయస్సు దేహముయొక్క రూపము కలిగినట్టియు, ఉరసి - వక్షఃస్థలమునందు, అభిలబ్ధమానామ్ - పొందబడిన సత్కారము కలిగినట్టియు, సీతా-అభిధామ్ - సీత అనే పేరు గల, శ్రియమ్ - లక్ష్మీదే విని, జిత్వా - పొంది, మార్గే - మార్గమునందు, వ్రజన్ - వెళ్లుచున్నవాడై, భృగుపతేః - భృగువంశీయులకు నాయకుడైన పరశురామునియొక్క, ప్రరూఢమ్ - మిక్కిలి పెద్దదైన, దర్పమ్ - గర్వమును, వి-అనయత్ -

తొలగించెను, యః - ఏ పరశురాముడైతే, త్రిః - మూడు (ఏడు) సార్లు, మహీమ్ - భూలోకమును, అరాజబీజామ్ - రాజవంశములు లేనిదిగా, అకృత - చేసెనో.

శ్రీహరి వక్షఃస్థలమునందు నివసించే సన్మానము లక్ష్మీదేవికి గలదు. ఆమెయే ఇప్పుడు సీత అనే పేరుతో వెలసినది. గుణములు, సచ్ఛీలము, వయస్సు, అంగములు, రూపము అనే అంశములలో ఆ సీతాదేవి రామునకు అన్ని విధములుగా తగియుండెను. ఆమెను స్వయంవరములో తన దానినిగా చేసుకొని శ్రీరాముడు అయోధ్యకు వెళ్లుచుండెను. ఆ మార్గములో ఆయన భృగువంశశ్రేష్ఠుడగు పరశురాముని మిక్కిలి బలీయమైన గర్వమును అణచివేసెను. ఆ పరశురాముడు ఇరవై ఒక్కసార్లు క్షత్రియులను సంహరించి, భూమండలమునందు క్షత్రియవంశముల బీజము లేకుండా చేసెను.

యస్సత్యపాశపరివీతపితుర్నిదేశం
స్త్రైణస్య చాపి శిరసా జగృహే సభార్యః ।
రాజ్యం శ్రియం ప్రణయినస్సుహృదో నివాసం
త్యక్త్వా యయౌ వనమసూనివ ముక్తసంగః ।। 8

**యః - ఏ శ్రీరాముడు, సభార్యః - భార్యతో కూడినవాడై, సత్యపాశపరివీతపితుః - సత్యమనే పాశముచే కట్టివేయబడిన తండ్రి,** స్త్రైణస్య చ అపి - భార్యకు వశుడే అయిననూ, నిదేశమ్ - ఆదేశమును, శిరసా - శిరస్సుతో, జగృహే - స్వీకరించెనో, రాజ్యమ్ - రాజ్యమును, శ్రియమ్ - సంపదను, ప్రణయినః - ప్రేమగల తల్లి మొదలగువారిని, సుహృదః - మిత్రులను, నివాసమ్ - నివసించే ప్రాసాదమును, ముక్తసంగః - విడిచిపెట్టబడిన ఆసక్తి గల యోగి, అసూన్ ఇవ - ప్రాణములను వలె, త్యక్త్వా - విడిచిపెట్టి, వనమ్ - అడవిని గురించి, యయౌ - వెళ్లెనో.

శ్రీరాముని తండ్రియగు దశరథుడు కైకేయి అనే భార్యకు వశుడు. ఆయన సత్యమనే పాశముచే కట్టివేయబడి రాముని అరణ్యవాసమునకు ఆదేశించెను. శ్రీరాముడు భార్యతో గూడి ఆ ఆదేశమును శిరసా వహించెను. ఆయన రాజ్యమును, సంపదను, ప్రేమించే తల్లి మొదలగువారిని,

మిత్రులను, తాను నివసించే ప్రాసాదమును, సంసారాసక్తిని విడిచిపెట్టిన యోగి ప్రాణములను వలె, విడిచిపెట్టి అడవికి వెళ్లెను.

రక్షస్స్వసుర్వ్యకృత రూపమశుద్ధబుద్ధేః
తస్యాః ఖరత్రిశిరదూషణముఖ్యబంధూన్ ।
జఘ్నే చతుర్దశసహస్రమపారణీయ-
కోదండపాణిరటమాన ఉవాస కృచ్ఛ్రమ్ ॥ 9

అశుద్ధబుద్ధేః - అపవిత్రమగు సంకల్పము గల, రక్షః-స్వసుః - రాక్షసప్రభువగు రావణుని సోదరియగు శూర్పణఖయొక్క, రూపమ్ - రూపమును, వ్యకృత - వికృతముగా చేసెను, తస్యాః - ఆమెయొక్క, ఖరత్రిశిరదూషణముఖ్యబంధూన్ - ఖరుడు దూషణుడు త్రిశిరసుడు మొదలైన బంధువులను, చతుర్దశసహస్రమ్ - పదునాలుగు వేల సైన్యమును, జఘ్నే - సంహరించెను, అపారణీయకోదండపాణిః - ఉల్లంఘించ శక్యము కాని ధనుస్సు చేతియందు గలవాడై, అటమానః - సంచరించువాడై, కృచ్ఛ్రమ్ - కష్టముగా, ఉవాస - నివసించెను.

రాక్షసప్రభువగు రావణాసురుని సోదరి శూర్పణఖ. ఆమె శ్రీరాముని వద్దకు అపవిత్రమగు సంకల్పముతో రాగా, ఆయన ఆమె రూపమును వికృతముగా చేసెను. ఖరుడు, దూషణుడు, త్రిశిరసుడు మొదలైన ఆమె బంధువులను మరియు పదునాల్గువేల మంది రాక్షసులను శ్రీరాముడు సంహరించెను. ఆయన ధనుస్సు చేతియందు పట్టి నిలబడగా, ఆయనను ఉల్లంఘించుట శక్యము కాదు. ఆయన అడవిలో ఈ విధముగా కష్టములను సహిస్తూ సంచరించెను.

సీతాకథాశ్రవణదీపితహృచ్ఛయేన
సృష్టం విలోక్య నృపతే దశకంధరేణ ।
జఘ్నేఽద్భుతైణవపుషాఽఽశ్రమతోఽపకృష్టో
మారీచమాశు విశిఖేన యథా కముగ్రః ॥ 10

నృపతే - ఓ మహారాజా!, సీతాకథాశ్రవణదీపితహృత్-శయేన - సీతాదేవియొక్క వృత్తాంతమును వినుటచే ఉద్దీపింప జేయబడిన కామన

గల, దశకంధరేణ - పది తలల రావణునిచే, సృష్టమ్ - పంపించబడిన, మారీచమ్ - మారీచుని, విలోక్య - చూచి, అద్భుత-ఏణవపుషా - ఆశ్చర్యమును కలిగించే లేడియొక్క రూపముచే, ఆశ్రమతః - ఆశ్రమమునుండి, అపకృష్టః - దూరముగా తీసుకొని పోబడినవాడై, ఆశు - వెంటనే, విశిఖేన - బాణముతో, కమ్ - దక్ష ప్రజాపతిని, ఉగ్రః యథా - వీరభద్రుడు వలె, జఘ్నె - కొట్టెను.

ఓ పరీక్షిన్మహారాజా! సీతయొక్క వృత్తాంతమును విన్న పది తలల రావణుని హృదయములో మన్మథుడు ఉద్దీపింప జేయబడెను. ఆయన మారీచుని ఆశ్చర్యమును గొల్పే రూపములో పంపించెను. ఆ మారీచుడు శ్రీరాముని ఆశ్రమమునుండి దూరముగా తీసుకొని పోయెను. అప్పుడు వెంటనే శ్రీరాముడు ఆ మాయలేడి రూపములోనున్న మారీచుని, వీరభద్రుడు దక్షప్రజాపతిని వలె, బాణముతో సంహరించెను.

రక్షోఽధమేన వృకవద్విపినేఽసమక్షం
వైదేహరాజదుహితర్యపయాపితాయామ్ ।
భ్రాత్రా వనే కృపణవత్ప్రియయా వియుక్తః
స్త్రీసంగినాం గతిమితి ప్రథయంశ్చచార ॥ 11

రక్షః-అదమేన - రాక్షసాధముడగు రావణునిచే, విపినే - అడవియందు, అసమక్షమ్ - రామలక్ష్మణులు దరిలో లేనప్పుడు, వృకవత్ - తోడేలు వలె, వైదేహరాజదుహితరి - విదేహరాజగు జనకుని కుమార్తెయగు సీతాదేవి, అపయాపితాయామ్ - అపహరించబడగా, ఇతి - ఈ విధముగా, ప్రియయా - ప్రియురాలగు సీతాదేవితో, వియుక్తః - వియోగమును పొందిన శ్రీరాముడు, భ్రాత్రా - సోదరుడగు లక్ష్మణునితో గూడి, వనే - అడవియందు, కృపణవత్ - దీనుడు వలె, స్త్రీసంగినామ్ - స్త్రీయందు ఆసక్తి గలవారల, గతిమ్ - గతిని, ప్రథయన్ - ప్రకటించువాడై, చచార - సంచరించెను.

రాక్షసాధముడగు రావణుడు అడవిలో రామలక్ష్మణులు దరిదాపులలో లేని సమయమునందు, తోడేలు మేకను వలె, సీతాదేవిని అపహరించెను. ఆమె విదేహరాజగు జనకుని కుమార్తె. ఈ విధముగా శ్రీరామునకు

తన ప్రియురాలగు సీతాదేవితో వియోగము ఘటిల్లెను. ఆయన అడవిలో సోదరుడగు లక్ష్మణునితో గూడి దీనుడు వలె సంచరించెను. స్త్రీయందు ఆసక్తి గల వ్యక్తి పొందే గతిని ఆయన ఈ విధముగా లోకమునకు ప్రకటించెను.

దగ్ధ్వాఽఽత్మకృత్యహతకృత్యమహన్ కబంధం
సఖ్యం విధాయ కపిభిర్దయితాగతిం తైః ।
బుద్ధ్వాఽథ వాలిని హతే ప్లవగేంద్రసైన్యై-
ర్వేలామగాత్స మనుజోఽజభవార్చితాంఘ్రిః ॥ 12

మనుజః - మానవరూపములోనున్నవాడు, అజభవ-అర్చిత-అంఘ్రిః - బ్రహ్మగారిచే శివునిచే పూజించబడే పాదములు గలవాడు అగు, సః - ఆ శ్రీరాముడు, ఆత్మకృత్యహతకృత్యమ్ - తన కర్మచే నశింపజేయబడిన కర్మబంధము గల జటాయువును, దగ్ధ్వా - దహనకర్మను చేసి, కబంధమ్ - కబంధుని, అహన్ - సంహరించెను, కపిభిః - వానరులతో, సఖ్యమ్ - మైత్రిని, విధాయ - చేసుకొని, వాలిని - వాలి, హతే - సంహరించబడగా, తైః - వారి ద్వారా, దయితాగతిమ్ - ప్రియురాలగు సీతయొక్క జాడను, బుద్ధ్వా - తెలుసుకొని, అథ - తరువాత, ప్లవగ-ఇంద్రసైన్యైః - వానరాధిపతియగు సుగ్రీవునియొక్క సైన్యములతో కూడి, వేలామ్ - చెలియలి కట్టను, అగాత్ - చేరుకొనెను.

శ్రీరాముడు మానవుడే అయినా ఆయన పాదములను బ్రహ్మగారు, శివుడు పూజించెదరు. ఆయన ప్రయోజనము (సీతను విడిపించుట) కొరకై యుద్ధమును చేసిన జటాయువు ఆ కర్మచే కర్మబంధమును పోగొట్టుకొనెను. శ్రీరాముడు జటాయువునకు దహనక్రియల నాచరించి, కబంధుని సంహరించెను. తరువాత ఆయన వానరులతో మైత్రిని నెరపి వాలిని సంహరించెను. ఆ వానరుల ద్వారా ఆయనకు సీత జాడ (లంక) తెలిసెను. అపుడాయన వానరాధిపతియగు సుగ్రీవుని సైన్యములతో గూడి సముద్రతీరమును చేరుకొనెను.

యద్రోషవిభ్రమవివృత్తకటాక్షపాత-
సంభ్రాంతనక్రమకరో భయగీర్ణఘోషః ।

సింధుశ్శిరస్యర్హణం పరిగృహ్య రూపీ
పాదారవిందముపగమ్య బభాష ఏతత్ ॥ 13

యద్-రోషవిభ్రమవివృత్తకటాక్షపాతసంభ్రాంతనక్రమకరః - ఏ శ్రీరామునియొక్క కోపము అనే లీలచే గిర గిర త్రిప్పబడిన కన్నుల చూపు పడుటచే భయభ్రాంతమైన మొసళ్లు పెద్దచేపలు కలిగినది, భయగీర్ణఘోషః - భయముతో స్తంభించిన ఘోష గలది అగు, సింధుః - సముద్రము, రూపీ - రూపము దాల్చినదై, శిరసి - తలపై, అర్హణమ్ - పూజాద్రవ్యమును, పరిగృహ్య - ఉంచుకొని, పాద-అరవిందమ్ - పాదపద్మమును, ఉపగమ్య - చేరుకొని, ఏతత్ - ఈ మాటను, బభాషే - పలికెనో.

సముద్రము ఆటంకము కాగా శ్రీరాముడు కోపించుట అనే లీలను నెరపెను. ఆయన కోపముతో కన్నులను గిర గిర త్రిప్పుతూ చూడగా సముద్రములోని మొసళ్లు, పెద్దచేపలు భయభ్రాంతములైనవి; సముద్ర ఘోష ఆగిపోయెను. అప్పుడు సముద్రము రూపు దాల్చి, తలపై పూజా ద్రవ్యములను ఉంచుకొని, శ్రీరాముని పాదపద్మమును చేరి ఇట్లు పలికెను.

న త్వాం వయం జడధియో ను విదామ భూమన్
కూటస్థమాదిపురుషం జగతామధీశమ్ ।
యత్సత్త్వతస్సురగణా రజసః ప్రజేశా
మన్యోశ్చ భూతపతయస్స భవాన్ గుణేశః ॥ 14

భూమన్ - ఓ పరబ్రహ్మస్వరూపా!, జడధియః - మొద్దు బుద్ధి గల, వయమ్ - మేము, కూటస్థమ్ - వికారములు లేనట్టియు, ఆదిపురుషమ్ - జగత్కారణమైనట్టియు పూర్ణుడవైనట్టియు, జగతామ్ - లోకములకు, అధి-ఈశమ్ - అధీశ్వరుడవగు, త్వామ్ - నిన్ను, న విదామ ను - తెలియ లేము గదా!, యత్ - ఎవ్వాని, సత్త్వతః - సత్త్వగుణమునుండి, సురగణాః - దేవతాగణములు, రజసః - రజోగుణమునుండి, ప్రజా-ఈశాః - ప్రజాపాలకులు, చ - మరియు, మన్యోః - తమోగుణమునుండి, భూతపతయః - భూతనాయకులు ప్రకటమైనారో, సః - అట్టి, భవాన్ - నీవు, గుణ-ఈశః - మూడు గుణములకు నియంతవు.

ఓ పరబ్రహ్మ స్వరూపా! మావి మొద్దు బుద్ధులు. నీవు వికారములు లేకుండగనే జగత్తునకు కారణమగుదువు. పూర్ణుడవగు నీవు లోకములకు అధీశ్వరుడవు. నిన్ను మేమైతే తెలియజాలము. నీవు సత్త్వరజస్తమోగుణములకు నియంతవు. నీ సత్త్వగుణమునుండి దేవతాగణములు, రజోగుణమునుండి ప్రజాపాలకులు, తమోగుణమునుండి భూతనాయకులు ప్రకటమైనారు.

కామం ప్రయాహి జహి విశ్రవసోఽవమేహం
త్రైలోక్యరావణమవాప్నుహి వీర పత్నీమ్ ।
బధ్నీహి సేతుమిహ తే యశసో వితత్యై
గాయంతి దిగ్విజయినో యముపేత్య భూపాః ।। 15

వీర - ఓ వీరుడా!, కామమ్ - యథేచ్ఛగా, ప్రయాహి - వెళ్లుము, విశ్రవసః - విశ్రవస ప్రజాపతియొక్క, అవమేహమ్ - దుష్టపుత్రుడైనట్టియు, త్రైలోక్యరావణమ్ - ముల్లోకములకు పీడను కలిగించే రావణుని, జహి - సంహరించుము, పత్నీమ్ - భార్యను, అవాప్నుహి - పొందుము, తే - నీ, యశసః - కీర్తియొక్క, వితత్యై - విస్తారము కొరకు, ఇహ - ఇచట, సేతుమ్ - సేతువును, బధ్నీహి - నిర్మించుము, యమ్ - ఏ సేతువును, ఉపేత్య - చేరుకొని, దిగ్-విజయినః - దిక్కులను జయించిన, భూపాః - రాజులు, గాయంతి - గానము చేయుదురో.

ఓ వీరా! యథేచ్ఛగా వెళ్లుము (నీకు నేను అడ్డము రాను). విశ్రవస ప్రజాపతియొక్క దుష్టపుత్రుడగు రావణుడు ముల్లోకములకు పీడను కలిగించువాడు. వానిని సంహరించి, నీ భార్యను తిరిగి పొందుము. నీవిచట సేతువును నిర్మించి నీ కీర్తిని విస్తరింప జేయుము. దిక్కులను జయించిన రాజులు ఇచటకు వచ్చి (సేతువును చూచి) నీ కీర్తిని గానము చేయగలరు.

బద్ధ్వోదధౌ రఘుపతిర్వివిధాద్రికూటైః
సేతుం కపీంద్రకరకంపితభూరుహాంగైః ।
సుగ్రీవనీలహనుమత్ప్రముఖైరనీకై-
ర్లంకాం విభీషణదృశాఽఽవిశదగ్రదగ్ధామ్ ।। 16

కపి-ఇంద్రకరకంపితభూరుహ-అంగైః - వానరవీరుల చేతులచే కంపింప జేయబడిన చెట్ల కొమ్మలు గల, వివిధ-అద్రికూటైః - వివిధము లైన పర్వతముల శిఖరములతో, ఉదధౌ - సముద్రమునందు, రఘుపతిః - శ్రీరాముడు, సేతుమ్ - సేతువును, బద్ధ్వా - కట్టి, సుగ్రీవనీలహనుమత్-ప్రముఖైః - సుగ్రీవుడు నీలుడు హనుమంతుడు ప్రముఖులుగా గల, అనీకైః - సైన్యములతో, విభీషణదృశా - విభీషణుని సలహాతో, అగ్రదగ్ధామ్ - ముందే దహించబడిన, లంకామ్ - లంకను, ఆవిశత్ - ప్రవేశించెను.

కపివీరులు పర్వతశిఖరములను ఊడబెరకి సముద్రములో వేయుచుండగా వాటిపైనున్న చెట్లు కంపించుచుండెను. రఘువంశవీరుడగు శ్రీరాముడు ఈ విధముగా సముద్రముపై సేతువును కట్టెను. తరువాత సుగ్రీవుడు, నీలుడు, హనుమంతుడు ప్రముఖులుగా గల సైన్యములతో గూడి ఆయన విభీషణుని సలహానుసరించి లంకను ప్రవేశించెను. ఆ లంకను హనుమంతుడు ఇదివరకే దహించియుండెను.

సా వానరేంద్రబలరుద్ధవిహారకోష్ఠ-
శ్రీద్వారగోపురసదోవలభీవిటంకా ।
నిర్భజ్యమానధిషణధ్వజహేమకుంభ-
శృంగాటకా గజకులైర్హ్రదినీవ ఘూర్ణా ॥ 17

వానర-ఇంద్రబలరుద్ధవిహారకోష్ఠశ్రీద్వారగోపురసదః-వలభీవిటంకా - వానరవీరుల సైన్యములచే ముట్టడించబడిన క్రీడాస్థానములు ధాన్యపు కొట్టములు మొదలైనవి ఖజానా ద్వారములు ప్రధానద్వారము సభ చంద్రశాల (పై మేడ) లు గువ్వగూళ్లు గలది, నిర్భజ్యమానధిషణధ్వజహేమకుంభశృంగాటకా - విరుగగొట్టబడుచున్న వేదికలు ధ్వజములు బంగరు కడవలు కూడళ్లు కలిగినది, సా - ఆ లంక, గజకులైః - ఏనుగుల గుంపులచే, హ్రదినీ ఇవ - నది వలె, ఘూర్ణా - కలిచివేయబడినది.

క్రీడాస్థానములు, ధాన్యపు కొట్టములు, ఖజానా, ద్వారములు, ప్రధానద్వారము, సభలు, చంద్రశాలలు, గువ్వగూళ్లు మొదలగువాటితో కూడియున్న లంకానగరమును వానరవీరుల సైన్యములు ముట్టడించినవి. వారు వేదికలను, ధ్వజములను, (గోపురములపైనుండే) బంగరు కడవలను

విరుగకొట్టి కూడళ్లను చెల్లాచెదరు చేయుచుండిరి. అట్టి లంక, ఏనుగుల గుంపులచే నది వలె, కలచివేయబడెను.

రక్షఃపతిస్తదవలోక్య నికుంభకుంభ-
ధూమ్రాక్షదుర్ముఖసురాంతనరాంతకాదీన్ ।
పుత్రం ప్రహస్తమతికాయవికంపనాదీన్
సర్వానుగాన్ సమహినోదథ కుంభకర్ణమ్ ॥ 18

రక్షః-పతిః - రాక్షసప్రభువగు రావణుడు, తత్ - దానిని, అవలోక్య - చూచి, నికుంభకుంభధూమ్రాక్షదుర్ముఖసురాంతనరాంతక-ఆదీన్ - నికుంభుడు కుంభుడు ధూమ్రాక్షుడు దుర్ముఖుడు సురాంతకుడు నరాంతకుడు మొదలగువారిని, పుత్రమ్ - పుత్రుడగు ఇంద్రజిత్తును, ప్రహస్తమ్ - ప్రహస్తుని, అతికాయవికంపన-ఆదీన్ - అతికాయుడు వికంపనుడు మొదలగువారిని, సర్వ-అనుగాన్ - అనుచరులందరిని, అథ - తరువాత, కుంభకర్ణమ్ - కుంభకర్ణుని, సమహినోత్ - పంపించెను.

వానరసైన్యములు చేసిన పనిని చూచి రాక్షసప్రభువగు రావణుడు తన అనుచరులనందరిని యుద్ధమునకు పంపించెను. నికుంభుడు, కుంభుడు, ధూమ్రాక్షుడు, దుర్ముఖుడు, సురాంతకుడు, నరాంతకుడు, పుత్రుడగు ఇంద్రజిత్తు, ప్రహస్తుడు, అతికాయుడు, వికంపనుడు మొదలగువారిని పంపించెను. వారందరు మరణించిన తరువాత కుంభకర్ణుని పంపెను.

తాం యాతుధానపృతనామసిశూలచాపప్రాసర్ష్టిశక్తిశరతోమరఖడ్గదుర్గామ్।
సుగ్రీవలక్ష్మణమరుత్సుతగంధమాదనీలాంగదర్క్షపనసాదిభిరన్వితోఽగాత్॥

అసిశూలచాపప్రాస-ఋష్టిశక్తిశరతోమరఖడ్గదుర్గామ్ - చురకత్తులు శూలములు ధనుస్సులు బల్లెములు ఈటెలు చిల్లకోలలు బాణములు ఇనుప గుదియలు మరియు కత్తులతో ఎదుర్కొన శక్యము కాని, తామ్ - ఆ, యాతుధానపృతనామ్ - రాక్షసుల సైన్యమును, సుగ్రీవలక్ష్మణమరుత్-సుతగంధమాదనీల-అంగద-ఋక్షపనస-ఆదిభిః - సుగ్రీవుడు లక్ష్మణుడు వాయుపుత్రుడు గంధమాదనుడు నీలుడు అంగదుడు జాంబ

వంతుడు పనసుడు మొదలగువారితో, అన్వితః - కూడియున్నవాడై, అగాత్ - ఎదుర్కొనెను.

చురకత్తులు, శూలములు, ధనుస్సులు, బల్లెములు, ఈటెలు, చిల్ల కోలలు, బాణములు, ఇనుప గుదియలు, మరియు కత్తులు అనే ఆయుధ ములను కలిగియున్న ఆ రాక్షససైన్యమును ఎదుర్కొనుట చాల కష్టము. కాని, సుగ్రీవుడు, లక్ష్మణుడు, వాయుపుత్రుడు, గంధమాదనుడు, నీలుడు, అంగదుడు, జాంబవంతుడు, పనసుడు మొదలగువారు తోడు కాగా, శ్రీరా ముడు ఆ సైన్యమును ఎదుర్కొనెను.

తేఽనీకపా రఘుపతేరభిపత్య సర్వే
ద్వంద్వం వరూథమిభపత్తిరథాశ్వయోధైః ।
జఘ్నుర్ద్రుమైర్గిరిగదేషుభిరంగదాద్యాః
సీతాభిమర్శహతమంగలరావణేశాన్ ।। 20

తే - ఆ, అంగద-ఆద్యాః - అంగదుడు మొదలుగా గల, రఘు పతేః - శ్రీరాముని, అనీకపాః - సేనాపతులు, సర్వే - అందరు, ఇభపత్తిర థ-అశ్వయోధైః - ఏనుగులపై రథములపై గుర్రములపై ఎక్కియున్న యోధులతో మరియు పదాతి యోధులతో కూడిన, వరూథమ్ - (రావ ణుని) సైన్యమును, ద్వంద్వమ్ - ఒక్కొక్కడు ఒక్కొక్కని చొప్పున, అభి పత్య - ఎదుర్కొని, సీతా-అభిమర్శహతమంగలరావణ-ఈశాన్ - సీతాదే విని స్పృశించుటచే నశింప జేయబడిన కల్యాణము గల రావణుడు ప్రభు వుగా గల రాక్షసులను, ద్రుమైః - చెట్లతో, గిరిగదా-ఇషుభిః - పర్వతము లతో గదలతో బాణములతో, జఘ్నుః - కొట్టిరి.

సీతాదేవిని స్పృశించుటచే రావణునకు కల్యాణములు తొలగిపో యెను. అట్టి రావణుని అధీనములోనున్న సైన్యములో పదాతులు, రథికు లు, గుర్రపు రౌతులు, ఏనుగునెక్కి యుద్ధము చేయువారు అనే నాలుగు అంగములు ఉండెను. రఘువంశశిరోమణియగు శ్రీరాముని సేనాపతులగు అంగదుడు మొదలగు వారందరు ఆ సైన్యమునెదుర్కొని ద్వంద్వయుద్ధ మును చేసిరి. వారు రాక్షసులను చెట్లతో, పర్వతశిఖరములతో, గదలతో మరియు బాణములతో సంహరించుచుండిరి.

రక్షఃపతిస్స్వబలనష్టిమవేక్ష్య రుష్ట
ఆరుహ్య యానకమథాభిససార రామమ్ ।
స్వస్స్యందనే ద్యుమతి మాతలినోపనీతే
విభ్రాజమానమహనన్నిశితైః క్షురప్రైః ॥ 21

రక్షఃపతిః - రాక్షసప్రభువగు రావణుడు, స్వబలనష్టిమ్ - తన సైన్యముయొక్క వినాశమును, అవేక్ష్య - చూచి, రుష్టః - కోపించినవాడై, యానకమ్ - రథమును, ఆరుహ్య - ఎక్కి, రామమ్ - శ్రీరాముని ఉద్దేశించి, అభిససార - యుద్ధమునకు ముందుకు వచ్చెను, అథ - అప్పుడు, ద్యుమతి - ప్రకాశించునట్టియు, మాతలినా - మాతలిచే, ఉపనీతే - తీసుకురాబడిన, స్వః-స్యందనే - స్వర్గలోకమునకు చెందిన రథమునందు, విభ్రాజమానమ్ - ప్రకాశించుచున్న శ్రీరాముని, నిశితైః - వాడియైన, క్షురప్రైః - అర్ధచంద్రాకార బాణములతో, అహనత్ - కొట్టెను.

రాక్షసప్రభుడగు రావణుడు తన సైన్యము వినాశమగుచుండుటను గాంచి కోపించినవాడై, తానే రథమెక్కి శ్రీరామునిపైకి యుద్ధమునకు వచ్చెను. ఇంద్రుని సారథియగు మాతలి ఇంద్రుని ప్రకాశించే రథమును తీసుకురాగా, శ్రీరాముడు దానిపై విరాజిల్లుచుండెను. అప్పుడు రావణుడు శ్రీరాముని వాడియైన అర్ధచంద్రాకార బాణములతో కొట్టెను.

రామస్తమాహ పురుషాదపురీష యన్నః
కాంతాఽసమక్షమసతాఽపహృతా శ్వవత్తే ।
త్యక్తత్రపస్య ఫలమద్య జుగుప్సితస్య
యచ్ఛామి కాల ఇవ కర్తురలంఘ్యవీర్యః ॥ 22

రామః - శ్రీరాముడు, తమ్ - వానిని గురించి, ఆహ - పలికెను, పురుషాదపురీష - ఓ రాక్షసాధమా!, నః - మాయొక్క, అసమక్షమ్ - సన్నిధిలో లేనప్పుడు, అసతా - దుష్టుడవగు నీచే, కాంతా - భార్య, శ్వవత్ - కుక్కవలె, అపహృతా - అపహరించబడినది అనేది, యత్ - ఏది గలదో, జుగుప్సితస్య - గర్హ్యమైన ఆ పనికి, త్యక్తత్రపస్య - విడిచిపెట్టబడిన సిగ్గుగల, తే - నీకు, అద్య - ఈనాడు, ఫలమ్ - ఫలమును, కర్తుః -

పనిని చేసినవానికి, అలంఘ్యవీర్యః - లంఘించ శక్యము కాని శక్తి గల, కాలః ఇవ - కాలము వలె, యచ్ఛామి - ఇచ్చెదను.

శ్రీరాముడు రావణునితో ఇట్లు పలికెను -- ఓ రాక్షసాధమా! దుష్టుడవగు నీవు మేమిద్దరము లేని సమయములో కుక్కవలె వచ్చి నా భార్యను అపహరించినావు. నీవు చేసిన ఈ పని గర్హ్యమైనది. కాలము యొక్క శక్తిని ఎవరైననూ ఉల్లంఘించలేరు. కాలము కర్మకు ఫలమును కర్తకు ఇచ్చితీరును. అదే విధముగా, నీవు సిగ్గు విడిచి చేసిన పనికి ఫలమును నేను నీకు ఈనాడు ఇచ్చెదను.

ఏవం క్షిపన్ ధనుషి సంధితముత్ససర్జ
బాణం స వజ్రమివ తద్ధృదయం బిభేద ।
సోఽసృగ్వమన్దశముఖైర్న్యపతద్విమానాత్
హా హేతి జల్పతి జనే సుకృతీవ రిక్తః ॥ 23

సః - ఆ శ్రీరాముడు, ఏవమ్ - ఈ విధముగా, క్షిపన్ - నిందించువాడై, ధనుషి - ధనుస్సునందు, సంధితమ్ - ఎక్కుపెట్టబడిన, బాణమ్ - బాణమును, వజ్రం ఇవ - వజ్రమును వలె, ఉత్-ససర్జ - విడిచిపెట్టెను, తద్-హృదయమ్ - వాని హృదయమును, బిభేద - చీల్చివేసెను, సః - ఆ రావణుడు, దశముఖైః - పది నోళ్లతో, అసృక్ - రక్తమును, వమన్ - గ్రక్కుచున్నవాడై, జనే - జనము, హా హా - అయ్యో! అయ్యో!, ఇతి - అని, జల్పతి - పలుకుచుండగా, రిక్తః - క్షీణించిన పుణ్యము గల, సుకృతీ - పుణ్యాత్ముడు, విమానాత్ ఇవ - స్వర్గమునుండి వలె, ని-అపతత్ - క్రింద బడెను.

ఆ శ్రీరాముడు ఈ విధముగా అధిక్షేపించి ధనుస్సుపై బాణమునెక్కుపెట్టి విడిచిపెట్టెను. వజ్రమువంటి ఆ బాణము ఆ రావణుని గుండెను చీల్చివేసెను. ఆయన పది నోళ్లతో రక్తమును గ్రక్కుతూ, క్షీణించిన పుణ్యము గల పుణ్యాత్ముడు స్వర్గమునుండి వలె, క్రింద బడెను. అచటి జనులు హాహాకారములను చేసిరి.

తతో నిష్క్రమ్య లంకాయా యాతుధాన్యస్సహస్రశః ।
మందోదర్యా సమం తస్మిన్ ప్రరుదత్య ఉపాద్రవన్ ॥ 24

తతః - అప్పుడు, యాతుధాన్యః - రాక్షసస్త్రీలు, సహస్రశః - వేలాదిగా, మందోదర్యా సమమ్ - మందోదరితో గూడి, లంకాయాః - లంకనుండి, నిష్క్రమ్య - బయటకు వచ్చి, ప్రరుదత్యః - గట్టిగా ఏడ్చుచున్నవారై, తస్మిన్ - ఆ స్థానమునందు, ఉపాద్రవన్ - వచ్చిరి.

అప్పుడు వేలాది రాక్షసస్త్రీలు మందోదరితో గూడి లంకనుండి బయటకు వచ్చి బిగ్గరగా ఏడుస్తూ ఆ స్థానమును చేరిరి.

స్వాన్ స్వాన్ బంధూన్ పరిష్వజ్య లక్ష్మణేషుభిరర్దితాన్ ।
రురుదుస్సుస్వరం దీనా ఘ్నంత్య ఆత్మానమాత్మనా ॥ 25

దీనాః - దీనురాండ్రగు ఆ స్త్రీలు, లక్ష్మణ-ఇషుభిః - లక్ష్మణుని బాణములచే, అర్దితాన్ - సంహరించబడిన, స్వాన్ స్వాన్ - తమ తమ, బంధూన్ - బంధువులను, పరిష్వజ్య - కౌగిలించుకొని, ఆత్మానమ్ - తనను, ఆత్మనా - తనచే, ఘ్నంత్యః - కొట్టుకొనుచున్నవారై, సుస్వరమ్ - మంచి స్వరము కలుగునట్లుగా, రురుదుః - ఏడ్చిరి.

వారి బంధువులు యుద్ధములో లక్ష్మణుని బాణములచే హతులైరి. దీనురాండ్రగు ఆ స్త్రీలు తమ తమ ఆ బంధువులను కౌగిలించుకొని గుండెలు బాదుకుంటూ ఏడ్చిరి. వారి ఏడ్పు కూడ సుస్వరముగనే యుండెను.

హా హతాస్స్మ వయం నాథ లోకరావణ రావణ ।
కం యాయాచ్ఛరణం లంకా త్వద్విహీనా పరార్దితా ॥ 26

హా - అయ్యో!, వయమ్ - మేము, హతాః స్మ - చంపబడితిమి, నాథ - ఓ ప్రభూ!, లోకరావణ - లోకములను ఏడ్పించినవాడా!, రావణ - ఓ రావణా!, త్వద్-విహీనా - నీవు లేనిది, పర-అర్దితా - శత్రువులచే పీడించబడేది అగు, లంకా - లంక, కమ్ - ఎవనిని, శరణమ్ - రక్షకునిగా, యాయాత్ - పొందవలెను?

అయ్యో! చంపబడితిమి. లోకములనేడ్పించిన ఓ రావణా! నీవు లేని ఈ లంకను శత్రువులు నాశనము చేసెదరు. ఇప్పుడీ లంక ఎవరిని శరణు వేడవలెను?

నైవం వేద మహాభాగ భవాన్ కామవశం గతః ।
తేజోఽనుభావం సీతాయా యేన నీతో దశామిమామ్ ॥ 27

మహాభాగ - ఓ గొప్ప భాగ్యవంతుడా!, కామవశమ్ - కామమునకు వశమగుటను, గతః - పొందిన, భవాన్ - నీవు, సీతాయాః - సీతాదేవియొక్క, ఏవమ్ - ఈ విధమైన, తేజః-అనుభావమ్ - తేజస్సుయొక్క ప్రభావమును, న వేద - తెలియకుంటివి, యేన - దేనిచే, ఇమామ్ - ఈ, దశామ్ - దశను, నీతః - పొందించ బడితివి.

ఓ రావణా! గొప్ప భాగ్యవంతుడవగు నీవు కామమునకు వశుడవైతివి. కావుననే, సీతాదేవియొక్క ఈ విధమైన తేజస్సుయొక్క ప్రభావమును తెలియకుంటివి. కావుననే, ఈ దుర్దశలోనికి త్రోసివేయ బడితివి.

కృతైషా విధవా లంకా వయం చ కులనందన ।
దేహః కృతోఽన్నం గృధ్రాణామాత్మా నరకహేతవే ॥ 28

**కులనందన - వంశీయులను ఆనందింప జేసినవాడా!, ఏషా -** ఈ, లంకా - లంక, విధవా - నాథుడు లేనిది, కృతా - చేయబడినది, వయం చ - మేము కూడ, దేహః - దేహము, గృధ్రాణామ్ - గ్రద్దలకు, అన్నమ్ - ఆహారముగా, కృతః - చేయబడినది, ఆత్మా - సూక్ష్మశరీరము, నరకహేతవే - నరకమువనుభవించుట కొరకు.

ఓ రావణా! నీవు నీ వంశీయులను ఆనందింప జేసితివి. కాని, ఈనాడు నీవు లేని ఈ లంక అనాథ యైనది, మేము కూడ విగతభర్తృకలైనాము. నీ దేహము గ్రద్దలకు ఆహారము కాగా, నీవు సూక్ష్మశరీరివై నరకము ననుభవించుటకు పోతివి.

శ్రీశుక ఉవాచ ।
స్వానాం విభీషణశ్చక్రే కోసలేంద్రానుమోదితః ।
పితృమేధవిధానేన యదుక్తం సాంపరాయికమ్ ॥ 29

కోసల-ఇంద్ర-అనుమోదితః - కోసలప్రభువగు శ్రీరామునిచే ఆజ్ఞాపించబడిన, విభీషణః - విభీషణుడు, స్వానామ్ - తనవారలకు, పితృ మేధవిధానేన - పితృయజ్ఞ విధానముచే, యత్ - ఏ, సాంపరాయికమ్ - మరణానంతరము కర్మ, ఉక్తమ్ - చెప్పబడినదో దానిని, చక్రే - చేసెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను -- మరణించిన తన బంధువులకు వ్యక్తి మరణించినప్పుడు చేయవలసిన కర్మలను చేయుమని కోసల ప్రభు డగు శ్రీరాముడు విభీషణుని ఆజ్ఞాపించెను. విభీషణుడు పితృయజ్ఞవిధాన ముతో ఆ పితృకర్మలను చేసెను.

తతో దదర్శ భగవానశోకవనికాశ్రమే ।
క్షామాం స్వవిరహవ్యాధిం శింశపామూలమాస్థితామ్ ॥ 30

తతః - తరువాత, భగవాన్ - శ్రీరామ భగవానుడు, అశోకవనికా- ఆశ్రమే - అశోకవనమునందలి ఆశ్రమమునందు, క్షామామ్ - కృశించినట్టి యు, స్వవిరహవ్యాధిమ్ - తన వియోగమే వ్యాధిగా కలిగినట్టియు, శింశ పామూలమ్ - ఇరుగుడు చెట్టు మొదలును, ఆస్థితామ్ - ఆశ్రయించి యున్న సీతాదేవిని, దదర్శ - చూచెను.

తరువాత శ్రీరామ భగవానుడు అశోకవనములోని ఆశ్రమము నందు ఇరుగుడు చెట్టు మొదలును ఆశ్రయించుకొని కృశించియున్న సీతా దేవిని చూచెను. శ్రీరాముని విరహమే ఆమె పాలిట రోగమాయెను.

రామః ప్రియతమాం భార్యాం దీనాం వీక్ష్యాన్వకంపత ।
ఆత్మసందర్శనాహ్లాదవికసన్ముఖపంకజామ్ ॥ 31

ప్రియతమామ్ - మిక్కిలి ప్రియమైనట్టియు, దీనామ్ - దీనురాలై నట్టియు, ఆత్మసందర్శన-ఆహ్లాదవికసత్-ముఖపంకజామ్ - తనను చూచుటచే కలిగిన ఆనందముచే వికసించుచున్న పద్మమువంటి ముఖము

గల, భార్యామ్ - భార్యయగు సీతాదేవిని, వీక్ష్య - చూచి, అన్వకంపత - జాలి పడెను.

దీనురాలగు సీతయొక్క పద్మమువంటి ముఖము శ్రీరాముని చూచుటచే కలిగిన ఆనందముతో వికసించెను. తనకు మిక్కిలి ప్రియురాలగు ఆమెను చూచి శ్రీరాముడు జాలి పడెను.

ఆరోప్యారురుహే యానం భ్రాతృభ్యాం హనుమద్యుతః ।
విభీషణాయ భగవాన్ దత్త్వా రక్షోగణేశతామ్ ॥ 32

లంకామాయుశ్చ కల్పాంతం యయౌ చీర్ణవ్రతః పురీమ్ ।
అవకీర్యమాణః కుసుమైర్లోకపాలార్పితైః పథి ॥ 33

భగవాన్ - శ్రీరామ భగవానుడు, విభీషణాయ - విభీషణుని కొరకు, రక్షః-గణ-ఈశతామ్ - రాక్షస గణముల ఆధిపత్యమును, లంకామ్ - లంకానగరమును, కల్ప-అంతమ్ - కల్పము అంతమయ్యేవరకు ఉండే, ఆయుః - ఆయుర్దాయమును, దత్త్వా - ఇచ్చి, ఆరోప్య - ఎక్కించి, హనుమద్-యుతః - హనుమంతునితో గూడినవాడై, భ్రాతృభ్యామ్ - లక్ష్మణసుగ్రీవులతో గూడి, యానమ్ - పుష్పక విమానమును, ఆరురుహే - అధిష్ఠించెను, చీర్ణవ్రతః - అనుష్ఠించబడిన వ్రతము గల శ్రీరాముడు, పథి - మార్గమునందు, లోకపాల-అర్పితైః - లోకపాలకులచే సమర్పించబడిన, కుసుమైః - పుష్పములతో, అవకీర్యమాణః - చల్లబడుచున్నవాడై, పురీమ్ - అయోధ్యా నగరమును గురించి, యయౌ - వెళ్లెను.

శ్రీరామ భగవానుడు విభీషణునకు లంకా నగరమును, కల్పము అంతమయ్యేవరకు ఆయుర్దాయమును అనుగ్రహించి, ఆయనను రాక్షసగణములకు అధీశ్వరుని చేసెను. అపుడాయన సీతాదేవిని పుష్పక విమానములోనికి ఎక్కించెను. సోదర సమానుడగు సుగ్రీవునితో, సోదరుడగు లక్ష్మణునితో మరియు హనుమంతునితో కూడి ఆయన కూడ విమానమునెక్కెను. ఆయన ఈ విధముగా వనవాస వ్రతమును పూర్తి చేసుకొని అయోధ్యా నగరమునకు వెళ్లుచుండగా, లోకపాలకులు మార్గములో ఆయనపై పుష్పవర్షమును కురిపించిరి.

ఉపగీయమానచరితశ్శతధృత్యాదిభిర్ముదా ।
గోమూత్రయావకం శ్రుత్వా భ్రాతరం వల్కలాంబరమ్ ।। 34

మహాకారుణికోఽతప్యజ్జటిలం స్థండిలేశయమ్ ।

శతధృతి-ఆదిభిః - బ్రహ్మగారు మొదలగువారిచే, ముదా - ఆనందముతో, ఉపగీయమానచరితః - గానము చేయబడే చరిత్ర గలవాడు, మహాకారుణికః - గొప్ప దయామయుడు అగు శ్రీరాముడు, గోమూత్ర యావకమ్ - గోమూత్రముతో సంస్కృతమైన యవధాన్యపు అన్నమును తినునట్టియు, వల్కల-అంబరమ్ - నారబట్టలను ధరించినట్టియు, జటిలమ్ - జటాధారియైనట్టియు, స్థండిలేశయమ్ - దర్భలు పరచిన నేలపై పరుండే, భ్రాతరమ్ - తమ్ముడు భరతుని గురించి, శ్రుత్వా - విని, అతప్యత్ - దుఃఖపడెను.

బ్రహ్మగారు మొదలగు దేవతలు ఆనందముతో శ్రీరాముని చరిత మును గానము చేసిరి. శ్రీరాముడు చాల దయామయుడు. తన తమ్ము డగు భరతుడు నారబట్టలను ధరించి జటలను పెంచుకొని గోమూత్రముతో సంస్కృతమైన యవధాన్యపు అన్నమును తింటూ దర్భలు పరచిన నేలపై పరుంటూ ఉన్నాడని విని మనస్సులో చాల క్లేశమును పొందెను.

భరతః ప్రాప్తమాకర్ణ్య పౌరామాత్యపురోహితైః ।। 35

పాదుకే శిరసి న్యస్య రామం ప్రత్యుద్యతోఽగ్రజమ్ ।
నందిగ్రామాత్స్వశిబిరాద్గీతవాదిత్రనిస్స్వనైః ।। 36

ప్రాప్తమ్ - విచ్చేసిన, అగ్రజమ్ - అన్నయగు, రామమ్ - శ్రీరాముని గురించి, ఆకర్ణ్య - విని, భరతః - భరతుడు, పాదుకే - పాదుకలను, శిరసి - తలపై, న్యస్య - ఉంచుకొని, స్వశిబిరాత్ - తన నివాసస్థానమైన, నందిగ్రామాత్ - నందిగ్రామమునుండి, పౌర-అమాత్యపురోహితైః - పౌరులతో అమాత్యులతో మరియు పురోహితులతో, గీతవాదిత్రనిస్స్వనైః - గానములయొక్క మరియు వాద్యముల ధ్వనులతో, ప్రతి-ఉద్యతః - ఎదురేగినవాడు.

అన్నయగు శ్రీరాముడు విచ్చేయుచున్నాడని విని భరతుడు పాదుకలను తలపై నుంచుకొని తన నివాసస్థానమగు నందిగ్రామము నుండి ఆయనకు ఎదురేగెను. పౌరులు, అమాత్యులు, పురోహితులు ఆయనతో బాటు నడచిరి. జనులు వాద్యములను వాయిస్తూ గానము చేయుచుండగా, పెద్ద శబ్దము కలిగెను.

బ్రహ్మఘోషేణ చ ముహుః పఠద్భిర్బ్రహ్మవాదిభిః ।
స్వర్ణకక్షపతాకాభిర్హైమైశ్చిత్రధ్వజై రథైః ॥ 37

సదశ్వై రుక్మసన్నాహైర్భటైః పురటవర్మభిః ।
శ్రేణీభిర్వారముఖ్యాభిర్భృత్యైశ్చైవ పదానుగైః ॥ 38

పారమేష్ఠ్యాన్యుపాదాయ పణ్యాన్యుచ్చావచాని చ ।
పాదయోర్న్యపతత్ప్రేమ్ణా ప్రక్లిన్నహృదయేక్షణః ॥ 39

బ్రహ్మ - వేదమును, ఘోషేణ - పెద్ద స్వరముతో, ముహుః - నిరంతరముగా, పఠద్భిః - పఠించుచున్న, బ్రహ్మవాదిభిః - వేదవేత్తలతో, స్వర్ణకక్షపతాకాభిః - బంగారము తాపడము చేసిన పార్శ్వములు గల టెక్కెములతో, హైమైః - బంగారముతో చేసినట్టియు, చిత్రధ్వజైః - రంగు రంగుల ధ్వజములు కలిగినట్టియు, సద్-అశ్వైః - మంచి గుర్రములు కలిగినట్టియు, రుక్మసన్నాహైః - బంగరు పై కప్పులు గల, రథైః - రథములతో, పురటవర్మభిః - బంగరు కవచములు గల, భటైః - భటులతో, శ్రేణీభిః - శిల్పిసంఘములతో (వర్తకులతో), వారముఖ్యాభిః - ప్రముఖులైన వారాంగనలతో, పదానుగైః - పాదచారులగు, భృత్యైః ఏవ చ - సేవకులతో కూడ గూడి, పారమేష్ఠ్యాని - చక్రవర్తికి తగిన ఛత్రచామరాదులను, ఉచ్చావచాని - పెద్ద చిన్న, పణ్యాని చ - విలువైన వస్తువులను కూడ, ఉపాదాయ - పట్టుకొని, ప్రేమ్ణా - ప్రేమతో, ప్రక్లిన్నహృదయ-ఈక్షణః - ఆర్ద్రమైన హృదయము మరియు కన్నులు గలవాడై, పాదయోః - పాదములపై, న్యపతత్ - పడెను.

బిగ్గరగా వేదమును వల్లించుచున్న వేదవేత్తలు మరియు బంగారము తాపడము చేసిన పార్శ్వముల టెక్కెములు గల బంగరు రథములు

భరతుని వెంట నడచినవి. చక్కని గుర్రములు పూన్చిన ఆ రథములు రంగురంగుల జెండాలతో అలంకరించబడెను. వాటి పైకప్పులు బంగార ముతో చేసినవి. బంగరు కవచములను దాల్చిన భటులు, శిల్పుల సంఘ ములు, వర్తకులు, ప్రముఖ వారాంగనలు, మరియు పాదచారులగు సేవ కులు కూడ భరతుని వెంట నడచిరి. చక్రవర్తికి తగియున్న ఛత్రచామరాదు లను, పెద్ద చిన్న విలువైన వస్తువులను (రత్నాదులు) కూడ తీసుకొని ఆయన వెళ్లెను. శ్రీరాముని చూచి ఆయన హృదయము, దాని వెంబడి కళ్లు కూడ ప్రేమతో ఆర్ద్రములాయెను. ఆయన శ్రీరాముని పాదములపై పడెను.

పాదుకే న్యస్య పురతః ప్రాంజలిర్బాష్పలోచనః ।
తమాశ్లిష్య చిరం దోర్భ్యాం స్నాపయన్ నేత్రజైర్జలైః ।। 40

పాదుకే - పాదుకలను, పురతః - ఎదుట, న్యస్య - పెట్టి, ప్రాంజలిః - దోసిలి యొగ్గినవాడై, బాష్పలోచనః - నీళ్లతో నిండిన కన్నులు గలవాడై, తమ్ - ఆ భరతుని, దోర్భ్యామ్ - రెండు బాహువుల తో, చిరమ్ - చాలసేపు, ఆశ్లిష్య - కౌలిగించుకొని, నేత్రజైః - కళ్ళనుండి స్రవించే, జలైః - నీళ్లతో, స్నాపయన్ - అభిషేకము చేయువాడు.

భరతుడు శ్రీరాముని యెదుట పాదుకలను పెట్టి కళ్ల వెంబడి నీరు స్రవించుచుండగా దోసిలి యొగ్గి నమస్కరించెను. తరువాత ఆ శ్రీరా ముడు భరతుని రెండు బాహువులతో చాల సేపు కౌగిలించుకొని కన్నీటితో అభిషేకించెను.

రామో లక్ష్మణసీతాభ్యాం విప్రేభ్యో యేऽర్హసత్తమాః ।
తేభ్యస్స్వయం నమశ్చక్రే ప్రజాభిశ్చ నమస్కృతః ।। 41

రామః - శ్రీరాముడు, లక్ష్మణసీతాభ్యామ్ - లక్ష్మణునితో మరియు సీతాదేవితో గూడి, విప్రేభ్యః - వేదవేత్తల కొరకు, యే - ఏ, అర్హ సత్తమాః - కులవృద్ధులు గలరో, తేభ్యః - వారి కొరకు, స్వయమ్ - తాను, నమః - నమస్కారమును, చక్రే - చేసెను, చ - మరియు, ప్రజాభిః - ప్రజలచే, నమస్కృతః - నమస్కరించ బడినవాడు.

శ్రీరాముడు సీతాలక్ష్మణులతో గూడి వేదవేత్తలకు, కులవృద్ధులకు తాను నమస్కరించగా, ప్రజలు శ్రీరామునకు నమస్కరించిరి.

ధున్వంత ఉత్తరాసంగాన్ పతిం వీక్ష్య చిరాగతమ్ ।
ఉత్తరాః కోసలా మాల్యైః కిరంతో ననృతుర్ముదా ॥ 42

ఉత్తరాః కోసలాః - ఉత్తరకోసలదేశస్థులైన జనులు, చిర-ఆగతమ్ - చాల కాలమునకు వచ్చిన, పతిమ్ - శ్రీరామ ప్రభుని, వీక్ష్య - చూచి, ఉత్తరాసంగాన్ - ఉత్తరీయములను, ధున్వంతః - విసురుచున్నవారై, మాల్యైః - పుష్పములతో, కిరంతః - చల్లుచున్నవారై, ముదా - ఆనందముతో, ననృతుః - నాట్యము చేసిరి.

ఉత్తరకోసలదేశ ప్రజలు చాల కాలమునకు వచ్చిన శ్రీరామ ప్రభుని చూచి ఆనందముతో ఉత్తరీయములను విసురుతూ పుష్పములను చల్లుతూ నాట్యమును చేసిరి.

పాదుకే భరతోఽగృహ్ణాచ్చామరవ్యజనోత్తమే ।
విభీషణస్ససుగ్రీవశ్శ్వేతచ్ఛత్రం మరుత్సుతః ॥ 43

భరతః - భరతుడు, పాదుకే - పాదుకలను, ససుగ్రీవః - సుగ్రీవునితో కూడియున్న, విభీషణః - విభీషణుడు, చామరవ్యజన-ఉత్తమే - ఉత్తమమైన వింజామరమును విసనకర్రను, మరుత్-సుతః - వాయుపుత్రుడు, శ్వేతచ్ఛత్రమ్ - తెల్లని గొడుగును, అగృహ్ణాత్ - పట్టెను.

భరతుడు పాదుకలను స్వీకరించెను. విభీషణుడు మరియు సుగ్రీవుడు ఉత్తమమైన వింజామరలను వీచుచుండగా, వాయుపుత్రుడగు హనుమంతుడు తెల్లని గొడుగును పట్టెను.

ధనుర్నిషంగాన్ శత్రుఘ్నస్సీతా తీర్థకమండలుమ్ ।
అబిభ్రదంగదః ఖడ్గం హైమం చర్మర్క్షరాణ్ నృప ॥ 44

నృప - ఓ రాజా!, శత్రుఘ్నః - శత్రుఘ్నుడు, ధనుః-నిషంగాన్ - ధనుస్సును అంబుల పొదులను, సీతా - సీతాదేవి, తీర్థకమండలుమ్ - తీర్థజలముతో నిండిన కమండలమును, అంగదః - అంగదుడు, ఖడ్గమ్ -

కత్తిని, ఋక్షరాట్ - ఎలుగుబంట్ల రాజగు జాంబవంతుడు, హైమమ్ - బంగారముతో చేసిన, చర్మ - డాలును, అబిభ్రత్ - పట్టుకొనెను.

ఓ పరీక్షిన్మహారాజా! శత్రుఘ్నుడు ధనుస్సును మరియు అంబుల పొదులను, సీతాదేవి తీర్థజలముతో నిండిన కమండలమును, అంగదుడు కత్తిని, ఎలుగుబంట్ల రాజగు జాంబవంతుడు బంగరు డాలును పట్టుకొనెను.

పుష్పకస్థోఽన్వితః స్త్రీభిః స్తూయమానశ్చ వందిభిః ।
విరేజే భగవాన్ రాజన్ గ్రహైశ్చంద్ర ఇవోదితః ॥ 45

రాజన్ - ఓ రాజా!, పుష్పకస్థః - పుష్పకమునందున్నవాడు, స్త్రీభిః - స్త్రీలచే, అన్వితః - కూడియున్నవాడు, చ - మరియు, వందిభిః - స్తోత్రపాఠకులచే, స్తూయమానః - కొనియాడ బడుచున్నవాడు అగు, భగవాన్ - శ్రీరామ భగవానుడు, ఉదితః - ఉదయించిన, చంద్రః - చంద్రుడు, గ్రహైః ఇవ - గ్రహములతో వలె, విరేజే - ప్రకాశించెను.

ఓ పరీక్షిన్మహారాజా! పుష్పక విమానమునందున్న శ్రీరామ భగవానుని పరిచారికలు చుట్టూ చేరియుండగా, స్తోత్రపాఠకులు స్తోత్రములను పలుకుచుండిరి. అపుడాయన ఉదయించిన చంద్రుడు గ్రహములతో వలె ప్రకాశించెను.

భ్రాతృభిర్నందితస్సోఽపి సోత్సవాం ప్రావిశత్పురీమ్ ।
ప్రవిశ్య రాజభవనం గురుపత్నీస్స్వమాతరమ్ ॥ 46

గురూన్ వయస్యావరజాన్ పూజితః ప్రత్యపూజయత్ ।
వైదేహీ లక్ష్మణశ్చైవ యథావత్సముపేయతుః ॥ 47

భ్రాతృభిః - సోదరులచే, నందితః - అభినందించబడిన, సః అపి - ఆ శ్రీరాముడు కూడ, సోత్సవామ్ - ఉత్సవముతో కూడియున్న, పురీమ్ - నగరమును, ప్రావిశత్ - ప్రవేశించెను, రాజభవనమ్ - రాజప్రాసాదమును, ప్రవిశ్య - ప్రవేశించి, గురుపత్నీః - తండ్రి భార్యలగు కైకేయి మొదలగువారిని, స్వమాతరమ్ - తన తల్లియగు కౌసల్యను, గురూన్ - పెద్దలను, వయస్య-అవరజాన్ - మిత్రులను చిన్నవారిని, పూజితః -

సత్కరించబడినవాడై, ప్రతి-అపూజయత్ - తిరిగి సత్కరించెను, వైదేహీ - సీతాదేవి, లక్ష్మణః చ ఏవ - లక్ష్మణుడు కూడ, యథావత్ - యథాయోగ్యముగా, సముపేయతుః - చక్కగా ప్రవేశించిరి.

సోదరులచే అభినందించబడిన ఆ శ్రీరాముడు ఉత్సవముతో విరాజిల్లే అయోధ్యా నగరములో ప్రవేశించి రాజప్రాసాదమునకు వెళ్లెను. ఆయన తండ్రి భార్యలగు కైకేయి మొదలగు వారిని, తన తల్లియగు కౌసల్యను, పెద్దలను, మిత్రులను, చిన్నవారిని సత్కరించి, వారి సత్కారములను అందుకొనెను. జానకి మరియు లక్ష్మణుడు కూడ యథాయోగ్యముగా రాజప్రాసాదములో ప్రవేశించి, అందరితో కలుసుకొనిరి.

పుత్రాన్ స్వమాతరస్తాస్తు ప్రాణాంస్తన్వ ఇవోత్థితాః ।
ఆరోప్యాంకేఽభిషించంత్యో బాష్పౌఘైర్విజహుశ్శుచః ।। 48

తాః - ఆ, స్వమాతరః తు - వారి వారి తల్లులైతే, ప్రాణాన్ - ప్రాణములను (పొంది), ఉత్థితాః - పైకి లేచిన, తన్వః ఇవ - దేహములు వలె, పుత్రాన్ - పుత్రులను, అంకే - ఒడియందు, ఆరోప్య - కూర్చుండ బెట్టుకొని, బాష్ప-ఓఘైః - కన్నీటి ధారలతో, అభిషించంత్యః - అభిషేకించుచున్నవారై, శుచః - శోకములను, విజహుః - విడిచి పెట్టిరి.

కౌసల్య మొదలైన ఆ తల్లులకు తమ తమ పుత్రులను చూచి, పోయిన ప్రాణములు తిరిగి వచ్చినట్లాయెను. వారు తమ పుత్రులను ఒడిలో కూర్చుండ బెట్టుకొని ఆనందబాష్పముల ధారలతో అభిషేకించి, వియోగ దుఃఖములను విడిచి పెట్టిరి.

జటా నిర్ముచ్య విధివత్ కులవృద్ధైస్సమం గురుః ।
అభ్యషించద్యథైవేంద్రం చతుస్సింధుజలాదిభిః ।। 49

గురుః - గురువగు వసిష్ఠుడు, కులవృద్ధైః సమమ్ - కులపెద్దలతో గూడి, జటాః - జటలను, నిర్ముచ్య - తొలగింప జేసి, ఇంద్రం యథా ఏవ - ఇంద్రుని వలెనే, చతుః-సింధుజల-ఆదిభిః - నాల్గు సముద్రముల జలములు పంచామృతములు మొదలగువాటితో, విధివత్ - యథావిధిగా, అభ్యషించత్ - అభిషేకించెను.

గురువగు వసిష్ఠుడు శ్రీరాముని జటలను తొలగింపజేసి, కులపెద్ద లతో గూడి, ఇంద్రుని వలెనే, శ్రీరాముని నాలుగు సముద్రముల జలము లతో మరియు పంచామృతములు మొదలగువాటితో యథావిధిగా పట్టాభి షిక్తుని చేసెను.

ఏవం కృతశిరస్స్నానస్సువాసాస్స్రగ్వ్యలంకృతః ।
స్వలంకృతైస్సువాసోభిర్భ్రాతృభిర్భార్యయా బభౌ ।। 50

ఏవమ్ - ఈ విధముగా, కృతశిరః-స్నానః - చేయబడిన అభిషే కము గలవాడు, సువాసాః - చక్కని వస్త్రములను దాల్చినవాడు, స్రగ్వీ - పుష్పమాల గలవాడు, అలంకృతః - అలంకరించుకున్నవాడు, సు-అ లంకృతైః - చక్కగా అలంకరించుకున్నట్టియు, సువాసోభిః - చక్కని వస్త్ర ములను దాల్చిన, భ్రాతృభిః - సోదరులతో, భార్యయా - భార్యతో, బభౌ - ప్రకాశించెను.

శ్రీరాముడీ విధముగా అభిషేకము అయిన తరువాత చక్కని వస్త్ర ములను దాల్చి, పుష్పమాలను ధరించి, అలంకరించుకొనెను. ఆయన సోదరులు, భార్యయగు సీతాదేవి కూడ చక్కని వస్త్రములను ధరించి అలంకరించుకొనిరి. వారితో గూడి ఆయన గొప్పగా ప్రకాశించెను.

అగ్రహీదాసనం భ్రాత్రా ప్రణిపత్య ప్రసాదితః ।
ప్రజాస్స్వధర్మనిరతా వర్ణాశ్రమగుణాన్వితాః ।
జుగోప పితృవద్రామో మేనిరే పితరం చ తమ్ ।। 51

భ్రాత్రా - సోదరుడగు భరతునిచే, ప్రణిపత్య - నమస్కరించి, ప్రసాదితః - సంతోషముగా ఒప్పుకొనేట్లు చేయబడిన శ్రీరాముడు, ఆస నమ్ - సింహాసనమును, అగ్రహీత్ - గ్రహించెను, స్వధర్మనిరతాః - తమ ధర్మమునందు నిష్ఠ కలిగినట్టియు, వర్ణ-ఆశ్రమగుణ-అన్వితాః - వర్ణముల మరియు ఆశ్రమముల గుణములతో కూడియున్న, ప్రజాః - జనులను, రామః - శ్రీరాముడు, పితృవత్ - తండ్రివలె, జుగోప - రక్షించెను, తం చ - ఆయననే, పితరమ్ - తండ్రినిగా, మేనిరే - తలపోసిరి.

సోదరుడగు భరతుడు శ్రీరామునకు నమస్కరించి ఆయన సింహాసనమును గ్రహించుటకు సంతోషముతో ఒప్పుకొనునట్లు చేయగా, ఆయన అటులనే చేసెను. ఆయన రాజ్యములో ప్రజలు తమ తమ వర్ణాశ్రమములకు తగిన గుణములు గలవారై తమ ధర్మమునందు శ్రద్ధను కలిగియుండిరి. ఆయన వారిని తండ్రి వలెనే రక్షించగా, వారాయనను తండ్రిగనే భావించిరి.

త్రేతాయాం వర్తమానాయాం కాలః కృతసమోఽభవత్ ।
రామే రాజని ధర్మజ్ఞే సర్వభూతసుఖావహే ॥ 52

ధర్మజ్ఞే - ధర్మవేత్తయైనట్టియు, సర్వభూతసుఖ-ఆవహే - సకల ప్రాణములకు సుఖమును కలిగించే, రామే - శ్రీరాముడు, రాజని - రాజై యుండగా, త్రేతాయామ్ - త్రేతాయుగము, వర్తమానాయామ్ - కొనసాగుచుండగా, కాలః - కాలము, కృతసమః - కృతయుగముతో సమానమైనదిగా, అభవత్ - ఆయెను.

ధర్మవేత్తయైన శ్రీరాముడు రాజై సకలప్రాణులకు సుఖమును కలిగించుచుండగా, ఆ కాలము త్రేతాయుగమే అయిననూ, కృతయుగముతో సమానమైనది (నాలుగు పాదముల ధర్మము కలది) ఆయెను.

వనాని నద్యో గిరయో వర్షాణి ద్వీపసింధవః ।
సర్వే కామదుఘా ఆసన్ ప్రజానాం భరతర్షభ ॥ 53

భరత-ఋషభ - భరతవంశీయులలో శ్రేష్ఠుడవైన ఓ రాజా!, వనాని - అడవులు, నద్యః - నదులు, గిరయః - పర్వతములు, వర్షాణి - ఉపఖండములు, ద్వీపసింధవః - ఖండములు మరియు సముద్రములు, సర్వే - అన్నీ, ప్రజానామ్ - ప్రజలకు, కామదుఘాః - కోరికలను పితుకునవియై, ఆసన్ - అయినవి.

భరతవంశీయులలో శ్రేష్ఠుడవైన ఓ పరీక్షిన్మహారాజా! అడవులు, నదులు, పర్వతములు, ఉపఖండములు, ఖండములు, సముద్రములు అన్నీ ప్రజలకు అవసరములను తీర్చెడివి.

నాధివ్యాధిజరాగ్లానిదుఃఖశోకభయక్లమాః ।
మృత్యుశ్చానిచ్ఛతాం నాసీద్రామే రాజన్యధోక్షజే ॥ 54

అధోక్షజే - ఇంద్రియగోచరుడు కాని శ్రీహరి, రామే - రాముడై, రాజని - రాజు కాగా, అధివ్యాధిజరాగ్లానిదుఃఖశోకభయక్లమాః - మనో వ్యాధులు శరీరవ్యాధులు ముసలితనము దుర్బలత్వము శారీరకపీడ మానసిక పీడ భయము శ్రమలు, న - లేవు, అనిచ్ఛతామ్ - కోరనివార లకు, మృత్యుః చ - మరణమైననూ, న ఆసీత్ - కలుగలేదు.

ఇంద్రియగోచరుడు కాని శ్రీహరి రాముడై అవతరించి రాజ్యమునే లుచుండగా ప్రజలకు మనోవ్యాధులు, శరీరవ్యాధులు, కదలలేని ముసలిత నము, దుర్బలత్వము, శారీరకపీడ, మానసికపీడ, భయము, శ్రమ అను నవి లేవు. ఇంతేగాక, ప్రజలు ఎంతవరకైతే మరణించవలెనని కోరరో, అంతవరకు మృత్యువు కూడ వచ్చేడిది కాదు.

ఏకపత్నీవ్రతధరో రాజర్షిచరితశ్శుచిః ।
స్వధర్మం గృహమేధీయం శిక్షయన్ స్వయమాచరన్ ॥ 55

ఏకపత్నీవ్రతధరః - ఒకే భార్య అనే వ్రతమును దాల్చినవాడు, రాజ-ఋషి చరితః - రాజర్షుల నడవడి గలవాడు, శుచిః - పవిత్రమైనవా డు, గృహమేధీయమ్ - గృహస్థులాచరించదగిన, స్వధర్మమ్ - తన ధర్మ మును, స్వయమ్ - తాను, ఆచరన్ - ఆచరించువాడై, శిక్షయన్ - నేర్పు వాడు.

శ్రీరాముడు ఒకే భార్య అనే వ్రతమును జీవితములో పాలించెను. రాజర్షుల నడవడివంటి నడవడి గల శ్రీరాముడు పవిత్రమైన ఆచరణము గలవాడై తన గృహస్థధర్మములను తాను స్వయముగా ఆచరిస్తూ, జను లకు ఆదర్శముగా నిలిచెను.

ప్రేమ్ణానువృత్త్యా శీలేన ప్రశ్రయావనతా సతీ ।
ధియా హ్రియా చ భావజ్ఞా భర్తుస్సీతాఽహరన్మనః ॥ 56

సతీ - పతివ్రతయగు, సీతా - సీతాదేవి, ప్రేమ్ణా - ప్రేమతో, అనువృత్త్యా - సేవతో, శీలేన - సచ్ఛీలముతో, ప్రశ్రయ-అవనతా - వినయముతో నమ్రురాలై, ధియా - బుద్ధితో, భావజ్ఞా - ఇంగితమును తెలియునదై, హ్రియా చ - బిడియముతో కూడ, భర్తుః - భర్తయగు శ్రీరాముని యొక్క, మనః - మనస్సును, అహరత్ - హరించెను.

పతివ్రతయగు సీతాదేవి ప్రేమతో, సేవతో, సచ్ఛీలముతో మరియు బిడియముతో భర్తయగు శ్రీరాముని మనస్సును దోచివేసెను ఆమె బుద్ధిశక్తితో శ్రీరాముని ఇంగితమును తెలుసుకుంటూ, వినయముతో నమ్రురాలై శ్రీరాముని సేవించెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
శ్రీరాముని చరితమును వర్ణించే పదవ
అధ్యాయము ముగిసినది (10).

* * * * *

# అథ ఏకాదశోఽధ్యాయః

## ఉత్తర రామ చరితము

శ్రీశుక ఉవాచ।
భగవానాత్మనాఽఽత్మానం రామ ఉత్తమకల్పకైః ।
సర్వదేవమయం దేవమీజ ఆచార్యవాన్మఖైః ॥ 1

భగవాన్ రామః - శ్రీరామ భగవానుడు, ఆచార్యవాన్ - ఆచార్యుడు గలవాడై, ఉత్తమకల్పకైః - ఉత్తమమగు సాధనములు గల, మఖైః - యజ్ఞములచే, ఆత్మనా - తనచే, సర్వదేవమయమ్ - సకలదేవతాస్వరూపుడగు, ఆత్మానమ్ - తానే అగు, దేవమ్ - దేవుని, ఈజే - ఆరాధించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శ్రీరామ భగవానుడు ఆచార్యుని యెదుట నుంచుకొని ఉత్తమమగు సాధనములు గల యజ్ఞములను చేసెను. ఈ విధముగా ఆయన తానే అయి ఉన్న సకలదేవతాస్వరూపుడగు దేవుని తానే ఆరాధించెను.

హోత్రేఽదదాద్దిశం ప్రాచీం బ్రహ్మణే దక్షిణాం ప్రభుః ।
అధ్వర్యవే ప్రతీచీం చ ఉదీచీం సామగాయ సః ॥ 2

సః - ఆ, ప్రభుః - శ్రీరామ ప్రభుడు, ప్రాచీం దిశమ్ - తూర్పు దిక్కును, హోత్రే - హోత కొరకు, దక్షిణామ్ - దక్షిణదిక్కును, బ్రహ్మణే - బ్రహ్మ కొరకు, ప్రతీచీం - పడమర దిక్కును, అధ్వర్యవే - అధ్వర్యుని కొరకు, ఉదీచీం చ - ఉత్తరదిక్కును కూడ, సామగాయ - సామగానమును చేసే ఉద్గాత కొరకు, అదదాత్ - దానము చేసెను.

ఆ శ్రీరామ ప్రభుడు తూర్పు దిక్కును హోతకు, దక్షిణదిక్కును బ్రహ్మకు, పడమర దిక్కును అధ్వర్యునకు, ఉత్తరదిక్కును సామగానము చేసే ఉద్గాతకు దానము చేసెను.

ఆచార్యాయ దదౌ శేషాం యావతీ భూస్తదంతరా ।
మన్యమాన ఇదం కృత్స్నం బ్రాహ్మణోఽర్హతి నిస్స్పృహః ॥ 3

ఇదమ్ - ఈ, కృత్స్నమ్ - సర్వమును, బ్రాహ్మణః - వేదవేత్త, అర్హతి - తగును, ఇతి - అని, మన్యమానః - తలపోయువాడై, నిస్స్పృహః - కామనలు లేని శ్రీరాముడు, తద్-అంతరా - ఆ దిక్కుల మధ్యలో, యావతీ - ఎంత, భూః - భూమి గలదో, శేషామ్ - మిగిలియున్న ఆ భూమిని, ఆచార్యాయ - ఆచార్యుని కొరకు, దదౌ - ఇచ్చెను.

శ్రీరామునకు కామనలు లేవు. ఈ భూమినంతనూ పొందుటకు వేదవేత్త తగినవాడే, అని ఆయన భావన. ఆ దిక్కుల మధ్యలో మిగిలి యున్న భూమిని ఆయన ఆచార్యునకు ఇచ్చివేసెను.

ఇత్యయం తదలంకారవాసోభ్యామవశేషితః ।
తథా రాజ్ఞ్యపి వైదేహీ సౌమంగల్యావశేషితా ॥ 4

ఇతి - ఈ విధముగా, అయమ్ - ఈ శ్రీరాముడు, తత్ - అప్పుడు, అలంకారవాసోభ్యామ్ - అలంకారములతో వస్త్రములతో, అవశేషితః - మిగిలియున్నవాడు, తథా - అదే విధముగా, రాజ్ఞీ అపి - మహారాణి యగు, వైదేహీ - సీతాదేవి కూడ, సౌమంగల్య-అవశేషితా - సూత్రము మొదలగు మాంగల్యాలంకారములతో మిగిలియున్నది.

ఈ విధముగా ఈ శ్రీరాముడు కేవలము అలంకారములతో మరియు కట్టుబట్టలతో, మహారాణియగు సీతాదేవి మాంగల్యచిహ్నము లగు సూత్రము, ముక్కుపుడక మొదలగు ఆభరణములతో మరియు వస్త్రములతో మాత్రమే మిగిలియుండిరి.

తే తు బ్రహ్మణ్యదేవస్య వాత్సల్యం వీక్ష్య సంస్తుతమ్ ।
ప్రీతాః క్లిన్నధియస్తస్మై ప్రత్యర్ప్యేదం బభాషిరే ॥ 5

తే తు - ఆ ఋత్విక్కులైతే, బ్రహ్మణ్యదేవస్య - వేదవేత్తలే దైవముగా గల శ్రీరామునియొక్క, సంస్తుతమ్ - అధికముగా కొనియాడబడిన, వాత్సల్యమ్ - ప్రేమను, వీక్ష్య - చూచి, ప్రీతాః - సంతోషించినవారై,

క్లిన్నధియః - ప్రేమతో ఆర్ద్రమైన చిత్తము గలవారై, తస్మై - ఆ శ్రీరాముని కొరకు, ప్రత్యర్ప్య - తిరిగి సమర్పించి, ఇదమ్ - ఈ మాటను, బభాషిరే - పలికిరి.

శ్రీరామునకు వేదవేత్తలే దైవము. ఈ విషయములో సత్పురుషులు రాముని కొనియాడుచుందురు. ఆయన ప్రేమను చూచిన ఋత్విక్కులకైతే వారి హృదయములు ప్రేమతో ఆర్ద్రములాయెను. వారు తమకిచ్చిన భూమిని మరల ఆయనకు సమర్పించి ఇట్లు పలికిరి.

అప్రత్తం నస్త్వయా కిం ను భగవన్ భువనేశ్వర ।
యన్నోఽంతర్హృదయం విశ్య తమో హంసి స్వరోచిషా ॥ 6

భగవన్ - ఓ భగవానుడా!, భువన-ఈశ్వర - ఓ జగన్నాథా!, త్వయా - నీచే, నః - మాకు, కిం ను - ఎయ్యది, అప్రత్తమ్ - ఈయబడలేదు?, యత్ - ఏలయనగా, నః - మాయొక్క, అంతః-హృదయమ్ - హృదయము లోపల, విశ్య - ప్రవేశించి, స్వరోచిషా - నీ ప్రకాశముతో, తమః - చీకటిని, హంసి - పోగొట్టుచున్నావు.

ఓ భగవానుడా! జగన్నాథుడవు నీవే. నీవు మాకీయనిది ఏది గలదు? (ఏదీ లేదు). ఎందుకంటే, నీవు మా హృదయముల లోపల (ఆత్మ రూపముగా) ప్రవేశించి చీకటి (అజ్ఞానము) ని పోగొట్టుచున్నావు.

నమో బ్రహ్మణ్యదేవాయ రామాయాకుంఠమేధసే ।
ఉత్తమశ్లోకధుర్యాయ న్యస్తదండార్పితాంఘ్రయే ॥ 7

బ్రహ్మణ్యదేవాయ - వేదవేత్తలే దైవముగా కలిగినట్టియు, అకుంఠమేధసే - మొక్కవోని బుద్ధిశక్తి కలిగినట్టియు, ఉత్తమశ్లోకధుర్యాయ - ఉత్తమమగు కీర్తి గలవారిలో అగ్రేసరుడైనట్టియు, న్యస్తదండ-అర్పిత-అంఘ్రయే - విడిచిపెట్టబడిన ప్రాణిహింసగల సన్న్యాసులచే తమ హృదయమునందు నెలకొల్పబడిన పాదములు గల, రామాయ - శ్రీరాముని కొరకు, నమః - నమస్కారము.

మొక్కవోని బుద్ధిశక్తి గల శ్రీరామునకు వేదవేత్తలే దైవము. ఆయన ఉత్తమమగు కీర్తి గలవారిలో అగ్రేసరుడు. సకలప్రాణులకు అభయదక్షిణ నిచ్చే సర్వసంగపరిత్యాగులు ఆయన పాదములను తమ హృదయములో నిలుపుకొనెదరు. అట్టి శ్రీరామునకు నమస్కారము.

కదాచిల్లోకజిజ్ఞాసుర్గూఢో రాత్ర్యామలక్షితః ।
చరన్ వాచోఽశృణోద్రామో భార్యాముద్దిశ్య కస్యచిత్ ।। 8

కదాచిత్ - ఒకనాడు, లోకజిజ్ఞాసుః - జనులను గురించి తెలియ గోరే, రామః - శ్రీరాముడు, గూఢః - గుర్తు పట్టలేని వేషము గలవాడై, రాత్ర్యామ్ - రాత్రియందు, అలక్షితః - కానరానివాడుగా, చరన్ - సంచ రించువాడై, భార్యామ్ - భార్యను, ఉద్దిశ్య - ఉద్దేశించి, కస్యచిత్ - ఒకానొ కనియొక్క, వాచః - పలుకులను, అశృణోత్ - వినెను.

శ్రీరాముడు అయోధ్యా నగరములోని జనులను గురించి తెలియ గోరి మారు వేషముతో రాత్రియందు ఇతరులకు కానరాకుండా సంచరించె ను. అపుడాయన ఒకానొక వ్యక్తి తన భార్యనుద్దేశించి పలికిన పలుకులను వినెను.

నాహం బిభర్మి త్వాం దుష్టామసతీం పరవేశ్మగామ్ ।
స్త్రైలోభీ బిభృయాత్సీతాం రామో నాహం భజే పునః ।। 9

దుష్టామ్ - దుష్టురాలవైనట్టియు, అసతీమ్ - పాపివైనట్టియు, పర వేశ్మగామ్ - పరాయి వ్యక్తి ఇంటికి వెళ్లిన, త్వామ్ - నిన్ను, అహమ్ - నేను, న బిభర్మి - ఏలుకోను, స్త్రైలోభీ - భార్యయందు లోభము గల, రామః - రాముడు, సీతామ్ - సీతను, బిభృయాత్ - ఏలుకొనుగాక!, అహం పునః - నేనైతే, న భజే - ఏలుకోను.

నీవు దుష్టురాలవు, పరాయివాని ఇంటికి వెళ్లిన పాపివి. నేను నిన్ను ఏలుకోను. రాముడు స్త్రీయందు లోభము గలవాడు గాన, సీతను ఏలుకొనుగాక! కాని, నేను మాత్రము ఏలుకోను.

ఇతి లోకాద్బహుముఖాద్దురారాధ్యాదసంవిదః ।
పత్యా భీతేన సా త్యక్తా ప్రాప్తా ప్రాచేతసాశ్రమమ్ ॥ 10

ఇతి - ఈ విధముగా, బహుముఖాత్ - పలురకములుగా మాటలాడునట్టియు, దురారాధ్యాత్ - మెప్పించ శక్యము కానట్టియు, అసంవిదః - జ్ఞానము లేని, లోకాత్ - జనము వలన, భీతేన - భయపడిన, పత్యా - భర్తయగు శ్రీరామునిచే, త్యక్తా - విడిచిపెట్టబడిన, సా - ఆ సీతాదేవి, ప్రాచేతస-ఆశ్రమమ్ - వాల్మీకి మహర్షియొక్క ఆశ్రమమును, ప్రాప్తా - చేరెను.

లోకులు పలువిధములుగా మాటలాడెదరు. అజ్ఞానులగు జనులను మెప్పించుట సంభవము కాదు. వారికి భయపడి శ్రీరాముడు సీతాదేవిని విడిచిపెట్టగా, ఆమె వాల్మీకి మహర్షి ఆశ్రమమును చేరెను.

అంతర్వత్న్యాగతే కాలే యమౌ సా సుషువే సుతౌ ।
కుశో లవ ఇతి ఖ్యాతౌ తయోశ్చక్రే క్రియా మునిః ॥ 11

అంతర్వత్నీ - గర్భిణియగు, సా - ఆ సీతాదేవి, కాలే - సమయము, ఆగతే - వచ్చినప్పుడు, యమౌ - కవలలైనట్టియు, కుశః - కుశుడు, లవః - లవుడు, ఇతి - అని, ఖ్యాతౌ - విఖ్యాతి చెందిన, సుతౌ - పుత్రులను, సుషువే - కనెను, మునిః - వాల్మీకి మహర్షి, తయోః - వారిద్దరికి, క్రియాః - జాతకర్మాది సంస్కారకర్మలను, చక్రే - చేసెను.

గర్భిణియగు ఆ సీతాదేవి ప్రసవసమయము వచ్చినప్పుడు కవల పుత్రులనిద్దరిని కనెను. వారు కుశలవులు అని ప్రఖ్యాతి గాంచిరి. వారిద్దరికి వాల్మీకి మహర్షి జాతకర్మాది సంస్కారములను చేసెను.

అంగదశ్చిత్రకేతుశ్చ లక్ష్మణస్యాత్మజౌ స్మృతౌ ।
తక్షః పుష్కల ఇత్యాస్తాం భరతస్య మహీపతే ॥ 12

అంగదః - అంగదుడు, చిత్రకేతుః చ - చిత్రకేతువు, లక్ష్మణస్య - లక్ష్మణునియొక్క, ఆత్మజౌ - పుత్రులని, స్మృతౌ - చెప్పబడినారు, మహీపతే - ఓ మహారాజా!, భరతస్య - భరతునకు, తక్షః - తక్షుడు, పుష్కలః - పుష్కలుడు, ఇతి - అనువారలు, ఆస్తామ్ - ఉండిరి.

ఓ మహారాజా! అంగదుడు, చిత్రకేతువు అనువారలు లక్ష్మణుని పుత్రులు. తక్షుడు, పుష్కలుడు భరతుని పుత్రులు.

సుబాహుశ్శ్రుతసేనశ్చ శత్రుఘ్నస్య బభూవతుః ।
గంధర్వాన్ కోటిశో జఘ్నే భరతో విజయే దిశామ్ ।। 13

శత్రుఘ్నస్య - శత్రుఘ్నునకు, సుబాహుః - సుబాహుడు, శ్రుత సేనః చ - శ్రుతసేనుడు, బభూవతుః - కలిగిరి, భరతః - భరతుడు, దిశామ్ - దిక్కులయొక్క, విజయే - విజయమునందు, గంధర్వాన్ - గంధర్వులను, కోటిశః - కోట్లాదిగా, జఘ్నే - సంహరించెను.

శత్రుఘ్నునకు సుబాహుడు, శ్రుతసేనుడు అనే పుత్రులు కలిగిరి. భరతుడు దిగ్విజయమునందు కోట్లాది గంధర్వులను సంహరించెను.

తదీయం ధనమానీయ సర్వం రాజ్ఞే న్యవేదయత్ ।
శత్రుఘ్నశ్చ మధోః పుత్రం లవణం నామ రాక్షసమ్ ।
హత్వా మధువనే చక్రే మథురాం నామ వై పురీమ్ ।। 14

తదీయమ్ - ఆ గంధర్వులకు చెందిన, ధనమ్ - ధనమును, సర్వమ్ - అంతనూ, ఆనీయ - తీసుకువచ్చి, రాజ్ఞే - శ్రీరామ ప్రభుని కొరకు, న్యవేదయత్ - సమర్పించెను, శత్రుఘ్నః చ - శత్రుఘ్నుడు కూడ, మధోః - మధువుయొక్క, పుత్రమ్ - పుత్రుడైన, లవణం నామ - లవణుడని ప్రసిద్ధి గాంచిన, రాక్షసమ్ - రాక్షసుని, హత్వా - సంహరించి, మధువనే - మధువనమునందు, మథురాం నామ - మథుర యని ప్రసిద్ధి గాంచిన, పురీమ్ - నగరమును, చక్రే వై - నిర్మించెను.

భరతుడు ఆ గంధర్వుల సంపదనంతనూ తెచ్చి శ్రీరామ ప్రభునకు సమర్పించెను. శత్రుఘ్నుడు కూడ మధువుయొక్క పుత్రుడైన లవణుడని ప్రసిద్ధి గాంచిన రాక్షసుని సంహరించి, మధువనమునందు మథుర అని ప్రసిద్ధి గాంచిన నగరమును నిర్మించెను.

మునౌ నిక్షిప్య తనయౌ సీతా భర్త్రా వివాసితా ।
ధ్యాయంతీ రామచరణౌ వివరం ప్రవివేశ హ ।। 15

భర్త్రా - భర్తయగు శ్రీరామునిచే, వివాసితా - విడిచిపెట్టబడిన, సీతా - సీతాదేవి, తనయౌ - పుత్రులిద్దరిని, మునౌ - వాల్మీకి మహర్షి యందు, నిక్షిప్య - నిక్షేపించి, రామచరణౌ - శ్రీరాముని పాదములను, ధ్యాయంతీ - ధ్యానము చేయుచున్నదై, వివరమ్ - భూమిలోని బిలము ను, ప్రవివేశ హ - ప్రవేశించెనట.

భర్తయగు శ్రీరామునిచే పరిత్యజించబడిన సీతాదేవి పుత్రులిద్దరిని వాల్మీకి మహర్షికి అప్పజెప్పి, శ్రీరాముని పాదములను ధ్యానిస్తూ, భూమి లోని బిలమును ప్రవేశించెను.

తచ్ఛ్రుత్వా భగవాన్ రామో రుంధన్నపి ధియా శుచః ।
స్మరంస్తస్యా గుణాంస్తాంస్తాన్నాశక్నోద్రోద్ధుమీశ్వరః ॥ 16

ఈశ్వరః - సర్వసమర్థుడైన, భగవాన్ రామః - శ్రీరామ భగవాను డు,తత్ - ఆ విషయమును, శ్రుత్వా - విని, ధియా - వివేకబుద్ధితో, శుచః - కన్నీళ్లను, రుంధన్ అపి - ఆపుకొనువాడే అయిననూ, తస్యాః - ఆమె యొక్క, తాన్ తాన్ - ఆయా, గుణాన్ - గుణములను, స్మరన్ - స్మరిం చుచున్నవాడై, రోద్ధుమ్ - ఆపుటకు, న అశక్నోత్ - సమర్థుడు కాలేదు.

శ్రీరామ భగవానుడు ఆ విషయమును విని వివేకబుద్ధితో దుఃఖా శ్రువులను ఆపుకొనుటకు యత్నించెను. ఆయన సర్వసమర్థుడే అయిన నూ సీతాదేవియొక్క ఆయా గుణములను గుర్తుకు తెచ్చుకుంటూ కన్నీరు పెట్టకుండా ఉండలేక పోయెను.

స్త్రీపుంప్రసంగ ఏతాదృక్సర్వత్ర త్రాసమావహః ।
అపీశ్వరాణాం కిముత గ్రామ్యస్య గృహచేతసః ॥ 17

ఏతాదృక్ - ఇటువంటి, స్త్రీపుంప్రసంగః - స్త్రీపురుషులయొక్క ఆసక్తి, ఈశ్వరాణాం అపి - సర్వసమర్థులకైననూ, సర్వత్ర - అన్ని సంద ర్భములయందు, త్రాసం-ఆవహః - భయమును గొల్పునది, గృహచేతసః - గృహమునందు మనస్సు గల, గ్రామ్యస్య - భోగపరాయణునకు, కిం ఉత - వేరుగా చెప్పవలయునా?

స్త్రీపురుషులకు పరస్పరము ఉండే ఈ విధమైన (అధికమగు) ఆసక్తి సర్వసమర్థులైనవారికి కూడ అన్ని సందర్భములలో భయహేతువే యగును. ఇక గృహమునందు తగుల్కొన్న చిత్తము గలవారై భోగపరాయణులగు సామాన్యవ్యక్తులకు భయహేతువగునని వేరుగా చెప్పవలెనా?

తత ఊర్ధ్వం బ్రహ్మచర్యం ధారయన్నజుహోత్ప్రభుః ।
త్రయోదశాబ్దసాహస్రమగ్నిహోత్రమఖండితమ్ ॥ 18

తతః ఊర్ధ్వమ్ - ఆ తరువాత, ప్రభుః - శ్రీరామ ప్రభుడు, బ్రహ్మచర్యమ్ - బ్రహ్మచర్యమును, ధారయన్ - పాటించువాడై, త్రయోదశ-అబ్దసాహస్రమ్ - పదమూడు వేల సంవత్సరములను, అఖండితమ్ - విచ్ఛేదము కాకుండా, అగ్నిహోత్రమ్ - అగ్నిహోత్రమును, అజుహోత్ - హోమము చేసెను.

సీత భూమిని ప్రవేశించిన తరువాత శ్రీరామ ప్రభుడు బ్రహ్మచారిగనే ఉండిపోయెను. ఆయన పదమూడు వేల సంవత్సరములు అవిచ్ఛిన్నముగా అగ్నిహోత్రమును చేసెను.

స్మరతాం హృది విన్యస్య విద్ధం దండకకంటకైః ।
స్వపాదపల్లవం రామ ఆత్మజ్యోతిరగాత్తతః ॥ 19

తతః - తరువాత, రామః - శ్రీరాముడు, దండకకంటకైః - దండకారణ్యములోని ముళ్లచే, విద్ధమ్ - గాయపరచబడిన, స్వపాదపల్లవమ్ - చిగురువంటి తన పాదమును, స్మరతామ్ - స్మరించువారల, హృది - హృదయమునందు, విన్యస్య - ఉంచి, ఆత్మజ్యోతిః - ఆత్మచైతన్యమును, అగాత్ - పొందెను.

తరువాత శ్రీరాముడు దండకారణ్యములో ముళ్లచే గాయపరచబడిన తన చిగుళ్లవంటి పాధములను తనను స్మరించే భక్తుల హృదయములో నిలిపి, ఆయన తన స్వరూపమగు పరబ్రహ్మ చైతన్యమునందు విలీనమాయెను (ప్రకాశించే తన వైకుంఠ ధామమును చేరెను).

నేదం యశో రఘుపతేస్సురయాచ్ఞయాఽఽత్త-
లీలాతనోరధికసామ్యవిముక్తధామ్నః ।
రక్షోవధో జలధిబంధనమస్త్రపూగైః
కిం తస్య శత్రుహననే కపయస్సహాయాః ॥ 20

సురయాచ్ఞయా - దేవతల ప్రార్థించుటచే, ఆత్తలీలాతనోః - స్వీకరించబడిన విలాస కొరకైన దేహము కలిగినట్టియు, అధికసామ్యవిముక్త ధామ్నః - అధికము మరియు సమానము అనువాటిచే విడిచిపెట్టబడిన మహిమ కలిగిన, రఘుపతేః - శ్రీరామునకు, అస్త్రపూగైః - అస్త్రముల సమూహములతో, రక్షః-వధః - రాక్షసులను సంహరించుట, జలధిబంధనమ్ - సముద్రముపై సేతువు అనే, ఇదమ్ - ఇయ్యది, యశః - కీర్తి, న - కాదు, తస్య - ఆయనకు, శత్రుహననే - శత్రువులను సంహరించుటయందు, కపయః - వానరులు, సహాయాః కిమ్ - సహాయకులా యేమి?

దేవతలు ప్రార్థించగా శ్రీహరి దేహమును స్వీకరించి రఘువంశ శిరోమణియై లీలలను నెరపెను. మహిమ (ప్రకాశము) లో ఆయనకంటె అధికుడు గాని, ఆయనతో సమానమైనవాడు గాని లేడు. ఆయన అస్త్రముల సముదాయములతో రాక్షసులను వధించుట, సముద్రముపై సేతువును కట్టుట ఆయనకు కీర్తిని ఇచ్చేటంతటి ఘనకార్యములు కానే కావు. శత్రువులను సంహరించుటయందు ఆయనకు వానరుల సాహాయ్యము ఆవశ్యకమా? (కాదు).

యస్యామలం నృపసదస్సు యశోఽధునాపి
గాయంత్యఘఘ్నమృషయో దిగిభేంద్రపట్టమ్ ।
తం నాకపాలవసుపాలకిరీటజుష్ట-
పాదాంబుజం రఘుపతిం శరణం ప్రపద్యే ॥ 21

యస్య - ఏ శ్రీరామునియొక్క, అమలమ్ - స్వచ్ఛమైనట్టియు, అఘఘ్నమ్ - పాపములను పోగొట్టునట్టియు, దిగ్-ఇభ-ఇంద్రపట్టమ్ - గొప్ప దిగ్గజములకు నడుము పట్టెయగు, యశః - కీర్తిని, అధునా అపి - ఇప్పటికి కూడా, నృపసదస్సు - రాజసభలయందు, ఋషయః - మహర్షులు, గాయంతి - గానము చేయుచున్నారో, తమ్ - ఆ, నాకపాలవసుపాల

కిరీటజుష్టపాద-అంబుజమ్ - ఇంద్రాది దిక్పాలకుల మరియు భూపాలుర యొక్క కిరీటములచే సేవించబడే పద్మమువంటి పాదములు గల, రఘుపతిమ్ - శ్రీరాముని, శరణమ్ - రక్షకునిగా, ప్రపద్యే - పట్టుకొనుచున్నాను.

రఘువంశ శిరోమణియగు శ్రీరాముని స్వచ్ఛమైన కీర్తి స్మరించు వారల పాపములను పోగొట్టును. ఆ కీర్తి గొప్ప దిగ్గజములకు నడుము పట్టైయైనది (అనగా, దిగంతముల వరకు వ్యాపించినది). ఈ నాటికీ ధర్మరాజాదుల సభలయందు మార్కండేయాది మహర్షులు ఆ కీర్తిని గానము చేయుచునే యున్నారు. ఇంద్రాది లోకపాలకులు, భూపాలురు తమ కిరీటములను పద్మములవంటి శ్రీరాముని పాదములకు ఆన్చి సేవించెదరు. అట్టి శ్రీరాముని నేను శరణు వేడుచున్నాను.

స యైస్స్పృష్టోఽభిదృష్టో వా సంవిష్టోఽనుగతోఽపి వా ।
కోసలాస్తే యయుః స్థానం యత్ర గచ్ఛంతి యోగినః ।। 22

యైః - ఎవరిచేనైతే, సః - ఆ శ్రీరాముడు, స్పృష్టః - స్పృశించబడినాడో, వా - లేదా, అభిదృష్టః - పరికించి చూడబడినాడో, సంవిష్టః - సహవాసము చేయబడినాడో, వా - లేదా, అనుగతః అపి - అనుసరించబడినాడో, తే - ఆ, కోసలాః - కోసలదేశస్థులు, స్థానమ్ - ధామమును, యయుః - పొందిరి, యత్ర - ఎక్కడనైతే, యోగినః - యోగులు, గచ్ఛంతి - వెళ్లెదరో.

కోసలదేశస్థులలో ఎవరైతే శ్రీరాముని స్పృశించినారో, లేదా పరికించి చూచినారో, లేదా సహవాసము చేసినారో, లేదా ఆయన వెంట నడచిరో, వారందరు యోగులు చేరే ధామమును చేరిరి.

పురుషో రామచరితం శ్రవణైరుపధారయన్ ।
ఆనృశంస్యపరో రాజన్ కర్మబంధైర్విముచ్యతే ।। 23

రాజన్ - ఓ రాజా!, ఆనృశంస్యపరః - దయాగుణము ప్రముఖముగా గల, పురుషః - మానవుడు, రామచరితమ్ - శ్రీరాముని చరితమును, శ్రవణైః - శ్రవణములతో, ఉపధారయన్ - హృదయమునందు నిలుపు

కొనువాడై, కర్మబంధైః - కర్మబంధములనుండి, విముచ్యతే - విముక్తుడగును.

ఓ పరీక్షిన్మహారాజా! దయాగుణము ప్రధానము గల ఏ వ్యక్తియైతే నిరంతరము శ్రీరాముని చరితమును శ్రవణము చేస్తూ, ఆయనను హృదయములో నిలుపుకొనునో, అట్టి వ్యక్తి కర్మబంధములనుండి విముక్తుడగును.

రాజోవాచ ।
కథం స భగవాన్ రామో భ్రాతౄన్ వా స్వయమాత్మనః ।
తస్మిన్ వా తేఽన్వవర్తంత ప్రజాః పౌరాశ్చ ఈశ్వరే ॥ 24

సః - ఆ, రామః భగవాన్ - శ్రీరామ భగవానుడు, ఆత్మనః - తన అంశలే అయిన, భ్రాతౄన్ వా - సోదరులను ఉద్దేశించి గాని, స్వయం - తాను, కథమ్ - ఏ విధముగా, తే - ఆ సోదరులు, ప్రజాః - ప్రజలు, పౌరాః చ - పురజనులు కూడ, తస్మిన్ - ఆ, ఈశ్వరే వా - రామప్రభునియందు గాని, అన్వవర్తంత - వ్యవహరించిరి?

పరీక్షిన్మహారాజు ఇట్లు ప్రశ్నించెను -- ఆ శ్రీరామ భగవానుడు తన అంశలే అయిన సోదరుల యెడల తాను ఎట్లు వ్యవహరించెను? ఆ సోదరులు, ప్రజలు, పురజనులు కూడ ఆయన యెడల ఎట్లు వ్యవహరించిరి?

శ్రీశుక ఉవాచ ।
అథాదిశద్దిగ్విజయే భ్రాతౄంస్త్రిభువనేశ్వరః ।
ఆత్మానం దర్శయన్ స్వానాం పురీమైక్షత సానుగః ॥ 25

అథ - తరువాత, త్రిభువన-ఈశ్వరః - ముల్లోకములకు ప్రభువగు శ్రీరాముడు, దిగ్-విజయే - దిగ్విజయ యాత్రయందు, భ్రాతౄన్ - సోదరులను, ఆదిశత్ - ఆదేశించెను, స్వానామ్ - తనవారలకు, ఆత్మానమ్ - తనను, దర్శయన్ - చూపించుచున్నవాడై, సానుగః - సోదరులతో కూడినవాడై, పురీమ్ - అయోధ్యా నగరమును, ఐక్షత - చూచెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- పట్టాభిషేకము తరువాత ముల్లోకములకు ప్రభువగు శ్రీరాముడు తన సోదరులను దిగ్విజయయాత్రకై ఆదేశించెను. ఆయన తన వారలకు దర్శనమిచ్చుటయే గాక, అయోధ్యా నగరమును తాను సోదరులతో గూడినవాడై దర్శించెను.

ఆసిక్తమార్గాం గంధోదైః కరిణాం మదశీకరైః ।
స్వామినం ప్రాప్తమాలోక్య మత్తాం వా సుతరామివ ॥ 26

గంధోదైః - గంధజలములతో, కరిణామ్ - ఏనుగులయొక్క, మద శీకరైః - మదబిందువులచే, ఆసిక్తమార్గామ్ - తడుపబడిన మార్గములు కలిగినట్టియు, ప్రాప్తమ్ - విచ్చేసిన, స్వామినమ్ - ప్రభువును, ఆలోక్య - చూచి, సుతరామ్ - మిక్కిలి, మత్తాం ఇవ వా - మత్తెక్కినదా యన్నట్లు ఉన్న (నగరమును శ్రీరాముడు చూచెను).

అయోధ్యలోని రాజమార్గములు గంధజలములతో మరియు ఏనుగుల మదజలములతో తడిసి యుండెడివి. ఆ నగరము తన వద్దకు వచ్చిన ప్రభువును చూచి మిక్కిలి మత్తెక్కిన యువతిని పోలియుండెడిది.

ప్రాసాదగోపురసభాచైత్యదేవగృహాదిషు ।
విన్యస్తహేమకలశైః పతాకాభిశ్చ మండితామ్ ॥ 27

ప్రాసాదగోపురసభాచైత్యదేవగృహ-ఆదిషు - ప్రాసాదములు గోపురములు సభామండపములు విహారములు దేవాలయములు మొదలగువాటియందు, విన్యస్తహేమకలశైః - ఉంచబడిన బంగరు కడవలతో, పతాకాభిః చ - జెండాలతో కూడ, మండితామ్ - అలంకరించబడియున్న (నగరమును చూచెను).

ఆ నగరము బంగరు కడవలతో అలంకరించబడిన ప్రాసాదములు, గోపురములు, సభామండపములు, విహారములు, దేవాలయములు మొదలగువాటితో మరియు జెండాలతో శోభిల్లెను.

పూగైస్సవృంతై రంభాభిః పట్టికాభిస్సువాససామ్ ।
ఆదర్శైరంశుకైస్స్రగ్భిః కృతకౌతుకతోరణామ్ ॥ 28

సవృంతైః - పళ్ల గుత్తులతో కూడిన, పూగైః - పోకచెట్లతో, రంభాభిః - అరటి చెట్లతో, సువాససామ్ - మంచి వస్త్రముల, పట్టికాభిః - పతాకములతో, ఆదర్శైః - అద్దములతో, అంశుకైః - వస్త్రములతో, స్రగ్భిః - మాలలతో, కృతకౌతుకతోరణామ్ - చేయబడిన మంగళములు గల ద్వారములు గల (నగరమును చూచెను).

ఆ నగరములోని గృహద్వారములు పళ్ల గుత్తులతో కూడిన పోకచెట్లతో, అరటి చెట్లతో, మంచి వస్త్రముల పతాకములతో, అద్దములతో మరియు మాలలతో అలంకరించబడి మంగళకరముగా నుండెను. బజారులయందు వస్త్రములు పరుచబడి యుండెను.

తముపేయుస్తత్ర తత్ర పౌరా అర్హణపాణయః ।
ఆశిషో యుయుజుర్దేవ పాహీమాం ప్రాక్ త్వయోద్ధృతామ్ ।। 29

తత్ర తత్ర - అక్కడక్కడ, అర్హణపాణయః - పూజాద్రవ్యములు చేతులయందు గల, పౌరాః - పురజనులు, తమ్ - ఆ శ్రీరాముని, ఉపేయుః - సమీపించిరి, ఆశిషః - ఆశీస్సులను, యుయుజుః - ప్రయోగించిరి, దేవ - ఓ దేవా!, ప్రాక్ - పూర్వము, త్వయా - నీచే, ఉద్ధృతామ్ - ఉద్ధరించబడిన, ఇమామ్ - ఈ భూమిని, పాహి - రక్షించుము.

ఆ నగరములో పురజనులు శ్రీరాముని అక్కడక్కడ పూజాద్రవ్యములను పట్టుకొని సమీపించి, ఓ దేవా! నీవు పూర్వము (వరాహావతారములో) ఉద్ధరించిన ఈ భూమండలమును రక్షించుము, అంటూ ఆశీస్సులను ప్రయోగించిరి.

తతః ప్రజా వీక్ష్య పతిం చిరాగతం దిదృక్షయోత్సృష్టగృహాః స్త్రియో నరాః,
ఆరుహ్య హర్మ్యాణ్యరవిందలోచనమతృప్తనేత్రాః కుసుమైరవాకిరన్ । 30

తతః - శ్రీరాముడు పట్టాభిషిక్తుడైన తరువాత, చిర-ఆగతమ్ - చాల కాలము తరువాత తిరిగి వచ్చిన, పతిమ్ - శ్రీరామ ప్రభుని గురించి, ప్రజాః - ప్రజలు, వీక్ష్య - విని, దిదృక్షయా - చూచే కోరికతో, ఉత్సృష్ట గృహాః - విడిచిపెట్టబడిన ఇళ్లు గల, స్త్రియః - స్త్రీలు, నరాః - పురుషులు, హర్మ్యాణి - భవనములను, ఆరుహ్య - పైకెక్కి, అరవిందలోచ

నమ్ - పద్మములవంటి కన్నులు గల శ్రీరాముని, అతృప్తనేత్రాః - తృప్తి చెందని కన్నులు గలవారై, కుసుమైః - పుష్పములతో, అవాకిరన్ - వెదజల్లిరి.

శ్రీరాముడు పట్టాభిషిక్తుడయ్యెను. చిరకాలము తరువాత తిరిగి వచ్చిన ఆయనను చూడవలెననే కోరిక ప్రజలకు ఉండెను. స్త్రీలు, పురుషులు ఇళ్లను వదిలి వచ్చి ప్రాసాదములపైకి ఎక్కి పద్మములవంటి కన్నులు గల శ్రీరాముని చూచి ఆయనపై పూలను చల్లిరి. ఆయనను చూచుచున్ననూ, వారి కళ్లకు తృప్తి లేకుండెను.

అథ ప్రవిష్టస్స్వగృహం జుష్టం స్వైః పూర్వరాజభిః ।
అనంతాఖిలకోశాఢ్యమనర్ఘ్యోరుపరిచ్ఛదమ్ ॥ 31

అథ - తరువాత, స్వైః - తనవారైన, పూర్వరాజభిః - పూర్వజులైన రాజులచే, జుష్టమ్ - సేవించబడినట్టియు, అనంత-అఖిలకోశ-ఆఢ్యమ్ - హద్దులు లేని సకలములైన ఖజానాలతో సమృద్ధమై యున్నట్టియు, అనర్ఘ్య-ఉరుపరిచ్ఛదమ్ - అమూల్యమగు అనేకములైన ఉపకరణములు గల, స్వగృహమ్ - తన ప్రాసాదమును, ప్రవిష్టః - ప్రవేశించినాడు.

తరువాత శ్రీరాముడు తన ప్రాసాదమును ప్రవేశించెను. ఆయన పూర్వజులైన మహారాజులు ఆ ప్రాసాదమునే సేవించిరి. అది హద్దులు లేని అనేకములైన ఖజానాలతో, మరియు విలువ కట్టలేని అనేకములైన సామగ్రులతో సమృద్ధమై యుండెను.

విద్రుమోదుంబరద్వారైర్వైదూర్యస్తంభపంక్తిభిః ।
స్థలైర్మారకతైస్స్వచ్ఛైర్భ్రాతస్ఫటికభిత్తిభిః ॥ 32

విద్రుమ-ఉదుంబరద్వారైః - పగడముల గడపలు గల ద్వారములతో, వైదూర్యస్తంభపంక్తిభిః - కెంపుల స్తంభముల వరుసలతో, మారకతైః - పచ్చలు పొదిగిన, స్థలైః - చదును నేలలతో, భాతస్ఫటికభిత్తిభిః - ప్రకాశించే స్ఫటికములు పొదిగిన గోడలతో.

ఆ ప్రాసాదమునందలి ద్వారముల గడపలకు పగడములు పొదగబడి యుండెను. దానియందు కెంపులు పొదిగిన స్తంభముల వరుసలు ఉండెను. అచటి స్వచ్ఛమైన నేలలు పచ్చలు పొదిగి యుండెను. అచటి గోడలపై స్ఫటికములు ప్రకాశించుచుండెను.

చిత్రస్రగ్భిః పట్టికాభిర్వాసోమణిగణాంశుకైః ।
ముక్తాఫలైశ్చిదుల్లాసైః కాంతకామోపపత్తిభిః ॥ 33

చిత్రస్రగ్భిః - రంగురంగుల మాలలతో, పట్టికాభిః - పతాక (చాందినీ) లతో, వాసోమణిగణ-అంశుకైః - వస్త్రముల మరియు మణుల గుంపుల కాంతులతో, చిద్-ఉల్లాసైః - చైతన్యముయొక్క ఉల్లాసము వలె స్వచ్ఛమైన ఉల్లాసము గల (చిత్ - అక్కడక్కడ, ఉల్లాసైః - ఉజ్జ్వలమైన), ముక్తాఫలైః - ముత్యములతో, కాంతకామ-ఉపపత్తిభిః - సుందరమైన భోగ సాధనములతో.

రంగురంగుల మాలలు, పతాకలు, చాందినీలు, వస్త్రములు, మణుల గుంపుల కాంతులు, అక్కడక్కడ శుద్ధచైతన్యము వలె స్వచ్ఛమైన ఉజ్జ్వలమగు ముత్యములు మరియు సుందరమగు భోగసాధనములు అను వాటితో ఆ ప్రాసాదము ప్రకాశించెను.

ధూపదీపైస్సురభిభిర్మండితం పుష్పమండనైః ।
స్త్రీపుంభిస్సురసంకాశైర్జుష్టం భూషణభూషణైః ॥ 34

సురభిభిః - సుగంధము గల, ధూపదీపైః - ధూపదీపములతో, పుష్పమండనైః - పుష్పముల అలంకారములచే, మండితమ్ - అలంకరించబడినట్టియు, సురసంకాశైః - దేవతలను పోలినట్టియు, భూషణభూషణైః - అలంకారములకే అలంకారములైన, స్త్రీపుంభిః - స్త్రీపురుషులతో, జుష్టమ్ - సేవించబడిన (ప్రాసాదమును).

సుగంధయుక్తములగు ధూపదీపములతో, మరియు పుష్పాలంకారములతో ఆ ప్రాసాదము అలంకరించబడెను. అలంకారములకే అలంకారములనదగిన దేవతలను పోలిన స్త్రీపురుషులు ఆ ప్రాసాదమును సేవించు చుండిరి.

తస్మిన్ స భగవాన్ రామస్స్నిగ్ధయా ప్రియచేష్టయా ।
రేమే స్వారామధీరాణామృషభస్సీతయా కిల ॥ 35

తస్మిన్ - ఆ ప్రాసాదమునందు, సః - ఆ, స్వ-ఆరామధీరాణామ్ - ఆత్మస్వరూపమునందు రమించే వివేకవంతులలో, ఋషభః - అగ్రేసరు (ప్రియు) డగు, భగవాన్ రామః - శ్రీరామ భగవానుడు, స్నిగ్ధయా - ప్రేమమూర్తియైనట్టియు, ప్రియచేష్టయా - ఆహ్లాదకరమైన నడవడి గల, సీతయా - సీతాదేవితో గూడి, రేమే కిల - విహరించెను.

ఆత్మారాములలో అగ్రేసరుడగు శ్రీరాముడు వివేకవంతులై ఆత్మారాములైన మహాత్ములకు ప్రియమైనవాడు. ప్రేమమూర్తియగు సీతాదేవి తన నడవడిచే ఆయనకు ఆహ్లాదమును కలిగించెడిది. ఆయన ఆమెతో గూడి ఆ ప్రాసాదములో విహరించెను.

బుభుజే చ యథాకాలం కామాన్ ధర్మమపీడయన్ ।
వర్షపూగాన్ బహూన్నౄణామభిధ్యాతాంఘ్రిపల్లవః ॥ 36

నౄణామ్ - మానవులకు, అభిధ్యాత-అంఘ్రిపల్లవః - ధ్యానించబడే చిగుళ్లవంటి పాదములు గల శ్రీరాముడు, ధర్మమ్ - ధర్మమును, అపీడయన్ - సంకోచము చేయనివాడై, బహూన్ - అనేకములగు, వర్షపూగాన్ - సంవత్సరముల సమూహములను, యథాకాలమ్ - కాలమునతిక్రమించకుండా, కామాన్ చ - కామనలను కూడ, బుభుజే - అనుభవించెను.

మానవులచే ధ్యానించబడే చిగుళ్లవంటి పాదములు గల శ్రీరాముడు ధర్మమును సంకోచము చేయకుండా (ధర్మమునకు అడ్డు పడకుండా), అనేక సంవత్సర సమూహముల కాలములో ఉచితమగు సమయములయందు కామనలను కూడ అనుభవించెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
ఉత్తరరామచరితమును వర్ణించే పదకొండవ
అధ్యాయము ముగిసినది (11).

* * * * *

# అథ ద్వాదశోऽధ్యాయః

## శ్రీరాముని తరువాతి రఘువంశ రాజుల చరితము

శ్రీశుక ఉవాచ।
కుశస్య చాతిథిస్తస్మాన్నిషధస్తత్సుతో నభః ।
పుండరీకోऽథ తత్పుత్రః క్షేమధన్వాऽభవత్తతః ।। 1

కుశస్య చ - కుశునకు కూడ, అతిథిః - అతిథి, తస్మాత్ - ఆయన నుండి, నిషధః - నిషధుడు, తత్-సుతః - ఆయన పుత్రుడు, నభః - నభుడు, అథ - తరువాత, తత్-పుత్రః - ఆయనయొక్క పుత్రుడు, పుండరీకః - పుండరీకుడు, తతః - ఆయన వలన, క్షేమధన్వా - క్షేమధన్వుడు, అభవత్ - కలిగెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- కుశుని పుత్రుడు అతిథి. అతిథి పుత్రుడు నిషధుడు. నిషధుని పుత్రుడు నభుడు. నభుని పుత్రుడు పుండరీకుడు. పుండరీకుని పుత్రుడు క్షేమధన్వుడు.

దేవానీకస్తతోऽనీహః పారియాత్రోऽథ తత్సుతః ।
తతో బలస్థలస్తస్మాద్వజ్రనాభోऽర్కసంభవః ।। 2

తతః - ఆయన వలన, దేవానీకః - దేవానీకుడు, అథ - ఆయన వలన, అనీహః - అనీహుడు, తత్-సుతః - ఆయన పుత్రుడు, పారియాత్రః - పారియాత్రుడు, తతః - ఆయన వలన, బలస్థలః - బలస్థలుడు, తస్మాత్ - ఆయన వలన, అర్కసంభవః - సూర్యుని అంశ వలన జన్మించిన, వజ్రనాభః - వజ్రనాభుడు.

క్షేమధన్వుని పుత్రుడు దేవానీకుడు. దేవానీకుని పుత్రుడు అనీహుడు. అనీహుని పుత్రుడు పారియాత్రుడు. పారియాత్రుని పుత్రుడు బలస్థలుడు. బలస్థలుని పుత్రుడు సూర్యుని అంశతో జన్మించిన వజ్రనాభుడు.

ఖగణస్తత్సుతస్తస్మాద్విధృతిశ్చాభవత్సుతః ।
తతో హిరణ్యనాభోఽభూద్యోగాచార్యస్తు జైమినేః ॥ 3

శిష్యః కౌసల్య ఆధ్యాత్మం యాజ్ఞవల్క్యోఽధ్యగాద్యతః ।
యోగం మహోదయమృషిర్హృదయగ్రంథిభేదకమ్ ॥ 4

తత్-సుతః - ఆయన పుత్రుడు, ఖగణః - ఖగణుడు, తస్మాత్ - ఆయన వలన, విధృతిః - విధృతి అనే, సుతః చ - పుత్రుడు, అభవత్ - కలిగెను, తతః - ఆయన వలన, హిరణ్యనాభః - హిరణ్యనాభుడు, అభూత్ - కలిగెను, యోగాచార్యః తు - యోగాచార్యుడు, జైమినేః - జైమినియొక్క, శిష్యః - శిష్యుడు, యతః - ఎవనినుండి, కౌసల్యః - కోసలదేశస్థుడగు, యాజ్ఞవల్క్యః - యాజ్ఞవల్క్యుడు అనే, ఋషిః - మహర్షి, మహా-ఉదయమ్ - గొప్ప అభ్యుదయమును కలిగించునట్టియు, హృదయ గ్రంథిభేదకమ్ - హృదయమునందలి అజ్ఞానమనే ముడిని విడదీసే, ఆధ్యాత్మం యోగమ్ - అధ్యాత్మయోగమును, అధ్యగాత్ - అధ్యయనము చేసెనో.

ఆ వజ్రనాభుని పుత్రుడు ఖగణుడు. ఖగణుని పుత్రుడు విధృతి. విధృతి పుత్రుడు హిరణ్యనాభుడు. ఆయన జైమిని శిష్యుడు, యోగాచార్యుడు. కోసలదేశవాసియగు యాజ్ఞవల్క్య మహర్షి ఆయన వద్దనే అధ్యాత్మయోగమునధ్యయనము జేసెను. ఆ యోగము సాధకునకు గొప్ప అభ్యుదయమును కలిగించి, హృదయమునందలి అజ్ఞానమనే ముడిని తొలగించును.

పుష్యో హిరణ్యనాభస్య ధ్రువసంధిస్తతోఽభవత్ ।
సుదర్శనోఽథాగ్నివర్ణశ్శీఘ్రస్తస్య మరుస్సుతః ॥ 5

హిరణ్యనాభస్య - హిరణ్యనాభునకు, పుష్యః - పుష్యుడు, తతః - ఆయన వలన, ధ్రువసంధిః - ధ్రువసంధి, అభవత్ - కలిగెను, అథ - ఆయన వలన, సుదర్శనః - సుదర్శనుడు, అగ్నివర్ణః - అగ్నివర్ణుడు, శీఘ్రః - శీఘ్రుడు, తస్య - ఆయనయొక్క, సుతః - పుత్రుడు, మరుః - మరువు.

హిరణ్యనాభుని పుత్రుడు పుష్యుడు. పుష్యుని పుత్రుడు ధ్రువసంధి. ధ్రువసంధి పుత్రుడు సుదర్శనుడు. సుదర్శనుని పుత్రుడు అగ్నివర్ణుడు. అగ్నివర్ణుని పుత్రుడు శీఘ్రుడు. శీఘ్రుని పుత్రుడు మరువు.

యోఽసావాస్తే యోగసిద్ధః కలాపగ్రామమాశ్రితః ।
కలేరంతే సూర్యవంశం నష్టం భావయితా పునః ॥ 6

యోగసిద్ధః - యోగముచే జయించబడిన మృత్యువు గల, యః - ఏ, మరుః - మరువు గలడో, అసౌ - ఈయన, కలాపగ్రామమ్ - కలాప మనే గ్రామమును, ఆశ్రితః - ఆశ్రయించినవాడై, ఆస్తే - ఉన్నాడు, కలేః - కలియుగముయొక్క, అంతే - అంతమునందు, నష్టమ్ - కనబడకుండా పోయిన, సూర్యవంశమ్ - సూర్యవంశమును, పునః - మరల, భావయితా - ప్రవర్తిల్ల జేయగలడు.

మరువు యోగముచే మృత్యువును జయించి ఇప్పుడు కలాప మనే గ్రామమునందు ఉన్నాడు. కలియుగాంతమునందు కనబడకుండా పోయిన సూర్యవంశమును ఆయన మరల ప్రవర్తిల్ల జేయగలడు.

తస్మాత్ప్రసుశ్రుతస్తస్య సంధిస్తస్యాప్యమర్షణః ।
మహస్వాంస్తత్సుతస్తస్మాద్విశ్వసాహ్వోఽన్వజాయత ॥ 7

తస్మాత్ - ఆయన వలన, ప్రసుశ్రుతః - ప్రసుశ్రుతుడు, తస్య - ఆయనకు, సంధిః - సంధి, తస్య అపి - ఆయనకు కూడ, అమర్షణః - అమర్షణుడు, తత్-సుతః - ఆయన పుత్రుడు, మహస్వాన్ - మహస్వంతుడు, తస్మాత్ - ఆయన వలన, విశ్వసాహ్వః - విశ్వసాహ్వుడు, అన్వజాయత - జన్మించెను.

మరువు పుత్రుడు ప్రసుశ్రుతుడు. ప్రసుశ్రుతుని పుత్రుడు సంధి. సంధి పుత్రుడు అమర్షణుడు. అమర్షణుని పుత్రుడు మహస్వంతుడు. మహస్వంతుని పుత్రుడు విశ్వసాహ్వుడు.

తతః ప్రసేనజిత్తస్మాత్తక్షకో భవితా పునః ।
తతో బృహద్బలో యస్తు పిత్రా తే సమరే హతః ॥ 8

తతః - ఆయన వలన, ప్రసేనజిత్ - ప్రసేనజిత్తు, తస్మాత్ - ఆయన వలన, తక్షకః - తక్షకుడు, పునః భవితా - కలిగెను, తతః - ఆయన వలన, బృహద్బలః - బృహద్బలుడు, యః తు - ఏ బృహద్బలు డైతే, తే - నీయొక్క, పిత్రా - తండ్రియగు అభిమన్యునిచే, సమరే - యుద్ధమునందు, హతః - సంహరించబడినాడో.

విశ్వసాహ్వుని పుత్రుడు ప్రసేనజిత్తు. ప్రసేనజిత్తు పుత్రుడు తక్షకుడు. తక్షకుని పుత్రుడు బృహద్బలుడు. బృహద్బలుని నీ తండ్రియగు అభిమన్యుడు మహాభారత యుద్ధములో సంహరించెను.

ఏతే హీక్ష్వాకుభూపాలా అతీతాశ్శృణ్వనాగతాన్ ।
బృహద్బలస్య భవితా పుత్రో నామ బృహద్రణః ॥ 9

ఏతే హి - వీరైతే, అతీతాః - గడచిపోయిన, ఇక్ష్వాకుభూపాలాః - ఇక్ష్వాకువంశపు రాజులు, అనాగతాన్ - భవిష్యత్తులో రాబోయే వారిని గురించి, శృణు - వినుము, బృహద్బలస్య - బృహద్బలునకు, బృహద్రణః నామ - బృహద్రణుడని ప్రసిద్ధి గాంచిన, పుత్రః - పుత్రుడు, భవితా - కలుగగలడు.

వీరందరు గడచిపోయిన ఇక్ష్వాకువంశపు రాజులు. ఇప్పుడు రాబోయే రాజులను గురించి వినుము. బృహద్బలునకు బృహద్రణుడని ప్రసిద్ధి గాంచిన పుత్రుడు కలుగును.

ఉరుక్రియస్తతస్తస్య వత్సవృద్ధో భవిష్యతి ।
ప్రతివ్యోమస్తతో భానుర్దివాకో వాహినీపతిః ॥ 10

తతః - ఆయన వలన, ఉరుక్రియః - ఉరుక్రియుడు, తస్య - ఆయనకు, వత్సవృద్ధః - వత్సవృద్ధుడు, భవిష్యతి - కలుగగలడు, తతః - ఆయన వలన, ప్రతివ్యోమః - ప్రతివ్యోముడు, తతః - ఆయన వలన, భానుః - భానుడు, వాహినీపతిః - సేనాపతియగు, దివాకః - దివాకుడు.

బృహద్రణునకు ఉరుక్రియుడు, ఉరుక్రియునకు వత్సవృద్ధుడు, వత్సవృద్ధునకు ప్రతివ్యోముడు, ప్రతివ్యోమునకు భానుడు, భానునకు సేనాధిపతియగు దివాకుడు పుత్రులై జన్మించెదరు.

సహదేవస్తతో వీరో బృహదశ్వోఽథ భానుమాన్ ।
ప్రతీకాశ్వో భానుమతస్సుప్రతీకోఽథ తత్సుతః ॥ 11

భవితా మరుదేవోఽథ సునక్షత్రోఽథ పుష్కరః ।
తస్యాంతరిక్షస్తత్పుత్రస్సుతపాస్తదమిత్రజిత్ ॥ 12

తతః - ఆయన వలన, వీరః - వీరుడగు, సహదేవః - సహదేవుడు, అథ - ఆయన వలన, బృహదశ్వః - బృహదశ్వుడు, భానుమాన్ - భానుమంతుడు, భానుమతః - భానుమంతుని వలన, ప్రతీకాశ్వః - ప్రతీకాశ్వుడు, అథ - ఆయన వలన, సుప్రతీకః - సుప్రతీకుడు, తత్-సుతః - ఆయన పుత్రుడు, మరుదేవః - మరుదేవుడు, భవితా - కాగలడు, అథ - ఆయన వలన, సునక్షత్రః - సునక్షత్రుడు, అథ - ఆయన వలన, పుష్కరః - పుష్కరుడు, తస్య - ఆయనకు, అంతరిక్షః - అంతరిక్షుడు, తత్-పుత్రః - ఆయన పుత్రుడు, సుతపాః - సుతపసుడు, తత్ - ఆయన వలన, అమిత్రజిత్ - అమిత్రజిత్తు.

దివాకుని పుత్రుడు వీరుడైన సహదేవుడు, సహదేవుని పుత్రుడు బృహదశ్వుడు, బృహదశ్వుని పుత్రుడు భానుమంతుడు, భానుమంతుని పుత్రుడు ప్రతీకాశ్వుడు, ప్రతీకాశ్వుని పుత్రుడు సుప్రతీకుడు, సుప్రతీకుని పుత్రుడు మరుదేవుడు, మరుదేవుని పుత్రుడు సునక్షత్రుడు, సునక్షత్రుని పుత్రుడు పుష్కరుడు, పుష్కరుని పుత్రుడు అంతరిక్షుడు, అంతరిక్షుని పుత్రుడు సుతపసుడు, సుతపసుని పుత్రుడు అమిత్రజిత్తు కలుగగలరు.

బృహద్రాజస్తు తస్యాపి బర్హిస్తస్మాత్కృతంజయః ।
రణంజయస్తస్య సుతస్సంజయో భవితా తతః ॥ 13

తస్య అపి - ఆయనకు కూడ, బృహద్రాజః తు - బృహద్రాజు, తస్మాత్ - ఆయన వలన, బర్హిః - బర్హి, కృతంజయః - కృతంజయుడు,

తస్య - ఆయనయొక్క, సుతః - పుత్రుడు, రణంజయః - రణంజయుడు, తతః - ఆయన వలన, సంజయః - సంజయుడు, భవితా - కలుగగలడు.

అమిత్రజిత్తుని పుత్రుడు బృహద్రాజు, బృహద్రాజుయొక్క పుత్రుడు బర్హి, బర్హియొక్క పుత్రుడు కృతంజయుడు, కృతంజయుని పుత్రుడు రణంజయుడు, రణంజయుని పుత్రుడు సంజయుడు కాగలరు.

తస్మాచ్ఛాక్యోఽథ శుద్ధోదో లాంగలస్తత్సుతస్స్మృతః ।
తతః ప్రసేనజిత్తస్మాత్ క్షుద్రకో భవితా తతః ।। 14

రణకో భవితా తస్మాత్సురథస్తనయస్తతః ।
సుమిత్రో నామ నిష్ఠాంత ఏతే బార్హద్వలాన్వయాః ।। 15

తస్మాత్ - ఆయన వలన, శాక్యః - శాక్యుడు, అథ - ఆయన వలన, శుద్ధోదః - శుద్ధోదుడు, తత్-సుతః - ఆయన పుత్రుడు, లాంగలః - లాంగలుడని, స్మృతః - చెప్పబడినవాడు, తతః - ఆయన వలన, ప్రసేన జిత్ - ప్రసేనజిత్తు, తస్మాత్ - ఆయన వలన, క్షుద్రకః - క్షుద్రకుడు, భవితా - కలుగగలడు, తతః - ఆయన వలన, రణకః - రణకుడు, భవితా - కలుగగలడు, తస్మాత్ - ఆయన వలన, సురథః - సురథుడనే, తనయః - పుత్రుడు, తతః - ఆయన వలన, సుమిత్రః నామ - సుమిత్రుడని ప్రసిద్ధి చెందినవాడు, నిష్ఠా-అంతః - వంశమునకు ఆఖరివాడు, ఏతే - వీరు, బార్హ ద్వల-అన్వయాః - బృహద్వలుని వంశమునకు చెందినవారు.

సంజయుని పుత్రుడు శాక్యుడు, శాక్యుని పుత్రుడు శుద్ధోదుడు, శుద్ధోదుని పుత్రుడు లాంగలుడు, లాంగలుని పుత్రుడు ప్రసేనజిత్తు, ప్రసేన జిత్తు పుత్రుడు క్షుద్రకుడు, క్షుద్రకుని పుత్రుడు రణకుడు, రణకుని పుత్రుడు సురథుడు, సురథుని పుత్రుడు సుమిత్రుడు అనువారలు కలుగగలరు. వీరు బృహద్వలుని వంశమునకు చెందినవారు. వీరిలో సుమిత్రుడు ఆ వంశము నకు ఆఖరివాడుగా ప్రసిద్ధి గాంచును.

ఇక్ష్వాకూణామయం వంశస్సుమిత్రాంతో భవిష్యతి ।
యతస్తం ప్రాప్య రాజానం సంస్థాం ప్రాప్స్యతి వై కలౌ ।। 16

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే నవమస్కంధే ద్వాదశోఽధ్యాయః ॥

ఇక్ష్వాకూణామ్ - ఇక్ష్వాకువంశపు రాజులయొక్క, అయమ్ - ఈ, వంశః - వంశము, సుమిత్ర-అంతః - సుమిత్రుడు ఆఖరివాడుగా గల ది, భవిష్యతి - కాగలదు, యతః - ఏలయనగా, తమ్ - ఆ సుమిత్రుని, రాజానమ్ - రాజునుగా, ప్రాప్య - పొంది, కలౌ - కలియుగమునందు, వై - నిశ్చయముగా, సంస్థామ్ - అంతమును, ప్రాప్స్యతి - పొందగలదు.

ఈ ఇక్ష్వాకు వంశపు రాజుల వంశమునకు సుమిత్రుడు ఆఖరి మహారాజు. ఏలయనగా, కలియుగములో ఆ వంశము నిశ్చయముగా ఆయనతో అంతము కాగలదు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
శ్రీరాముని తరువాతి రఘువంశరాజుల చరితమును వర్ణించే
పన్నెండవ అధ్యాయము ముగిసినది (12).

* * * * *

# అథ త్రయోదశోఽధ్యాయః

## నిమి మహారాజు చరితము

శ్రీశుక ఉవాచ।
నిమిరిక్ష్వాకుతనయో వసిష్ఠమవృతర్త్విజమ్ ।
ఆరభ్య సత్రం సోఽప్యాహ శక్రేణ ప్రాగ్వృతోఽస్మి భోః ॥ 1

ఇక్ష్వాకుతనయః - ఇక్ష్వాకుని పుత్రుడగు, నిమిః - నిమి, సత్రమ్ - సత్రయాగమును, అరభ్య - ప్రారంభించి, వసిష్ఠమ్ - వసిష్ఠుని, ఋత్విజమ్ - ఋత్విక్కునుగా, అవృత - వరించెను, సః అపి - ఆ వసిష్ఠుడైతే, ఆహ - పలికెను, భోః - ఓయీ!, శక్రేణ - ఇంద్రునిచే, ప్రాక్ - ముందుగా, వృతః - వరించబడినవాడను, అస్మి - అగుచున్నాను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఇక్ష్వాకుని పుత్రుడగు నిమి సత్రయాగమును ప్రార్ధంభించి, వసిష్ఠుని ఋత్విక్కుగా వరించెను. ఆయన ఇట్లు బదులు చెప్పెను -- ఓ మహారాజా! ఇంద్రుడు నన్ను ముందుగా (తన యజ్ఞమునకై ఋత్విక్కుగా) వరించినాడు.

తం నిర్వ ర్త్యాగమిష్యామి తావన్మాం ప్రతిపాలయ ।
తూష్ణీమాసీద్గృహపతిస్సోఽపీంద్రస్యాకరోన్మఖమ్ ॥ 2

తమ్ - ఆ యజ్ఞమును, నిర్వర్త్య - నిర్వర్తించి, ఆగమిష్యామి - రాగలను, తావత్ - అంతవరకు, మామ్ - నన్ను గురించి, ప్రతిపాలయ - వేచియుండుము, గృహపతిః - గృహయజమానియగు నిమి, తూష్ణీం ఆసీత్ -. మిన్నకుండెను, సః అపి - ఆ వసిష్ఠుడు కూడ, ఇంద్రస్య - ఇంద్రునియొక్క, మఖమ్ - యజ్ఞమును, అకరోత్ - చేసెను.

ఆ యజ్ఞమును నిర్వర్తించి నేను తిరిగి వచ్చెదను; అంతవరకు నా కొరకై వేచియుండుము, అని వసిష్ఠుడు చెప్పెను. గృహయజమానియగు నిమి మిన్నకుండెను. వసిష్ఠుడు ఇంద్రుని యజ్ఞమును నిర్వర్తించెను.

నిమిశ్చలమిదం విద్వాన్ సత్రమారభతాత్మవాన్ ।
ఋత్విగ్భిరపరైస్తావన్నాగమద్యావతా గురుః ।। 3

ఇదమ్ - ఈ జీవితమును, చలమ్ - చంచలమునుగా, విద్వాన్ - తెలిసియున్నవాడు, ఆత్మవాన్ - వివేకియగు, నిమిః - నిమి, యావతా - ఎంతలోనైతే, గురుః - గురువగు వసిష్ఠుడు, న ఆ అగమత్ - రాలేదో, తావత్ - అంతలో, అపరైః - ఇతరులగు, ఋత్విగ్భిః - ఋత్విక్కులతో, సత్రమ్ - సత్రయాగమును, ఆరభత - ఆరంభించెను.

ఈ జీవితము చంచలమైనదనే వివేకము నిమికి గలదు. గురువగు వసిష్ఠుడు ఎంతకైననూ రాకపోవుటచే, ఆయన ఇతరులగు ఋత్విక్కులతో సత్రయాగమునారంభించెను.

శిష్యవ్యతిక్రమం వీక్ష్య నిర్వర్త్య గురురాగతః ।
అశపత్పతతాద్దేహో నిమేః పండితమానినః ।। 4

నిర్వర్త్య - నిర్వర్తించి, ఆగతః - వచ్చిన, గురుః - గురువగు వసిష్ఠుడు, శిష్యవ్యతిక్రమమ్ - శిష్యుడగు నిమి ఆజ్ఞను ఉల్లంఘించుటను, వీక్ష్య - చూచి, అశపత్ - శపించెను, పండితమానినః - తాను పండితుడనని గర్వించే, నిమేః - నిమియొక్క, దేహః - దేహము, పతతాత్ - పడిపోవు గాక!

ఇంద్రుని యజ్ఞమును నిర్వర్తించి తిరిగి వచ్చిన గురువగు వసిష్ఠుడు నిమి తన ఆజ్ఞను ఉల్లంఘించుటను గాంచి ఇట్లు శపించెను -- తాను పండితుడనని గర్వించే ఈ నిమి మరణించు గాక!

నిమిః ప్రతిదదే శాపం గురవేఽధర్మవర్తినే ।
తవాపి పతతాద్దేహో లోభాద్ధర్మమజానతః ।। 5

అధర్మవర్తినే - అధర్మమునాచరించిన, గురవే - గురువగు వసిష్ఠుని కొరకు, నిమిః - నిమి, శాపమ్ - శాపమును, ప్రతిదదే - తిరిగి యిచ్చెను, లోభాత్ - లోభము వలన, ధర్మమ్ - ధర్మమును, అజానతః - తెలియకున్న, తవ - నీయొక్క, దేహః అపి - దేహము కూడ, పతతాత్ - పడిపోవు గాక!

ధర్మము చేయుటయందు విలంబము తగదు అనే ధర్మమును గురువగు వసిష్ఠుడు ఉపేక్షించి శాపమునిచ్చినాడు. రెండు యజ్ఞముల దక్షిణలను పొందవలెననే లోభము ఆయనకుండెను. కావున, నిమి తిరిగి ఆయన కూడ మరణించునని శాపమునిచ్చెను.

ఇత్యుత్ససర్జ స్వం దేహం నిమిరధ్యాత్మకోవిదః ।
మిత్రావరుణయోర్జజ్ఞే ఉర్వశ్యాం ప్రపితామహః ।। 6

అధ్యాత్మకోవిదః - ఆత్మజ్ఞానమునందు గొప్పవాడగు, నిమిః - నిమి, ఇతి - అని, స్వమ్ - తనదైన, దేహమ్ - దేహమును, ఉత్ససర్జ - విడిచిపెట్టెను, ప్రపితామహః - ముత్తాతయగు వసిష్ఠుడు, మిత్రావరుణయోః - మిత్రావరుణులకు, ఉర్వశ్యామ్ - ఉర్వశియందు, జజ్ఞే - పుట్టెను.

ఆత్మజ్ఞానమునందు నిమి గొప్పవాడు. ఆయన ఇట్లు పలికి తన దేహమును విడిచిపెట్టెను. మా ముత్తాతయగు వసిష్ఠుడు కూడ మరణించి మిత్రావరుణులకు ఉర్వశియందు పుత్రుడై జన్మించెను.

గంధవస్తుషు తద్దేహం నిధాయ మునిసత్తమాః ।
సమాప్తే సత్రయాగేఽథ దేవానూచుస్సమాగతాన్ ।। 7

మునిసత్తమాః - మహర్షులు, తద్-దేహమ్ - ఆ నిమియొక్క దేహమును, గంధవస్తుషు - సుగంధ ద్రవ్యములయందు, నిధాయ - ఉంచి, సత్రయాగే - సత్రయాగము, సమాప్తే - సమాప్తము కాగా, అథ - అప్పుడు, సమాగతాన్ - వచ్చియున్న, దేవాన్ - దేవతలనుద్దేశించి, ఊచుః - పలికిరి.

నిమియొక్క ఋత్విక్కులైన మహర్షులు నిమియొక్క ఆ దేహమును పరిమళ తైలమునందు భద్రము చేసిరి. సత్రయాగము పూర్తి అయిన పిదప, అచటకు వచ్చియున్న దేవతలనుద్దేశించి వారిట్లు పలికిరి.

రాజ్ఞో జీవతు దేహోఽయం ప్రసన్నాః ప్రభవో యది ।
తథేత్యుక్తే నిమిః ప్రాహ మా భూన్మే దేహబంధనమ్ ॥ 8

ప్రభవః - సమర్థులగు మీరు, ప్రసన్నాః యది - ప్రసన్నులైనచో, రాజ్ఞః - రాజుయొక్క, అయమ్ - ఈ, దేహః - దేహము, జీవతు - బ్రదుకు గాక!, తథా - అటులనే, ఇతి - అని, ఉక్తే - పలుకబడగా, నిమిః - నిమి, ప్రాహ - పలికెను, మే - నాకు, దేహబంధనమ్ - దేహముయొక్క బంధము, మా భూత్ - కలుగకుండు గాక!

సమర్థులగు మీరు ప్రసన్నులైనచో, మహారాజుయొక్క ఈ దేహము బ్రదుకు గాక! అని మహర్షులు పలుకగా, దేవతలు తథాస్తు! అనిరి. కాని, నిమి ఇట్లు పలికెను -- నాకు దేహముయొక్క బంధము కలుగకుండు గాక!

యస్య యోగం న వాంఛంతి వియోగభయకాతరాః ।
భజంతి చరణాంభోజం మునయో హరిమేధసః ॥ 9

హరిమేధసః - శ్రీహరియందు బుద్ధి గల, మునయః - మననశీలురు, వియోగభయకాతరాః - వియోగము వలని భయము వలని భయపడినవారై, యస్య - ఏ దేహముయొక్క, యోగమ్ - సంయోగమును, న వాంఛంతి - కోరుకొనరో, చరణ-అంభోజమ్ - పాదపద్మమును, భజంతి - సేవించెదరు.

మననశీలురై శ్రీహరియందు బుద్ధిని లగ్నము చేసినవారలు దేహముతోడి సంయోగము (జన్మ) ను కోరుకొనరు. ఏలయనగా, దేహముతోడి వియోగము (మరణము) వలన వారు భయభీతులగుదురు. వారు శ్రీహరి పాదపద్మములను (మోక్షము కొరకై) సేవించెదరు.

దేహం నావరురుత్సేऽహం దుఃఖశోకభయావహమ్ ।
సర్వత్రాస్య యతో మృత్యుర్మత్స్యానాముదకే యథా ॥ 10

అహమ్ - నేను, దుఃఖశోకభయ-ఆవహమ్ - దుఃఖమునకు శోకమునకు భయమునకు నిలయమైన, దేహమ్ - దేహమును, న అవరురుత్సే - పొందగోరుట లేదు, యతః - దేనివలనైతే, అస్య - ఈ జీవునకు, ఉదకే - నీటియందు, మత్స్యానాం యథా - చేపలకు వలె, సర్వత్ర - అంతటా, మృత్యుః - మృత్యువో.

దేహము దేహపీడకు, మనోవ్యథకు మరియు భయమునకు నిలయము. అట్టి దేహమును పొందాలనే కోరిక నాకు లేదు. దేహమును పొందుట వలన ఈ జీవునకు అంతటా, నీటిలోని చేపలకు (పెద్ద చేప) వలె, మరణము సిద్ధముగా నుండును.

దేవా ఊచుః ।
విదేహ ఉష్యతాం కామం లోచనేషు శరీరిణామ్ ।
ఉన్మేషణనిమేషాభ్యాం లక్షితోऽధ్యాత్మసంస్థితః ॥ 11

దేవాః - దేవతలు, ఊచుః - పలికిరి, విదేహః - దేహము లేని నిమి, శరీరిణామ్ - దేహము గల ప్రాణులయొక్క, అధ్యాత్మసంస్థితః - అధ్యాత్మమునందున్నవాడై, లోచనేషు - కళ్లయందు, ఉన్మేషణనిమేషాభ్యామ్ - తెరచుట మూయుటలచే, లక్షితః - సూచించబడువాడై, కామమ్ - యథేచ్ఛగా, ఉష్యతామ్ - నివసించు గాక!

దేవతలిట్లు పలికిరి -- నిమి దేహము లేకుండగనే దేహధారులగు ప్రాణుల అధ్యాత్మము (దేహేంద్రియమనస్సంఘాతము) నందలి కన్నులయందు యథేచ్ఛగా నివసించు గాక! ఆయన ఉనికిని కనురెప్పల తెరచుకొనుట మరియు మూయబడుట సూచించును.

అరాజకభయం నౄణాం మన్యమానా మహర్షయః ।
దేహం మమంథుస్స్మ నిమేః కుమారస్సమజాయత ॥ 12

నృణామ్ - మానవులకు, అరాజకభయమ్ - రాజు లేకపోవుట వలని భయమును, మన్యమానాః - తలపోయువారై, మహర్షయః - మహర్షులు, నిమేః - నిమియొక్క, దేహమ్ - దేహమును, మమంథుః స్మ - మథించిరి, కుమారః - పుత్రుడు, సమజాయత - పుట్టెను.

రాజు లేనిచో మానవులకు భయము కలుగునని తలపోసి ఆ మహర్షులు నిమియొక్క దేహమును మథించగా, పుత్రుడు కలిగెను.

జన్మనా జనకస్సోఽభూద్వైదేహస్తు విదేహజః ।
మిథిలో మథనాజ్జాతో మిథిలా యేన నిర్మితా ।। 13

జన్మనా - పుట్టుకచే, సః - ఆయన, జనకః - జనకుడు, అభూత్ - అయెను, విదేహజః - దేహము లేని నిమి వంశములో జన్మించినవాడు, వైదేహః తు - వైదేహుడు, మథనాత్ - మథించుట వలన, జాతః - పుట్టినవాడు, మిథిలః - మిథిలుడు, యేన - ఎవనిచేనైతే, మిథిలా - మిథిలా నగరము, నిర్మితా - నిర్మించబడినదో.

అసాధారణముగా జన్మించుటచే ఆయనకు జనకుడనియు, దేహము లేని నిమి వంశములో జన్మించుటచే వైదేహుడనియు, దేహమును మథించుట వలన పుట్టుటచే మిథిలుడనియు ఆయనకు పేర్లు. ఆయన నిర్మించిన నగరమే మిథిల.

తస్మాదుదావసుస్తస్య పుత్రోఽభూన్నందివర్ధనః ।
తతస్సుకేతుస్తస్యాపి దేవరాతో మహీపతే ।। 14

మహీపతే - ఓ మహారాజా!, తస్మాత్ - ఆయన వలన, ఉదావసుః - ఉదావసువు, తస్య - ఆయనకు, నందివర్ధనః - నందివర్ధనుడనే, పుత్రః - పుత్రుడు, అభూత్ - కలిగెను, తతః - ఆయన వలన, సుకేతుః - సుకేతువు, తస్య అపి - ఆయనకు కూడ, దేవరాతః - దేవరాతుడు.

ఓ పరీక్షిన్మహారాజా! ఆ జనకుని పుత్రుడు ఉదావసువు. ఉదావసుని పుత్రుడు నందివర్ధనుడు. నందివర్ధనుని పుత్రుడు సుకేతువు. సుకేతుని పుత్రుడు దేవరాతుడు.

తస్మాద్బృహద్రథస్తస్య మహావీర్యస్సుధృత్పితా ।
సుధృతేర్ధృష్టకేతుర్వై హర్యశ్వోఽథ మరుస్తతః ॥ 15

తస్మాత్ - ఆయన వలన, బృహద్రథః - బృహద్రథుడు, తస్య - ఆయనకు, మహావీర్యః - మహావీర్యుడు, సుధృత్-పితా - సుధృతియొక్క తండ్రి, సుధృతేః - సుధృతి వలన, ధృష్టకేతుః వై - ధృష్టకేతువు, అథ - ఆయన వలన, హర్యశ్వః - హర్యశ్వుడు, తతః - ఆయన వలన, మరుః - మరువు.

దేవరాతుని పుత్రుడు బృహద్రథుడు. బృహద్రథుని పుత్రుడు మహావీర్యుడు. మహావీర్యుని పుత్రుడు సుధృతి. సుధృతి పుత్రుడు ధృష్టకే తువు. ధృష్టకేతుని పుత్రుడు హర్యశ్వుడు. హర్యశ్వుని పుత్రుడు మరువు.

మరోః ప్రతీపకస్తస్మాజ్జాతః కృతిరథో యతః ।
దేవమీఢస్తస్య సుతో విశ్రుతోఽథ మహాధృతిః ॥ 16

మరోః - మరువు వలన, ప్రతీపకః - ప్రతీపకుడు, తస్మాత్ - ఆయన వలన, కృతిరథః - కృతిరథుడు, జాతః - పుట్టినాడు, యతః - ఎవని వలనైతే, దేవమీఢః - దేవమీఢుడో, తస్య - ఆయనయొక్క, సుతః - పుత్రుడు, విశ్రుతః - విశ్రుతుడు, అథ - ఆయన వలన, మహాధృతిః - మహాధృతి.

మరువు పుత్రుడు ప్రతీపకుడు. ప్రతీపకుని పుత్రుడు కృతిరథుడు. కృతిరథుని పుత్రుడు దేవమీఢుడు. దేవమీఢుని పుత్రుడు విశ్రుతుడు. విశ్రు తుని పుత్రుడు మహాధృతి.

కృతిరాతస్తతస్తస్మాన్మహారోమాథ తత్సుతః ।
స్వర్ణరోమా సుతస్తస్య హ్రస్వరోమా వ్యజాయత ॥ 17

తతః - ఆయన వలన, కృతిరాతః - కృతిరాతుడు, తస్మాత్ - ఆయన వలన, మహారోమా - మహారోముడు, అథ - తరువాత, తత్-సుతః - ఆయన పుత్రుడు, స్వర్ణరోమా - స్వర్ణరోముడు, తస్య - ఆయన

కు, హ్రస్వరోమా - హ్రస్వరోముడు అనే, సుతః - పుత్రుడు, వ్యజాయత - పుట్టెను.

ఆ మహాధృతి పుత్రుడు కృతిరాతుడు. కృతిరాతుని పుత్రుడు మహారోముడు. మహారోముని పుత్రుడు స్వర్ణరోముడు. స్వర్ణరోముని పుత్రుడు హ్రస్వరోముడు.

తతస్సీరధ్వజో జజ్ఞే యజ్ఞార్థం కర్షతో మహీమ్ ।
సీతా సీరాగ్రతో జాతా తస్మాత్సీరధ్వజస్స్మృతః ॥ 18

తతః - ఆయన వలన, సీరధ్వజః - సీరధ్వజుడు, జజ్ఞే - పుట్టెను, యజ్ఞ-అర్థమ్ - యజ్ఞము కొరకై, మహీమ్ - భూమిని, కర్షతః - దున్ను చుండగా, సీర-అగ్రతః - నాగలి చాలునందు, సీతా - సీతాదేవి, జాతా - పుట్టెను, తస్మాత్ - అందువలన, సీరధ్వజః - సీరధ్వజుడని, స్మృతః - చెప్పబడినాడు.

హ్రస్వరోముని పుత్రుడు సీరధ్వజుడు. ఆయన యజ్ఞము కొరకై భూమిని దున్నుచుండగా, నాగలి చాలునుండి సీతాదేవి పుట్టెను. కావున నే, ఆయనకు సీరధ్వజుడు (నాగలియే కీర్తిని తెలుపునదిగా గలవాడు) అని పిలువబడెను.

కుశధ్వజస్తస్య పుత్రస్తతో ధర్మధ్వజో నృపః ।
ధర్మధ్వజస్య ద్వౌ పుత్రౌ కృతధ్వజమితధ్వజౌ ॥ 19

తస్య - ఆయనయొక్క, పుత్రః - పుత్రుడు, కుశధ్వజః - కుశధ్వ జుడు, తతః - ఆయన వలన, ధర్మధ్వజః నృపః - ధర్మధ్వజ మహారాజు, ధర్మధ్వజస్య - ధర్మధ్వజునకు, కృతధ్వజమితధ్వజౌ - కృతధ్వజుడు మితధ్వజుడు అనే, ద్వౌ - ఇద్దరు, పుత్రౌ - పుత్రులు.

సీరధ్వజుని పుత్రుడు కుశధ్వజుడు. కుశధ్వజుని పుత్రుడు ధర్మ ధ్వజ మహారాజు. ధర్మధ్వజునకు కృతధ్వజుడు, మితధ్వజుడు అనే ఇద్దరు పుత్రులు ఉండిరి.

కృతధ్వజాత్కేశిధ్వజః ఖాండిక్యస్తు మితధ్వజాత్ ।
కృతధ్వజసుతో రాజన్నాత్మవిద్యావిశారదః ॥ 20

కృతధ్వజాత్ - కృతధ్వజుని వలన, కేశిధ్వజః - కేశిధ్వజుడు, మితధ్వజాత్ తు - మితధ్వజుని వలనైతే, ఖాండిక్యః - ఖాండిక్యుడు, రాజన్ - ఓ రాజా!, కృతధ్వజసుతః - కృతధ్వజుని పుత్రుడు, ఆత్మవిద్యా విశారదః - సుస్పష్టమైన ఆత్మజ్ఞాననిష్ఠ గలవాడు.

ఓ పరీక్షిన్మహారాజా! కృతధ్వజుని పుత్రుడు కేశిధ్వజుడు. ఆయన సుస్పష్టమైన ఆత్మజ్ఞాననిష్ఠ గలవాడు. మితధ్వజుని పుత్రుడు ఖాండిక్యుడు.

ఖాండిక్యః కర్మతత్త్వజ్ఞో భీతః కేశిధ్వజాద్ద్రుతః ।
భానుమాంస్తస్య పుత్రోఽభూచ్ఛతద్యుమ్నస్తు తత్సుతః ॥ 21

కర్మతత్త్వజ్ఞః - కర్మస్వరూపమునెరింగిన, ఖాండిక్యః - ఖాండిక్యుడు, కేశిధ్వజాత్ - కేశిధ్వజుని వలన, భీతః - భయపడినవాడై, ద్రుతః - పారిపోయినాడు, తస్య - ఆయనయొక్క, పుత్రః - పుత్రుడు, భానుమాన్ - భానుమంతుడు, తత్-సుతః తు - ఆయనయొక్క పుత్రుడైతే, శతద్యుమ్నః - శతద్యుమ్నుడు.

కర్మస్వరూపమునెరింగిన ఖాండిక్యుడు కేశిధ్వజునకు భయపడి పారిపోయెను. ఆయన పుత్రుడు భానుమంతుడు. భానుమంతుని పుత్రుడు శతద్యుమ్నుడు.

శుచిస్తత్తనయస్తస్మాత్సనద్వాజస్తతోఽభవత్ ।
ఊర్ధ్వకేతుస్సనద్వాజాదజోఽథ పురుజిత్సుతః ॥ 22

తత్-తనయః - ఆయనయొక్క పుత్రుడు, శుచిః - శుచి, తస్మాత్ - ఆయన వలన, సనద్వాజః - సనద్వాజుడు, తతః - ఆ, సనద్వాజాత్ - సనద్వాజుని వలన, ఊర్ధ్వకేతుః - ఊర్ధ్వకేతువు, అథ - ఆయన వలన, అజః - అజుడు, సుతః - పుత్రుడు, పురుజిత్ - పురుజిత్తు.

ఆ శతద్యుమ్నుని పుత్రుడు శుచి. శుచి పుత్రుడు సనద్వాజుడు. ఆ సనద్వాజుని పుత్రుడు ఊర్ధ్వకేతువు. ఊర్ధ్వకేతువు పుత్రుడు అజుడు. అజుని పుత్రుడు పురుజిత్తు.

అరిష్టనేమిస్తస్యాపి శ్రుతాయుస్తత్సుపార్శ్వకః ।
తతశ్చిత్రరథో యస్య క్షేమధిర్మిథిలాధిపః ॥ 23

అరిష్టనేమిః - అరిష్టనేమి, తస్య అపి - ఆయనకు కూడ, శ్రుతాయుః - శ్రుతాయువు, తత్ - ఆయన వలన, సుపార్శ్వకః - సుపార్శ్వకుడు, తతః - ఆయన వలన, చిత్రరథః - చిత్రరథుడు, యస్య - ఎవనికైతే, మిథిలా-అధిపః - మిథిలకు ప్రభువగు, క్షేమధిః - క్షేమధియో.

పురుజిత్తు పుత్రుడు అరిష్టనేమి. అరిష్టనేమి పుత్రుడు శ్రుతాయువు. శ్రుతాయువు పుత్రుడు సుపార్శ్వకుడు. సుపార్శ్వకుని పుత్రుడు చిత్రరథుడు. చిత్రరథుని పుత్రుడగు క్షేమధి మిథిలకు ప్రభువు.

తస్మాత్సమరథస్తస్య సుతస్సత్యరథస్తతః ।
ఆసీదుపగురుస్తస్మాదుపగుప్తోఽగ్నిసంభవః ॥ 24

తస్మాత్ - ఆయన వలన, సమరథః - సమరథుడు, తస్య - ఆయనయొక్క, సుతః - పుత్రుడు, సత్యరథః - సత్యరథుడు, తతః - ఆయన వలన, ఉపగురుః - ఉపగురువు, ఆసీత్ - కలిగెను, తస్మాత్ - ఆయన వలన, అగ్నిసంభవః - అగ్నియొక్క అంశ వలన పుట్టిన, ఉపగుప్తః - ఉపగుప్తుడు.

క్షేమధి పుత్రుడు సమరథుడు. సమరథుని పుత్రుడు సత్యరథుడు. సత్యరథుని పుత్రుడు ఉపగురువు. ఉపగురువునకు అగ్ని అంశతో ఉపగుప్తుడనే పుత్రుడు కలిగెను.

వస్వనంతోఽథ తత్పుత్రో యుయుధో యత్సుభాషణః ।
శ్రుతస్తతో జయస్తస్మాద్విజయోఽస్మాదృతస్సుతః ॥ 25

అథ - ఆయన వలన, వస్వనంతః - వస్వనంతుడు, తత్-పుత్రః - ఆయనయొక్క పుత్రుడు, యుయుధః - యుయుధుడు, యత్ - ఎవని

వలనైతే, సుభాషణః - సుభాషణుడో, తతః - ఆయన వలన, శ్రుతః - శ్రుతుడు, తస్మాత్ - ఆయన వలన, జయః - జయుడు, విజయః - విజయుడు, అస్మాత్ - ఈయన వలన, ఋతః - ఋతుడనే, సుతః - పుత్రుడు.

ఉపగుప్తుని పుత్రుడు వస్వనంతుడు. వస్వనంతుని పుత్రుడు యుయుధుడు. యుయుధుని పుత్రుడు సుభాషణుడు. సుభాషణుని పుత్రుడు శ్రుతుడు. శ్రుతుని పుత్రుడు జయుడు. జయుని పుత్రుడు విజయుడు. విజయుని పుత్రుడు ఋతుడు.

శునకస్తత్సుతో జజ్ఞే వీతహవ్యో ధృతిస్తతః ।
బహులాశ్వో ధృతేస్తస్య కృతిరస్య మహావశీ ॥ 26

తత్-సుతః - ఆ ఋతుని పుత్రుడు, శునకః - శునకుడు. వీతహవ్యః - వీతహవ్యుడు, తతః - ఆయన వలన, ధృతిః - ధృతి, ధృతేః - ధృతికి, బహులాశ్వః - బహులాశ్వుడు, తస్య - ఆయనకు, కృతిః - కృతి, అస్య - ఈయనకు, మహావశీ - మహావశి.

ఆ ఋతుని పుత్రుడు శునకుడు. శునకుని పుత్రుడు వీతహవ్యుడు. వీతహవ్యుని పుత్రుడు ధృతి. ధృతి పుత్రుడు బహులాశ్వుడు. బహులాశ్వుని పుత్రుడు కృతి. కృతి పుత్రుడు మహావశి.

ఏతే వై మైథిలా రాజన్నాత్మవిద్యావిశారదాః ।
యోగేశ్వరప్రసాదేన ద్వంద్వైర్ముక్తా గృహేష్వపి ॥ 27

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే నవమస్కంధే త్రయోదశోఽధ్యాయః ॥

రాజన్ - ఓ రాజా!, ఏతే వై - వీరైతే, మైథిలాః - మిథిలుని వంశమునకు చెందినవారు, ఆత్మవిద్యావిశారదాః - సుస్పష్టమైన ఆత్మజ్ఞాననిష్ఠ గలవారు, యోగ-ఈశ్వరప్రసాదేన - యోగేశ్వరుల అనుగ్రహముచే, గృహేషు అపి - ఇంటియందు కూడ, ద్వంద్వైః - రాగద్వేషాది ద్వంద్వములచే, ముక్తాః - విముక్తులు.

ఓ పరీక్షిన్మహారాజా! వీరందరు మిథిలుని వంశమునకు చెందినవారు. యోగేశ్వరులగు యాజ్ఞవల్క్యాదుల అనుగ్రహముచే వీరందరికి సుస్పష్టమైన ఆత్మజ్ఞాననిష్ఠ ఉండెడిది. కావుననే, వీరు గృహస్థులై ఉండియు, రాగద్వేషాది ద్వంద్వములకు అతీతులై యుండెడివారు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
నిమియొక్క వంశమును వర్ణించే పదమూడవ
అధ్యాయము ముగిసినది (13).

* * * * *

# అథ చతుర్దశోఽధ్యాయః

## ఊర్వశీ పురూరవుల చరితము

శ్రీశుక ఉవాచ।

అథాతశ్శ్రూయతాం రాజన్ వంశస్సోమస్య పావనః ।
యస్మిన్నైలాదయో భూపాః కీర్త్యంతే పుణ్యకీర్తయః ।। 1

రాజన్ - ఓ రాజా!, అథ - సూర్యవంశమును గురించి చెప్పిన తరువాత, అతః - వంశకీర్తనము చిత్తశుద్ధికి హేతువు గనుక, సోమస్య - చంద్రునియొక్క, పావనః - పవిత్రము చేసే, వంశః - వంశము, శ్రూయ తామ్ - వినబడుగాక!, యస్మిన్ - ఏ వంశమునందైతే, పుణ్యకీర్తయః - పవిత్రమగు కీర్తి గల, ఐల-ఆదయః - ఐలుడు మొదలగు, భూపాః - రాజు లు, కీర్త్యంతే - కీర్తించబడుచున్నారో.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! సూర్యవం శమును గురించి చెప్పితిని. ఈ వంశకీర్తనము చిత్తశుద్ధికి హేతువు. కావున, ఈపైన చంద్రవంశమును గురించి చెప్పెదను, వినుము. ఆ వంశములో పవిత్రమగు కీర్తిగల ఐలుడు మొదలగు రాజులు కీర్తించబడెదరు.

సహస్రశిరసః పుంసో నాభిహ్రదసరోరుహాత్ ।
జాతస్యాసీత్సుతో ధాతురత్రిః పితృసమో గుణైః ।। 2

సహస్రశిరసః - అనంతమగు శిరస్సులు గల, పుంసః - పురుషోత్త మునియొక్క, నాభిహ్రదసరోరుహాత్ - నాభి అనే సరస్సులోని పద్మము నుండి, జాతస్య - పుట్టిన, ధాతుః - బ్రహ్మగారికి, గుణైః - గుణములతో, పితృసమః - తండ్రిగారితో సమానమైన, అత్రిః - అత్రి అనే, సుతః - పుత్రుడు, ఆసీత్ - కలిగెను.

అనంతమగు శిరస్సులు గల పురుషోత్తముని నాభి అనే సరస్సులో పుట్టిన పద్మమునుండి బ్రహ్మగారు ప్రకటమయ్యెను. బ్రహ్మగారి పుత్రుడగు అత్రి గుణములలో తండ్రితో సమానమైనవాడు.

తస్య దృగ్భ్యోఽభవత్పుత్రస్సోమోఽమృతమయః కిల ।
విప్రౌషధ్యుడుగణానాం బ్రహ్మణా కల్పితః పతిః ॥ 3

తస్య - ఆ అత్రియొక్క, దృగ్భ్యః - ఆనందబాష్పములనుండి, అమృతమయః - అమృతస్వరూపుడగు, సోమః - చంద్రుడు, పుత్రః - పుత్రుడై, అభవత్ కిల - కలిగెను, బ్రహ్మణా - బ్రహ్మగారిచే, విప్ర-ఓషధి-ఉడుగణానామ్ - వేదవేత్తలకు చెట్టుచేమలకు నక్షత్రముల గణములకు, పతిః - ప్రభువుగా, కల్పితః - ఏర్పాటు చేయబడినాడు.

ఆ అత్రియొక్క ఆనందబాష్పములనుండి అమృతస్వరూపుడగు చంద్రుడు పుత్రుడై జన్మించెను. ఆయనను బ్రహ్మగారు వేదవేత్తలకు, చెట్టు చేమలకు, నక్షత్రముల గణములకు ప్రభువుగా ఏర్పాటు చేసెను.

సోఽయజద్రాజసూయేన విజిత్య భువనత్రయమ్ ।
పత్నీం బృహస్పతేర్దర్పాత్తారాం నామాహరద్బలాత్ ॥ 4

సః - ఆ చంద్రుడు, భువనత్రయమ్ - ముల్లోకములను, విజిత్య - జయించి, రాజసూయేన అయజత్ - రాజసూయ యాగమును చేసెను, దర్పాత్ - గర్వము వలన, తారాం నామ - తారయని ప్రసిద్ధి గాంచిన, బృహస్పతేః - బృహస్పతియొక్క, పత్నీమ్ - భార్యను, బలాత్ - బలాత్కారముగా, అహరత్ - అపహరించెను.

ఆ చంద్రుడు ముల్లోకములను జయించి రాజసూయ యాగమును చేసెను. అపుడు గర్వము పెరిగి, ఆయన తారయని ప్రసిద్ధి గాంచిన బృహస్పతియొక్క భార్యను అపహరించెను.

యదా స దేవగురుణా యాచితోఽభీక్ష్ణశో మదాత్ ।
నాత్యజత్తత్కృతే జజ్ఞే సురదానవవిగ్రహః ॥ 5

యదా - ఏ కాలమునందైతే, దేవగురుణా - దేవతలకు గురువగు బృహస్పతిచే, అభీక్ష్ణశః - పలుమార్లు, యాచితః - కోరబడిన, సః - ఆ చంద్రుడు, మదాత్ - గర్వము వలన, న అత్యజత్ - విడిచి పెట్టలేదో, తత్ -కృతే - ఆమె కారణముగా, సురదానవవిగ్రహః - దేవతలకు రాక్షసులకు వైరము, జజ్ఞే - కలిగెను.

దేవతలకు గురువగు బృహస్పతి పలుమార్లు కోరిననూ చంద్రుడు గర్వము వలన ఆమెను విడిచి పెట్టలేదు. ఆమె కారణముగా దేవతలకు, రాక్షసులకు వైరము ఏర్పడెను.

శుక్రో బృహస్పతేర్ద్వేషాదగ్రహీత్సాసురోడుపమ్ ।
హరో గురుసుతం స్నేహాత్సర్వభూతగణావృతః ॥ 6

బృహస్పతేః - బృహస్పతియొక్క, ద్వేషాత్ - ద్వేషము నిమిత్తముగా, శుక్రః - శుక్రుడు, స-అసురః - రాక్షసులతో కూడినవాడై, ఉడుపమ్ - చంద్రుని, అగ్రహీత్ - పట్టుకొనెను, సర్వభూతగణ-ఆవృతః - సకలభూతగణములతో చుట్టువారబడియుండే, హరః - రుద్రుడు, గురుసుతమ్ - తన గురువగు అంగిరసుని పుత్రుడగు బృహస్పతిని, స్నేహాత్ - ప్రేమ వలన.

శుక్రాచార్యుడు బృహస్పతి తనను ద్వేషించుటచే, రాక్షసుల అనుమతితో చంద్రుని పక్షమును వహించెను. సకలభూతగణములచే చుట్టువారబడి యుండే రుద్రుడు, బృహస్పతి తనకు గురువగు అంగిరసుని పుత్రుడైన కారణముగా, అనురాగముతో ఆయన పక్షమున నిలిచెను.

సర్వదేవగణోపేతో మహేంద్రో గురుమన్వయాత్ ।
సురాసురవినాశోఽభూత్సమరస్తారకామయః ॥ 7

మహా-ఇంద్రః - దేవేంద్రుడు, సర్వదేవగణ-ఉపేతః - సకలదేవతాగణములతో కూడినవాడై, గురుమ్ - బృహస్పతిని, అన్వయాత్ - అనుసరించెను, సుర-అసురవినాశః - దేవతల మరియు రాక్షసుల వినాశము కలిగినట్టియు, తారకామయః - తార నిమిత్తముగా గల, సమరః - యుద్ధము, అభూత్ - జరిగెను.

దేవేంద్రుడు సకలదేవతాగణములతో గూడి బృహస్పతి పక్షమును సమర్థించెను. అప్పుడు తార నిమిత్తముగా జరిగిన యుద్ధములో దేవతలు మరియు రాక్షసులు కూడ వినాశమును చెందిరి.

నివేదితోఽథాంగిరసా సోమం నిర్భర్త్స్య విశ్వకృత్ ।
తారాం స్వభర్త్రే ప్రాయచ్ఛదంతర్వత్నీమవైత్పతిః ॥ 8

అథ - తరువాత, అంగిరసా - అంగిరసునిచే, నివేదితః - విన్నవించబడిన, విశ్వకృత్ - సృష్టికర్తయగు బ్రహ్మగారు, సోమమ్ - చంద్రుని, నిర్భర్త్స్య - బెదిరించి, తారామ్ - తారను, స్వభర్త్రే - ఆమె భర్తయగు బృహస్పతి కొరకు, ప్రాయచ్ఛత్ - అప్పజెప్పెను, పతిః - భర్తయగు బృహస్పతి, అంతర్వత్నీమ్ - గర్భవతినిగా, అవైత్ - తెలుసుకొనెను.

తరువాత అంగిరసుడు బ్రహ్మగారికి నివేదించగా, ఆయన చంద్రుని బెదిరించి తారను ఆమె భర్తయగు బృహస్పతికి అప్పజెప్పెను. కాని, ఆమె గర్భవతియని ఆయనకు తెలిసిపోయెను.

త్యజ త్యజాశు దుష్ప్రజ్ఞే మత్క్షేత్రాదాహితం పరైః ।
నాహం త్వాం భస్మసాత్కుర్యాం స్త్రియం సాంతానికస్సతి ॥ 9

దుష్ప్రజ్ఞే - ఓ దుష్టబుద్ధి గలదానా!, పరైః - ఇతరులచే, ఆహితమ్ - ఆధానము చేయబడిన గర్భమును, మత్-క్షేత్రాత్ - నా క్షేత్రము నుండి, ఆశు - వెంటనే, త్యజ - విడిచి పెట్టుము, త్యజ - విడిచి పెట్టుము, సతి - ఓ యోగ్యురాలా!, సాంతానికః - సంతానమును కోరే, అహమ్ - నేను, స్త్రియమ్ - స్త్రీవగు, త్వామ్ - నిన్ను, భస్మసాత్ - బూడిదగా, న కుర్యామ్ - చేయకుందును గాక!

ఓసీ! నీవు దుర్బుద్ధి గలదానవు. ఇతరులచే (శత్రువులచే) ఆధానము చేయబడిన గర్భమును నాకు చెందిన క్షేత్రమునుండి దూరము చేయుము, దూరము చేయుము. అట్లు చేసినచో, నీవు యోగ్యురాలవు అగుదువు. నీవు దోషము చేసిననూ, నీవు స్త్రీవి అయినందువలన, పైగా నేను సంతానమును కోరుచుండుట వలన, నేను నిన్ను బూడిదగా చేయకుందును గాక!

తత్యాజ వ్రీడితా తారా కుమారం కనకప్రభమ్ ।
స్పృహామాంగిరసశ్చక్రే కుమారే సోమ ఏవ చ ।। 10

వ్రీడితా - సిగ్గుపడిన, తారా - తార, కనకప్రభమ్ - బంగరు కాంతులు గల, కుమారమ్ - పుత్రుని, తత్యాజ - విడిచిపెట్టెను, ఆంగిరసః - అంగిరసుని పుత్రుడగు బృహస్పతి, సోమః ఏవ చ - చంద్రుడు కూడ, కుమారే - ఆ బాలకునియందు, స్పృహామ్ - కోరికను, చక్రే - చేసెను.

తార సిగ్గు పడి బంగరు కాంతులు విరజిమ్మే పుత్రుని విడిచిపెట్టెను. ఆ కుమారుని అంగిరసపుత్రుడగు బృహస్పతి మరియు చంద్రుడు కూడ కోరిరి.

మమాయం న తవేత్యుచ్చైస్తస్మిన్ వివదమానయోః ।
పప్రచ్ఛుర్ఋషయో దేవా నైవోచే వ్రీడితా తు సా ।। 11

అయమ్ - ఈ బాలకుడు, మమ - నావాడు, తవ - నీవాడు, న - కాదు, ఇతి - అని, తస్మిన్ - ఆ బాలకుని విషయమునందు, వివదమానయోః - (వారిద్దరు) వివాదపడుచుండగా, ఋషయః - మహర్షులు, దేవాః - దేవతలు, పప్రచ్ఛుః - ప్రశ్నించిరి, సా తు - ఆ తారయైతే, వ్రీడితా - సిగ్గు పడినదై, న ఊచే ఏవ - చెప్పనే లేదు.

ఈ బాలకుడు నావాడు, నీవాడు కాడు, అంటూ బృహస్పతి, చంద్రుడు వివాదపడుచుండిరి. అప్పుడు మహర్షులు, దేవతలు తారను ప్రశ్నించిరి. కాని, ఆమె సిగ్గు పడి సమాధానమును చెప్పనే లేదు.

కుమారో మాతరం ప్రాహ కుపితోఽలీకలజ్జయా ।
కిం న వోచస్యసద్వృత్తే ఆత్మావద్యం వదాశు మే ।। 12

కుపితః - కోపించిన, కుమారః - ఆ బాలకుడు, మాతరమ్ - తల్లిని గురించి, ప్రాహ - పలికెను, అసద్-వృత్తే - దుష్టమగు నడవడి గలదానా!, అలీకలజ్జయా - మిథ్యయగు సిగ్గుతో, న వోచసి కిమ్ - పలుకవేమి?, ఆత్మావద్యమ్ - నీయొక్క దోషమును గురించి, మే - నా కొరకు, ఆశు - వెంటనే, వద - చెప్పుము.

ఆ బాలకుడు కోపించి తల్లితో ఇట్లు పలికెను -- దుష్టమగు నడవడి గలదానా! సమాధానమును చెప్పవేమి? నీ సిగ్గు మిథ్య (వ్యర్థము). నీవు చేసిన చెడు పనిని గురించి నాకు వెంటనే చెప్పుము.

బ్రహ్మా తాం రహ ఆహూయ సమప్రాక్షీచ్చ సాంత్వయన్ ।
సోమస్యేత్యాహ శనకైస్సోమస్తం తావదగ్రహీత్ ॥ 13

బ్రహ్మా - బ్రహ్మగారు, తామ్ - ఆమెను, రహః - ఏకాంతమునందు, ఆహూయ - పిలిచి, సాంత్వయన్ - బుజ్జగించుచున్నవాడై, సమప్రాక్షీత్ చ - ప్రశ్నించెను, సోమస్య - చంద్రునిది, ఇతి - అని, శనకైః - మెల్లగా, ఆహ - పలికెను, తావత్ - అప్పుడు, సోమః - చంద్రుడు, తమ్ - ఆ బాలకుని, అగ్రహీత్ - స్వీకరించెను.

బ్రహ్మగారు ఆ తారను ఏకాంతములోనికి పిలిచి బుజ్జగిస్తూ ప్రశ్నించగా, చంద్రుని పిల్లవాడు అని ఆమె మెల్లగా చెప్పెను. అప్పుడు ఆ బాలకుని చంద్రుడు తీసుకొనెను.

తస్యాత్మయోనిరకృత బుధ ఇత్యభిధాం నృప ।
బుద్ధ్యా గంభీరయా యేన పుత్రేణాపోడురాట్ ముదమ్ ॥ 14

నృప - ఓ రాజా!, తస్య - ఆ బాలకునకు, ఆత్మయోనిః - స్వయంభువుడగు బ్రహ్మగారు, బుధః - బుధుడు, ఇతి - అని, అభిధామ్ - పేరును, అకృత - పెట్టెను, గంభీరయా - సూక్ష్మమైన, బుద్ధ్యా - బుద్ధితో కూడిన, యేన - ఏ, పుత్రేణ - పుత్రునితో, ఉడురాట్ - నక్షత్రాధిపతియగు చంద్రుడు, ముదమ్ - ఆనందమును, ఆప - పొందెనో.

ఓ పరీక్షిన్మహారాజా! ఆ బాలకునకు స్వయంభువుడగు బ్రహ్మగారు బుధుడు అని పేరు పెట్టెను. సూక్ష్మబుద్ధియగు ఆ పుత్రునితో కూడి నక్షత్రరాజగు చంద్రుడు ఆనందమును పొందెను.

తతః పురూరవా జజ్ఞే ఇలాయాం య ఉదాహృతః ।
తస్య రూపగుణౌదార్యశీలద్రవిణవిక్రమాన్ ॥ 15

శ్రుత్వోర్వశీంద్రభవనే గీయమానాన్ సురర్షిణా ।
తదంతికముపేయాయ దేవీ స్మరశరార్దితా ॥ 16

యః - ఏ పురూరవుడైతే, తతః - ఆ బుధుని వలన, ఇలాయామ్ - ఇలయందు, ఉదాహృతః - చెప్పబడినాడో, పురూరవాః - ఆ పురూరవుడు, జజ్ఞే - జన్మించెను, సుర-ఋషిణా - దేవర్షియగు నారదునిచే, ఇంద్రభవనే - ఇంద్రుని భవనమునందు, గీయమానాన్ - కీర్తించబడుచున్న, తస్య - ఆ పురూరవునియొక్క, రూపగుణ-ఔదార్యశీలద్రవిణవిక్రమాన్ - రూపము గుణములు ఔదార్యము సచ్ఛీలము సంపద పరాక్రమములను గురించి, శ్రుత్వా - విని, ఉర్వశీ దేవీ - ఊర్వశీదేవి, స్మరశర-అర్దితా - మన్మథుని బాణములచే పీడించబడినదై, తద్-అంతికమ్ - ఆ పురూరవుని సమీపమును గురించి, ఉపేయాయ - వచ్చివేసెను.

ఆ బుధునకు ఇలయందు పురూరవుడనే పుత్రుడు కలిగెనని ఇది వరలో చెప్పబడినది. దేవర్షియగు నారదుడు ఆ పురూరవుని రూపమును, గుణములను, పెద్ద మనస్సును, సచ్ఛీలమును, సంపదను, పరాక్రమమును గురించి ఇంద్రుని భవనములో వర్ణించి చెప్పెను. ఆ విషయములను విన్న ఊర్వశీదేవి మన్మథుని బాణములచే పీడను పొందినదై ఆ పురూరవుని వద్దకు వచ్చివేసెను.

మిత్రావరుణయోశ్శాపాదాపన్నా నరలోకతామ్ ।
నిశమ్య పురుషశ్రేష్ఠం కందర్పమివ రూపిణమ్ ।
ధృతిం విష్టభ్య లలనా ఉపతస్థే తదంతికే ॥ 17

మిత్రావరుణయోః - మిత్రుని మరియు వరుణునియొక్క, శాపాత్ - శాపము వలన, నరలోకతామ్ - మానవస్త్రీ యగుటను, ఆపన్నా - పొందియున్న, లలనా - ఆ సుందరి, ధృతిమ్ - ధైర్యమును, విష్టభ్య - అవలంబించి, పురుషశ్రేష్ఠమ్ - పురుషులలో శ్రేష్ఠుడైనట్టియు, కందర్పం ఇవ - మన్మథుని వలె, రూపిణమ్ - రూపవంతుడైన పురూరవుని గురించి, నిశమ్య - విని, తద్-అంతికే - ఆయన సమీపమునందు, ఉపతస్థే - వచ్చియుండెను.

మిత్రావరుణుల శాపముచే ఊర్వశి మనుష్యభావమును పొందెను. పురుషులలో శ్రేష్ఠుడు మరియు మన్మథునివలె అందగాడు అగు పురూరవుని గురించి విని, ఆ సుందరి ధైర్యమును చిక్కబట్టి ఆయన వద్దకు వచ్చి చేరెను.

స తాం విలోక్య నృపతిర్హర్షేణోత్ఫుల్లలోచనః ।
ఉవాచ శ్లక్ష్ణయా వాచా దేవీం హృష్టతనూరుహః ॥ 18

సః - ఆ, నృపతిః - మహారాజు, తామ్ - ఆమెను, విలోక్య - చూచి, హర్షేణ - హర్షముతో, ఉత్ఫుల్లలోచనః - వికసించిన కన్నులు గల వాడై, హృష్టతనూరుహః - గగుర్పొడిచిన రోమములు గలవాడై, శ్లక్ష్ణయా - మధురమైన, వాచా - వాక్కుతో, దేవీమ్ - ఆ ఊర్వశీదేవిని గురించి, ఉవాచ - పలికెను.

ఆ ఊర్వశీదేవిని చూచినంతనే పురూరవ మహారాజునకు హర్షముతో కన్నులు విప్పారి, శరీరమంతయు గగుర్పాటు కలిగెను. ఆయన మధురమగు వాక్కుతో ఆమెను ఉద్దేశించి ఇట్లు పలికెను.

రాజోవాచ ।
స్వాగతం తే వరారోహే ఆస్యతాం కరవామ కిమ్ ।
సంరమస్వ మయా సాకం రతిర్నౌ శాశ్వతీస్సమాః ॥ 19

వరారోహే - ఓ సుందరీ!, తే - నీ కొరకు, స్వాగతమ్ - స్వాగతము, ఆస్యతామ్ - కూర్చుండబడుగాక!, కిమ్ - దేనిని, కరవామ - మేము చేయవలెను?, మయా సాకమ్ - నాతో గూడి, సంరమస్వ - చక్కగా రమించుము, నౌ - మన యిద్దరికి, శాశ్వతీః - అనేకములగు, సమాః - సంవత్సరములను, రతిః - విహారము.

పురూరవ మహారాజు ఇట్లు పలికెను -- ఓ సుందరీ! నీకు స్వాగతము. కూర్చుండుము. మేము నీకు ఏమి చేయవలెను? నీవు నాతో గూడి చక్కగా రమించుము. మన యిద్దరి విహారము చాల సంవత్సరములు నిరంతరముగా కొనసాగు గాక!

ఉర్వశ్యువాచ ।
కస్యాస్త్వయి న సజ్జేత మనో దృష్టిశ్చ సుందర ।
యదంగాంతరమాసాద్య చ్యవతే హ రిరంసయా ।। 20

సుందర - ఓయీ సుందరుడా!, కస్యాః - ఏ స్త్రీయొక్క, మనః - మనస్సు, దృష్టిః చ - చూపు కూడ, త్వయి - నీయందు, న సజ్జేత - లగ్నము కాకుండును?, అంగ - ఓ రాజా!, యత్ - ఏ నిన్ను, అంతరమ్ - ఏకాంతమునందు, ఆసాద్య - పొంది, రిరంసయా - రమించే కోరికతో, చ్యవతే హ - జారిపోవుచున్నది సుమా!

ఊర్వశి ఇట్లు పలికెను --- సుందరుడవగు ఓ రాజా! ఏ స్త్రీయొక్క చూపు మరియు మనస్సు నీయందు లగ్నము కాకుండును? నిన్ను ఏకాంతమునందు పొంది రమించవలెనని మనస్సు ఉవ్విళ్లూరుచు న్నది సుమా!

ఏతావురణకౌ రాజన్ న్యాసౌ రక్షస్వ మానద ।
సంరంస్యే భవతా సాకం శ్లాఘ్యః స్త్రీణాం వరస్స్మృతః ।। 21

రాజన్ - రాజా!, మానద - మర్యాదను కాపాడువాడా!, ఏతౌ - ఈ, ఉరణకౌ - పొట్టేళ్లు, న్యాసౌ - నీవద్ద ఉంచబడునవి, రక్షస్వ - కాపాడుము, భవతా సాకమ్ - నీతో కూడి, సంరంస్యే - రమించగలను, స్త్రీణామ్ - అప్సరసలకు, శ్లాఘ్యః - కొనియాడ దగినవాడే, వరః - భర్తయని, స్మృతః - చెప్పబడినాడు.

మర్యాదను కాపాడే ఓ రాజా! ఈ రెండు పొట్టేళ్లను నీవద్ద ఉంచెద ను. వీటిని నీవు కాపాడుము. నీవు అట్లు చేసినచో, నేను నీతో కూడి రమించెదను. అప్సరసలకు (నీవంటి) కొనియాడ దగిన వ్యక్తియే భర్తయని చెప్పబడినది.

ఘృతం మే వీర భక్ష్యం స్యాన్నేక్షే త్వాన్యత్ర మైథునాత్ ।
వివాససం తత్తథేతి ప్రతిపేదే మహామనాః ।। 22

వీర - ఓ వీరుడా!, మే - నాకు, భక్ష్యమ్ - తినదగిన ఆహారము, ఘృతమ్ - నెయ్యి, స్యాత్ - అగును, మైథునాత్ అన్యత్ర - సంభోగ మునందు మినహాయించి, త్వా - నిన్ను, వివాససమ్ - వస్త్రములు లేని వానినిగా, న ఈక్షే - చూడను, మహామనాః - ఆనందముతో నిండిన మనస్సు గలవాడై, తత్ - ఆ షరతును, తథా - అటులనే, ఇతి - అని, ప్రతిపేదే - అంగీకరించెను.

ఓ వీరుడా! నేను నెయ్యిని మాత్రమే ఆహారముగా తీసుకొనెదను; సంభోగమునందు తప్ప నీవు నాకు నగ్నముగా కనబడరాదు; అని ఊర్వశి షరతులను విధించెను. ఆనందముతో నిండియున్న మనస్సు గల ఆ మహా రాజు ఆ షరతులను యథాతథముగా అంగీకరించెను.

అహో రూపమహో భావో నరలోకవిమోహనమ్ ।
కో న సేవేత మనుజో దేవీం త్వాం స్వయమాగతామ్ ।। 23

నరలోకవిమోహనమ్ - మానవలోకమునకు వ్యామోహమును కలి గించే, రూపమ్ - రూపము, అహో - ఆశ్చర్యము!, భావః - హావభావము, అహో - ఆశ్చర్యము!, స్వయమ్ - స్వయముగా, ఆగతామ్ - వచ్చిన, దేవీమ్ - అప్సరసవగు, త్వామ్ - నిన్ను, కః - ఏ, మనుజః - మానవుడు, న సేవేత - సేవించకుండును?

మానవలోకమునకు వ్యామోహమును కలిగించే నీ రూపము, నీ హావభావములు అచ్చెరువును గొల్పుచున్నవి. ఆహా! అప్సరసవగు నీవే స్వయముగా వచ్చినప్పుడు, ఏ మానవుడు నిన్ను సేవించకుండును?

తయా స పురుషశ్రేష్ఠో రమయంత్యా యథార్హతః ।
రేమే సురవిహారేషు కామం చైత్రరథాదిషు ।। 24

యథార్హతః - యోగ్యతకు తగ్గట్లుగా, రమయంత్యా - విహ రించుచున్న, తయా - ఆమెతో, పురుషశ్రేష్ఠః - పురుషులలో శ్రేష్ఠుడగు, సః - ఆ మహారాజు, సురవిహారేషు - దేవతలు విహరించే, చైత్రరథ-ఆ దిషు - చైత్రరథము మొదలగు ఉద్యానములయందు, కామమ్ - యథే చ్ఛగా, రేమే - రమించెను.

అప్సరసల ప్రభావమునకు తగ్గట్లుగా ఆమె పురుషశ్రేష్ఠుడగు ఆ మహారాజును రమింపజేసెను. ఆయన ఆమెతో గూడి దేవతలు విహరించే చైత్రరథము, నందనము మొదలగు ఉద్యానములయందు యథేచ్ఛగా విహరించెను.

రమమాణస్తయా దేవ్యా పద్మకింజల్కగంధయా ।
తన్ముఖామోదముషితో ముముదేఽహర్గణాన్ బహూన్ ॥ 25

పద్మకింజల్కగంధయా - పద్మముల పుప్పొడియొక్క పరిమళము వంటి పరిమళము గల, తయా - ఆ, దేవ్యా - అప్సరసతో, రమమాణః - రమించుచున్న ఆ మహారాజు, తత్-ముఖ-ఆమోదముషితః - ఆమె ముఖముయొక్క పరిమళముచే ప్రలోభితుడై, బహూన్ - అనేకములగు, అహః-గణాన్ - దినముల సమూహములను, ముముదే - ఆనందించెను.

పద్మముల పుప్పొడియొక్క పరిమళము వంటి పరిమళము గల ఆ అప్సరసతో గూడి ఆ మహారాజు చాల నెలలను, సంవత్సరములను ఆనందముగా గడిపెను. ఆమె ముఖపరిమళముచే ఆయన ప్రలోభితుడాయెను.

అపశ్యన్నుర్వశీమింద్రో గంధర్వాన్ సమచోదయత్ ।
ఉర్వశీరహితం మహ్యమాస్థానం నాతిశోభతే ॥ 26

ఇంద్రః - ఇంద్రుడు, ఉర్వశీమ్ - ఊర్వశిని, అపశ్యన్ - కాననివాడై, గంధర్వాన్ - గంధర్వులను, సమచోదయత్ - ప్రేరేపించెను, ఉర్వశీరహితమ్ - ఊర్వశి లేని, మహ్యమ్ - నాయొక్క, ఆస్థానమ్ - సభ, న అతిశోభతే - అధికముగా శోభిల్లుట లేదు.

ఇంద్రునకు ఊర్వశి కానరాలేదు. ఊర్వశి లేని నా ఆస్థానము అధికముగా శోభిల్లుట లేదని చెప్పి, ఆయన ఆమెను తీసుకురండని గంధర్వులను ప్రేరేపించెను.

తే ఉపేత్య మహారాత్రే తమసి ప్రత్యుపస్థితే ।
ఉర్వశ్యా ఉరణౌ జహ్రుర్న్యస్తౌ రాజని జాయయా ।। 27

మహారాత్రే - అర్ధరాత్రమునందు, తమసి - చీకటి, ప్రతి-ఉపస్థితే - వచ్చియుండగా, తే - ఆ గంధర్వులు, ఉపేత్య - వచ్చి, రాజని - మహా రాజునందు, జాయయా - ప్రియురాలగు ఊర్వశిచే, న్యస్తౌ - రక్షణ కొరకు ఉంచబడిన, ఉర్వశ్యాః - ఊర్వశియొక్క, ఉరణౌ - పొట్టేళ్లను, జహ్రుః - లాగుకొని పోయిరి.

పురూరవుని ప్రియురాలగు ఊర్వశి ఆయన వద్ద రెండు పొట్టేళ్లను భద్రముగా కాపాడుటకై ఉంచినది. అర్ధరాత్రమునందు చీకటి దట్టముగా నుండగా, ఆ గంధర్వులు వచ్చి ఆ రెండు పొట్టేళ్లను లాగుకొని పోయిరి.

నిశమ్యాక్రందితం దేవీ పుత్రయోర్నీయమానయోః ।
హతాస్మ్యహం కునాథేన నపుంసా వీరమానినా ।। 28

పుత్రయోః - పుత్రులవలె పాలించబడిన పొట్టేళ్లు, నీయమానయోః - లాగుకొనబడి పోవుచుండగా, ఆక్రందితమ్ - మొరను, నిశమ్య - విని, దేవీ - ఊర్వశీదేవి, అహమ్ - నేను, వీరమానినా - తాను వీరుడనని తలపోయునట్టియు, నపుంసా - నపుంసకుడైనట్టియు, కునాథేన - దుష్టుడగు భర్తచే, హతా - భ్రష్టము చేయబడినదానను, అస్మి - అగుచున్నాను.

ఊర్వశి ఆ పొట్టేళ్లను తన పుత్రులను వలె పాలించెను. గంధర్వులు లాగుకొని పోవుచుండగా అవి పెట్టిన మొరను విని ఆమె ఇట్లు పలికెను -- నా భర్త దుష్టుడు, నపుంసకుడు. కాని, తాను వీరుడనని అతడు తలపోయును. అట్టి భర్త కారణముగా నేను భ్రష్టురాలనైతిని.

యద్విశ్రంభాదహం నష్టా హృతాపత్యా చ దస్యుభిః ।
యశ్శేతే నిశి సంత్రస్తో యథా నారీ దివా పుమాన్ ।। 29

యద్-విశ్రంభాత్ - ఎవనియందలి విశ్వాసము వలన, దస్యుభిః - చోరులచే, హృత-అపత్యా చ - అపహరించబడిన పుత్రులు గలదాననై,

అహమ్ - నేను, నష్టా - నష్టపోతినో, దివా - పగలు, పుమాన్ - మగవాడగు, యః - ఎవడైతే, సంత్రస్తః - భయపడినవాడై, నిశి - రాత్రియందు, నారీ యథా - స్త్రీ వలె, శేతే - నిద్రించుచున్నాడో.

నేను నా ప్రియుని నమ్మి నష్టపోయినాను. నా స్వంతపిల్లలవంటి పొట్టేళ్లను చోరులు అపహరించినారు. ఈయన పగలైతే మగవాడే గాని, రాత్రి మాత్రము భయపడి స్త్రీవలె నిద్రించుచున్నాడు.

ఇతి వాక్సాయకైర్విద్ధః ప్రతోత్త్రైరివ కుంజరః ।
నిశి నిస్త్రింశమాదాయ వివస్త్రోఽభ్యద్రవద్రుషా ॥ 30

ఇతి - ఈ విధముగా, వాక్-సాయకైః - వాక్కులనే బాణములతో, ప్రతోత్త్రైః - అంకుశములతో, కుంజరః ఇవ - ఏనుగు వలె, విద్ధః - పొడవబడినవాడై, నిశి - రాత్రియందు, వివస్త్రః - వస్త్రములు లేనివాడై, రుషా - కోపముతో, నిస్త్రింశమ్ - కత్తిని, ఆదాయ - తీసుకొని, అభి-అద్రవత్ - ఆ దిక్కులో పరుగెత్తెను.

ఈ విధముగా ఊర్వశి, ఏనుగును అంకుశములతో పొడిచినట్లుగా, వాక్కులనే బాణములతో పురూరవుని పొడిచెను. అపుడాయన ఆ రాత్రియందు నగ్నముగా కోపముతో కత్తిని పట్టుకొని చోరులు వెళ్లిన దిక్కువైపు పరుగెత్తెను.

తే విసృజ్యోరణౌ తత్ర వ్యద్యోతంత స్మ విద్యుతః ।
ఆదాయ మేషావాయాంతం నగ్నమైక్షత సా పతిమ్ ॥ 31

తే - ఆ గంధర్వులు, ఉరణౌ - పొట్టేళ్లను, తత్ర - అక్కడ, విసృజ్య - విడిచిపెట్టి, విద్యుతః - మెరుపులను, వ్యద్యోతంత స్మ - ప్రకాశింప జేసిరి, మేషౌ - పొట్టేళ్లను, ఆదాయ - తీసుకొని, ఆయాంతమ్ - తిరిగి వచ్చుచున్న, నగ్నమ్ - దిగంబరుడైన, పతిమ్ - భర్తను, సా - ఆమె, ఐక్షత - చూచెను.

ఆ గంధర్వులు పొట్టేళ్లను అక్కడనే విడిచిపెట్టి మెరుపులు మెరియునట్లు చేసిరి. పురూరవ మహారాజు ఆ పొట్టేళ్లను తీసుకొని వచ్చుచుం

డెను. కాని, ఆయన దిగంబరుడై యుండెను. ఆ మెరుపుల వెలుతురులో ఊర్వశి నగ్నుడైయున్న తన భర్తను చూచెను.

ఐలోఽపి శయనే జాయామపశ్యన్ విమనా ఇవ ।
తచ్చిత్తో విహ్వలశ్శోచన్ బభ్రామోన్మత్తవన్మహీమ్ ॥ 32

ఐలః - ఇలాపుత్రుడగు పురూరవుడు, శయనే - శయనమునందు, జాయామ్ - భార్యయగు ఊర్వశిని, అపశ్యన్ - కానరానివాడై, విమనాః ఇవ - మిక్కిలి చెడిన మనస్సు గలవాడై, తత్-చిత్తః - ఆమె యందు చిత్తము గలవాడై, విహ్వలః - వ్యాకులమైన చిత్తము గలవాడై (అస్వస్థుడై), శోచన్ - దుఃఖించువాడై, ఉన్మత్తవత్ - పిచ్చివాడు వలె, మహీమ్ - భూమిని, బభ్రామ - తిరుగాడెను.

ఇలాపుత్రుడగు పురూరవునకు శయ్యయందు తన భార్యయగు ఊర్వశి కానరాలేదు. ఆయన మనస్సు మిక్కిలి చెడి దుఃఖించెను. వ్యాకులమైన చిత్తముతో ఆయన ఆమెనే ధ్యానిస్తూ పిచ్చివాడు వలె అస్వస్థుడై భూలోకములో తిరుగాడెను.

స తాం వీక్ష్య కురుక్షేత్రే సరస్వత్యాం చ తత్సఖీః ।
పంచ ప్రహృష్టవదనాః ప్రాహ సూక్తం పురూరవాః ॥ 33

సః - ఆ, పురూరవాః - పురూరవుడు, కురుక్షేత్రే - కురుక్షేత్రమునందు, సరస్వత్యామ్ - సరస్వతీ నదీతీరమున, తామ్ - ఆ ఊర్వశిని, ప్రహృష్టవదనాః - హర్షముతో నిండిన ముఖములు గల, పంచ - అయిదుగురు, తత్-సఖీః చ - ఆమె చెలికత్తెలను కూడ, వీక్ష్య - చూచి, సు-ఉక్తమ్ - సూక్తము రూపములోనున్న వచనమును, ప్రాహ - పలికెను.

ఆ పురూరవునకు కురుక్షేత్రములో సరస్వతీ నదీతీరమునందు ఆ ఊర్వశి కనబడెను. ఆమెతో బాటుగా హర్షముతో నిండిన ముఖములు గల అయిదుగురు చెలికత్తెలు కూడ ఉండిరి. అపుడాయన ఈ క్రింది విధముగా మధురమగు పలుకులను పలికెను. ఆయన పలుకులు వేదప్రసిద్ధమగు సూక్తము రూపములో నుండెను.

అయే జాయే తిష్ఠ తిష్ఠ ఘోరే న త్యక్తుమర్హసి ।
మాం త్వమద్యాప్యనిర్వృత్య వచాంసి కృణవావహై ।। 34

అయే జాయే - ఓ ప్రియురాలా!, తిష్ఠ - నిలు, తిష్ఠ - నిలు, త్వమ్ - నీవు, మామ్ - నన్ను, అద్య అపి - ఇప్పుడైనా, అనిర్వృత్య - ఆనందమును కలిగించకుండా, ఘోరే - భయంకరమగు దుఃఖమునందు, త్యక్తుమ్ - విడిచిపెట్టుటకు, న అర్హసి - తగవు, వచాంసి - మాటలను, కృణవావహై - చెప్పుకొనెదము.

ఓ ప్రియురాలా! నిలు, నిలు. నాకు ఈ నాడైనా సంతోషమును కలిగించకుండా భయంకరమగు విరహదుఃఖములో పారవేయుట నీకు తగదు. మనము మాటలాడుకొనవలెను.

సుదేహోఽయం పతత్యత్ర దేవి దూరం హృతస్త్వయా ।
ఖాదంత్యేనం వృకా గృధ్రాస్త్వత్ప్రసాదస్య నాస్పదమ్ ।। 35

దేవి - ఓ దేవీ!, త్వయా - నీచే, దూరమ్ - దూరముగా, హృతః - విడిచిపెట్టబడిన, అయమ్ - ఈ, సుదేహః - అందమైన దేహము, అత్ర - ఇక్కడ, పతతి - పడిపోవును, త్వత్-ప్రసాదస్య - నీ అనుగ్రహమునకు, న-ఆస్పదమ్ - విషయము కాని, ఏనమ్ - దీనిని, వృకాః - తోడేళ్లు, గృధ్రాః - గ్రద్దలు, ఖాదంతి - తినును.

ఓ దేవీ! నీవు నా ఈ సుందరమైన దేహమును దూరముగా విడిచిపెట్టి వెళ్లిపోతివి. నీ అనుగ్రహమునకు నోచుకోని ఈ దేహము ఇక్కడనే పడిపోవును. దీనిని తోడేళ్లు, గ్రద్దలు భక్షించును.

ఉర్వశ్యువాచ ।
మా మృథాః పురుషోఽసి త్వం మా స్మ త్వాఽద్యుర్వృకా ఇమే ।
క్వాపి సఖ్యం న వై స్త్రీణాం వృకాణాం హృదయం తథా ।। 36

మా స్మ మృథాః - మరణించవద్దు, త్వమ్ - నీవు, పురుషః అసి - మగవాడవు, త్వా - నిన్ను, ఇమే - ఈ, వృకాః - తోడేళ్లు, మా అద్యుః - తినకుండుగాక!, స్త్రీణామ్ - స్త్రీలకు, క్వ అపి - ఎవ్వనియందైననూ,

సఖ్యమ్ - ప్రేమ, న - ఉండదు, వై - నిశ్చయము, వృకాణాం యథా - తోడేళ్లకు వలె, హృదయమ్ - హృదయము.

ఊర్వశి ఇట్లు పలికెను --- నీవు మరణించరాదు. నీవు మగవాడవు. తోడేళ్లు వంటి ఈ ఇంద్రియములు నిన్ను భక్షించకుండు గాక! (ఇంద్రియములను జయించుము). స్త్రీలకు ఏ వ్యక్తియందైననూ ప్రేమ స్థిరముగా నుండదు. స్త్రీల హృదయము తోడేళ్ల హృదయము వంటిది (క్రూరమైనది).

స్త్రియో హ్యకరుణాః క్రూరా దుర్మర్షాః ప్రియసాహసాః ।
ఘ్నంత్యల్పార్థేఽపి విశ్రబ్ధం పతిం భ్రాతరమప్యుత ॥ 37

హి - ఏలయనగా, స్త్రియః - స్త్రీలు, అకరుణాః - దయ లేనివారు, క్రూరాః - క్రూరులు, దుర్మర్షాః - సహనము లేనివారు, ప్రియసాహసాః - ప్రియుని విషయములో సాహసము గలవారు, అల్ప-అర్థే అపి - అల్పమగు ప్రయోజనమునందు కూడ, విశ్రబ్ధమ్ - నమ్మిన, పతిమ్ - భర్తను, భ్రాతరం అపి - సోదరుని కూడ, ఘ్నంతి - దెబ్బ తీసెదరు, ఉత - ఇతరులను గురించి చెప్పవలెనా?

ఏలయనగా, స్త్రీలు దయ లేనివారు, క్రూరమగు స్వభావము గలవారు. వారికి సహనము సున్న. వారు తమకు నచ్చిన వాని (వస్తువు) విషయములో ఎంతటికైననూ తెగించెదరు. వారు చిన్న ప్రయోజనము కొరకైననూ భర్తను, సోదరుని కూడ దెబ్బ తీసెదరు. ఇతరులను లెక్క చేయరని వేరుగా చెప్పవలయునా?

విధాయాలీకవిశ్రంభమజ్ఞేషు త్యక్తసౌహృదాః ।
నవం నవమభీప్సంత్యః పుంశ్చల్యః స్వైరవృత్తయః ॥ 38

అజ్ఞేషు - మూర్ఖులయందు, అలీకవిశ్రంభమ్ - కపట విశ్వాసమును, విధాయ - కలిగించి, త్యక్తసౌహృదాః - విడిచి పెట్టబడిన ప్రేమ గల, పుంశ్చల్యః - స్వైరవృత్తి గల స్త్రీలు, నవం నవమ్ - కొత్త కొత్తవానిని, అభీప్సంతః - కోరువారై, స్వైరవృత్తయః - యథేచ్ఛగా సంచరించువారు.

స్వైరవృత్తి గల స్త్రీలు మూర్ఖులకు కపట విశ్వాసమును కలిగించి, ప్రేమను విడిచిపెట్టి, కొత్త కొత్త ప్రియులను కోరుకుంటూ యథేచ్ఛగా సంచరించెదరు.

సంవత్సరాంతే హి భవానేకరాత్రం మయేశ్వర ।
వత్స్యత్యపత్యాని చ తే భవిష్యంత్యపరాణి భోః ॥ 39

ఈశ్వర - ఓ ప్రభూ!, సంవత్సర-అంతే - సంవత్సరము పూర్తి అయినప్పుడు, భవాన్ - నీవు, మయా - నాతో, ఏకరాత్రమ్ - ఒక రాత్రి, వత్స్యతి హి - నిశ్చయముగా నివసించగలవు, భోః - ఓయీ!, తే - నీకు, అపరాణి - ఇంకనూ, అపత్యాని చ - సంతానములు కూడ, భవిష్యంతి - కలుగగలవు.

ఓ ప్రభూ! నీవు సమర్థుడవు. సంవత్సరము తరువాత నీవు ఒక రాత్రి నిశ్చయముగా నాతో గడుపగలవు. పైగా, నీకు ఇంకనూ సంతానములు కలుగగలవు.

అంతర్వత్నీముపాలక్ష్య దేవీం స ప్రయయౌ పురమ్ ।
పునస్తత్ర గతోఽబ్దాంతే ఉర్వశీం వీరమాతరమ్ ॥ 40

ఉపలభ్య ముదా యుక్తస్సమువాస తయా నిశామ్ ।
అథైనముర్వశీ ప్రాహ కృపణం విరహాతురమ్ ॥ 41

సః - ఆ పురూరవుడు, దేవీమ్ - ఊర్వశీదేవిని, అంతర్వత్నీమ్ - గర్భవతినిగా, ఉపాలక్ష్య - గమనించి, పురమ్ - నగరమును గురించి, ప్రయయౌ - వెళ్లెను, అబ్ద-అంతే - సంవత్సరము పూర్తి అయిన తరువాత, పునః - మరల, తత్ర - అచటకు, గతః - వెళ్లినవాడై, వీరమాతరమ్ - వీరుడగు పుత్రుని తల్లియగు, ఉర్వశీమ్ - ఊర్వశిని, ఉపలభ్య - చూచి, ముదా - ఆనందముతో, యుక్తః - కూడినవాడై, తయా - ఆమెతో, నిశామ్ - రాత్రిని, సమువాస - చక్కగా నివసించెను, అథ - మరునాడు, విరహ-ఆతురమ్ - వియోగముచే వ్యాకులుడైనట్టియు, కృపణమ్ - దీనుడైన, ఏనమ్ - ఈ మహారాజును గురించి, ప్రాహ - పలికెను.

ఊర్వశి గర్భవతి అనే విషయమును గమనించి ఆ పురూరవుడు తన నగరమునకు వెళ్లెను. సంవత్సరము తరువాత ఆయన మరల ఆ కురు క్షేత్రమునకు వెళ్లి ఊర్వశిని చూచెను. ఆమె అప్పటికే వీరుడగు పుత్రునకు జన్మనిచ్చెను. ఆయన ఆమెతో కూడి ఆనందముగా ఆ రాత్రిని చక్కగా గడిపెను. మరునాడు ఆమెతోడి వియోగముచే వ్యాకులుడై దీనుడై యున్న ఈ మహారాజును ఉద్దేశించి ఆమె ఇట్లు పలికెను.

గంధర్వానుపధావేమాంస్తుభ్యం దాస్యంతి మామితి ।
తస్య సంస్తువతస్తుష్టా అగ్నిస్థాలీం దదుర్నృప ।
ఉర్వశీం మన్యమానస్తాం సోఽబుధ్యత చరన్ వనే ।। 42

ఇమాన్ - ఈ, గంధర్వాన్ - గంధర్వులను, ఉపధావ - స్తుతించుము, మామ్ - నన్ను, తుభ్యమ్ - నీ కొరకు, దాస్యంతి - ఈయగలరు, ఇతి - అని, నృప - ఓ రాజా!, తస్య - ఆయన, సంస్తువతః - చక్కగా స్తుతించుచుండగా, తుష్టాః - సంతోషించిన గంధర్వులు, అగ్నిస్థాలీమ్ - అగ్నిని స్థాపించే పాత్రను, దదుః - ఇచ్చిరి, సః - ఆ మహారాజు, తామ్ - ఆ పాత్రను, ఉర్వశీమ్ - ఊర్వశినిగా, మన్యమానః - తలపోయుచున్నవాడై, వనే - అడవియందు, చరన్ - సంచరించువాడై, అబుధ్యత - తెలుసుకొనెను.

ఈ గంధర్వులను నీవు స్తుతించుము, వారు నన్ను నీకు ఈయగలరు, అని ఊర్వశి చెప్పగా, ఆయన వారిని చక్కగా స్తుతించెను. ఓ పరీక్షిన్మహారాజా! గంధర్వులు సంతోషించి ఆయనకు అగ్నిని స్థాపించే పాత్రను ఇచ్చిరి (అగ్నియందు హోమమును చేసి దేవలోకమును పొందుమని వారి అభిప్రాయము). కాని, ఆ మహారాజు ఆ పాత్రయే ఊర్వశియని తలపోసెను. ఆయన అడవిలో సంచరిస్తూ, అది కేవలము పాత్రయేనని తెలుసుకొనెను.

స్థాలీం న్యస్య వనే గత్వా గృహానాధ్యాయతో నిశి ।
త్రేతాయాం సంప్రవృత్తాయాం మనసి త్రయ్యవర్తత ।। 43

స్థాలీమ్ - ఆ పాత్రను, వనే - అడవియందు, న్యస్య - ఉంచి, గృహాన్ - ఇంటిని గురించి, గత్వా - వెళ్లి, నిశి - రాత్రియందు, ఆధ్యాయతః - ధ్యానించుచున్న ఆ పురూరవసునకు, మనసి - మనస్సునందు, త్రేతాయామ్ - త్రేతాయుగము, సంప్రవృత్తాయామ్ - ప్రవర్తిల్లుచుండగా, త్రయీ - వేదము, అవర్తత - ప్రాదుర్భవించెను.

ఆ పురూరవ మహారాజు ఆ పాత్రను అడవిలో పదిలి, తన ఇంటికి వెళ్లి, ఆ ఊర్వశినే ధ్యానించుచుండెను. ఇంతలో త్రేతాయుగము ప్రారంభమయ్యేను. అప్పుడు ఆయన హృదయములో కర్మను బోధించే మూడు (ఋగ్యజుస్సామలు) వేదములు ప్రకటమయ్యేను.

స్థాలీస్థానం గతోఽశ్వత్థం శమీగర్భం విలక్ష్య సః ।
తేన ద్వే అరణీ కృత్వా ఉర్వశీలోకకామ్యయా ॥ 44

ఉర్వశీం మంత్రతో ధ్యాయన్నధరారణిముత్తరామ్ ।
ఆత్మానముభయోర్మధ్యే యత్తత్ప్రజననం ప్రభుః ॥ 45

సః - ఆ, ప్రభుః - పురూరవ మహారాజు, స్థాలీస్థానమ్ - పాత్ర ఉన్న స్థానమును గురించి, గతః - వెళ్లినవాడు, శమీగర్భమ్ - జమ్మి చెట్టు మొదట్లో పుట్టిన, అశ్వత్థమ్ - రావి చెట్టును, విలక్ష్య - పరికించి చూచి, తేన చ - దానితో, ద్వే - రెండు, అరణీ - నిప్పును మథించే కొయ్యలను, కృత్వా - చేసి, ఉర్వశీలోకకామ్యయా - ఊర్వశియొక్క లోకమునందలి కామనచే, అధర-అరణిమ్ - క్రింది కొయ్యను, ఉర్వశీమ్ - ఊర్వశినిగా, ఉత్తరామ్ - పై కొయ్యను, ఆత్మానమ్ - తననుగా, ఉభయోః - రెండింటి యొక్క, మధ్యే - మధ్యయందు, యత్ - ఏ కట్టె గలదో, తత్ - దానిని, ప్రజననమ్ - పుత్రునిగా, మంత్రతః - మంత్రపూర్వకముగా, ధ్యాయన్ - ధ్యానించువాడు.

ఆ పురూరవ మహారాజు అడవిలో అగ్నిపాత్రను వదలిపెట్టిన చోటికి వెళ్లెను. అచట జమ్మి చెట్టు మొదట్లో మొలిచియున్న రావి చెట్టును చూచెను. దాని కట్టెతో రెండు నిప్పును మథించే కొయ్యలను చేసెను. అపుడాయన ఊర్వశియొక్క లోకమును పొందే కోరికతో, క్రింది కొయ్యను

ఊర్వశినిగా, పై కొయ్యను తననుగా, వాటి మధ్యలోనుండే కట్టెను పుత్రునిగా మంత్రపూర్వకముగా ధ్యానిస్తూ అగ్నిని మథించెను.

తస్య నిర్మంథనాజ్జాతో జాతవేదా విభావసుః ।
త్రయ్యా స విద్యయా రాజ్ఞా పుత్రత్వే కల్పితస్త్రివృత్ ।। 46

తస్య - ఆ కట్టెయొక్క, నిర్మంథనాత్ - మథించుట వలన, జాతవేదాః - సంపదలు పుట్టే స్థానమైన, విభావసుః - అగ్ని, జాతః - పుట్టినవాడు, త్రివృత్ - మూడు రూపములు గల, సః - ఆ అగ్ని, త్రయ్యా - మూడు వేదముల రూపములోనున్న, విద్యయా - జ్ఞానముచే, రాజ్ఞా - మహారాజుచే, పుత్రత్వే - పుత్రుని స్థానమునందు, కల్పితః - ఏర్పాటు చేయబడినవాడు.

ఆ కట్టెను మథించుట వలన అగ్ని పుట్టెను. ఈ అగ్నిని ఆరాధించుట వలననే మానవుడు సకలసంపదలను పొందును. మూడు వేదముల జ్ఞానముతో ఆ పురూరవ మహారాజు అగ్నిని ఆహవనీయము, గార్హపత్యము, అన్వాహార్య పచనము అనే మూడు రూపములుగా విభాగము చేసి, ఆ అగ్నిని తన పుత్రుడుగా చేసుకొనెను.

తేనాయజత యజ్ఞేశం భగవంతమధోక్షజమ్ ।
ఉర్వశీలోకమన్విచ్ఛన్ సర్వదేవమయం హరిమ్ ।। 47

ఉర్వశీలోకమ్ - ఊర్వశియొక్క లోకమును, అన్విచ్ఛన్ - కోరుచున్న ఆ మహారాజు, యజ్ఞ-ఈశమ్ - యజ్ఞేశ్వరుడైనట్టియు, అధోక్షజమ్ - ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరము కానట్టియు, సర్వదేవమయమ్ - సకలదేవతారూపుడైన, భగవంతం హరిమ్ - శ్రీహరి భగవానుని, తేన - ఆ అగ్ని ద్వారా, అయజత - ఆరాధించెను.

ఊర్వశీలోకమును కోరే ఆ పురూరవ మహారాజు ఆ అగ్ని ద్వారా యజ్ఞేశ్వరుడగు శ్రీహరి భగవానుని ఆరాధించెను. సకలదేవతాస్వరూపుడగు శ్రీహరి ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరుడు కాడు.

ఏక ఏవ పురా వేదః ప్రణవస్సర్వవాఙ్మయః ।
దేవో నారాయణో నాన్య ఏకోఽగ్నిర్వర్ణ ఏవ చ ।। 48

పురా - పూర్వము, సర్వవాఙ్మయః - సకలవాక్కులకు బీజమైన, ప్రణవః - ఓంకారము, ఏకః ఏవ - ఒక్కటి మాత్రమే, వేదః - వేదము, దేవః - దేవుడు, నారాయణః - నారాయణుడు, అన్యః - ఇతరుడు, న - కాడు, అగ్నిః - అగ్ని, వర్ణః ఏవ చ - వర్ణము కూడ, ఏకః - ఒక్కటే.

పూర్వము (కృతయుగములో) సకలవాక్కులకు బీజమైన ఓంకార మొక్కటియే వేదము. దేవుడు నారాయణుడే కాని, మరియొకడు కాడు. అగ్ని ఒక్కటియే ఉండెడిది (మూడు కాదు). వర్ణము కూడ ఒక్కటి (హంస) మాత్రమే ఉండెడిది.

పురూరవస ఏవాసీత్త్రయీ త్రేతాముఖే నృప ।
అగ్నినా ప్రజయా రాజా లోకం గాంధర్వమేయివాన్ ।। 49

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే నవమస్కంధే చతుర్దశోఽధ్యాయః ।।

నృప - ఓ రాజా!, త్రేతాముఖే - త్రేతాయుగముయొక్క ఆరంభ మునందు, త్రయీ - మూడు వేదముల సముదాయము, పురూరవసః ఏవ - పురూరవ మహారాజునుండి మాత్రమే, ఆసీత్ - ప్రకటమయ్యెను, రాజా - ఆ రాజు, అగ్నినా - అగ్ని ద్వారా, ప్రజయా - సంతానము ద్వారా, గాంధర్వమ్ - గంధర్వులకు చెందిన, లోకమ్ - లోకమును, ఏయివాన్ - చేరుకొనెను.

ఓ పరీక్షిన్మహారాజా! త్రేతాయుగము ఆరంభములో పురూరవ మహారాజు ద్వారానే మూడు వేదములు ఆవిర్భవించెను. ఆ రాజు ఆ అగ్నిని ఆరాధించి, సంతానమును పొంది గంధర్వలోకమును చేరుకొనెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
ఊర్వశీ-పురూరవుల వృత్తాంతమును వర్ణించే పదునాల్గవ
అధ్యాయము ముగిసినది (14).

* * * * *

# అథ పంచదశోऽధ్యాయః

## పరశురామ కార్తవీర్యార్జునుల చరితము

శ్రీశుక ఉవాచ।
ఐలస్య చోర్వశీగర్భాత్ షడాసన్నాత్మజా నృప ।
ఆయుశ్శ్రుతాయుస్సత్యాయూ రయోऽథ విజయో జయః ।। 1

నృప - ఓ రాజా!, ఐలస్య - ఇలాపుత్రుడగు పురూరవునకు, ఊర్వశీగర్భాత్ - ఊర్వశియొక్క గర్భమునుండి, షట్ - ఆర్గురు, ఆత్మజాః - పుత్రులు, ఆసన్ - కలిగిరి, ఆయుః - ఆయువు, శ్రుతాయుః - శ్రుతాయువు, సత్యాయుః - సత్యాయువు, రయః - రయుడు, విజయః - విజయుడు, అథ - మరియు, జయః - జయుడు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! ఇలాపుత్రుడగు పురూరవునకు ఊర్వశి గర్భమునుండి ఆయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుడు, విజయుడు, మరియు జయుడు అనే ఆర్గురు పుత్రులు కలిగిరి.

శ్రుతాయోర్వసుమాన్ పుత్రస్సత్యాయోశ్చ శ్రుతంజయః ।
రయస్య సుత ఏకశ్చ జయస్య తనయోऽమితః ।। 2

శ్రుతాయోః - శ్రుతాయువుయొక్క, పుత్రః - పుత్రుడు, వసుమాన్ - వసుమంతుడు, సత్యాయోః చ - సత్యాయువుయొక్క పుత్రుడు, శ్రుతంజయః - శ్రుతంజయుడు, రయస్య - రయునియొక్క, సుతః - పుత్రుడు, ఏకః - ఏకుడు, జయస్య చ - జయునియొక్క, తనయః - పుత్రుడు, అమితః - అమితుడు.

శ్రుతాయువుయొక్క పుత్రుడు వసుమంతుడు. సత్యాయువుయొక్క పుత్రుడు శ్రుతంజయుడు. రయుని పుత్రుడు ఏకుడు. జయుని పుత్రుడు అమితుడు.

భీమస్తు విజయస్యాథ కాంచనో హోత్రకస్తతః ।
తస్య జహ్నుస్సుతో గంగాం గండూషీకృత్య యోఽపిబత్ ।
జహ్నోస్తు పూరుస్తత్పుత్రో బలాకశ్చాత్మజోఽజకః ॥ 3

విజయస్య తు - విజయుని పుత్రుడైతే, భీమః - భీముడు, అథ - ఆయన పుత్రుడు, కాంచనః - కాంచనుడు, తతః - ఆయన వలన, హోత్రకః - హోత్రకుడు, తస్య - ఆయనయొక్క, సుతః - పుత్రుడు, జహ్నుః - జహ్నువు, యః - ఎవడైతే, గంగామ్ - గంగను, గండూషీకృత్య - పుక్కిటబట్టి, అపిబత్ - త్రాగెనో, జహ్నోః తు - జహ్నువుయొక్క పుత్రుడైతే, పూరుః - పూరువు, తత్-పుత్రః - ఆయనయొక్క పుత్రుడు, బలాకః - బలాకుడు, ఆత్మజః - ఆయన పుత్రుడు, అజకః - అజకుడు.

విజయుని పుత్రుడైతే భీముడు. భీముని పుత్రుడు కాంచనుడు. కాంచనుని పుత్రుడు హోత్రకుడు. హోత్రకుని పుత్రుడు జహ్నువు. జహ్నువు గంగను పుక్కిటబట్టి త్రాగివేసెను. జహ్నువుయొక్క పుత్రుడు పూరువు. పూరువు పుత్రుడు బలాకుడు. బలాకుని పుత్రుడు అజకుడు.

తతః కుశః కుశస్యాపి కుశాంబుస్తనయో వసుః ।
కుశనాభశ్చ చత్వారో గాధిరాసీత్కుశాంబుజః ॥ 4

తతః - ఆ అజకుని వలన, కుశః - కుశుడు, కుశస్య అపి - కుశుని పుత్రుడు కూడ, కుశాంబుః - కుశాంబువు, తనయః - తనయుడు, వసుః - వసువు, చ - మరియు, కుశనాభః - కుశనాభుడు అనే, చత్వారః - నల్గురు, కుశాంబుజః - కుశాంబుని పుత్రుడు, గాధిః - గాధి, ఆసీత్ - ఆయెను.

ఆ అజకుని పుత్రుడు కుశుడు. కుశునకు కుశాంబువు, తనయుడు, వసువు, కుశనాభుడు అనే నల్గురు పుత్రులు ఉండిరి. వారిలో కుశాంబుని పుత్రుడు గాధి.

తస్య సత్యవతీం కన్యామృచీకోఽయాచత ద్విజః ।
వరం విసదృశం మత్వా గాధిర్భార్గవమబ్రవీత్ ॥ 5

తస్య - ఆ గాధియొక్క, కన్యామ్ - కుమార్తెయగు, సత్యవతీమ్ - సత్యవతిని, ఋచీకః - ఋచీకుడు అనే, ద్విజః - బ్రాహ్మణుడు, అయాచత - కోరెను, వరమ్ - వరుని, విసదృశమ్ - అనురూపుడు కానివానిని గా, మత్వా - తలచి, గాధిః - గాధి, భార్గవమ్ - భృగువంశీయుడగు ఋచీకుని ఉద్దేశించి, అబ్రవీత్ - పలికెను.

ఆ గాధియొక్క కుమార్తె సత్యవతి. ఆమెను తనకిచ్చి వివాహము చేయుమని ఋచీకుడనే బ్రాహ్మణుడు కోరెను. కాని, ఆయన తగిన వరుడు కాదని గాధి తలపోసి, భృగువంశీయుడగు ఆ ఋచీకునితో ఇట్లు పలికెను.

ఏకతశ్శ్యామకర్ణానాం హయానాం చంద్రవర్చసామ్ ।
సహస్రం దీయతాం శుల్కం కన్యాయాః కుశికా వయమ్ ॥ 6

ఏకతః - ఒకవైపు, శ్యామకర్ణానామ్ - నల్లని చెవులు కలిగినట్టి యు, చంద్రవర్చసామ్ - చంద్రుని కాంతి వంటి కాంతి గల, హయానామ్ - గుర్రములయొక్క, సహస్రమ్ - వేయి, కన్యాయాః - కన్యకు, శుల్కమ్ - కట్నముగా, దీయతామ్ - ఈయబడుగాక!, వయమ్ - మేము, కుశికాః - కుశికవంశము వారము.

మేము కుశికవంశము వారము. మా కన్యకు కట్నముగా చంద్రుని వలె మెరిసిపోయే వేయి గుర్రములనీయవలెను. వాటికి ఒకవైపు (కుడి గా ని, ఎడమ గాని) చెవి నల్లగా నుండవలెను.

ఇత్యుక్తస్తన్మతం జ్ఞాత్వా గతస్స వరుణాంతికమ్ ।
ఆనీయ దత్త్వా తానశ్వానుపయేమే వరాననామ్ ॥ 7

ఇతి - అని, ఉక్తః - పలుకబడిన, సః - ఆ ఋచీకుడు, తత్-మతమ్ - ఆయన అభిప్రాయమును, జ్ఞాత్వా - తెలుసుకొని, వరుణ-అంతికమ్ - వరుణుని సమీపమును గురించి, గతః - వెళ్లినవాడు, తాన్ - అట్టి,

అశ్వాన్ - గుర్రములను, ఆనీయ - తీసుకువచ్చి, దత్త్వా - ఇచ్చి, వర-ఆననామ్ - అందమైన ముఖము గల ఆ కన్యను, ఉపయేమే - వివాహమాడెను.

గాధి ఇట్లు పలుకగా ఆ ఋచీకుడు ఆయన అభిప్రాయమును తెలుసుకొని వరుణుని వద్దకు వెళ్లెను. ఆయనవద్దనుండి అట్టి గుర్రములను తీసుకువచ్చి ఇచ్చి సుందరముఖియగు ఆ కన్య (సత్యవతి) ను వివాహమాడెను.

స ఋషిః ప్రార్థితః పత్న్యా శ్వశ్ర్వా చాపత్యకామ్యయా ।
శ్రపయిత్వోభయైర్మంత్రైశ్చరుం స్నాతుం గతో మునిః ॥ 8

సః - ఆ, ఋషిః - ఋచీక మహర్షి, అపత్యకామ్యయా - సంతానమును గోరే, పత్న్యా - భార్యచే, శ్వశ్ర్వా చ - అత్తగారిచే కూడ, ప్రార్థితః - ప్రార్థించబడినవాడు, మునిః - ఆ మహర్షి, ఉభయైః - రెండు రకముల, మంత్రైః - మంత్రములతో, చరుమ్ - హోమము చేసే అన్నమును, శ్రపయిత్వా - వండి, స్నాతుమ్ - స్నానము చేయుటకు, గతః - వెళ్లినవాడు.

ఆ ఋచీక మహర్షిని భార్య మరియు అత్తగారు కూడ తమకు సంతానము కలగాలని కోరిరి. అపుడా మహర్షి బ్రాహ్మణ (తన భార్య) క్షత్రియు (అత్తగారు) లిద్దరికి చెందిన మంత్రములతో హోమమును చేసే అన్నమును వండి, స్నానమును చేయుటకు వెళ్లెను.

తావత్సత్యవతీ మాత్రా స్వచరుం యాచితా సతీ ।
శ్రేష్ఠం మత్వా తయాఽయచ్ఛన్మాత్రే మాతురదత్స్వయమ్ ॥ 9

తావత్ - అంతలో, సత్యవతీ - సత్యవతి, తయా - ఆ, మాత్రా - తల్లిచే, స్వచరుమ్ - తన చరువును, శ్రేష్ఠమ్ - శ్రేష్ఠమైనదిగా, మత్వా - తలచి, యాచితా సతీ - కోరబడినదై, మాత్రే - తల్లి కొరకు, అయచ్ఛత్ - ఇచ్చెను, మాతుః - తల్లియొక్క (చరువును), స్వయమ్ - తాను, అదత్ - భక్షించెను.

ఆయన తిరిగి వచ్చే లోపులో సత్యవతియొక్క చరువు శ్రేష్ఠమైన దని భావించి ఆమె తల్లి ఆ చరువును కోరెను. సత్యవతి దానిని తల్లికి ఇచ్చి, తల్లియొక్క చరువును తాను భక్షించెను.

తద్విజ్ఞాయ మునిః ప్రాహ పత్నీం కష్టమకారషీః ।
ఘోరో దండధరః పుత్రో భ్రాతా తే బ్రహ్మవిత్తమః ॥ 10

తత్ - ఆ విషయమును, విజ్ఞాయ - తెలుసుకొని, మునిః - ఋచీక మహర్షి, పత్నీమ్ - భార్యను గురించి, ప్రాహ - పలికెను, కష్టమ్ - హేయమైన పనిని, అకారషీః - చేసితివి, తే - నీకు, ఘోరః - క్రూరస్వభావుడు, దండధరః - శస్త్రధారియగు, పుత్రః - పుత్రుడు, భ్రాతా - సోదరుడు, బ్రహ్మవిత్తమః - వేదవేత్తలలో శ్రేష్ఠుడు.

ఆ విషయము తెలిసి ఋచీక మహర్షి ఇట్లు పలికెను -- హేయమైన పనిని చేసితివి. నీకు క్రూరస్వభావము కలిగి శస్త్రములను ధరించే పుత్రుడు కలుగును. నీ తమ్ముడు వేదవేత్తలలో శ్రేష్ఠుడు అగును.

ప్రసాదితస్సత్యవత్యా మైవం భూదితి భార్గవః ।
అథ తర్హి భవేత్పౌత్రో జమదగ్నిస్తతోఽభవత్ ॥ 11

ఏవమ్ - ఈ విధముగా, మా భూత్ - ఘటిల్లరాదు, ఇతి - అని, సత్యవత్యా - సత్యవతిచే, ప్రసాదితః - ప్రసన్నుడుగా చేసుకొనబడిన, భార్గవః - భృగువంశీయుడగు ఋచీక మహర్షి, అథ తర్హి - అట్లైనచో, పౌత్రః - పుత్రుని పుత్రుడు, భవేత్ - (అట్లు) అగును, తతః - తరువాత (ఆమెనుండి), జమదగ్నిః - జమదగ్ని, అభవత్ - కలిగెను.

ఈ విధముగా ఘటిల్లరాదు అని సత్యవతి భృగువంశీయుడగు ఋచీక మహర్షిని ప్రసన్నుని చేసుకొనెను. అపుడాయన -- అట్లైనచో, నీ పుత్రుని పుత్రుడు అట్టివాడు (శస్త్రధారి) కాగలడు -- అని చెప్పెను. తరువాత ఆమెకు జమదగ్ని (శాంతస్వభావుడు) పుట్టెను.

సా చాభూత్సుమహాపుణ్యా కౌశికీ లోకపావనీ ।
రేణోస్సుతాం రేణుకాం వై జమదగ్నిరువాహ యామ్ ॥ 12

సా చ - ఆ సత్యవతియైతే, సుమహాపుణ్యా - గొప్ప పుణ్యాత్ము రాలు, లోకపావనీ - జనులను పవిత్రము చేయునది అగు, కౌశికీ - కౌశికి అనే నది, అభూత్ - ఆయెను, రేణోః - రేణు మహర్షియొక్క, సుతామ్ - కుమార్తెయైన, యామ్ - ఏ, రేణుకాం వై - రేణుకనైతే, జమదగ్నిః - జమ దగ్ని, ఉవాహ - వివాహమాడెనో.

మహాపుణ్యాత్మురాలగు ఆ సత్యవతి జనులను పవిత్రము చేసే కౌశికి అనే నదియై ప్రవహించెను. రేణు మహర్షియొక్క కుమార్తెయగు రేణుకను జమదగ్ని వివాహమాడెను.

తస్యాం వై భార్గవఋషేస్సుతా వసుమదాదయః ।
యవీయాన్ జజ్ఞ ఏతేషాం రామ ఇత్యభివిశ్రుతః ॥ 13

భార్గవఋషేః - భృగువంశీయుడగు జమదగ్ని మహర్షి వలన, తస్యాం వై - ఆ రేణుకయందైతే, వసుమద్-ఆదయః - వసుమంతుడు మొదలగు, సుతాః - పుత్రులు, ఏతేషామ్ - వీరిలో, రామః - రాముడు, ఇతి - అని, అభివిశ్రుతః - అంతటా ప్రసిద్ధి చెందినవాడు, యవీయాన్ - కనిష్ఠుడై, జజ్ఞే - పుట్టెను.

భృగువంశీయుడగు జమదగ్ని మహర్షికి రేణుకయందు వసుమంతుడు, వసువు, సుషేణుడు, రుమణ్వంతుడు అనే పుత్రులు కలిగిరి. వీరి తరువాత కనిష్ఠ పుత్రుడు జన్మించి, లోకములో (పరశు) రాముడు అనే పేరుతో చాల ప్రసిద్ధిని పొందెను.

యమాహుర్వాసుదేవాంశం హైహయానాం కులాంతకమ్ ।
త్రిస్సప్తకృత్వో య ఇమాం చక్రే నిఃక్షత్రియాం మహీమ్ ॥ 14

హైహయానామ్ - హైహయుల, కుల-అంతకమ్ - కులమును అంతమొందించిన, యమ్ - ఏ పరశురామునైతే. వాసుదేవ-అంశమ్ - శ్రీహరియొక్క అంశావతారముగా, ఆహుః - చెప్పెదరో, యః - ఎవడైతే, త్రిః-సప్తకృత్వః - మూడు ఏడు సార్లు, ఇమామ్ - ఈ, మహీమ్ - భూమి ని, నిఃక్షత్రియామ్ - క్షత్రియులు లేనిదానినిగా, చక్రే - చేసెనో.

హైహయుల వంశమును అంతమొందించిన ఆ పరశురాముడు శ్రీహరియొక్క అంశావతారమని చెప్పెదరు. ఆయన ఇరవై ఒక్క పర్యాయములు భూమండలముపై క్షత్రియులు లేకుండా చేసెను.

దుష్టం క్షత్రం భువో భారమబ్రహ్మణ్యమనీనశత్ ।
రజస్తమోవృతమహన్ ఫల్గున్యపి కృతేఽంహసి ॥ 15

దుష్టమ్ - దుర్బుద్ధి కలిగినట్టియు, అబ్రహ్మణ్యమ్ - వేదవేత్తలను పీడించునట్టియు, రజః-తమః-వృతమ్ - రజస్తమోగుణములతో కూడిన, క్షత్రమ్ - క్షత్రియసముదాయమును, ఫల్గుని - అల్పమైన, అంహసి - అపరాధము, కృతే అపి - చేయబడినా, అహన్ - సంహరించెను, భువః - భూమియొక్క, భారమ్ - బరువును, అనీనశత్ - నశింప జేసెను.

రజస్తమోగుణములతో నిండి దుర్బుద్ధితో వేదవేత్తలను పీడించే క్షత్రియుల సముదాయమును -- వారు చేసిన తప్పు చిన్నదే అయిననూ -- ఆయన వారిని సంహరించి, భూభారమును తొలగించెను.

రాజోవాచ ।
కిం తదంహో భగవతో రాజన్యైరజితాత్మభిః ।
కృతం యేన కులం నష్టం క్షత్రియాణామభీక్ష్ణశః ॥ 16

అజిత-ఆత్మభిః - జయించబడని మనస్సులు గల, రాజన్యైః - క్షత్రియులచే, భగవతః - భగవానునకు, కృతమ్ - చేయబడిన, తత్ - ఆ, అంహః - పాపము, కిమ్ - ఏది?, యేన - దేనిచే, క్షత్రియాణామ్ - క్షత్రియులయొక్క, కులమ్ - కులము, అభీక్ష్ణశః - పలుమార్లు, నష్టమ్ - నశింప జేయబడినదో.

పరీక్షిన్మహారాజు ఇట్లు ప్రశ్నించెను --- మనోనిగ్రహము లేని క్షత్రియులు భగవానునియెడల అపరాధమును చేయుటచే వారి వంశము పలుమార్లు వినాశము చేయబడినది గదా! వారు చేసిన ఆ అపరాధమెయ్యది?

శ్రీశుక ఉవాచ ।
హైహయానామధిపతిరర్జునః క్షత్రియర్షభః ।
దత్తం నారాయణస్యాంశమారాధ్య పరికర్మభిః ॥ 17

హైహయానామ్ - హైహయవంశీయుల, అధిపతిః - ప్రభువు, క్షత్రియ-ఋషభః - క్షత్రియులలో శ్రేష్ఠుడు అగు, అర్జునః - కార్తవీర్యార్జునుడు, నారాయణస్య - నారాయణుని, అంశమ్ - అంశావతారమైన, దత్తమ్ - దత్తాత్రేయుని, పరికర్మభిః - పరిచర్యలచే, ఆరాధ్య - ఆరాధించి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- హైహయవంశీయుల అధిపతి, క్షత్రియులలో శ్రేష్ఠుడు అగు కార్తవీర్యార్జునుడు నారాయణుని అంశావతారమైన దత్తాత్రేయునకు పరిచర్యలను చేసి ఆరాధించెను.

బాహూన్ దశశతం లేభే దుర్ధర్షత్వమరాతిషు ।
అవ్యాహతేంద్రియౌజశ్శ్రీతేజోవీర్యయశోబలమ్ ॥ 18

దశశతమ్ - వేయి, బాహూన్ - చేతులను, అరాతిషు - శత్రువుల యెడల, దుర్ధర్షత్వమ్ - పరాజితుడు కాకుండుటను, అవ్యాహత-ఇంద్రియ-ఓజః-శ్రీ-తేజః-వీర్యయశః-బలమ్ - మొక్కవోని ఇంద్రియపాటవము సంపద తేజస్సు శక్తి కీర్తి బలముల సమాహారమును, లేభే - పొందెను.

ఆయనకు దత్తాత్రేయుని అనుగ్రహముచే వేయి చేతులు, శత్రువులచే పరాజయమును పొందకుండుట, మొక్కవోని ఇంద్రియపాటవము, సంపద, తేజస్సు, శక్తి, కీర్తి, మరియు బలములు లభించెను.

యోగేశ్వరత్వమైశ్వర్యం గుణా యత్రాణిమాదయః ।
చచారావ్యాహతగతిర్లోకేషు పవనో యథా ॥ 19

యోగ-ఈశ్వరత్వమ్ - యోగులలో అగ్రేసరత్వమును, ఐశ్వర్యమ్ - ఈశ్వరభావమును (పొందెను), యత్ర - దేనియందైతే, అణిమా-ఆదయః - అణిమ గరిమ మొదలైన, గుణాః - గుణములు (ఉండునో), అవ్యాహతగతిః - ఆటంకము లేని గమనము గలవాడై, పవనః యథా - వాయువు వలె, లోకేషు - లోకములయందు, చచార - సంచరించెను.

ఆయన యోగేశ్వరుడై అణిమ (దూదివలె తేలిక యగుట), గరిమ (పర్వతము వలె బరువు అగుట) మొదలైన సిద్ధులు గల ఈశ్వరభావమును పొందెను. ఆయన వాయువు వలె ఆటంకము లేని గమనముతో లోకములను సంచరించెను.

స్త్రీరత్నైరావృతః క్రీడన్ రేవాంభసి మదోత్కటః ।
వైజయంతీం స్రజం బిభ్రద్రురోధ సరితం భుజైః ॥ 20

స్త్రీరత్నైః - గొప్ప స్త్రీలచే, ఆవృతః - చుట్టువారబడినవాడై, రేవా-అంభసి - నర్మదానదియొక్క నీటియందు, క్రీడన్ - విహరించుచు న్నవాడై, మద-ఉత్కటః - గర్వముచే ఉద్రేకమును పొందినవాడై, వైజ యంతీం స్రజమ్ - వైజయంతీ మాలను, బిభ్రత్ - ధరించినవాడై, సరితమ్ - నర్మదానదిని, భుజైః - చేతులతో, రురోధ - అడ్డుకొనెను.

గర్వముతో ఉద్రేకమును పొందియున్న ఆ కార్తవీర్యుడు గొప్ప యువతులు చుట్టువారియుండగా నర్మదానదీజలములలో విహరించుచుం డెను. ఆయన వైజయంతీ (తొమ్మిది రకముల మణుల) మాలను ధరించి యుండెను. ఆతడా నదీప్రవాహమును తన చేతులతో ఆపివేసెను.

విప్లావితం స్వశిబిరం ప్రతిస్రోతస్సరిజ్జలైః ।
నామృష్యత్తస్య తద్వీర్యం వీరమానీ దశాననః ॥ 21

వీరమానీ - తాను వీరుడననే అభిమానము గల, దశ-ఆననః - దశకంఠుడు, ప్రతిస్రోతః-సరిత్-జలైః - వెనుకకు ప్రవహించిన నదియొక్క జలములచే, విప్లావితమ్ - ముంచబడిన, స్వశిబిరమ్ - తన శిబిరమును (చూచి), తస్య - ఆ కార్తవీర్యునియొక్క, తత్ - ఆ, వీర్యమ్ - శక్తిని, న అమృష్యత్ - సహించలేదు.

ఆ సమీపములో దశకంఠుడగు రావణుడు శిబిరములో నుండెను. కార్తవీర్యుడు నదిని అడ్డుకొనగా, ప్రవాహము వెనుకకు మళ్లి ఆ శిబి రమును ముంచివేసెను. తాను గొప్ప వీరుడననే అభిమానము రావణునకు ఉండెను. కావుననే, ఆయన కార్యవీర్యుని అట్టి (నదిని ఆపివేసే) శక్తిని చూసి సహించలేక పోయెను.

గృహీతో లీలయా స్త్రీణాం సమక్షం కృతకిల్బిషః ।
మాహిష్మత్యాం సంనిరుద్ధో ముక్తో యేన కపిర్యథా ॥ 22

యేన - ఏ కార్తవీర్యునిచేనైతే, కృతకిల్బిషః - చేయబడిన తప్పిదము గల రావణుడు, స్త్రీణామ్ - స్త్రీలయొక్క, సమక్షమ్ - ఎదుట, లీలయా - అలవోకగా, కపిః యథా - కోతివలె, గృహీతః - పట్టుకొనబడినవాడై, మాహిష్మత్యామ్ - మాహిష్మతీ నగరమునందు, సంనిరుద్ధః - బంధించబడినవాడై, ముక్తః - విడిచిపెట్టబడినాడో.

రావణుడు కార్తవీర్యుని యెడల అనుచితముగా ప్రవర్తించెను. అపుడాయన ఆ రావణుని స్త్రీల యెదుటనే అలవోకగా కోతిని వలె పట్టుకొని మాహిష్మతీ నగరములో బంధించి తరువాత విడిచిపెట్టెను.

స ఏకదా తు మృగయాం విచరన్ విపినే వనే ।
యదృచ్ఛయాఽఽశ్రమపదం జమదగ్నేరుపావిశత్ ॥ 23

సః తు - ఆ కార్తవీర్యుడైతే, ఏకదా - ఒకనాడు, విపినే - దట్టమైన, వనే - అడవియందు, మృగయాం విచరన్ - వేటకై సంచరించుచున్నవాడై, యదృచ్ఛయా - అనుకోకుండా, జమదగ్నేః - జమదగ్నియొక్క, ఆశ్రమపదమ్ - ఆశ్రమస్థానమును, ఉపావిశత్ - ప్రవేశించెను.

ఆ కార్తవీర్యుడు ఒకనాడు దట్టని అడవిలో వేటాడుతూ సంచరించెను. ఆయన అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే) జమదగ్ని మహర్షియొక్క ఆశ్రమస్థానమును ప్రవేశించెను.

తస్మై స నరదేవాయ మునిరర్హణమాహరత్ ।
ససైన్యామాత్యవాహాయ హవిష్మత్యా తపోధనః ॥ 24

తపః-ధనః - తపస్సే ధనముగా గల, సః - ఆ, మునిః - జమదగ్ని మహర్షి, ససైన్య-అమాత్యవాహాయ - సైన్యము అమాత్యులు మరియు వాహనములతో కూడియున్న, తస్మై - ఆ, నరదేవాయ - మహారాజు కొరకు, హవిష్మత్యా - కామధేనువుతో, అర్హణమ్ - ఆతిథ్యమును, ఆహరత్ - సమర్పించెను.

తపస్సే ధనముగా గల జమదగ్ని వద్ద కామధేనువు గలదు. దాని అనుగ్రహముతో ఆయన ఆ మహారాజునకు, ఆయన సైన్యమునకు, మంత్రులకు, వాహనములకు కూడ ఆతిథ్యమునిచ్చెను.

స వీరస్తత్ర తద్దృష్ట్వా ఆత్మైశ్వర్యాతిశాయనమ్ ।
తన్నాద్రియతాగ్నిహోత్ర్యాం సాభిలాషస్సహైహయః ॥ 25

వీరః - వీరుడు, సహైహయః - హైహయులతో కూడియున్న వాడు అగు, సః - ఆ కార్తవీర్యుడు, తత్ర - ఆ ఆశ్రమమునందు, ఆత్మైశ్వ ర్య-అతిశాయనమ్ - తన సంపదను అతిశయించియున్న, తత్ - ఆ సంప దను, దృష్ట్వా - చూచి, అగ్నిహోత్ర్యామ్ - హోమధేనువునందు, స-అభి లాషః - కోరికతో కూడినవాడై, తత్ - ఆ ఆతిథ్యమును, న ఆద్రియత - ఆదరించలేదు.

వీరుడగు ఆ కార్తవీర్యుడు హైహయులతో కూడియుండెను. ఆతడు ఆ ఆశ్రమములో చూచిన సంపద (కామధేనువుచే సమకూర్చబడిన ఆతిథ్యము) తన ఐశ్వర్యమును అతిశయించి యుండెను. ఆయనకు ఆ కామధేనువునందు అభిలాష కలిగి, ఆ మహర్షి ఇచ్చిన ఆతిథ్యము సంతోష మును కలిగించలేదు.

హవిర్ధానీమృషేర్దర్పాన్నరాన్ హర్తుమచోదయత్ ।
తే చ మాహిష్మతీం నిన్యుస్సవత్సాం క్రందతీం బలాత్ ॥ 26

దర్పాత్ - గర్వము వలన, ఋషేః - మహర్షియొక్క, హవిర్ధా నీమ్ - హోమధేనువును, హర్తుమ్ - లాగుకొని వచ్చుటకు, నరాన్ - అను చరులను, అచోదయత్ - ప్రేరేపించెను, తే చ - వారు కూడ, సవత్సామ్ - దూడతో కూడియున్నట్టియు, క్రందతీమ్ - ఆక్రోశించుచున్న కామధేను వును, బలాత్ - బలాత్కారముగా, మాహిష్మతీమ్ - మాహిష్మతీ నగర మును గురించి, నిన్యుః - తీసుకువెళ్లిరి.

ఆ రాజు గర్వముచే మహర్షియొక్క హోమధేనువును లాగుకొని రమ్మని తన అనుచరులను ఆదేశించెను. వారు కూడ ఆక్రోశించుచున్న ఆ

కామధేనువును దూడతో సహా మాహిష్మతీ నగరమునకు బలాత్కారముగా లాగుకొని పోయిరి.

అథ రాజని నిర్యాతే రామ ఆశ్రమ ఆగతః ।
శ్రుత్వా తత్తస్య దౌరాత్మ్యం చుక్రోధాహిరివాహతః ।। 27

అథ - తరువాత, రాజని - మహారాజగు కార్తవీర్యుడు, నిర్యాతే - నిష్క్రమించగా, రామః - రాముడు, ఆశ్రమే - ఆశ్రమమునందు, ఆగతః - వచ్చినవాడు, తస్య - ఆ కార్తవీర్యునియొక్క, తత్ - ఆ, దౌరాత్మ్యమ్ - దుర్బుద్ధిని గురించి, శ్రుత్వా - విని, ఆహతః - తొక్కబడిన, అహిః ఇవ - పాము వలె, చుక్రోధ - కోపించెను.

తరువాత మహారాజగు కార్తవీర్యుడు నిష్క్రమించెను. ఇంతలో రాముడు ఆశ్రమమునకు తిరిగి వచ్చెను. ఆయన ఆ కార్తవీర్యుని దుర్బుద్ధిని గురించి విని, తోక తొక్కిన త్రాచు వలె, కోపించెను.

ఘోరమాదాయ పరశుం సతూణం చర్మ కార్ముకమ్ ।
అన్వధావత దుర్ధర్షో మృగేంద్ర ఇవ యూథపమ్ ।। 28

ఘోరమ్ - భయంకరమైన, పరశుమ్ - గొడ్డలిని, సతూణమ్ - అంబులపొదితో కూడిన, కార్ముకమ్ - ధనుస్సును, చర్మ - డాలును, ఆదాయ - తీసుకొని, దుర్ధర్షః - నిలువరించ శక్యము కాని, మృగేంద్రః - సింహము, యూథపం ఇవ - ఏనుగును వలె, అను-అధావత - వెన్నంటి పరుగెత్తెను.

ఆ రాముడు భయంకరమగు గొడ్డలిని, డాలును, అంబుల పొదిని, ధనుస్సును తీసుకొని, నిలువరించ శక్యము కాని సింహము ఏనుగు వెంట బడినట్లుగా, ఆ కార్తవీర్యుని వెన్నంటి వేగముగా వెళ్లెను.

తమాపతంతం భృగువర్యమోజసా ధనుర్ధరం బాణపరశ్వధాయుధమ్ ।
ఐణేయచర్మాంబరమర్కధామభిర్యుతం జటాభిర్దదృశే పురీం విశన్ ।। 29

ఓజసా - వేగముతో, ఆపతంతమ్ - మీదకు వచ్చుచున్నట్టియు, భృగువర్యమ్ - భృగువంశీయులలో శ్రేష్ఠుడైనట్టియు, ధనుః-ధరమ్ -

ధనుస్సును ధరించినట్టియు, బాణపరశ్వధ-ఆయుధమ్ - బాణములు గండ్ర గొడ్డలి ఆయుధములుగా కలిగినట్టియు, ఐణేయచర్మ-అంబరమ్ - లేడి చర్మమే వస్త్రముగా కలిగినట్టియు, అర్కధామభిః - సూర్యుని కాంతు లువంటి కాంతులు గల, జటాభిః - జటలతో, యుతమ్ - కూడుకొనియు న్న, తమ్ - ఆ రాముని, పురీమ్ - నగరమును, విశన్ - ప్రవేశించుచున్న కార్తవీర్యుడు, దదృశే - చూచెను.

కార్తవీర్యుడు నగరములో ప్రవేశిస్తూ, భృగువంశీయులలో శ్రేష్ఠు డగు రాముడు తన మీదకు వేగముగా వచ్చుచుండగా చూచెను. లేడి చర్మ మును వస్త్రముగా దాల్చి, ధనుస్సు, బాణములు, గండ్ర గొడ్డలి అనే ఆయుధములను ధరించియున్న ఆ రాముని జటలు సూర్యకిరణముల వలె ప్రకాశించుచుండెను.

అచోదయద్ధస్తిరథాశ్వపత్తిభిర్గదాసిబాణర్ష్టిశతఘ్నిశక్తిభిః ।
అక్షౌహిణీస్సప్తదశాతిభీషణాస్తా రామ ఏకో భగవానసూదయత్ ।। 30

హస్తిరథ-అశ్వపత్తిభిః - ఏనుగులు రథములు గుర్రములు మరియు పదాతులతో, గదా-అసిబాణ-ఋష్టిశతఘ్నిశక్తిభిః - గదలు కత్తులు బాణములు ఈటెలు ఇనుపముళ్ల కర్రలు మరియు చిల్లకోలలతో, అతిభీషణాః - మిక్కిలి భయంకరములగు, సప్తదశ - పదిహేడు, అక్షౌ హిణీః - అక్షౌహిణులను, అచోదయత్ - పంపించెను, తాః - వాటిని, రామః - రాముడు, ఏకః - ఒక్కడే, అసూదయత్ - సంహరించెను.

కార్తవీర్యుడు పదిహేడు అక్షౌహిణీల సైన్యమును (క్రమముగా) రామునిపైకి పంపించెను. ఆ సేనయందు ఏనుగులు, రథములు, గుర్ర ములు మరియు పదాతులు ఉండిరి. గదలు, కత్తులు, బాణములు, ఈటెలు, ఇనుపముళ్ల కర్రలు మరియు చిల్లకోలలు అనే ఆయుధములతో ఆ సైన్యము చాల భయంకరముగ నుండెను. రాముడు ఒక్కడే ఆ సైన్యము నంతనూ సంహరించెను.

యతో యతోఽసౌ ప్రహరత్పరశ్వధో మనోఽనిలౌజాః పరచక్రసూదనః ।
తతస్తతశ్ఛిన్నభుజోరుకంధరా నిపేతురుర్వ్యాం హతసూతవాహనాః ।।31

ప్రహరత్-పరశ్వధః - ప్రహారము చేయుచున్న గండ్ర గొడ్డలి కలిగినవాడు, మనః-అనిల-ఓజాః - మనస్సుయొక్క గాలియొక్క వేగమువంటి వేగము గలవాడు, పరచక్రసూదనః - శత్రుసైన్యములను దునుమాడువాడు అగు, అసౌ - ఈ రాముడు, యతః యతః - ఎక్కడెక్కడైతే ఉండెనో, తతః తతః - అక్కడక్కడ, ఛిన్నభుజ-ఊరుకంధరాః - తెగిన భుజములు తొడలు మెడలు గలవారు, హతసూతవాహనాః - సంహరించబడిన రథచోదకులు మరియు వాహనములు గలవారు, ఉర్వ్యామ్ - భూమియందు, నిపేతుః - కూలిరి.

శత్రుసైన్యములను నుగ్గు నుగ్గు చేసే ఆ రాముడు మనస్సుయొక్క మరియు గాలియొక్క వేగమువంటి వేగముతో గండ్ర గొడ్డలితో కొట్టుచుండెను. ఆయన సైన్యములో ఎక్కడెక్కడైతే విక్రమించెనో, అక్కడక్కడ సైనికులు భుజములు, తొడలు, మెడలు తెగి క్రింద పడుచుండిరి. రథచోదకులు, గుఱ్ఱములు మొదలగు వాహనములు సంహరించబడగా, వీరులు నేల గూలుచుండిరి.

దృష్ట్వా స్వసైన్యం రుధిరౌఘకర్దమే రణాజిరే రామకుఠారసాయకైః ।
వివృక్ణచర్మధ్వజచాపవిగ్రహం నిపాతితం హైహయ ఆపతద్రుషా ॥32

రుధిర-ఓఘకర్దమే - రక్తప్రవాహములచే బురదయైన, రణ-అజిరే - యుద్ధరంగమునందు, రామకుఠారసాయకైః - రాముని గండ్ర గొడ్డలిచే మరియు బాణములచే, వివృక్ణచర్మధ్వజచాపవిగ్రహమ్ - తెగగొట్టబడిన డాళ్లు జెండాలు ధనుస్సులు మరియు దేహములు కలిగినట్టియు, నిపాతితమ్ - కూల్చివేయబడిన, స్వసైన్యమ్ - తన సైన్యమును, దృష్ట్వా - చూచి, హైహయః - హైహయవంశీయుడగు కార్తవీర్యుడు, రుషా - కోపముతో, ఆపతత్ - వేగముగా వచ్చెను.

ఆ యుద్ధరంగము రక్తప్రవాహములతో బురద ఆయెను. సైనికుల డాళ్లు, జెండాలు, ధనుస్సులు మరియు దేహములు కూడ రాముని గండ్ర గొడ్డలిచే మరియు బాణములచే తెగగొట్టబడి, ఆ సైన్యము నేల గూలెను. దానిని చూచి హైహయవంశీయుడగు కార్తవీర్యుడు కోపించి వేగముగా వచ్చెను.

అథార్జునః పంచశతేషు బాహుభిర్ధనుష్షు బాణాన్యుగపత్స సందధే,
రామాయ రామోఽస్త్రభృతాం సమగ్రణీస్తాన్యేకధన్వేషుభిరాచ్ఛినత్సమమ్ ।

అథ - అప్పుడు, సః - ఆ, అర్జునః - కార్తవీర్యార్జునుడు, పంచ శతేషు - అయిదువందల, ధనుష్షు - ధనుస్సులయందు, బాణాని - బాణ ములను, యుగపత్ - ఒకేసారి, రామాయ - రాముని కొరకు, సందధే - ఎక్కుపెట్టెను, అస్త్రభృతామ్ - అస్త్రములను ధరించినవారిలో, సమగ్రణీః - అగ్రేసరుడు, ఏకధన్వా - ఒకే ధనుస్సు గలవాడు అగు, రామః - రాము డు, తాని - వాటిని, ఇషుభిః - బాణములతో, సమమ్ - ఒకేసారి, ఆచ్ఛి నత్ - పూర్తిగా ఛేదించెను.

అప్పుడా కార్తవీర్యార్జునుడు అయిదువందల ధనుస్సులయందు బాణములను ఎక్కుపెట్టి ఒకేసారి రామునిపై ప్రయోగించెను. అస్త్రవేత్త లలో అగ్రేసరుడగు రామునివద్ద ఒకే ధనుస్సు గలదు. ఆయన అనేకబాణ ములను ఒకేసారి ప్రయోగించి కార్తవీర్యుని బాణములను ముక్కలు ముక్కలుగా చేసెను.

పునస్స్వహస్తైరచలాన్మృధేఽంఘ్రిపానుత్క్షిప్య వేగాదభిధావతో యుధి ।
భుజాన్ కుఠారేణ కఠోరనేమినా చిచ్ఛేద రామః ప్రసభం త్వహేరివ ।। 34

పునః - మరల, స్వహస్తైః - తన చేతులతో, అచలాన్ - పర్వత ములను, అంఘ్రిపాన్ - వృక్షములను, ఉత్క్షిప్య - పైకెత్తి, మృధే - యుద్ధ రంగమునందు, వేగాత్ - వేగముగా, అభిధావతః - అభిముఖముగా వేగ ముగా వచ్చుచున్న కార్తవీర్యుని, భుజాన్ - భుజములను, కఠోరనేమినా - వాడి అంచుగల, కుఠారేణ - గండ్ర గొడ్డలితో, రామః - రాముడు, యుధి - యుద్ధమునందు, ప్రసభమ్ - బలముగా, అహేః ఇవ - పాముయొక్క (పడగలను) వలె, చిచ్ఛేద - నరికెను.

యుద్ధరంగమునందు కార్తవీర్యుడు మరల తన చేతులతో పర్వత ములను, వృక్షములను ఊడబెరకి పైకెత్తి వేగముగా రామునకు ఎదురుగా పరుగెత్తి వచ్చుచుండెను. రాముడు యుద్ధములో ఆతని చేతులను, పాము పడగలను వలె, వాడియంచు గల గండ్ర గొడ్డలితో బలముగా నరికెను.

కృత్తబాహోశ్శిరస్తస్య గిరేశ్శృంగమివాహరత్ ।
హతే పితరి తత్పుత్రా అయుతం దుద్రువుర్భయాత్ ॥ 35

కృత్తబాహోః - తెగగొట్టబడిన చేతులు గల, తస్య - ఆ కార్తవీర్యు నియొక్క, శిరః - తలను, గిరేః - పర్వతముయొక్క, శృంగం ఇవ - శిఖర మును వలె, అహరత్ - ఊడగొట్టెను, పితరి - తండ్రి, హతే - సంహరించ బడగా, తత్-పుత్రాః - ఆయన పుత్రులు, అయుతమ్ - పదివేల మంది, భయాత్ - భయము వలన, దుద్రువుః - పరుగెత్తిరి.

రాముడు ఆ కార్తవీర్యుని చేతులను నరికి పర్వతశిఖరమువంటి తలను ఊడగొట్టెను. ఈ విధముగా తమ తండ్రి సంహరించబడగా, ఆతని పుత్రులు పదివేలమంది పారిపోయిరి.

అగ్నిహోత్రీముపావర్త్య సవత్సాం పరవీరహా ।
సముపేత్యాశ్రమం పిత్రే పరిక్లిష్టాం సమర్పయత్ ॥ 36

పరవీరహా - శత్రువీరులను సంహరించే రాముడు, సవత్సామ్ - దూడతో కూడియున్నట్టియు, పరిక్లిష్టామ్ - అధికమగు దుఃఖమును పొంది న, అగ్నిహోత్రీమ్ - హోమధేనువును, ఉపావర్త్య - మళ్లించి, ఆశ్రమమ్ - ఆశ్రమమును గురించి, సముపేత్య - చేరుకొని, పిత్రే - తండ్రి కొరకు, సమర్పయత్ - సమర్పించెను.

హోమధేనువు ఆశ్రమమునకు దూరమైనందులకు చాల దుఃఖ మును పొందియుండెను. శత్రువీరులను సంహరించిన రాముడు ఆ ధేను వును దూడతో సహా ఆశ్రమమునకు మళ్లించెను. ఆయన ఆశ్రమమును చేరుకొని ఆ ధేనువును తండ్రికి సమర్పించెను.

స్వకర్మ తత్కృతం రామః పిత్రే భ్రాతృభ్య ఏవ చ ।
వర్ణయామాస తచ్ఛ్రుత్వా జమదగ్నిరభాషత ॥ 37

రామః - రాముడు, తత్ - ఆ, కృతమ్ - చేయబడిన, స్వకర్మ - తన పనిని గురించి, పిత్రే - తండ్రి కొరకు, భ్రాతృభ్యః ఏవ చ - సోదరుల

కొరకు కూడ, వర్ణయామాస - వర్ణించెను, తత్ - దానిని, శ్రుత్వా - విని, జమదగ్నిః - జమదగ్ని, అభాషత - పలికెను.

రాముడు తాను చేసిన ఆ పనిని గురించి తండ్రికి మరియు సోదరులకు కూడ వర్ణించి చెప్పెను. ఆ విషయమును విని జమదగ్ని ఇట్లు పలికెను.

రామ రామ మహాబాహో భవాన్ పాపమకారషీత్ ।
అవధీన్నరదేవం యత్సర్వదేవమయం వృథా ।। 38

రామ - ఓ రామా!, రామ - ఓ రామా!, మహాబాహో - గొప్ప బాహువులు గలవాడా!, భవాన్ - నీవు, పాపమ్ - పాపమును, అకారషీత్ - చేసితివి, యత్ - ఏలయనగా, సర్వదేవమయమ్ - సకలదేవతాస్వరూపుడైన, నరదేవమ్ - నరపతిని, వృథా - వ్యర్థముగా, అవధీత్ - సంహరించితివి.

ఓ రామా! రామా! నీవు గొప్ప భుజశక్తి గలవాడవు. కాని, నీవు సకలదేవతాస్వరూపుడగు నరపతిని వ్యర్థముగా సంహరించి పాపమునే చేసితివి.

వయం హి బ్రాహ్మణాస్తాత క్షమయార్హణతాం గతాః ।
యయా లోకగురుర్దేవః పారమేష్ఠ్యమగాత్పదమ్ ।। 39

తాత - అబ్బాయీ!, బ్రాహ్మణాః - బ్రాహ్మణులమగు, వయం హి - మనమైతే, క్షమయా - సహనముచే, అర్హణతామ్ - పూజనీయత్వమును, గతాః - పొందువారము, యయా - ఏ సహనముచే, లోకగురుః - జగత్తులకు తండ్రియగు, దేవః - బ్రహ్మదేవుడు, పారమేష్ఠ్యమ్ - సర్వాతిశాయియగు, పదమ్ - లోకమును, అగాత్ - పొందెనో.

అబ్బాయీ! బ్రాహ్మణులమగు మనమైతే సహనముచే పూజనీయులమగుదుము. అట్టి సహనగుణముండుట చేతనే జగత్తును సృష్టించిన బ్రహ్మదేవుడు సర్వాతిశాయియగు సత్యలోకమును పొందినాడు.

క్షమయా రోచతే లక్ష్మీర్బ్రాహ్మీ సౌరీ యథా ప్రభా ।
క్షమిణామాశు భగవాంస్తుష్యతే హరిరీశ్వరః ।। 40

బ్రాహ్మీ - వేదవేత్తలకు చెందిన, లక్ష్మీః - శోభ, క్షమయా - సహనముచే, సౌరీ - సూర్యునకు చెందిన, ప్రభా యథా - కాంతి వలె, రోచతే - ప్రకాశించును, ఈశ్వరః - జగన్నాథుడగు, భగవాన్ హరిః - శ్రీహరి భగవానుడు, క్షమిణామ్ - సహనగుణము గలవారలకు, ఆశు - శీఘ్రముగా, తుష్యతే - ప్రీతుడగును.

వేదవేత్తల శోభ (సంపద) సహనగుణముచే సూర్యకాంతి వలె అధికముగా ప్రకాశించును (వర్ధిల్లును). జగన్నాథుడగు శ్రీహరి భగవానుడు సహనగుణము గలవారల యెడల శీఘ్రముగా ప్రీతుడగును.

రాజ్ఞో మూర్ధాభిషిక్తస్య వధో బ్రహ్మవధాద్గురుః ।
తీర్థసంసేవయా చాంహో జహ్యంగాచ్యుతచేతనః ।। 41

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే నవమస్కంధే పంచదశోఽధ్యాయః ।।

మూర్ధ-అభిషిక్తస్య - సామ్రాజ్యపట్టాభిషిక్తుడైన, రాజ్ఞః - మహారాజు యొక్క, వధః - వధ, బ్రహ్మవధాత్ - బ్రహ్మహత్యకంటె, గురుః - అధికపాపము, అచ్యుతచేతనః - అచ్యుతునియందు మనస్సు గలవాడవై, తీర్థసంసేవయా - పుణ్యక్షేత్రములను చక్కగా సేవించుట వలన, అంహః చ - పాపమును, జహి - పోగొట్టుకొనుము.

సామ్రాజ్యపట్టాభిషిక్తుడైన మహారాజును వధించుట బ్రహ్మహత్య కంటె ఎక్కువ పాపము. నీవు బుద్ధియందు అచ్యుతుని నిలిపి పుణ్యక్షేత్రములను సేవించి పాపమును పోగొట్టుకొనుము.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
పరశురామ కార్తవీర్యార్జునుల వృత్తాంతమును వర్ణించే
పదునైదవ అధ్యాయము ముగిసినది (15).



# అథ షోడశోఽధ్యాయః

## పరశురామ చరితము - శునశ్శేపోపాఖ్యానము

శ్రీశుక ఉవాచ।
పిత్రోపశిక్షితో రామస్తథేతి కురునందన ।
సంవత్సరం తీర్థయాత్రాం చరిత్వాఽఽశ్రమమావ్రజత్ ॥ 1

కురునందన - కురువంశమును ఆనందింప జేయువాడా!, రామః - పరశురాముడు, పిత్రా - తండ్రిచే, ఉపశిక్షితః - ఆదేశించబడినవాడై, తథా - అటులనే, ఇతి - అని, సంవత్సరమ్ - సంవత్సరమును, తీర్థయాత్రామ్ - తీర్థయాత్రను, చరిత్వా - సంచరించి, ఆశ్రమమ్ - ఆశ్రమమును గురించి, ఆవ్రజత్ - వచ్చెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- కురువంశము నానందింపజేసే ఓ పరీక్షిన్మహారాజా! తండ్రి ఈ విధముగా ఆదేశించగా, పరశురాముడు సరే యని పలికెను. అపుడాయన సంవత్సరకాలము నిరంతరముగా తీర్థస్థలములలో సంచరించి ఆశ్రమమునకు తిరిగి వచ్చెను.

కదాచిద్రేణుకా యాతా గంగాయాం పద్మమాలినమ్ ।
గంధర్వరాజం క్రీడంతమప్సరోభిరదృశ్యత ॥ 2

కదాచిత్ - ఒకనాడు, రేణుకా - రేణుకాదేవి, గంగాయామ్ - గంగానదీతీరమునందు, యాతా - వెళ్లినదై, పద్మమాలినమ్ - పద్మముల మాల కలిగినట్టియు, అప్సరోభిః - అప్సరసలతో గూడి, క్రీడంతమ్ - విహరించుచున్న, గంధర్వరాజమ్ - గంధర్వరాజగు చిత్రరథుని, అదృశ్యత - చూచెను.

ఒకనాడు రేణుక (పరశురాముని తల్లి) గంగానదీతీరమునకు వెళ్లెను. అచట ఆమెకు పద్మముల మాలను ధరించి అప్సరసలతో గూడి విహరిస్తున్న గంధర్వరాజు చిత్రరథుడు కనబడెను.

విలోకయంతీ క్రీడంతముదకార్థం నదీం గతా ।
హోమవేలాం న సస్మార కించిచ్చిత్రరథస్పృహా ॥ 3

ఉదక-అర్థమ్ - నీటికొరకై, నదీమ్ - నదిని గురించి, గతా - వెళ్లిన రేణుకాదేవి, క్రీడంతమ్ - విహరించుచున్న చిత్రరథుని, విలోకయంతీ - చూచుచున్నదై, కించిత్ - కొంచెము, చిత్రరథస్పృహా - చిత్రరథునియందు కోరిక గలదియై, హోమవేలామ్ - హోమసమయమును, న సస్మార - స్మరించలేదు.

నీటికొరకై గంగానదికి వెళ్లిన రేణుకాదేవి జలకాలాడుచున్న చిత్రరథుని చూస్తు భర్త హోమమునకు సమయమాసన్నమైనదనే సంగతిని విస్మరించెను. పైగా, ఆమెకు కొద్దిగా చిత్రరథునిపై కోరిక కూడ కలిగెను.

కాలాత్యయం తం విలోక్య మునేశ్శాపవిశంకితా ।
ఆగత్య కలశం తస్థౌ పురోధాయ కృతాంజలిః ॥ 4

తమ్ - ఆ, కాల-అత్యయమ్ - కాలము అతీతమగుటను, విలోక్య - గమనించి, మునేః - మహర్షియొక్క, శాపవిశంకితా - శాపము వలన భయపడినదియై, ఆగత్య - వచ్చి, కలశమ్ - కలశమును, పురోధాయ - ఎదురుగానుంచి, కృత-అంజలిః - దోసిలి యొగ్గినదై, తస్థౌ - నిలబడెను.

ఆ విధముగా కాలము అతీతమగుటను ఆమె గమనించి, జమదగ్ని మహర్షి శాపమునిచ్చునేమో యని భయపడెను. ఆమె తిరిగి వచ్చి నీటి కలశమును మహర్షి యెదుటనుంచి చేతులు జోడించి నమస్కరించి నిలబడెను.

వ్యభిచారం మునిర్జ్ఞాత్వా పత్న్యాః ప్రకుపితోఽబ్రవీత్ ।
ఘ్నతైనాం పుత్రకాః పాపామిత్యుక్తాస్తే న చక్రిరే ॥ 5

మునిః - జమదగ్ని మహర్షి, పత్న్యాః - భార్యయొక్క, వ్యభిచారమ్ - మనస్సులో పరపురుషుని కోరుటను, జ్ఞాత్వా - తెలుసుకొని, ప్రకుపితః - చాల కోపించినవాడై, అబ్రవీత్ - పలికెను, పుత్రకాః - ప్రియమగు పుత్రులారా!, పాపామ్ - పాపియగు, ఏనామ్ - ఈమెను, ఘ్నత - సంహరించుడు, ఇతి - అని, ఉక్తాః - చెప్పబడిన, తే - వారు, న చక్రిరే - చేయలేదు.

జమదగ్ని మహర్షికి తన భార్య మానసికముగా పరపురుషుని కోరినదని తెలిసిపోయెను. ఆయన తీవ్రముగా కోపించి, ప్రియమగు పుత్రులారా! ఈ పాపిని సంహరించుడు, అని ఆదేశించెను. కాని, వారా ఆదేశమును పాటించలేదు.

రామస్సంచోదితః పిత్రా భ్రాతౄన్మాత్రా సహావధీత్ ।
ప్రభావజ్ఞో మునేస్సమ్యక్ సమాధేస్తపసశ్చ సః ।। 6

పిత్రా - తండ్రిచే, సంచోదితః - ఆదేశించబడిన, రామః - పరశురాముడు, భ్రాతౄన్ - సోదరులను, మాత్రా సహ - తల్లితో బాటుగా, అవధీత్ - సంహరించెను, సః - ఆయన, మునేః - మహర్షియొక్క, సమాధేః - సమాధియొక్క, తపసః చ - తపస్సుయొక్క కూడ, సమ్యక్ - బాగా, ప్రభావజ్ఞః - ప్రభావమును తెలిసినవాడు.

తండ్రియగు జమదగ్ని ఆజ్ఞాపించగా పరశురాముడు తల్లిని, సోదరులను కూడ సంహరించెను. ఎందుకంటే, జమదగ్ని మహర్షికి ఉన్న యోగ-తపశ్శక్తుల ప్రభావమును ఆయన బాగా యెరుగును.

వరేణ చ్ఛందయామాస ప్రీతస్సత్యవతీసుతః ।
వవ్రే హతానాం రామోఽపి జీవితం చాస్మృతిం వధే ।। 7

సత్యవతీసుతః - సత్యవతియొక్క పుత్రుడగు జమదగ్ని, ప్రీతః - ప్రీతిని చెందినవాడై, వరేణ ఛందయామాస - వరమును కోరుకొమ్మని ప్రోత్సహించెను, రామః అపి - పరశురాముడు కూడ, హతానామ్ - సంహరించబడినవారియొక్క, జీవితమ్ - జీవితమును, వధే - సంహరించ

బడిన విషయమునందు, అస్మృతిం చ - స్మరణము లేకుండుటను కూడ, వవ్రే - వరముగా కోరెను.

సత్యవతీపుత్రుడగు జమదగ్ని చాల సంతోషించి పరశు రాముని వరమును కోరుమని ప్రోత్సహించెను. మరణించిన తల్లి, సోదరులు తిరిగి జీవించవలెననియు, వారికి తాము సంహరించబడితిమనే స్మృతి ఉండకూడదనియు ఆయన వరమును కోరెను.

ఉత్తస్థుస్తే కుశలినో నిద్రాపాయ ఇవాంజసా ।
పితుర్విద్వాంస్తపోవీర్యం రామశ్చక్రే సుహృద్వధమ్ ॥ 8

తే - వారు, కుశలినః - క్షేమము గలవారై, నిద్రా-అపాయే ఇవ - నిద్ర తొలగినప్పుడు వలె, అంజసా - అనాయాసముగా, ఉత్తస్థుః - లేచి నిలబడిరి, పితుః - తండ్రియొక్క, తపః-వీర్యమ్ - తపశ్శక్తిని, విద్వాన్ - తెలిసిన, రామః - పరశు రాముడు, సుహృద్-వధమ్ - తాను ప్రేమించిన వారి సంహారమును, చక్రే - చేసెను.

వారు నిద్రనుండి లేచినారా యన్నట్లు అనాయాసముగా క్షేమముగా లేచి నిలుచుండిరి. తండ్రియొక్క తపశ్శక్తి తెలిసినవాడగుట చేతనే పరశురాముడు తాను ప్రేమించే తల్లిని, సోదరులను సంహరించెను.

యేఽర్జునస్య సుతా రాజన్ స్మరంతస్స్వపితుర్వధమ్ ।
రామవీర్యపరాభూతా లేభిరే శర్మ న క్వచిత్ ॥ 9

రాజన్ - ఓ రాజా!, అర్జునస్య - కార్తవీర్యార్జునునియొక్క, యే - ఏ, సుతాః - పుత్రులు గలరో, రామవీర్యపరాభూతాః - పరశు రాముని పరాక్రమముచే పరాజితులైన వారు, స్వపితుః - తమ తండ్రియొక్క, వధమ్ - వధను గురించి, స్మరంతః - స్మరించుచున్నవారై, క్వచిత్ - ఎక్కడనైననూ, శర్మ - సుఖమును, న లేభిరే - పొందలేదు.

ఓ పరీక్షిన్మహారాజా! కార్తవీర్యార్జునుని పుత్రులను పరశురాముడు పరాజితులను చేసెను గదా! వారు తమ తండ్రియొక్క వధను స్మరిస్తూ ఎక్కడనైననూ సుఖమును పొందలేకపోయిరి.

ఏకదాఽఽశ్రమతో రామే సభ్రాతరి వనం గతే ।
వైరం సిసాధయిషవో లబ్ధచ్ఛిద్రా ఉపాగమన్ ॥ 10

ఏకదా - ఒకనాడు, సభ్రాతరి - సోదరులతో కూడియున్న, రామే - పరశురాముడు, వనమ్ - అడవిని గురించి, గతే - వెళ్లగా, వైరమ్ - వైరమును, సిసాధయిషవః - సాధించగోరువారై, లబ్ధచ్ఛిద్రాః - లభించిన వివరము (అవకాశము) గలవారై, ఉపాగమన్ - వచ్చి పడిరి.

ఒకనాడు పరశురాముడు సోదరులతో గూడి అడవికి వెళ్లెను. దానిని అవకాశముగా చేసుకొని కార్తవీర్యుని పుత్రులు తమ పాత వైరమును సాధించగోరి ఆశ్రమమునకు వచ్చి పడిరి.

దృష్ట్వాగ్న్యగార ఆసీనమావేశితధియం మునిమ్ ।
భగవత్యుత్తమశ్లోకే జఘ్నుస్తే పాపనిశ్చయాః ॥ 11

పాపనిశ్చయాః - పాపకర్మయందే నిశ్చయము గల, తే - వారు, అగ్ని-అగారే - అగ్నిహోత్ర గృహమునందు, ఆసీనమ్ - కూర్చున్నట్టియు, ఉత్తమశ్లోకే - పవిత్రకీర్తియగు, భగవతి - శ్రీహరి భగవానునియందు, ఆవేశితధియమ్ - లగ్నము చేయబడిన అంతఃకరణము గల, మునిమ్ - జమదగ్ని మహర్షిని, దృష్ట్వా - చూచి, జఘ్నుః - సంహరించిరి.

జమదగ్ని మహర్షి అగ్నిహోత్ర గృహములో కూర్చుండి అంతఃకరణమును పవిత్రకీర్తియగు శ్రీహరి భగవానునిపై నిలిపి యుంచెను. పాపకర్మను చేయుటకే నిశ్చయించుకున్న ఆ కార్తవీర్యుని పుత్రుల కంట ఆయన పడెను. వారాయనను సంహరించిరి.

యాచ్యమానాః కృపణయా రామమాత్రాఽతిదారుణాః ।
ప్రసహ్య శిర ఉత్కృత్య నిన్యుస్తే క్షత్రబంధవః ॥ 12

కృపణయా - దీనురాలగు, రామమాత్రా - పరశురాముని తల్లిచే, యాచ్యమానాః - యాచించబడుచున్నవారు, అతిదారుణాః - మిక్కిలి క్రూరులు అగు, తే - ఆ, క్షత్రబంధవః - క్షత్రియాధములు, ప్రసహ్య -

బలాత్కారముగా, శిరః - తలను, ఉత్కృత్య - నరికి, నిన్యుః - తీసుకుపో యిరి.

ఆ క్షత్రియాధములు మిక్కిలి క్రూరులు. పరశురాముని తల్లియగు రేణుక దీనముగా బ్రతిమిలాడిననూ, వారు వినిపించుకోలేదు. వారు ఆ జమదగ్ని తలను బలాత్కారముగా నరికి తమతో తీసుకుపోయిరి.

రేణుకా దుఃఖశోకార్తా నిఘ్నంత్యాత్మానమాత్మనా ।
రామ రామేహి తాతేతి విచుక్రోశోచ్చకైస్సతీ ॥ 13

దుఃఖశోక-ఆర్తా - శారీరక మానస వ్యథలచే పీడించబడినది, సతీ - పతివ్రత అగు, రేణుకా - రేణుక, ఆత్మానమ్ - తనను, ఆత్మనా - తన చే, నిఘ్నంతీ - కొట్టుకొనుచున్నదై, రామ - ఓ రామా!, రామ - ఓ రామా!, ఏహి - రమ్ము, తాత - ఓ పుత్రా!, ఇతి - అని, ఉచ్చైః - బిగ్గరగా, విచుక్రోశ - ఆక్రోశించెను.

పతివ్రతయగు రేణుకాదేవి శారీరక మానసిక వ్యథలచే పీడించబ డుతూ తన గుండెలపై తానే బాదుకుంటూ, ఓ పుత్రా! రామా! రామా! రమ్ము, అని బిగ్గరగా ఆక్రోశించెను.

తదుపశ్రుత్య దూరస్థో హా రామేత్యార్తవత్స్వనమ్ ।
త్వరయాఽఽశ్రమమాసాద్య దదృశే పితరం హతమ్ ॥ 14

దూరస్థః - ధూరమునందున్న పరశురాముడు, రామ - ఓ రామా!, ఇతి - అనే, తత్ - ఆ, ఆర్తవత్-స్వనమ్ - పీడను సూచించే ధ్వని ని, ఉపశ్రుత్య - విని, త్వరయా - వేగముతో, ఆశ్రమమ్ - ఆశ్రమమును గురించి, ఆసాద్య - చేరుకొని, హతమ్ - సంహరించబడిన, పితరమ్ - తండ్రిని, దదృశే - చూచెను.

పరశురాముడు ఆశ్రమమునకు దూరమునందుండగనే ఓ రామా! అనే ఆక్రందనమును వినెను. ఆ ఆక్రందనములో దుఃఖము మిళితమై యుండెను. దానిని విని ఆయన వేగముగా ఆశ్రమమును చేరెను. ఆయ నకు సంహరించబడిన తన తండ్రి కనబడెను.

తద్దుఃఖరోషామర్షాతిశోకవేగవిమోహితః ।
హా తాత సాధో ధర్మిష్ఠ త్యక్త్వాఽస్మాన్ స్వర్గతో భవాన్ ।। 15

తత్ - అప్పుడు, దుఃఖరోష-అమర్ష-అతిశయశోకవేగవిమోహితః - శరీరపీడ ఉక్రోషము కోపము అధికమగు మానసికదుఃఖము అనువాటి వేగముచే వ్యామోహితుడైనవాడు, హా - అయ్యో!, తాత - తండ్రీ!, సాధో - సాధుపురుషా!, ధర్మిష్ఠ - ధర్మమునందు నిష్ఠ గలవాడా!, అస్మాన్ - మమ్ములను, త్యక్త్వా - విడిచిపెట్టి, భవాన్ - తమరు, స్వర్గతః - స్వర్గమును చేరినారు.

అప్పుడు శరీరపీడ, ఉక్రోషము, అధికమగు మానసిక దుఃఖము అనువాటి వేగముచే పరశు రాముడు వ్యామోహితుడాయెను. ఆయన ఇట్లు విలపించెను --- అయ్యో! ఓ తండ్రీ! నీవు ధర్మమునందు నిష్ఠగల సాధు పురుషుడవు. నీవు మమ్ములను విడిచిపెట్టి స్వర్గమును చేరితివి.

విలప్యైవం పితుర్దేహం నిధాయ భ్రాతృషు స్వయమ్ ।
ప్రగృహ్య పరశుం రామః క్షత్రాంతాయ మనో దధే ।। 16

ఏవమ్ - ఈ విధముగా, విలప్య - విలపించి, పితుః - తండ్రియొక్క, దేహమ్ - దేహమును, భ్రాతృషు - సోదరులయందు, నిధాయ - అప్పజెప్పి, స్వయమ్ - తాను, పరశుమ్ - గండ్ర గొడ్డలిని, ప్రగృహ్య - పట్టుకొని, రామః - రాముడు, క్షత్ర-అంతాయ - క్షత్రియుల నాశము కొరకు, మనః - మనస్సును, దధే - దృఢము చేసెను.

పరశు రాముడు ఈ విధముగా విలపించి, తండ్రి దేహమును సోదరులకు అప్పజెప్పి, తాను గండ్ర గొడ్డలిని పట్టుకొని, క్షత్రియులను వినాశము చేయుటకు నిశ్చయించుకొనెను.

గత్వా మాహిష్మతీం రామో బ్రహ్మఘ్నవిహతశ్రియమ్ ।
తేషాం స శీర్షభీ రాజన్ మధ్యే చక్రే మహాగిరిమ్ ।। 17

తద్రక్తేన నదీం ఘోరామబ్రహ్మణ్యభయావహామ్ ।

రాజన్ - ఓ రాజా!, బ్రహ్మఘ్నవిహతశ్రియమ్ - బ్రహ్మహత్య చేసిన రాజకుమారుల కారణముగా నష్టమైన శోభ గల, మాహిష్మతీమ్ - మాహిష్మతీ నగరమును గురించి, గత్వా - వెళ్లి, రామః - పరశు రాముడు, తేషామ్ - వారియొక్క, శీర్షభిః - తలలతో, మధ్యే - మధ్యయందు, మహాగిరిమ్ - పెద్ద పర్వతమును, తద్-రక్తేన - వారి రక్తముతో, అబ్రహ్మణ్యభయ-ఆవహామ్ - బ్రహ్మద్రోహులకు భయమును గొల్పే, ఘోరామ్ - ఘోరమైన, నదీమ్ - నదిని, చక్రే - చేసెను.

ఓ పరీక్షిన్మహారాజా! బ్రహ్మహత్య చేసిన రాజకుమారుల నిమిత్తముగా మాహిష్మతీ నగరముయొక్క శోభ నష్టమయ్యెను. పరశు రాముడు ఆ రాజకుమారుల తలలతో నగరమధ్యములో పెద్ద పర్వతమును నిలబెట్టి, వారి రక్తముతో ఘోరమైన నదిని నిర్మాణము చేసెను.

హేతుం కృత్వా పితృవధం క్షత్రేऽమంగలకారిణి ॥ 18

త్రిస్సప్తకృత్వః పృథివీం కృత్వా నిఃక్షత్రియాం ప్రభుః ।
సమంతపంచకే చక్రే శోణితోదాన్ హ్రదాన్నృప ॥ 19

నృప - ఓ రాజా!, క్షత్రే - క్షత్రియుడు, అమంగలకారిణి - అత్యాచారమును చేయువాడు కాగా, పితృవధమ్ - తండ్రిని వధించుటను, హేతుమ్ - నిమిత్తముగా, కృత్వా - చేసి, ప్రభుః - సర్వసమర్థుడగు పరశు రాముడు, త్రిః-సప్తకృత్వః - ఇరవై ఒక్క పర్యాయములు, పృథివీమ్ - భూలోకమును, నిఃక్షత్రియామ్ - క్షత్రియులు లేనిదానినిగా, కృత్వా - చేసి, సమంతపంచకే - సమంతపంచకమునందు, శోణిత-ఉదాన్ - రక్తమే నీరుగా గల, హ్రదాన్ - సరస్సులను, చక్రే - చేసెను.

ఓ పరీక్షిన్మహారాజా! క్షత్రియులు అత్యాచారములను చేయుచుండెను. అప్పుడు సర్వసమర్థుడగు పరశు రాముడు తన తండ్రి వధను నిమిత్తముగా చేసుకొని, ఇరవై ఒక్క పర్యాయములు భూమిపై క్షత్రియులు లేకుండా చేసెను. ఆయన కురుక్షేత్రమునందలి సమంతపంచకమునందు వారి రక్తజలముతో నిండియున్న అయిదు సరస్సులను నిర్మించెను.

పితుః కాయేన సంధాయ శిర ఆదాయ బర్హిషి ।
సర్వదేవమయం దేవమాత్మానమయజన్మఖైః ।। 20

పితుః - తండ్రియొక్క, శిరః - తలను, ఆదాయ - తీసుకువచ్చి, బర్హిషి - దర్భయందు, కాయేన - మొండెముతో, సంధాయ - అతికించి, సర్వదేవమయమ్ - సకలదేవతారూపుడైనట్టియు, ఆత్మానమ్ - తానే అయి ఉన్న, దేవమ్ - దేవుని, మఖైః - యజ్ఞముల ద్వారా, అయజత్ - ఆరాధించెను.

ఆయన తండ్రి తలను తెచ్చి దర్భలయందు మొండెముతో అతికించెను. ఆయన తానే యగు సకలదేవతాస్వరూపుడైన శ్రీహరి భగవానుని యజ్ఞములతో ఆరాధించెను.

దదౌ ప్రాచీం దిశం హోత్రే బ్రహ్మణే దక్షిణాం దిశమ్ ।
అధ్వర్యవే ప్రతీచీం వై ఉద్గాత్రే ఉత్తరాం దిశమ్ ।। 21

ప్రాచీం దిశమ్ - తూర్పు దిక్కును, హోత్రే - హోత కొరకు, దక్షిణాం దిశమ్ - దక్షిణ దిక్కును, బ్రహ్మణే - బ్రహ్మకు, ప్రతీచీం వై - పడమర దిక్కును, అధ్వర్యవే - అధ్వర్యుని కొరకు, ఉత్తరాం దిశమ్ - ఉత్తర దిక్కును, ఉద్గాత్రే - ఉద్గాత కొరకు, దదౌ - ఇచ్చెను.

ఆయన తూర్పు దిక్కును హోతకు, దక్షిణ దిక్కును బ్రహ్మకు, పడమర దిక్కును అధ్వర్యునకు, ఉత్తర దిక్కును ఉద్గాతకు ఇచ్చెను.

అన్యేభ్యోఽవాంతరదిశః కశ్యపాయ చ మధ్యతః ।
ఆర్యావర్తముపద్రష్ట్రే సదస్యేభ్యస్తతః పరమ్ ।। 22

అన్యేభ్యః - ఇతరులగు ఋత్విక్కుల కొరకు, అవాంతరదిశః - విదిక్కులను, చ - మరియు, కశ్యపాయ - కశ్యపుని కొరకు, మధ్యతః - మధ్యదేశమును, ఉపద్రష్ట్రే - ఉపద్రష్ట కొరకు, ఆర్యావర్తమ్ - ఆర్యావర్తమును, సదస్యేభ్యః - సభాసదుల కొరకు, తతః - ఆ మధ్యభాగమునుండి, పరమ్ - పైనున్న భాగమును.

ఆయన ప్రస్తోత మొదలగు ఇతరులైన ఋత్విక్కులకు ఆగ్నేయము మొదలగు విదిక్కులను, కశ్యపునకు మధ్యభాగమును, యజ్ఞములోని హెచ్చుతగ్గులను సర్దుబాటు చేసే ఉపద్రష్టకు ఆర్యావర్తమును, యజ్ఞములను చూచే సభాసదులకు మధ్యభాగము తరువాత ఉన్న భూభాగమును ఇచ్చెను.

తతశ్చావభృథస్నానవిధూతాశేషకిల్బిషః ।
సరస్వత్యాం బ్రహ్మనద్యాం రేజే వ్యభ్ర ఇవాంశుమాన్ ॥ 23

తతః చ - తరువాత, అవభృథస్నానవిధూత-అశేషకిల్బిషః - అవభృథస్నానముచే కడిగివేయబడిన సకలదోషములు గల రాముడు, బ్రహ్మనద్యామ్ - వేదరూపిణియగు నదియైన, సరస్వత్యామ్ - సరస్వతియందు, వి-అభ్రః - తొలగిన మేఘములు గల, అంశుమాన్ ఇవ - సూర్యుడు వలె, రేజే - ప్రకాశించెను.

తరువాత ఆయన వేదరూపిణియగు సరస్వతీనదియందు అవభృథస్నానమును చేసి సకలపాపములనుండి వినిర్ముక్తుడాయెను. ఆ నదీతీరమున ఆయన మేఘములు తొలగిపోయిన సూర్యుడు వలె ప్రకాశించెను.

స్వదేహం జమదగ్నిస్తు లబ్ధ్వా సంజ్ఞానలక్షణమ్ ।
ఋషీణాం మండలే సోఽభూత్సప్తమో రామపూజితః ॥ 24

సః - ఆ, జమదగ్నిః తు - జమదగ్నియైతే, సంజ్ఞానలక్షణమ్ - స్మరణము లక్షణముగా గల, స్వదేహమ్ - తన దేహమును, లబ్ధ్వా - పొంది, రామపూజితః - పరశురామునిచే పూజించబడినవాడై, ఋషీణామ్ - మహర్షుల, మండలే - మండలమునందు, సప్తమః - ఏడవవాడు, అభూత్ - ఆయెను.

ఆ జమదగ్నికి స్మరణరూపము (సంకల్పమయము) అగు దేహము లభించెను. ఆయన పరశురాముని పూజలనందుకొని, సప్తర్షిమండలములో ఏడవ మహర్షి ఆయెను.

జామదగ్న్యోఽపి భగవాన్ రామః కమలలోచనః ।
ఆగామిన్యంతరే రాజన్ వర్తయిష్యతి వై బృహత్ ॥ 25

రాజన్ - ఓ రాజా!, జామదగ్న్యః - జమదగ్ని పుత్రుడు, భగవాన్ - భగవానుడు, కమలలోచనః - కలువ కన్నులవాడు అగు, రామః అపి - పరశురాముడు కూడ, ఆగామిని - రాబోయే, అంతరే - మన్వంతరమునందు, బృహత్ - వేదమును, వై - నిశ్చయముగా, వర్తయిష్యతి - ప్రవర్తిల్ల జేయగలడు.

ఓ పరీక్షిన్మహారాజా! జమదగ్ని పుత్రుడు, కలువ కన్నులవాడు అగు పరశురామ భగవానుడు రాబోయే (సావర్ణి) మన్వంతరములో వేదములను నిశ్చయముగా ప్రవర్తిల్ల జేసే మహర్షి (వేదాచార్యుడు) కాగలడు.

ఆస్తేఽద్యాపి మహేంద్రాద్రౌ న్యస్తదండః ప్రశాంతధీః ।
ఉపగీయమానచరితస్సిద్ధగంధర్వచారణైః ॥ 26

అద్య అపి - ఈ నాటికీ, మహేంద్ర-అద్రౌ - మహేంద్ర పర్వతమునందు, ఆస్తే - ఉన్నాడు, న్యస్తదండః - త్యజించబడిన శిక్షించుట గలవాడు, ప్రశాంతధీః - ప్రసన్నమైన అంతఃకరణము గలవాడు, సిద్ధగంధర్వచారణైః - సిద్ధులచే గంధర్వులచే మరియు చారణులచే, ఉపగీయమానచరితః - కీర్తించబడే చరితము గలవాడు.

పరశురాముడు ఈ నాటికి మహేంద్ర పర్వతముపై ఉన్నాడు. ఆయన ఇతరులను శిక్షించుట మొదలైన హింసను విడనాడి, ప్రసన్నమగు అంతఃకరణమును కలిగియున్నాడు. సిద్ధులు, గంధర్వులు, చారణులు ఆయన చరితమును కీర్తించుచుందురు.

ఏవం భృగుషు విశ్వాత్మా భగవాన్ హరిరీశ్వరః ।
అవతీర్య పరం భారం భువోఽహన్ బహుశో నృపాన్ ॥ 27

విశ్వ-ఆత్మా - జగత్తుయొక్క ఆత్మ, ఈశ్వరః - జగన్నాథుడు అగు, భగవాన్ హరిః - శ్రీహరి భగవానుడు, ఏవమ్ - ఈ విధముగా, భృగుషు - భృగువంశీయులయందు, అవతీర్య - అవతరించి, భువః -

భూమికి, పరమ్ - అధికమగు, భారమ్ - భారమైన, నృపాన్ - రాజులను, బహుశః - అనేకులను, అహన్ - సంహరించెను.

జగద్రూపుడు, జగత్తునకు ఆత్మ, జగన్నాథుడు అగు శ్రీహరి భగవానుడు ఈ విధముగా భృగువంశీయులయందు పరశురాముడై అవతరించి, భూమికి పెద్ద భారముగా తయారైన అనేక మహారాజులను సంహరించెను.

గాధేరభూన్మహాతేజాస్సమిద్ధ ఇవ పావకః ।
తపసా క్షాత్రముత్సృజ్య యో లేభే బ్రహ్మవర్చసమ్ ।। 28

గాధేః - గాధికి, సమిద్ధః - చక్కగా ప్రజ్వరిల్ల జేయబడిన, పావకః ఇవ - అగ్నివంటి, మహాతేజాః - గొప్ప తేజశ్శాలి, అభూత్ - కలిగెను, యః - ఏ పుత్రుడైతే, తపసా - తపస్సుచే, క్షాత్రమ్ - క్షత్రియత్వమును, ఉత్సృజ్య - విడిచిపెట్టి, బ్రహ్మవర్చసమ్ - బ్రహ్మవర్చస్సును, లేభే - పొందెనో.

గాధియొక్క పుత్రుడు విశ్వామిత్రుడు. చక్కగా ప్రజ్వరిల్ల జేయబడిన అగ్నివలె ఆయన గొప్ప తేజశ్శాలి. ఆయన తపస్సుయొక్క ప్రభావముచే తన క్షత్రియత్వమును విడిచిపెట్టి బ్రహ్మవర్చస్సును పొందెను.

విశ్వామిత్రస్య చైవాసన్ పుత్రా ఏకశతం నృప ।
మధ్యమస్తు మధుచ్ఛందా మధుచ్ఛందస ఏవ తే ।। 29

నృప - ఓ రాజా!, విశ్వామిత్రస్య చ ఏవ - విశ్వామిత్రునకు, ఏకశతమ్ - వంద ఒక్కమంది, పుత్రాః - పుత్రులు, ఆసన్ - ఉండిరి, మధ్యమః తు - మధ్యముడైతే, మధుచ్ఛందాః - మధుచ్ఛందసుడు, తే - వారు, మధుచ్ఛందసః ఏవ - మధుచ్ఛందసులే.

ఓ పరీక్షిన్మహారాజా! విశ్వామిత్రునకు నూటొక్కమంది పుత్రులు గలరు. వీరిలో మధ్యవాడు మధుచ్ఛందసుడు. వారందరు అదే పేరుతో మధుచ్ఛందసులు అనియే ప్రసిద్ధి గాంచిరి.

పుత్రం కృత్వా శునశ్శేపం దేవరాతం చ భార్గవమ్ ।
ఆజీగర్తం సుతానాహ జ్యేష్ఠ ఏష ప్రకల్ప్యతామ్ ॥ 30

భార్గవమ్ - భృగువంశీయుడైనట్టియు, ఆజీగర్తమ్ - అజీగర్తుని పుత్రుడైనట్టియు, దేవరాతమ్ - దేవరాతుడనే పేరు గల, శునశ్శేపమ్ - శునశ్శేపుని, పుత్రమ్ - పుత్రునిగా, కృత్వా చ - చేసి, పుత్రాన్ - పుత్రుల నుద్దేశించి, ఆహ - పలికెను, ఏషః - ఈతడు, జ్యేష్ఠః - జ్యేష్ఠుడుగా, ప్రక ల్ప్యతామ్ - చేయబడుగాక!

విశ్వామిత్రుడు భృగువంశీయుడగు శునశ్శేపుని తన పుత్రునిగా చేసుకొనెను. అజీగర్తుని పుత్రుడైన ఆ శునశ్శేపునకే దేవరాతుడు (దేవత లచే ఈయబడినవాడు) అనియు పేరు గలదు. విశ్వామిత్రుడు తన పుత్రు లను ఆ శునశ్శేపుని అన్నగా చేసుకొనుడని ఆదేశించెను.

యో వై హరిశ్చంద్రమఖే విక్రీతః పురుషః పశుః ।
స్తుత్వా దేవాన్ ప్రజేశాదీన్ ముముచే పాశబంధనాత్ ॥ 31

యః వై - ఏ శునశ్శేపుడైతే, హరిశ్చంద్రమఖే - హరిశ్చంద్రుని యొక్క యజ్ఞమునందు, విక్రీతః - అమ్మివేయబడిన, పురుషః - పురుష రూపుడైన, పశుః - పశువై, ప్రజా-ఈశ-ఆదీన్ - బ్రహ్మగారు మొదలైన, దేవాన్ - దేవతలను, స్తుత్వా - స్తుతించి, పాశబంధనాత్ - పాశముల బంధమునుండి, ముముచే - విముక్తుడయ్యెనో.

హరిశ్చంద్రుని యజ్ఞమునకు పురుషపశువుగా శునశ్శేపుని ఆతని తల్లిదండ్రులు అమ్మివేసిరి. అపుడాయన బ్రహ్మగారు మొదలైన దేవతలను స్తుతించి (యూపమునకు కట్టివేసిన) పాశముల బంధమునుండి విముక్తుడా యెను.

యో రాతో దేవయజనే దేవైర్గాధిషు తాపసః ।
దేవరాత ఇతి ఖ్యాతశ్శునశ్శేపస్స భార్గవః ॥ 32

యః - ఎవడైతే, దేవయజనే - వరుణయజ్ఞమునందు, దేవైః - దేవతలచే, రాతః - ఈయబడినవాడో, గాధిషు - గాధివంశీయులయందు,

దేవరాతః - దేవరాతుడు, ఇతి - అని, ఖ్యాతః - కీర్తించబడినాడో, తాపసః - తపోనిష్ఠుడు, భార్గవః - భృగువంశీయుడు అగు, సః - ఆతడే, శునశ్శేపః - శునశ్శేపుడు.

(హరిశ్చంద్రుని) వరుణయజ్ఞమునందు దేవతలు భృగువంశీయుడగు శునశ్శేపుని విముక్తుని చేసిరి. కావుననే, ఆయన గాధివంశీయులలో దేవరాతుడు (దేవలతలచే ఈయబడినవాడు) అని ప్రఖ్యాతిని గాంచినాడు.

యే మధుచ్ఛందసో జ్యేష్ఠాః కుశలం మేనిరే న తత్ ।
అశపత్తాన్మునిః క్రుద్ధో మ్లేచ్ఛా భవత దుర్జనాః ॥ 33

జ్యేష్ఠాః - పెద్దవారైన, యే - ఏ, మధుచ్ఛందసః - మధుచ్ఛందసులు గలరో వారు, తత్ - దానిని, కుశలమ్ - మంచి పనిగా, న మేనిరే - తలచలేదు, క్రుద్ధః - కోపించిన, మునిః - విశ్వామిత్ర మహర్షి, తాన్ - వారిని, అశపత్ - శపించెను, దుర్జనాః - ఓ దుష్టులారా!, మ్లేచ్ఛాః - మ్లేచ్ఛులు, భవత - కండు.

మధుచ్ఛందసులలో పెద్దవారైన ఏబై మందికి శునశ్శేపుడు తమకు జ్యేష్ఠుడగుట మంచిది అనిపించలేదు. వారు అందుకు అంగీకరించలేదు. అప్పుడు విశ్వామిత్ర మహర్షి కోపించి వారిని, ఓరీ దుష్టులారా! మీరు మ్లేచ్ఛులు కండు, అని శపించెను.

స హోవాచ మధుచ్ఛందాస్సార్ధం పంచాశతా తతః ।
యన్నో భవాన్ సంజానీతే తస్మింస్తిష్ఠామహే వయమ్ ॥ 34

తతః - తరువాత, సః - ఆ, మధుచ్ఛందాః - మధుచ్ఛందసుడు, పంచాశతా సార్ధమ్ - ఏబై మందితో గూడి, ఉవాచ హ - పలికెనట, భవాన్ - తమరు, నః - మాకు, యత్ - దేనినైతే, సంజానీతే - ఆజ్ఞాపించెదరో, తస్మిన్ - దానియందు, వయమ్ - మేము, తిష్ఠామహే - నిలిచి యుండెదము.

తరువాత మధుచ్ఛందసుడనే ఆ మధ్యముడు ఏబైమంది కనిష్ఠులతో గూడి విశ్వామిత్ర మహర్షితో ఇట్లు పలికెను -- తమరు మాకు దేనిని

ఆజ్ఞాపిస్తే (శునశ్శేపుని జ్యేష్ఠునిగా స్వీకరించుట), దానియందు మేము నిలిచి యుండెదము.

జ్యేష్ఠం మంత్రదృశం చక్రుస్త్వామన్వంచో వయం స్మ హి ।
విశ్వామిత్రస్సుతానాహ వీరవంతో భవిష్యథ ।
యే మానం మేఽనుగృహ్ణంతో వీరవంతమకర్త మామ్ ॥ 35

జ్యేష్ఠమ్ - పెద్దవాడగు శునశ్శేపుని, మంత్రదృశమ్ - మంత్రద్రష్ట నుగా, చక్రుః - చేసిరి, వయమ్ - మేము, త్వామ్ - నిన్ను, అన్వంచః స్మ హి - అనుసరించువారలము, విశ్వామిత్రః - విశ్వామిత్ర మహర్షి, సుతాన్ - ఆ పుత్రులనుద్దేశించి, ఆహ - పలికెను, వీరవంతః - మంచి పుత్రులు గలవారలు, భవిష్యథ - కాగలరు, యే - ఏ మీరైతే, మే - నాయొక్క, మానమ్ - మర్యాదను, అనుగృహ్ణంతః - పాలించువారై, మామ్ - నన్ను, వీరవంతమ్ - యోగ్యులగు పుత్రులు గలవానినిగా, అకర్త - చేసితిరో.

వారు మంత్రద్రష్టయగు శునశ్శేపుని పెద్ద అన్ననుగా స్వీకరించి, మేము నీ అనుయాయులము అని ఆయనతో చెప్పిరి. ఆ తన పుత్రులను ద్దేశించి విశ్వామిత్ర మహర్షి ఇట్లు పలికెను -- మీరు నా మర్యాదను పాలించి నన్ను యోగ్యులగు పుత్రులు గలవానినిగా చేసిరి. కావున, మీకు కూడ యోగ్యులగు పుత్రులు కలిగెదరు.

ఏష వః కుశికా వీరో దేవరాతస్తమన్వితః ।
అన్యే చాష్టకహారీతజయక్రతుమదాదయః ॥ 36

కుశికాః - కుశవంశీయులారా!, ఏషః - ఈ, వీరః - వీరుడు (యోగ్యపుత్రుడు) అగు, దేవరాతః - దేవరాతుడనే శునశ్శేపుడు, వః - మీవాడు, తమ్ - వానిని, అన్విత - అనుసరించుడు, అష్టకహారీతజయక్రతుమద్ -ఆదయః - అష్టకుడు హారీతుడు జయుడు క్రతుమంతుడు మొదలగువారలు, అన్యే చ - ఇతరులు కూడ.

కుశవంశీయులగు ఓ పుత్రులారా! దేవరాతుడనే ఈ శునశ్శేపుడు నాకు యోగ్యుడైన పుత్రుడు, మీ గోత్రమునకు చెందిన కుశికుడే -- అని

విశ్వామిత్రుడు పలికెను. విశ్వామిత్రునకు అష్టకుడు, హారీతుడు, జయుడు, క్రతుమంతుడు, గాలవుడు మొదలగు ఇతరపుత్రులు కూడ గలరు.

ఏవం కౌశికగోత్రం తు విశ్వామిత్రైః పృథగ్విధమ్ ।
ప్రవరాంతరమాపన్నం తద్ధి చైవం ప్రకల్పితమ్ ॥ 37

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం
నవమస్కంధే షోడశోऽధ్యాయః ॥

ఏవమ్ - ఈ విధముగా, విశ్వామిత్రైః - విశ్వామిత్రుని పుత్రుల చే, కౌశికగోత్రం తు - కౌశికగోత్రమైతే, పృథగ్-విధమ్ - నానాప్రకారము లు గలది, ప్రవర-అంతరమ్ - మరియొక ప్రవరను, ఆపన్నమ్ - పొందిన ది, తత్ హి - ఆ వంశము, ఏవమ్ - ఈ విధముగా (దేవరాత ప్రవర గలది గా), ప్రకల్పితమ్ - చేయబడినది.

ఈ విధముగా విశ్వామిత్రుని పుత్రులలో కొందరు శపించబడి, కొందరు అనుగ్రహించబడుటచే, కౌశికగోత్రము పలువిధములుగా అయిన ది. పైగా, కౌశికులగు విశ్వామిత్ర పుత్రులు ఈ విధముగా దేవరాతుని అన్నగా స్వీకరించుటచే వారి ప్రవర కూడ మారి, వారు దేవరాత ప్రవర గలవారైరి.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
పరశురాముని చరితమును మరియు శునశ్శేపుని గాథను
వర్ణించే పదునారవ అధ్యాయము ముగిసినది (16).



# అథ సప్తదశోऽధ్యాయః

## ఆయువు వంశము - రజి మహారాజు చరితము

శ్రీశుక ఉవాచ।
యః పురూరవసః పుత్ర ఆయుస్తస్యాభవన్ సుతాః ।
నహుషః క్షత్రవృద్ధశ్చ రజీ రంభశ్చ వీర్యవాన్ ॥ 1

అనేనా ఇతి రాజేంద్ర శృణు క్షత్రవృధోऽన్వయమ్ ।

రాజేంద్ర - ఓ మహారాజా!, పురూరవసః - పురూరవుని, పుత్రః - పుత్రుడైన, యః - ఏ, ఆయుః - ఆయువు గలడో, తస్య - ఆయనకు, నహుషః - నహుషుడు, క్షత్రవృద్ధః చ - క్షత్రవృద్ధుడు, రజిః - రజి, వీర్యవాన్ - పరాక్రమశాలియగు, రంభః చ - రంభుడు, అనేనాః - అనేనసుడు, ఇతి - అనువారలు, క్షత్రవృధః - క్షత్రవృద్ధునియొక్క, అన్వయమ్ - వంశమును గురించి, శృణు - వినుము.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ మహారాజా! పురూరవుని పుత్రుడు ఆయువు. ఆయువునకు నహుషుడు, క్షత్రవృద్ధుడు, రజి, పరాక్రమశాలియగు రంభుడు, మరియు అనేనసుడు అనే పుత్రులు గలరు. వారిలో క్షత్రవృద్ధుని వంశమును గురించి వినుము.

క్షత్రవృద్ధసుతస్యాసన్ సుహోత్రస్యాత్మజాస్త్రయః ॥ 2

కాశ్యః కుశో గృత్సమద ఇతి గృత్సమదాదభూత్ ।
శునకశ్శౌనకో యస్య బహ్వృచప్రవరో మునిః ॥ 3

క్షత్రవృద్ధసుతస్య - క్షత్రవృద్ధుని పుత్రుడగు, సుహోత్రస్య - సుహోత్రునకు, త్రయః - ముగ్గురు, ఆత్మజాః - పుత్రులు, ఆసన్ - ఉండిరి, కాశ్యః - కాశ్యుడు, కుశః - కుశుడు, గృత్సమదః - గృత్సమదుడు, ఇతి - అనువారలు, గృత్సమదాత్ - గృత్సమదుని వలన, శునకః - శునకుడు,

అభూత్ - కలిగెను, యస్య - ఎవనికైతే, బహ్వృచప్రవరః - ఋగ్వేదాధ్యా యులలో శ్రేష్ఠుడగు, శౌనకః మునిః - శౌనక మహర్షియో.

క్షత్రవృద్ధుని పుత్రుడు సుహోత్రుడు. సుహోత్రునకు కాశ్యుడు, కుశుడు, గృత్సమదుడు అనే ముగ్గురు పుత్రులు ఉండిరి. గృత్సమదుని పుత్రుడు శునకుడు. శునకుని పుత్రుడగు శౌనక మహర్షి ఋగ్వేదాధ్యాయు లలో శ్రేష్ఠుడు.

కాశ్యస్య కాశిస్తత్పుత్రో రాష్ట్రో దీర్ఘతమఃపితా ।
ధన్వంతరిర్దైర్ఘతమ ఆయుర్వేదప్రవర్తకః ॥ 4

కాశ్యస్య - కాశ్యునకు, కాశిః - కాశి, తత్-పుత్రః - ఆయన పుత్రు డు, రాష్ట్రః - రాష్ట్రుడు, దీర్ఘతమః-పితా - దీర్ఘతముని తండ్రి, దైర్ఘతమః - దీర్ఘతముని పుత్రుడు, ధన్వంతరిః - ధన్వంతరి, ఆయుర్వేదప్రవర్తకః - ఆయుర్వేదమును ప్రవర్తిల్ల జేసినవాడు.

కాశ్యుని పుత్రుడు కాశి. కాశి పుత్రుడు రాష్ట్రుడు. రాష్ట్రుని పుత్రుడు దీర్ఘతముడు. దీర్ఘతముని పుత్రుడు ధన్వంతరి. ధన్వంతరి లోక ములో ఆయుర్వేదమును ప్రవర్తిల్ల జేసెను.

యజ్ఞభుగ్వాసుదేవాంశస్స్మృతమాత్రార్తినాశనః ।
తత్పుత్రః కేతుమానస్య జజ్ఞే భీమరథస్తతః ॥ 5

దివోదాసో ద్యుమాంస్తస్మాత్ప్రతర్దన ఇతి స్మృతః ।

యజ్ఞభుక్ - యజ్ఞభాగములను భుజించువాడు, వాసుదేవ-అంశః - శ్రీహరి భగవానుని అంశ, స్మృతమాత్ర-ఆర్తినాశనః - కేవలము స్మరిం చబడినవాడై దుఃఖములను నశింప జేయువాడు, తత్-పుత్రః - ఆయన పుత్రుడు, కేతుమాన్ - కేతుమంతుడు, అస్య - వీనికి, భీమరథః - భీమర థుడు, జజ్ఞే - పుట్టెను, తతః - ఆయన వలన, దివోదాసః - దివోదాసుడు, తస్మాత్ - ఆయన వలన, ద్యుమాన్ - ద్యుమంతుడు, ప్రతర్దనః - ప్రతర్ద నుడు, ఇతి - అని, స్మృతః - చెప్పబడినవాడు.

వాసుదేవ భగవానుని అంశయైన ధన్వంతరికి యజ్ఞభాగములలో వాటా గలదు. ఆయనను స్మరించినంత మాత్రాన మానవుల దుఃఖములు దూరమగును. ఆయనయొక్క పుత్రుడు కేతుమంతుడు. కేతుమంతుని పుత్రుడు భీమరథుడు. భీమరథుని పుత్రుడు దివోదాసుడు. దివోదాసుని పుత్రుడు ద్యుమంతుడు. ద్యుమంతునకే ప్రతర్దనుడనే పేరు కూడ గలదు.

స ఏవ శత్రుజిద్వత్స ఋతధ్వజ ఇతీరితః ।
తథా కువలయాశ్వేతి ప్రోక్తోఽలర్కాదయస్తతః ।। 6

సః ఏవ - ఆయనయే, శత్రుజిత్ - శత్రుజిత్తు, వత్సః - వత్సుడు, ఋతధ్వజః - ఋతధ్వజుడు, ఇతి - అని, ఈరితః - పిలువబడినవాడు, తథా - మరియు, కువలయాశ్వః - కువలయాశ్వుడు, ఇతి - అని, ప్రోక్తః - పిలువబడినవాడు, తతః - ఆయన వలన, అలర్క-ఆదయః - అలర్కుడు మొదలగువారు.

ఆ ద్యుమంతుడే శత్రుజిత్తు, వత్సుడు, ఋతధ్వజుడు, కువలయాశ్వుడు అనే పేర్లతో కూడ ప్రసిద్ధిని జెందెను. ఆయనకు అలర్కుడు మొదలగు పుత్రులు గలరు.

షష్టివర్షసహస్రాణి షష్టివర్షశతాని చ ।
నాలర్కాదపరో రాజన్ మేదినీం బుభుజే యువా ।। 7

రాజన్ - ఓ రాజా!, యువా - యువకుడగు అలర్కుడు, షష్టివర్షసహస్రాణి షష్టివర్షశతాని చ - అరవై ఆరువేల సంవత్సరములను, మేదినీమ్ - భూమిని, బుభుజే - పాలించెను, అలర్కాత్ - అలర్కునికంటె, అపరః - మరియొకడు, న - లేడు.

యువకుడగు అలర్కుడు అరవై ఆరువేల సంవత్సరముల కాలము నిరంతరముగా రాజ్యమును పాలించెను. అలర్కునికంటె మరియొకడు ఇంతకాలము రాజ్యమును పాలించలేదు.

అలర్కాత్సంతతిస్తస్మాత్సునీథోఽథ సుకేతనః ।
ధర్మకేతుస్సుతస్తస్మాత్సత్యకేతురజాయత ।। 8

అలర్కాత్ - అలర్కుని వలన, సంతతిః - సంతతి, తస్మాత్ - ఆయన వలన, సునీథః - సునీథుడు, అథ - ఆయన వలన, సుకేతనః - సుకేతనుడు, ధర్మకేతుః - ధర్మకేతువు అనే, పుత్రః - పుత్రుడు, తస్మాత్ - ఆయన వలన, సత్యకేతుః - సత్యకేతువు, అజాయత - జన్మించెను.

అలర్కుని పుత్రుడు సంతతి. సంతతి పుత్రుడు సునీథుడు. సునీథుని పుత్రుడు సుకేతనుడు. సుకేతనుని పుత్రుడు ధర్మకేతువు. ధర్మకేతువు పుత్రుడు సత్యకేతువు.

ధృష్టకేతుస్సుతస్తస్మాత్సుకుమారః క్షితీశ్వరః ।
వీతిహోత్రస్య భర్గోఽతో భార్గభూమిరభూన్నృపః ॥ 9

సుతః - పుత్రుడు, ధృష్టకేతుః - ధృష్టకేతువు, తస్మాత్ - ఆయన వలన, సుకుమారః - సుకుమారుడు అనే, క్షితి-ఈశ్వరః - మహారాజు, వీతిహోత్రస్య - వీతిహోత్రునకు, భర్గః - భర్గుడు, అతః - ఈయన వలన, భార్గభూమిః - భార్గభూమి అనే, నృపః - మహారాజు, అభూత్ - కలిగెను.

సత్యకేతుని పుత్రుడు ధృష్టకేతువు. ధృష్టకేతువు పుత్రుడు సుకుమార మహారాజు. సుకుమారుని పుత్రుడు వీతిహోత్రుడు. వీతిహోత్రుని పుత్రుడు భర్గుడు. భర్గుని పుత్రుడు భార్గభూమి మహారాజు.

ఇతీమే కాశయో భూపాః క్షత్రవృద్ధాన్వయాయినః ।
రంభస్య రభసః పుత్రో గంభీరశ్చాక్రియస్తతః ॥ 10

ఇతి - ఈ, ఇమే - వీరు, కాశయః - కాశి పరంపరలోనివారు, భూపాః - మహారాజులు, క్షత్రవృద్ధ-అన్వయాయినః - క్షత్రవృద్ధుని వంశమునకు చెందినవారు, రంభస్య - రంభునియొక్క, పుత్రః - పుత్రుడు, రభసః - రభసుడు, తతః - ఆయన వలన, గంభీరః - గంభీరుడు, చ - ఆయన వలన, అక్రియః - అక్రియుడు.

పైన చెప్పిన వీరు క్షత్రవృద్ధుని (కాశి ముత్తాత) వంశములో కాశి మహారాజు పరంపరకు చెందిన మహారాజులు. (ఆయువు పుత్రుడైన)

రంభుని పుత్రుడు రభసుడు. రభసుని పుత్రుడు గంభీరుడు. గంభీరుని పుత్రుడు అక్రియుడు.

తస్య క్షేత్రే బ్రహ్మ జజ్ఞే శృణు వంశమనేనసః ।
శుద్ధస్తతశ్శుచిస్తస్మాత్త్రికకుద్ధర్మసారథిః ॥ 11

తస్య - ఆ అక్రియునియొక్క, క్షేత్రే - భార్యయందు, బ్రహ్మ - బ్రాహ్మణవంశము, జజ్ఞే - పుట్టెను, అనేనసః - అనేనసుని, వంశమ్ - వంశమును గురించి, శృణు - వినుము, తతః - ఆ అనేనసునినుండి, శుద్ధః - శుద్ధుడు, తతః - ఆయన నుండి, శుచిః - శుచి, తస్మాత్ - ఆయననుం డి, త్రికకుత్ - త్రికకుత్తు, ధర్మసారథిః - ధర్మసారథి.

ఆ అక్రియుని భార్యనుండి బ్రాహ్మణవంశము ప్రవర్తిల్లెను. (ఆయువు పుత్రుడైన) అనేనసుని వంశమును గురించి వినుము. అనేనసుని పుత్రుడు శుద్ధుడు. శుద్ధుని పుత్రుడు శుచి. శుచి పుత్రుడు త్రికకుత్తు. తికకుత్తుయొక్క పుత్రుడు ధర్మసారథి.

తతశ్శాంతరయో జజ్ఞే కృతకృత్యస్స ఆత్మవాన్ ।
రజేః పంచశతాన్యాసన్ పుత్రాణామమితౌజసామ్ ॥ 12

తతః - ఆయననుండి, శాంతరయః - శాంతరయుడు, జజ్ఞే - పుట్టెను, సః - ఆయన, ఆత్మవాన్ - ఆత్మజ్ఞానము గలవాడు, కృతకృత్యః - కృతార్థుడు, రజేః - రజినుండి, అమిత-ఓజసామ్ - అమితమైన బలము గల, పుత్రాణామ్ - పుత్రులయొక్క, పంచ - అయిదు, శతాని - వందలు, ఆసన్ - కలిగినవి.

ధర్మసారథియొక్క పుత్రుడు శాంతరయుడు. ఆయన ఆత్మజ్ఞానము గలవాడగుటచే జీవన్ముక్తుడు. రజి (ఆయువుయొక్క పుత్రుడు) కి అమితమైన బలము గల అయిదువందలమంది పుత్రులు గలరు.

దేవైరభ్యర్థితో దైత్యాన్ హత్వేంద్రాయాదదాద్దివమ్ ।
ఇంద్రస్తస్మై పునర్దత్వా గృహీత్వా చరణౌ రజేః ॥ 13
ఆత్మానమర్పయామాస ప్రహ్లాదాద్యరిశంకితః ।

దేవైః - దేవతలచే, అభ్యర్థితః - ప్రార్థించబడిన రజి, దైత్యాన్ - రాక్షసులను, హత్వా - సంహరించి, దివమ్ - స్వర్గమును, ఇంద్రాయ - ఇంద్రుని కొరకు, దదౌ - ఇచ్చెను, ప్రహ్లాద-ఆది-అరిశంకితః - ప్రహ్లాదుడు మొదలైన శత్రువుల వలన భయపడిన, ఇంద్రః - ఇంద్రుడు, రజేః - రజి యొక్క, చరణౌ - రెండు పాదములను, గృహీత్వా - పట్టుకొని, ఆత్మా నమ్ - తనను, అర్పయామాస - సమర్పించుకొనెను.

దేవతలు ప్రార్థించగా రజి రాక్షసులను జయించి స్వర్గమును ఇంద్రునకు ఇచ్చెను. కాని, ప్రహ్లాదుడు మొదలగు శత్రువులకు భయపడిన ఇంద్రుడు రజియొక్క రెండు కాళ్లను పట్టుకొని తనను తాను ఆయనకు సమర్పించుకొనెను.

పితర్యుపరతే పుత్రా యాచమానాయ నో దదుః ।। **14**

త్రివిష్టపం మహేంద్రాయ యజ్ఞభాగాన్ సమాదదుః ।।

పితరి - తండ్రి, ఉపరతే - మరణించగా, పుత్రాః - పుత్రులు, త్రివి ష్టపమ్ - స్వర్గమును, యాచమానాయ - కోరుచున్న, మహేంద్రాయ - మహేంద్రుని కొరకు, నో దదుః - ఇవ్వరైరి, యజ్ఞభాగాన్ - యజ్ఞభాగము లను, సమాదదుః - స్వీకరించిరి.

తండ్రియగు రజి మరణించిన పిదప మహేంద్రుడు కోరిననూ, ఆయన పుత్రులు స్వర్గమును ఇంద్రునకీయలేదు. పైగా, వారు యజ్ఞభాగ ములను కూడ స్వీకరించిరి.

గురుణా హూయమానేఽగ్నౌ బలభిత్తనయాన్ రజేః ।। **15**

అవధీద్భ్రంశితాన్మార్గాన్న కశ్చిదవశేషితః ।

గురుణా - బృహస్పతిచే, అగ్నౌ - అగ్నియందు, హూయమానే - హోమము చేయబడుచుండగా, బలభిత్ - ఇంద్రుడు, మార్గాత్ - మార్గ మునుండి, భ్రంశితాన్ - తప్పిన, రజేః - రజియొక్క, తనయాన్ - పుత్రు లను, అవధీత్ - సంహరించెను, అవశేషితః - మిగిలినవాడు, కశ్చిత్ - ఒక్కడు, న - లేడు.

బృహస్పతి (ఇంద్రుని విజయము కొరకై) అగ్నియందు హోమము చేయుచుండగా, ఇంద్రుడు ధర్మమార్గమునుండి భ్రష్టులైన రజి యొక్క పుత్రులను సంహరించెను. వారిలో ఒక్కరైననూ మిగులలేదు.

కుశాత్ప్రతిః క్షాత్రవృద్ధాత్సంజయస్తత్సుతో జయః ।। 16

తతః కృతః కృతస్యాపి జజ్ఞే హర్యవనో నృపః ।
సహదేవస్తతో హీనో జయసేనస్తు తత్సుతః ।। 17

క్షాత్రవృద్ధాత్ - క్షత్రవృద్ధుని మనుమడగు, కుశాత్ - కుశుని వలన, ప్రతిః - ప్రతి, సంజయః - సంజయుడు, తత్-సుతః - ఆయన పుత్రుడు, జయః - జయుడు, తతః - ఆ జయుని వలన, కృతః - కృతుడు, కృతస్య అపి - కృతునకు కూడ, హర్యవనః నృపః - హర్యవన మహారాజు, జజ్ఞే - జన్మించెను, తతః - ఆయన వలన, సహదేవః - సహదేవుడు, హీనః - హీనుడు, తత్-సుతః తు - ఆయన పుత్రుడైతే, జయసేనః - జయసేనుడు.

క్షత్రవృద్ధుని మనుమడగు కుశునకు ప్రతి అనే పుత్రుడు కలిగెను. ప్రతి పుత్రుడు సంజయుడు. సంజయుని పుత్రుడు జయుడు. జయుని పుత్రుడు కృతుడు. కృతుని పుత్రుడు హర్యవన మహారాజు. హర్యవనుని పుత్రుడు సహదేవుడు. సహదేవుని పుత్రుడు హీనుడు. హీనుని పుత్రుడు జయసేనుడు.

సంకృతిస్తస్య చ జయః క్షత్రధర్మా మహారథః ।
క్షత్రవృద్ధాన్వయా భూపాశ్శృణు వంశం చ నాహుషాత్ ।। 18

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం
నవమస్కంధే సప్తదశోఽధ్యాయః ।।

సంకృతిః - సంకృతి, తస్య చ - ఆ సంకృతికి కూడ, జయః - జయుడు, క్షత్రధర్మా - క్షత్రియధర్మమునందు నిష్ఠ గలవాడు, మహారథః - మహారథుడు, క్షత్రవృద్ధ-అన్వయాః - క్షత్రవృద్ధుని వంశమునకు చెంది

న, భూపాః - మహారాజులు, నాహుషాత్ - నహుషుని పుత్రునినుండి, వంశం చ - వంశమును గురించి కూడ, శృణు - వినుము.

జయసేనుని పుత్రుడు సంకృతి. సంకృతి పుత్రుడు జయుడు. జయుడు క్షత్రియధర్మమునందు నిష్ఠ గల మహారథుడు. వీరు క్షత్రవృద్ధుని వంశమునకు చెందిన మహారాజులు. ఇప్పుడు (ఆయువు పుత్రుడైన) నహుషుని పుత్రుని నుండి ప్రవర్తిల్లిన వంశమును గురించి వినుము.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ
స్కంధములో రజి మహారాజు చరితమును వర్ణించే
పదునేడవ అధ్యాయము ముగిసినది (17).

* * * * *

# అథ అష్టాదశోऽధ్యాయః

## యయాతి చరితము

శ్రీశుక ఉవాచ।
యతిర్యయాతిస్సంయాతిరాయతిర్వియతిః కృతిః ।
షడిమే నహుషస్యాసన్నింద్రియాణీవ దేహినః ।। 1

నహుషస్య - నహుషునకు, యతిః - యతి, యయాతిః - యయాతి, సంయాతిః - సంయాతి, ఆయతిః - ఆయతి, వియతిః - వియతి, కృతిః - కృతి అనే, ఇమే - ఈ, షట్ - ఆర్గురు, దేహినః - ప్రాణికి, ఇంద్రియాణి ఇవ - ఇంద్రియములు వలె, ఆసన్ - ఉండిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ప్రాణధారులకు శ్రోత్ర-త్వజ్-నేత్ర-జిహ్వా-ఘ్రాణములు మరియు మనస్సు అనే ఆరు ఇంద్రియములున్నట్లే -- (ఆయువు పుత్రుడైన) నహుషునకు యతి, యయాతి, సంయాతి, ఆయతి, నియతి మరియు కృతి అనే ఆర్గురు పుత్రులు (వశవర్తులై కార్యకారులై) ఉండిరి.

రాజ్యం నైచ్ఛద్యతిః పిత్రా దత్తం తత్పరిణామవిత్ ।
యత్ర ప్రవిష్టః పురుష ఆత్మానం నావబుధ్యతే ।। 2

యతిః - యతి, పిత్రా - తండ్రిచే, దత్తమ్ - ఈయబడిన, రాజ్యమ్ - రాజ్యమును, న ఐచ్ఛత్ - ఇష్టపడలేదు, తత్-పరిణామవిత్ - దాని వలన కలిగే పరిణామములను తెలిసినవాడు, యత్ర - దేనియందైతే, ప్రవిష్టః - ప్రవేశించిన, పురుషః - వ్యక్తి, ఆత్మానమ్ - తన స్వరూపమును, న అవబుధ్యతే - తెలియడో.

తండ్రి యతికి రాజ్యమునిచ్చెను. కాని, ఆయన దానికి ఇష్టపడలేదు. ఎందుకంటే, రాజ్యమును స్వీకరిస్తే వచ్చే పరిణామములు (అనర్థము

లు) ఆయనకు తెలియును. రాజ్యవ్యవహారములలో ప్రవేశించిన వ్యక్తి ఆత్మస్వరూపమును తెలియలేడు.

పితరి భ్రంశితే స్థానాదింద్రాణ్యా ధర్షణాద్ద్విజైః ।
ప్రాపితేஉజగరత్వం వై యయాతిరభవన్నృపః ॥ 3

ఇంద్రాణ్యాః - ఇంద్రపత్నియగు శచీదేవిని, ధర్షణాత్ - కోరుట అనే దోషము వలన, ద్విజైః - మహర్షులచే, పితరి - తండ్రియగు నహుషుడు, స్థానాత్ - స్వర్గస్థానమునుండి, భ్రంశితే - స్వర్గమునుండి భ్రష్టుడు కాగా, అజగరత్వం వై - కొండచిలువ జన్మను, ప్రాపితే - పొందించబడగా, యయాతిః - యయాతి, నృపః - రాజు, అభవత్ - ఆయెను.

నహుషుడు ఇంద్రపత్నియగు శచీదేవి పొందును కోరుట అనే దోషము కారణముగా అగస్త్యాది మహర్షులచే శపించబడి ఇంద్రపదము నుండి భ్రష్టుడై కొండచిలువ యైనాడు. ఆ సమయములో యయాతి రాజాయెను.

చతసృష్వాదిశద్దిక్షు భ్రాతౄన్ భ్రాతా యవీయసః ।
కృతదారో జుగోపోర్వీం కావ్యస్య వృషపర్వణః ॥ 4

భ్రాతా - సోదరుడగు యయాతి, యవీయసః - చిన్నవారైన, భ్రాతౄన్ - నల్గురు సోదరులను, చతసృషు - నాలుగు, దిక్షు - దిక్కుల యందు, ఆదిశత్ - నియోగించెను, కావ్యస్య - శుక్రాచార్యునియొక్క, వృషపర్వణః - వృషపర్వునియొక్క, కృతదారః - (అమ్మాయిలతో) పొందబడిన భార్య గలవాడై, ఉర్వీమ్ - భూమిని, జుగోప - పాలించెను.

యయాతి తన తమ్ములను నలుగురిని నాలుగు దిక్కులయందు ప్రజాపాలన కొరకు నియోగించెను. ఆయన తాను శుక్రాచార్యుని కుమార్తెను, మరియు వృషపర్వుడనే రాక్షసరాజు కుమార్తెను వివాహమాడి రాజ్యమును పాలించెను.

రాజోవాచ ।
బ్రహ్మర్షిర్భగవాన్ కావ్యః క్షత్రబంధుశ్చ నాహుషః ।
రాజన్యవిప్రయోః కస్మాద్వివాహః ప్రతిలోమకః ॥ 5

భగవాన్ - పూజనీయుడగు, కావ్యః - శుక్రాచార్యుడు, బ్రహ్మ-ఋషిః - బ్రహ్మర్షి, నాహుషః చ - నహుషుని పుత్రుడగు యయాతియైతే, క్షత్రబంధుః - క్షత్రియుడు, రాజన్యవిప్రయోః - రాజునకు బ్రాహ్మణస్త్రీకి, ప్రతిలోమకః - తల్లక్రిందులైన, వివాహః - వివాహము, కస్మాత్ - ఎందువలన?

పరీక్షిన్మహారాజు ఇట్లు ప్రశ్నించెను --- పూజనీయుడగు శుక్రాచార్యుడు బ్రహ్మర్షి. కాని, నహుషుని పుత్రుడగు యయాతియైతే క్షత్రియుడు. రాజునకు బ్రాహ్మణయువతితో ఈ తల్లక్రిందులు వివాహము జరుగుటకు కారణమేమి?

శ్రీశుక ఉవాచ ।
ఏకదా దానవేంద్రస్య శర్మిష్ఠా నామ కన్యకా ।
సఖీసహస్రసంయుక్తా గురుపుత్ర్యా చ భామినీ ॥ 6

దేవయాన్యా పురోద్యానే పుష్పితద్రుమసంకులే ।
వ్యచరత్కలగీతాలినలినీపులినేఽబలా ॥ 7

దానవ-ఇంద్రస్య - రాక్షసరాజగు వృషపర్వునియొక్క, శర్మిష్ఠా నామ - శర్మిష్ఠ యని ప్రసిద్ధి గాంచిన, కన్యకా - కుమార్తె, భామినీ - యువతియగు, అబలా - ఆ సుందరి, ఏకదా - ఒకనాడు, సఖీసహస్రసంయుక్తా - వేయిమంది చెలికత్తెలతో కూడినదై, గురుపుత్ర్యా - గురువుగారగు శుక్రాచార్యుని కుమార్తెయగు, దేవయాన్యా చ - దేవయానితో గూడ, పుష్పితద్రుమసంకులే - పుష్పించిన చెట్లతో దట్టముగానున్నట్టియు, కలగీత-అలినలినీపులినే - మధురముగా గానము చేసే తుమ్మెదలు గల పద్మములతో నిండిన సరస్సుల ఇసుకతిన్నెలు గల, పుర-ఉద్యానే - నగరము నందలి ఉద్యాన వనమునందు, వ్యచరత్ - విహరించెను.

రాక్షసరాజగు వృషపర్వునకు శర్మిష్ఠయని ప్రసిద్ధి గాంచిన యువతియగు కుమార్తె గలదు. ఆ సుందరి ఒకనాడు వేయి చెలికత్తెలు వెంటరాగా, దానవగురువగు శుక్రాచార్యుని కుమార్తెయైన దేవయానితో కలిసి నగరమునందలి ఉద్యానవనములో విహరించెను. పుష్పించిన చెట్లు దట్టముగానున్న ఆ ఉద్యానమునందలి సరస్సులలో వికసించిన పద్మములయందున్న తుమ్మెదల మధురమగు గానముతో ఆ సరస్సుల ఇసుకతిన్నెలు ప్రతిధ్వనించుచుండెను.

తా జలాశయమాసాద్య కన్యాః కమలలోచనాః ।
తీరే న్యస్య దుకూలాని విజహ్రుస్సించతీర్మిథః ॥ 8

కమలలోచనాః - కలువ కన్నుల, తాః - ఆ, కన్యాః - కన్యలు, జల-ఆశయమ్ - సరస్సును, ఆసాద్య - చేరుకొని, తీరే - ఒడ్డుపై, దుకూలాని - వలువలను, న్యస్య - ఉంచి, మిథః - ఒకరిపైనొకరు, సించతీః - నీటిని చిమ్మువారై, విజహ్రుః - విహరించిరి.

కలువ కన్నుల ఆ కన్యలు సరస్సును చేరి ఒడ్డుపై వలువలనుంచి ఒకరిపైనొకరు నీటిని చిమ్ముకుంటూ విహరించిరి.

వీక్ష్య వ్రజంతం గిరిశం సహ దేవ్యా వృషస్థితమ్ ।
సహసోత్తీర్య వాసాంసి పర్యధుర్వ్రీడితాః స్త్రియః ॥ 9

దేవ్యా సహ - పార్వతీదేవితో గూడి, వ్రజంతమ్ - వెళ్లుచున్నట్టియు, వృషస్థితమ్ - నందిని అధిష్ఠించియున్న, గిరిశమ్ - కైలాసపతియగు శివుని, వీక్ష్య - చూచి, వ్రీడితాః - సిగ్గు పడిన, స్త్రియః - యువతులు, సహసా - వెంటనే, ఉత్తీర్య - ఒడ్డును చేరి, వాసాంసి - వస్త్రములను, పర్యధుః - కప్పుకొనిరి.

ఇంతలో పార్వతీదేవితో గూడి నందిని యెక్కి వెళ్లుచున్న కైలాసపతియగు శివుడు ఆ యువతుల కంటబడెను. వెంటనే వారు ఒడ్డునకు వచ్చి వస్త్రములను కప్పుకొనిరి.

శర్మిష్ఠాఽజానతీ వాసో గురుపుత్ర్యాస్సమవ్యయత్ ।
స్వీయం మత్వా ప్రకుపితా దేవయానీదమబ్రవీత్ ॥ 10

శర్మిష్ఠా - శర్మిష్ఠ, గురుపుత్ర్యాః - గురువుగారి పుత్రికయగు దేవయానియొక్క, వాసః - వస్త్రమును, అజానతీ - గుర్తు పట్టనిదై, స్వీయమ్ - తనదిగా, మత్వా - తలచి, సమవ్యయత్ - ధరించెను, ప్రకుపితా - మిక్కిలి కోపించిన, దేవయానీ - దేవయాని, ఇదమ్ - ఈ మాటను, అబ్రవీత్ - పలికెను.

శర్మిష్ఠ హడావిడిలో శుక్రాచార్యుని కుమార్తెయగు దేవయాని యొక్క చీరను గుర్తుపట్టక తనది అని తలచి ధరించెను. దీనితో దేవయాని చాల కోపించి ఇట్లు పలికెను.

అహో నిరీక్ష్యతామస్యా దాస్యాః కర్మ హ్యసాంప్రతమ్ ।
అస్మద్ధార్యం ధృతవతీ శునీవ హవిరధ్వరే ॥ 11

అహో - ఆహా!, అస్యాః - ఈ, దాస్యాః - దాసియొక్క, అసాంప్రతమ్ - అనుచితమైన, కర్మ - పని, నిరీక్ష్యతామ్ - చూడబడుగాక!, హి - ఏలయనగా, అధ్వరే - యజ్ఞమునందు, హవిః - హవిస్సును, శునీ ఇవ - ఆడుకుక్క వలె, అస్మద్-ధార్యమ్ - మాచే ధరించబడే వస్త్రమును, ధృతవతీ - ధరించినది.

ఆహా! ఈమె చేసిన అనుచితమగు పనిని కనుడు! యజ్ఞములో ఆడుకుక్క హవిస్సును ముట్టుకున్నట్లుగా, మాచే ధరించబడే వస్త్రమునీమె ధరించినది.

యైరిదం తపసా సృష్టం ముఖం పుంసః పరస్య యే ।
ధార్యతే యైరిహ జ్యోతిశ్శివః పంథాశ్చ దర్శితః ॥ 12

యైః - ఎవరిచేనైతే, ఇదమ్ - ఈ జగత్తు, తపసా - తపస్సుచే, సృష్టమ్ - సృష్టించబడినదో, యే - ఎవరైతే, పరస్య పుంసః - పురుషోత్తమునియొక్క, ముఖమ్ - ముఖమో, యైః - ఎవరిచేనైతే, ఇహ - ఈ లోకమునందు, జ్యోతిః - చైతన్యరూపమగు పరబ్రహ్మ, ధార్యతే - హృదయ

మునందు ధారణ చేయబడుచున్నదో, చ - మరియు, శివః - మంగళకర మైన, పంథాః - వేదమార్గము, దర్శితః - చూపబడినదో.

వేదవేత్తలు ఈ జగత్తును తమ తపశ్శక్తిచే సృష్టించిరి. వారు పురుషోత్తముని ముఖరూపులు. వారు ఈ లోకములో చైతన్యరూపుడగు పరబ్రహ్మను తమ హృదయమునందు ధారణ చేయుదురు. వారు జనులకు మంగళకరమగు వేదమార్గమును నిర్దేశించెదరు.

యాన్ వందంత్యుపతిష్ఠంతే లోకనాథాస్సురేశ్వరాః ।
భగవానపి విశ్వాత్మా పావనశ్శ్రీనికేతనః ॥ 13

లోకనాథాః - లోకపాలకులైన, సుర-ఈశ్వరాః - దేవశ్రేష్ఠులు, యాన్ - ఎవరిని, వందంతే - నమస్కరించుచున్నారో, ఉపతిష్ఠంతే - స్తుతించుచున్నారో, విశ్వ-ఆత్మా - జగత్తునకు సత్తాస్ఫూర్తులనిచ్చునట్టియు, పావనః - పవిత్రము చేయునట్టియు, శ్రీనికేతనః - శ్రీకి నివాసమైన, భగవాన్ అపి - భగవానుడు కూడ.

లోకపాలకులైన దేవశ్రేష్ఠులు వేదవేత్తలకు నమస్కరించి స్తుతించెదరు. జగత్తునకు సత్తాస్ఫూర్తులననుగ్రహించే శ్రీహరి భగవానుడు కూడ అటులనే చేయును. లక్ష్మికి నివాసస్థానమగు ఆ శ్రీహరి లోకములను పావనము చేయును.

వయం తత్రాపి భృగవశ్శిష్యోఽస్యా నః పితాఽసురః ।
అస్మద్ధార్యం ధృతవతీ శూద్రో వేదమివాసతీ ॥ 14

తత్ర అపి - అట్టి వేదవేత్తలయందు కూడ, వయమ్ - మేము, భృగవః - భృగువంశీయులము, అస్యాః - ఈమెయొక్క, పితా - తండ్రియగు, అసురః - రాక్షసుడు, నః - మాకు, శిష్యః - శిష్యుడు, అసతీ - దుష్టురాలగు ఈమె, శూద్రః - శూద్రుడు, వేదం ఇవ - వేదమును వలె, అస్మద్-ధార్యమ్ - మాచే ధరించదగిన దానిని, ధృతవతీ - ధరించినది.

అట్టి వేదవేత్తలగు బ్రాహ్మణులయందు కూడ మేము భృగువంశీయులము. ఈమె తండ్రియగు వృషపర్వుడు మాకు శిష్యుడు. ఈ దుష్టురా

లు, వేదమునకు అనర్హుడు వేదమును వలె, మేము ధరించే వస్త్రమును తాను ధరించినది.

ఏవం శపంతీం శర్మిష్ఠా గురుపుత్రీమభాషత ।
రుషా శ్వసంత్యురంగీవ ధర్షితా దష్టదచ్ఛదా ॥ 15

ఏవమ్ - ఈ విధముగా, శపంతీమ్ - తిట్టుచున్న, గురుపుత్రీమ్ - శుక్రాచార్యుని పుత్రికయగు దేవయానిని ఉద్దేశించి, ధర్షితా - తిరస్కరించ బడినది, దష్టదచ్ఛదా - కొరుకబడిన క్రింది పెదవి గలది అగు, శర్మిష్ఠా - శర్మిష్ఠ, రుషా - కోపముతో, ఉరంగీ ఇవ - ఆడు పాము వలె, శ్వసంతీ - నిట్టూర్చుచున్నదియై, అభాషత - పలికెను.

శుక్రాచార్యుని పుత్రికయగు దేవయాని ఇట్లు తిట్టుచుండగా, ఈ విధముగా తిరస్కారమునకు గురియైన శర్మిష్ఠ కోపముతో క్రింది పెదవిని కొరుకుతూ, పామువలె దీర్ఘముగా నిట్టూర్చుచున్నదియై ఇట్లు పలికెను.

ఆత్మవృత్తమవిజ్ఞాయ కత్థసే బహు భిక్షుకి ।
కిం న ప్రతీక్షసేఽస్మాకం గృహాన్ బలిభుజో యథా ॥ 16

భిక్షుకి - ఓ బిచ్చమెత్తుకొనే దానా!, ఆత్మవృత్తమ్ - నీ బ్రదుకుదెరువును, అవిజ్ఞాయ - తెలుసుకోకుండా, బహు - అనేకమును, కత్థసే - వదరుచున్నావు, బలిభుజః యథా - వేసిన అన్నమును తినే కాకులు మరియు కుక్కలు వలె, అస్మాకమ్ - మాయొక్క, గృహాన్ - ఇంటిని, న ప్రతీక్షసే - వేచియుండవా?

ఓ దేవయానీ! నీవు బిచ్చగత్తెవు. నీ బ్రదుకుదెరువును తెలుసుకో కుండా అధికముగా వదరుచున్నావు. మా ఇంటివద్ద మేము వేసే అన్నము కొరకు నీవు, కాకులు మరియు కుక్కలు వలె, ఎదురుచూచేదానవు కావా?

ఏవంవిధైస్సుపరుషైః క్షిప్త్వాఽఽచార్యసుతాం సతీమ్ ।
శర్మిష్ఠా ప్రాక్షిపత్కూపే వాస ఆదాయ మన్యునా ॥ 17

ఏవంవిధైః - ఇటువంటి, సుపరుషైః - మిక్కిలి పరుషములగు మాటలతో, సతీమ్ - పూజించదగిన, ఆచార్యసుతామ్ - శుక్రాచార్యుని పు

త్రికయగు దేవయానిని, క్షిప్త్వా - నిందించి, మన్యునా - కోపముతో, వాసః - వస్త్రమును, ఆదాయ - లాగుకొని, కూపే - నూతియందు, ప్రాక్షిపత్ - పడద్రోసెను.

శుక్రాచార్యుని పుత్రికయగుటచే దేవయాని పూజకు అర్హురాలు. కాని, శర్మిష్ఠ ఆమెను ఈ విధమైన పరుషవాక్కులతో తిట్టి, ఆమె వస్త్రమును లాగుకొని నూతిలో పడద్రోసెను.

తస్యాం గతాయాం స్వగృహం యయాతిర్మృగయాం చరన్ ।
ప్రాప్తో యదృచ్ఛయా కూపే జలార్థీ తాం దదర్శ హ ॥ **18**

తస్యామ్ - ఆమె, స్వగృహమ్ - తన యింటిని గురించి, గతాయామ్ - వెడలగా, మృగయాం చరన్ - వేటాడుచున్న, యయాతిః - యయాతి, యదృచ్ఛయా - అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే), కూపే - నూతియందు, జల-అర్థీ - నీటిని కోరువాడై, ప్రాప్తః - వచ్చినవాడై, తామ్ - ఆమెను, దదర్శ హ - చూచెనట.

అప్పుడు శర్మిష్ఠ తన యింటికి వెళ్లెను. ఇంతలో యయాతి వేటాడుతూ ఈశ్వరేచ్ఛచే అనుకోకుండా దప్పికను తీర్చుకొనుటకై నూతి వద్దకు వచ్చి ఆ దేవయానిని చూచెను.

దత్త్వా స్వముత్తరం వాసస్తస్యై రాజా వివాససే ।
గృహీత్వా పాణినా పాణిముజ్జహార దయాపరః ॥ **19**

దయాపరః - దయాపరుడగు, రాజా - రాజు, స్వమ్ - తనదైన, ఉత్తరం వాసః - పై వస్త్రమును, వివాససే - వస్త్రము లేని, తస్యై - ఆమె కొరకు, దత్త్వా - ఇచ్చి, పాణినా - చేతితో, పాణిమ్ - చేతిని, గృహీత్వా - పట్టుకొని, ఉజ్జహార - పైకి లాగెను.

యయాతి మహారాజు దయాపరుడు. వస్త్రము లేని ఆమెకు ఆయన తన ఉత్తరీయమునిచ్చి, ఆమె చేతిని తన చేతితో పట్టుకొని పైకి లాగెను.

తం వీరమాహౌశనసీ ప్రేమనిర్భరయా గిరా ।
రాజంస్త్వయా గృహీతో మే పాణిః పరపురంజయ ।। 20

ఔశనసీ - శుక్రాచార్యుని కుమార్తెయగు దేవయాని, వీరమ్ - వీరుడగు, తమ్ - ఆ రాజును ఉద్దేశించి, ప్రేమనిర్భరయా - ప్రేమతో నిండిన, గిరా - వాక్కుతో, ఆహ - పలికెను, రాజన్ - ఓ రాజా!, పరపురంజయ - శత్రువుల నగరములను జయించువాడా!, త్వయా - నీచే, మే - నాయొక్క, పాణిః - చేయి, గృహీతః - పట్టుకొనబడినది.

శుక్రాచార్యుని కుమార్తెయగు దేవయాని వీరుడగు ఆ యయాతిని ఉద్దేశించి ప్రేమతో నిండిన వాక్కుతో ఇట్లు పలికెను -- శత్రువుల నగరములను జయించే ఓ రాజా! నీవు నా చేతిని పట్టుకొంటివి.

హస్తగ్రాహోఽపరో మా భూద్గృహీతాయాస్త్వయా హి మే ।
ఏష ఈశకృతో వీర సంబంధో నౌ న పౌరుషః ।
యదిదం కూపలగ్నాయా భవతో దర్శనం మమ ।। 21

త్వయా - నీచే, గృహీతాయాః - పట్టుకొనబడిన, మే - నాకు, హస్తగ్రాహః - చేతిని పట్టుకొనువాడు, అపరః - మరియొకడు, మా భూత్ హి - కానే కారాదు, నౌ - మన యిద్దరియొక్క, ఏషః - ఈ, సంబంధః - సంబంధము, ఈశకృతః - ఈశ్వరునిచే చేయబడినది, పౌరుషః - మానవులచే చేయబడినది, న - కాదు, యత్ - ఏలయనగా, కూపలగ్నాయాః - నూతిలో మునిగియున్న, మమ - నాకు, భవతః - నీయొక్క, దర్శనమ్ - దర్శనము.

నీవు పట్టుకున్న నా చేతిని మరియొక వ్యక్తి పట్టుకొననే రాదు (అనగా నాకు పాణిగ్రహణము మరియొక వ్యక్తితో కానే రాదు). మన యిద్దరి ఈ సంబంధము ఈశ్వరకృతమే గాని, మానవులచే చేయబడినది కాదు. ఏలయనగా, నూతిలో పడియున్న నాకు నీ దర్శనము (ఈశ్వరేచ్ఛచేతనే) కలిగినది.

న బ్రాహ్మణో మే భవితా హస్తగ్రాహో మహాభుజ ।
కచస్య బార్హస్పత్యస్య శాపాద్యమశపం పురా ।। 22

మహాభుజ - గొప్ప బాహువులు గల ఓ రాజా!, బార్హస్పత్యస్య - బృహస్పతి పుత్రుడగు, కచస్య - కచునియొక్క, శాపాత్ - శాపము వలన, మే - నాయొక్క, హస్తగ్రాహః - పాణిగ్రహణమును చేయువాడు, బ్రాహ్మణః - బ్రాహ్మణుడు, న భవితా - కాబోడు, యమ్ - ఏ కచునైతే, పురా - ఇదివరలో, అశపమ్ - శపించితినో.

ఓ రాజా! నీ భుజములు గొప్పవి సుమా! నాకు వివాహము కాబోయేది బ్రాహ్మణునితో కాదని బృహస్పతి పుత్రుడగు కచుడు ఇదివ రలో నన్ను శపించినాడు. ఆతనిని నేను కూడ (నీవు నేర్చిన విద్య నీకు ఫలించదని) శపించితిని.

యయాతిరనభిప్రేతం దేవోపహృతమాత్మనః ।
మనస్తు తద్గతం బుద్ధ్వా ప్రతిజగ్రాహ తద్వచః ॥ 23

అనభిప్రేతమ్ - కోరనిది, దేవ-ఉపహృతమ్ - దైవముచే తీసుకు రాబడినది అనియు, ఆత్మనః - తనయొక్క, మనః తు - మనస్సైతే, తద్ -గతమ్ - ఆమెను చేరినది అనియు, బుద్ధ్వా - తెలుసుకొని, యయాతిః - యయాతి, తద్-వచః - ఆమెయొక్క వచనమును, ప్రతిజగ్రాహ - స్వీక రించెను.

తాను కోరని ఈ సంబంధమును ఈశ్వరుడే తనకు కలిగించినాడని యు, తన మనస్సైతే ఆమెయందు లగ్నమైనదనియు తెలుసుకున్న యయాతి ఆమె వచనమును అంగీకరించెను.

గతే రాజని సా వీరే తత్ర స్మ రుదతీ పితుః ।
న్యవేదయత్తతస్సర్వముక్తం శర్మిష్ఠయా కృతమ్ ॥ 24

వీరే - వీరుడగు, తత్ర - ఆ, రాజని - రాజు, గతే - వెళ్లగా, సా - ఆమె, తతః - తరువాత, రుదతీ - ఏడ్చుచున్నదై, శర్మిష్ఠయా - శర్మిష్ఠచే, ఉక్తమ్ - పలుకబడిన దానిని, కృతమ్ - చేయబడిన దానిని, సర్వమ్ - సర్వమును, పితుః - తండ్రికి, న్యవేదయత్ స్మ - విన్నవించెను.

ఆ యయాతి మహారాజు వెళ్లిన తరువాత దేవయాని ఏడుస్తూ తండ్రి దగ్గరకు వచ్చి, శర్మిష్ఠ తనను నిందిస్తూ పలికిన పలుకులను, తనకు చేసిన ఆ పనిని అంతనూ తండ్రియగు శుక్రాచార్యునకు విన్నవించెను.

దుర్మనా భగవాన్ కావ్యః పౌరోహిత్యం విగర్హయన్ ।
స్తువన్ వృత్తిం చ కాపోతీం దుహిత్రా స యయౌ పురాత్ ।। 25

దుర్మనాః - చెడిపోయిన మనస్సు గల, భగవాన్ - పూజనీయుడగు, సః - ఆ, కావ్యః - శుక్రాచార్యుడు, పౌరోహిత్యమ్ - పురోహిత వృత్తిని, విగర్హయన్ - నిందించుచున్నవాడై, కాపోతీమ్ - పావురములకు చెందిన, వృత్తిమ్ - బ్రదుకు దెరువును, స్తువన్ చ - కొనియాడుచున్నవాడై, దుహిత్రా - కుమార్తెతో, పురాత్ - నగరమునుండి, యయౌ - వెళ్లెను.

పూజనీయుడగు ఆ శుక్రాచార్యుని మనస్సు చెడిపోయెను. ఆయన పురోహిత వృత్తిని గర్హించెను. అంతకంటె పావురముల వలె పొలములలో క్రింద పడిన గింజలను ఏరుకొని తిని బ్రదుకుట శ్రేష్ఠమని ఆయన అట్టి బ్రదుకు దెరువు (ఉంఛవృత్తి) ను స్తుతించెను. ఆయన కుమార్తెతో గూడి నగరమును విడిచిపెట్టి వెళ్లెను.

వృషపర్వా తమాజ్ఞాయ ప్రత్యనీకవివక్షితమ్ ।
గురుం ప్రసాదయన్మూర్ధ్నా పాదయోః పతితః పథి ।। 26

వృషపర్వా - వృషపర్వుడు, ప్రత్యనీకవివక్షితమ్ - శత్రువులగు దేవతలకు మంచిని చెప్పగోరే, తమ్ - ఆ, గురుమ్ - శుక్రాచార్యుని గురించి, ఆజ్ఞాయ - తలపోసి, ప్రసాదయన్ - ప్రసన్నుని చేసుకొనుచున్నవాడై, మూర్ధ్నా - శిరస్సుతో, పథి - మార్గమునందు, పాదయోః - రెండు పాదములయందు, పతితః - పడినవాడు.

ఆ శుక్రాచార్యుడు తమ శత్రువులగు దేవతల పక్షమున చేరి వారికి హితమును చెప్పగోరుచున్నాడని వృషపర్వ మహారాజు తలచెను. ఆయన వెంటనే మార్గమునందున్న ఆచార్యుని ప్రసన్నుని చేసుకొనుటకై ఆయన రెండు పాదములకు తల వంచి ప్రణమిల్లెను.

క్షణార్ధమన్యుర్భగవాన్ శిష్యం వ్యాచష్ట భార్గవః ।
కామోఽస్యాః క్రియతాం రాజన్నైనాం త్యక్తుమిహోత్సహే ।। 27

క్షణ-అర్ధమన్యుః - అర్ధక్షణము కోపము కల, భగవాన్ - పూజనీయుడగు, భార్గవః - శుక్రాచార్యుడు, శిష్యమ్ - శిష్యుడగు వృషపర్వుని ఉద్దేశించి, వ్యాచష్ట - పలికెను, రాజన్ - ఓ రాజా!, అస్యాః - ఈ దేవయాని యొక్క, కామః - కోరిక, క్రియతామ్ - తీర్చబడు గాక!, ఏనామ్ - ఈమెను, ఇహ - ఇచట, త్యక్తుమ్ - విడిచి పెట్టుటకు, న ఉత్సహే - సమర్థుడను కాను.

పూజనీయుడగు శుక్రాచార్యుని కోపము అర్ధక్షణము మాత్రమే ఉండును. ఆయన శిష్యుడగు వృషపర్వునితో నిట్లు పలికెను -- ఓ రాజా! ఈ దేవయాని కోరికను నెరవేర్చుము. తల్లి లేని ఈ పిల్లను ఉదాసీనముగా విడిచిపెట్టే శక్తి నాకు లేదు.

తథేత్యవస్థితే ప్రాహ దేవయానీ మనోగతమ్ ।
పిత్రా దత్తా యతో యాస్యే సానుగా యాతు మామను ।। 28

తథా - అటులనే, ఇతి - అని, అవస్థితే - నిలిచియుండగా, దేవయానీ - దేవయాని, మనః-గతమ్ - మనస్సులో ఉన్న మాటను, ప్రాహ - పలికెను, పిత్రా - తండ్రిచే, దత్తా - ఈయబడినదాననై, యతః - ఎక్కడకి, యాస్యే - వెళ్ళెదనో, స-అనుగా - చెలికత్తెలతో గూడిన శర్మిష్ఠ, మామ్ - నన్ను, అనుయాతు - వెంట వచ్చుగాక!

అటులనే అని వృషపర్వుడు అంగీకరించి నిలిచియుండెను. అప్పుడు దేవయాని తన మనస్సులోని మాటను ఇట్లు చెప్పెను -- నా తండ్రి నన్ను ఎవరికి ఇచ్చి వివాహము చేయునో, వారి గృహమునకు నేను వెళ్ళునప్పుడు, శర్మిష్ఠ తన చెలికత్తెలతో బాటుగా నా వెంట రావలెను.

స్వానాం తత్సంకటం వీక్ష్య తదర్థస్య చ గౌరవమ్ ।
దేవయానీం పర్యచరత్ స్త్రీసహస్రేణ దాసవత్ ।। 29

స్వానామ్ - తనవారల, తత్ - ఆ, సంకటమ్ - విపత్తును, తద్-అర్థస్య - ఆ విషయముయొక్క, గౌరవం చ - ప్రాముఖ్యమును కూడ, వీక్ష్య - చూచి, స్త్రీసహస్రేణ - వేయిమంది చెలికత్తెలతో, దాసవత్ - దాసి వలె, దేవయానీమ్ - దేవయానిని, పరి-అచరత్ - పరిచర్యలను చేసెను.

శుక్రాచార్యుడు రాజ్యమును విడిచిపెట్టుట వలన తన తండ్రికి విపత్తు కలుగుననియు, శుక్రాచార్యుని నిలబెట్టుకొనుట రాజ్యముయొక్క సుస్థిరతకు చాల ప్రముఖమైన విషయమనియు శర్మిష్ఠ గుర్తించెను. ఆమె వేయిమంది చెలిగత్తెలతో గూడి దేవయానికి దాసి వలె పరిచర్యలను చేసెను.

నాహుషాయ సుతాం దత్త్వా సహ శర్మిష్ఠయోశనా ।
తమాహ రాజన్ శర్మిష్ఠామాధాస్తల్పే న కర్హిచిత్ ॥ 30

ఉశనా - శుక్రాచార్యుడు, సుతామ్ - కుమార్తెను, శర్మిష్ఠయా సహ - శర్మిష్ఠతో బాటుగా, నాహుషాయ - నహుషుని పుత్రుడగు యయాతి కొరకు, దత్త్వా - ఇచ్చి, తమ్ - ఆయనను గురించి, ఆహ - పలికెను, రాజన్ - ఓ రాజా!, కర్హిచిత్ - ఏనాడైననూ, శర్మిష్ఠామ్ - శర్మిష్ఠను, తల్పే - శయ్యయందు, న ఆధాః - పొందకుము.

శుక్రాచార్యుడు తన కుమార్తెయగు దేవయానిని నహుషుని పుత్రుడగు యయాతికిచ్చి వివాహము చేసెను. శర్మిష్ఠ దేవయాని వెంట వెళ్లెను. అపుడు శుక్రాచార్యుడు యయాతితో నిట్లనెను -- ఓ రాజా! ఏనాడైననూ శర్మిష్ఠతో సంబంధమును పెట్టుకొనకుము.

విలోక్యౌశనసీం రాజన్ శర్మిష్ఠా సప్రజాం క్వచిత్ ।
తమేవ వవ్రే రహసి సఖ్యాః పతిమృతౌ సతీ ॥ 31

రాజన్ - ఓ రాజా!, ఔశనసీమ్ - శుక్రాచార్యుని కుమార్తెయగు దేవయానిని, సప్రజామ్ - సంతానవతినిగా, విలోక్య - చూచి, సతీ - యోగ్యురాలగు, శర్మిష్ఠా - శర్మిష్ఠ, క్వచిత్ - ఒకనాడు, ఋతౌ - ఋతుకాలమునందు, రహసి - ఏకాంతమునందు, సఖ్యాః - తన సఖియగు దేవ

యానియొక్క, పతిమ్ - భర్తయగు, తం ఏవ - ఆ యయాతినే, వవ్రే - వరించెను.

కొంత కాలమునకు దేవయానికి సంతానము కలిగెను. యోగ్యురాలైన శర్మిష్ఠ ఆ పరిస్థితిని గమనించి ఒకనాడు ఏకాంతములో, తన చెలికత్తెయగు దేవయానియొక్క భర్తయైన ఆ యయాతినే వరించెను.

రాజపుత్ర్యాఽర్థితోఽపత్యే ధర్మం చావేక్ష్య ధర్మవిత్ ।
స్మరన్ శుక్రవచః కాలే దిష్టమేవాభ్యపద్యత ॥ 32

రాజపుత్ర్యా - రాజపుత్రికయగు శర్మిష్ఠచే, అపత్యే - సంతానము విషయములో, అర్థితః - కోరబడినవాడు, ధర్మవిత్ - ధర్మము తెలిసినవాడు అగు యయాతి, ధర్మం చ - ధర్మమును కూడ, అవేక్ష్య - పరిశీలించి, శుక్రవచః - శుక్రాచార్యుని వచనమును, స్మరన్ - స్మరించువాడై, కాలే - ఆ సమయమునందు, దిష్టం ఏవ - దైవనిర్ణయమునే, అభ్యపద్యత - పొందెను.

రాజపుత్రికయగు శర్మిష్ఠ తనకు సంతానము కావలెనని ధర్మము తెలిసిన యయాతిని కోరెను. ఆయన కూడ ధర్మమును పరిశీలించెను. పైగా, ఆయనకు శుక్రాచార్యుని హెచ్చరిక కూడ గుర్తులోనుండెను. అయిననూ, ఆయన ఆ సమయములో అది (శర్మిష్ఠతోడి పొందు) దైవనిర్ణయమేనని భావించెను.

యదుం చ తుర్వసుం చైవ దేవయానీ వ్యజాయత ।
ద్రుహ్యుం చానుం చ పూరుం చ శర్మిష్ఠా వార్షపర్వణీ ॥ 33

దేవయానీ - దేవయాని, యదుం చ - యదువును, తుర్వసుం చ ఏవ - తుర్వసుని కూడ, వార్షపర్వణీ - వృషపర్వుని కుమార్తెయగు, శర్మిష్ఠా చ - శర్మిష్ఠ కూడ, ద్రుహ్యుం చ - ద్రుహ్యువును, అనుమ్ - అనువును, పూరుం చ - పూరువును కూడ, వ్యజాయత - కనెను.

దేవయానికి యదువు, తుర్వసుడు అనే పుత్రులు కలిగిరి. వృషప ర్వుని కుమార్తెయగు శర్మిష్ఠకు కూడ ద్రుహ్యువు, అనువు, పూరువు అనే పుత్రులు కలిగిరి.

గర్భసంభవమాసుర్యా భర్తుర్విజ్ఞాయ మానినీ ।
దేవయానీ పితుర్గేహం యయౌ క్రోధవిమూర్ఛితా ॥ 34

ఆసుర్యాః - వృషపర్వుడనే రాక్షసుని కుమార్తెయగు శర్మిష్ఠకు, భర్తుః - తన భర్తయగు యయాతి వలన, గర్భసంభవమ్ - సంతానము కలుగుటను, విజ్ఞాయ - తెలుసుకొని, మానినీ - అభిమానవతియగు, దేవ యానీ - దేవయాని, క్రోధవిమూర్ఛితా - కోపముతో ఆవేశించబడినదై, పితుః - తండ్రియగు శుక్రాచార్యునియొక్క, గేహమ్ - ఇంటిని గురించి, యయౌ - వెళ్లెను.

వృషపర్వాసురుని కుమార్తెయగు శర్మిష్ఠ తన భర్తయగు యయాతి వలన సంతానమును పొందినదని దేవయానికి తెలిసెను. ఆ అభిమానవతి కోపముచే ఆవేశించబడినదియై తన తండ్రియగు శుక్రాచా ర్యుని ఇంటికి వెళ్లిపోయెను.

ప్రియామనుగతః కామీ వచోభిరుపమంత్రయన్ ।
న ప్రసాదయితుం శేకే పాదసంవాహనాదిభిః ॥ 35

కామీ - ప్రేమ గల యయాతి, ప్రియామ్ - ప్రియురాలగు దేవ యానిని, అనుగతః - అనుసరించి వెళ్లినవాడు, వచోభిః - మాటలతో, పాద సంవాహన-ఆదిభిః - పాదములను స్పృశించుట మొదలగువాటితో, ఉప మంత్రయన్ - ప్రసన్నురాలిని చేయువాడై, ప్రసాదయితుమ్ - ప్రసన్నురా లిని చేయుటకు, న శేకే - సమర్థుడు కాలేదు.

యయాతికి దేవయానియందు ప్రేమ గలదు. కావుననే, ఆయన కూడ ఆమె వెంట వెళ్లెను. మార్గములో మంచి మాటలతో, పాదములను స్పృశించుట, ప్రయాణములో సహకరించుట మొదలగు క్రియలతో ఆమెను ప్రసన్నురాలను చేయుటకు యత్నించి ఆయన విఫలుడాయెను.

శుక్రస్తమాహ కుపితః స్త్రీకామానృతపూరుష ।
త్వాం జరా విశతాం మంద విరూపకరణీ నృణామ్ ।। 36

కుపితః - కోపించిన, శుక్రః - శుక్రుడు, తమ్ - ఆయనను ఉద్దేశించి, ఆహ - పలికెను, స్త్రీకామ - స్త్రీలయందు కామన గలవాడా!, అనృతపూరుష - అసత్యమును పలికే వ్యక్తీ!, మంద - ఓరీ మూర్ఖుడా!, నృణామ్ - మానవులకు, విరూపకరణీ - వికృతరూపమును కలిగించే, జరా - ముసలితనము, త్వామ్ - నిన్ను, విశతామ్ - ప్రవేశించు గాక!

కోపించిన శుక్రాచార్యుడు యయాతితో నిట్లనెను -- ఓరీ మూర్ఖా! నీకు స్త్రీలయందు లోభము ఎక్కువ. అసత్యమును చెప్పుటకు వెనుకాడని వ్యక్తివి నీవు. మానవులకు వికృతరూపమును కలిగించే ముసలితనము నిన్ను (వెంటనే) ప్రవేశించు గాక!

యయాతిరువాచ ।
అతృప్తోఽస్మ్యద్య కామానాం బ్రహ్మన్ దుహితరి స్మ తే ।
వ్యత్యస్యతాం యథాకామం వయసా యోఽభిధాస్యతి ।। 37

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, తే - నీయొక్క, దుహితరి - కుమార్తె యగు దేవయానియందు, కామానామ్ - కామనలకు, అద్య స్మ - ఈ నాటికీ, అతృప్తః - తృప్తి చెందనివాడనై, అస్మి - అగుదును, యః - ఎవడైతే, అభిధాస్యతి - ధరించగలడో (వాని), వయసా - యౌవనముతో, యథాకామమ్ - యథేచ్ఛగా, వ్యత్యస్యతామ్ - మార్పు చేసుకొనబడు గాక!

యయాతి ఇట్లు పలికెను --- ఓ మహర్షీ! నీ కుమార్తెతో గూడి నేను అనుభవించిన భోగముల యెడల నాకింకనూ తృప్తి కలుగలేదు. (శుక్రాచార్యుడు ఇట్లు పలికెను) -- ఎవడైతే నీతో తన యౌవనమును మార్పిడి చేయుటకంగీకరించునో, వానితో యథేచ్ఛగా నీ ముసలితనమును మార్పు చేసుకొనెదవు గాక!

ఇతి లబ్ధవ్యవస్థానః పుత్రం జ్యేష్ఠమవోచత ।
యదో తాత ప్రతీచ్ఛేమాం జరాం దేహి నిజం వయః ।। 38

మాతామహకృతాం వత్స న తృప్తో విషయేష్వహమ్ ।
వయసా భవదీయేన రంస్యే కతిపయాస్సమాః ॥ 39

ఇతి - ఈ విధముగా, లబ్ధవ్యవస్థానః - పొందబడిన వ్యవస్థ గల వాడై, జ్యేష్ఠమ్ - పెద్ద, పుత్రమ్ - కొడుకును గురించి, అవోచత - పలికెను, తాత - కుమారా!, యదో - ఓ యదూ!, ఇమామ్ - ఈ, మాతామహ కృతామ్ - మీ తాతగారిచే కలిగించబడిన, జరామ్ - ముసలితనమును, ప్రతీచ్ఛ - స్వీకరించుము, నిజమ్ - నీదైన, వయః - యౌవనమును, దేహి - ఇమ్ము, వత్స - ఓ కుమారా!, అహమ్ - నేను, విషయేషు - ఇంద్రియభోగములయందు, తృప్తః - తృప్తిని చెందినవాడను, న - కాను, భవదీయేన - నీదైన, వయసా - యౌవనముతో, కతిపయాః - కొన్ని, సమాః - సంవత్సరములను, రంస్యే - రమించగలను.

ఈ విధముగా యయాతి శుక్రాచార్యునిమండి ముసలితనమును వినిమయము చేసే వ్యవస్థను పొందెను. ఆయన తన పెద్ద కొడుకగు యదువుతో నిట్లనెను -- ఓ కుమారా! నాకు మీ తాతగారు (శుక్రాచార్యుడు) కలిగించిన ఈ ముసలితనమును నీవు స్వీకరించి నీ యౌవనమును నాకిమ్ము. ఓ కుమారా! నాకింకనూ ఇంద్రియభోగములయందు తృప్తి కలుగలేదు. నేను నీ యౌవనముతో కొన్ని సంవత్సరములు నిరంతరముగా రమించెదను.

యదురువాచ ।
నోత్సహే జరసా స్థాతుమంతరా ప్రాప్తయా తవ ।
అవిదిత్వా సుఖం గ్రామ్యం వైతృష్ణ్యం నైతి పూరుషః ॥ 40

తవ - నీకు, అంతరా - మధ్యవయస్సునందు, ప్రాప్తయా - పొందబడిన, జరసా - ముసలిదనముతో, స్థాతుమ్ - ఉండుటకు, న ఉత్సహే - సమర్థుడను కాను, పూరుషః - మానవుడు, గ్రామ్యమ్ - ఇంద్రియముల సమూహామునకు సంబంధించిన, సుఖమ్ - సుఖమును గురించి, అవిదిత్వా - అనుభవించకుండా, వైతృష్ణ్యమ్ - వైరాగ్యమును, న ఏతి - పొందడు.

యదువు ఇట్లు పలికెను --- తమకు మధ్యవయస్సులో సంప్రాప్త మైన ముసలిదనమును స్వీకరించి ముసలివాడనై జీవించుటకు నాకు ఉత్సాహము లేదు. ఇంద్రియసుఖములననుభవించకుండా వ్యక్తికి వైరాగ్యము కలుగదు.

తుర్వసుశ్చోదితః పిత్రా ద్రుహ్యుశ్చానుశ్చ భారత ।
ప్రత్యాచఖ్యురధర్మజ్ఞా హ్యనిత్యే నిత్యబుద్ధయః ।। 41

భారత - భరతవంశీయుడవగు ఓ రాజా!, తుర్వసుః - తుర్వసువు, ద్రుహ్యుః చ - ద్రుహ్యుడు, అనుః చ - అనువు కూడ, పిత్రా - తండ్రియగు యయాతిచే, చోదితః - ఆదేశించబడినవాడు, ప్రత్యాచఖ్యుః - తిరస్కరించిరి, హి - ఏలయనగా, అధర్మజ్ఞాః - ధర్మము తెలియనివారు, అనిత్యే - నిత్యము కానిదానియందు, నిత్యబుద్ధయః - నిత్యమనే ధారణ గలవారు.

భరతవంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! యయాతి తుర్వసుని, ద్రుహ్యుని, మరియు అనువును కూడ అదే విధముగా ఆదేశించగా, వారు తమ యౌవనమునిచ్చుటకు నిరాకరించిరి. ఎందుకంటే, వారికి ధర్మము తెలియదు. పైగా, అనిత్యమగు యౌవనమునందు నిత్యమనే ధారణ వారికి ఉండెను.

అపృచ్ఛత్తనయం పూరుం వయసోనం గుణాధికమ్ ।
న త్వమగ్రజవద్వత్స మాం ప్రత్యాఖ్యాతుమర్హసి ।। 42

వయసా - వయస్సుచే, ఊనమ్ - చిన్నవాడైనట్టియు, గుణ-అధికమ్ - గుణములచే అధికుడైనట్టియు, తనయమ్ - పుత్రుడైన, పూరుమ్ - పూరువును, అపృచ్ఛత్ - అడిగెను, వత్స - కుమారా!, త్వమ్ - నీవు, అగ్రజవత్ - అన్నలవలె, మామ్ - నన్ను, ప్రత్యాఖ్యాతుమ్ - తిరస్కరించుటకు, న అర్హసి - తగవు.

యయాతియొక్క చిన్న కొడుకగు పూరువు వయస్సులో చిన్నవాడే అయినా, గుణములలో అధికుడు. యయాతి ఆతనితో నిట్లనెను -- ఓ కుమారా! నీవు నీ అన్నలవలె నన్ను తిరస్కరించుట తగదు.

పూరురువాచ ।
కో ను లోకే మనుష్యేంద్ర పితురాత్మకృతః పుమాన్ ।
ప్రతికర్తుం క్షమో యస్య ప్రసాదాద్విందతే పరమ్ ॥ 43

మనుష్య-ఇంద్ర - ఓ మహారాజా!, లోకే - లోకమునందు, ఆత్మ కృతః - తనకు జన్మనిచ్చిన, పితుః - తండ్రికి, ప్రతికర్తుమ్ - ఋణము తీర్చుకొనుటకు, క్షమః - సమర్థుడైన, పుమాన్ - వ్యక్తి, కః ను - ఎవడు?, యస్య - ఏ తండ్రియొక్క, ప్రసాదాత్ - అనుగ్రహము వలన, పరమ్ - ఉన్నతమగు శ్రేయస్సును, విందతే - పొందునో.

పూరువు ఇట్లు పలికెను --- ఓ మహారాజా! లోకములో తనకు జన్మనిచ్చిన తండ్రియొక్క ఋణమును తీర్చగల వ్యక్తి ఎవడైనా గలడా? (లేదు). తండ్రియొక్క అనుగ్రహము వలన పుత్రునకు ఉన్నతమైన శ్రేయస్సు లభించును.

ఉత్తమశ్చింతితం కుర్యాత్ప్రోక్తకారీ తు మధ్యమః ।
అధమోऽశ్రద్ధయా కుర్యాదకర్తోచ్చరితం పితుః ॥ 44

ఉత్తమః - ఉత్తముడైన పుత్రుడు, పితుః - తండ్రియొక్క, చింతితమ్ - సంకల్పించబడినదానిని, కుర్యాత్ - చేయును, మధ్యమః తు - మధ్యముడైతే, ప్రోక్తకారీ - చెప్పబడినదానిని చేయువాడు, అధమః - అధముడు, అశ్రద్ధయా - శ్రద్ధ లేకుండగా, కుర్యాత్ - చేయును, అకర్తా - చేయనివాడు, ఉచ్చరితమ్ - మాలిన్యము.

తండ్రి మనస్సులోని మాటను పైకి చెప్పకుండానే నిర్వర్తించే పుత్రుడు ఉత్తముడు. తండ్రి చెప్పిన దానిని చేయువాడు మధ్యముడు. తండ్రి చెప్పిన దానిని శ్రద్ధ లేకుండా చేయువాడు అధముడు. తండ్రి చెప్పిన దానిని అసలే చేయనివాడు తండ్రియొక్క మాలిన్యమువంటి వాడు మాత్రమే.

ఇతి ప్రముదితః పూరుః ప్రత్యగృహ్ణాజ్జరాం పితుః ।
సోऽపి తద్వయసా కామాన్ యథావజ్జుజుషే నృప ॥ 45

నృప - ఓ రాజా!, ఇతి - అని పలికి, ప్రముదితః - హర్షముతో కూడిన, పూరుః - పూరువు, పితుః - తండ్రియొక్క, జరామ్ - ముసలిదనమును, ప్రతి-అగృహ్ణాత్ - స్వీకరించెను, సః అపి - ఆ యయాతి కూడ, తద్-వయసా - ఆ పూరువుయొక్క యౌవనముతో, కామాన్ - భోగములను, యథావత్ - యథేచ్ఛగా, జుజుషే - సేవించెను.

ఓ పరీక్షిన్మహారాజా! ఇట్లు పలికి పూరువు ఆనందముతో తండ్రియొక్క ముసలిదనమును స్వీకరించెను. అపుడా యయాతి పూరువుయొక్క యౌవనమును పొంది భోగములను యథేచ్ఛగా సేవించెను.

సప్తద్వీపపతిస్సమ్యక్ పితృవత్పాలయన్ ప్రజాః ।
యథోపజోషం విషయాన్ జుజుషేఽవ్యాహతేంద్రియః ॥ 46

సప్తద్వీపపతిః - ఏడు ద్వీపముల భూమికి ప్రభువగు యయాతి, ప్రజాః - ప్రజలను, పితృవత్ - తండ్రివలె, సమ్యక్ - చక్కగా, పాలయన్ - పాలించువాడై, అవ్యాహత-ఇంద్రియః - అలుపు యెరుగని ఇంద్రియములు గలవాడై, విషయాన్ - ఇంద్రియభోగములను, యథా-ఉపజోషమ్ - ప్రీతికి తగ్గట్లుగా, జుజుషే - సేవించెను.

భారతవర్షములోని తొమ్మిది ద్వీపములలో ఏడింటికి ప్రభువు యయాతియే. ఆయన ప్రజలను తండ్రివలె చక్కగా పాలించెను. ఆయన అలుపునెరుగని ఇంద్రియములతో విషయభోగములను తనకు ప్రీతి కలిగేటంతవరకు సేవించెను.

దేవయాన్యప్యనుదినం మనోవాగ్దేహవస్తుభిః ।
ప్రేయసః పరమాం ప్రీతిమువాహ ప్రేయసీ రహః ॥ 47

ప్రేయసీ - ప్రియురాలగు, దేవయానీ అపి - దేవయాని కూడ, అనుదినమ్ - ప్రతిదినము, మనః-వాగ్-దేహవస్తుభిః - మనస్సు వాక్కు దేహము వస్తువులు అనువాటితో, రహః - ఏకాంతమునందు, ప్రేయసః - ప్రియుడగు యయాతికి, పరమామ్ - సర్వాతిశాయియగు, ప్రీతిమ్ - ప్రీతిని, ఉవాహ - కలిగించెను.

ప్రియురాలగు దేవయాని కూడ ప్రతిదినము ఏకాంతమునందు తన ప్రియుడగు యయాతికి మనస్సుతో అతిశయించిన ప్రేమను చూపి, వాక్కుతో మధురముగా మాటలాడి, దేహముతో పరిచర్యలను చేసి, ఇంకా అభీష్టమగు వస్తువులను సమర్పించెను. ఈ విధముగా ఆమె ఆయనకు సర్వాతిశాయియగు ప్రీతిని కలిగించెను.

అయజద్యజ్ఞపురుషం క్రతుభిర్భూరిదక్షిణైః ।
సర్వదేవమయం దేవం సర్వవేదమయం హరిమ్ ।। 48

యజ్ఞపురుషమ్ - యజ్ఞేశ్వరుడైనట్టియు, సర్వదేవమయమ్ - సకలదేవతాస్వరూపుడైనట్టియు, సర్వవేదమయమ్ - సకలవేదస్వరూపుడైన, హరిం దేవమ్ - శ్రీహరి దేవుని, భూరిదక్షిణైః - అధికమగు దక్షిణలు గల, క్రతుభిః - క్రతువులచే, అయజత్ - ఆరాధించెను.

సకలదేవతలు యజ్ఞేశ్వరుడగు శ్రీహరియొక్క రూపములు మాత్రమే. సకలవేదములు కూడ ఆయన స్వరూపమే. అట్టి శ్రీహరి దేవుని యయాతి అధికమగు దక్షిణలనిచ్చి క్రతువులను చేసి ఆరాధించెను.

యస్మిన్నిదం విరచితం వ్యోమ్నీవ జలదావలిః ।
నానేవ భాతి నాభాతి స్వప్నమాయామనోరథః ।। 49

స్వప్నమాయామనోరథః - స్వప్నము ఇంద్రజాలము మరియు మనోరథము అగు, ఇదమ్ - ఈ జగత్తు, యస్మిన్ - ఏ శ్రీహరియందు, వ్యోమ్ని - ఆకాశమునందు, జలద-ఆవలిః - మేఘపంక్తివలె, విరచితమ్ - రచించబడినదో, నానా ఇవ - అనేకమా యన్నట్లు, భాతి - ప్రకాశించుచున్నదో, న ఆభాతి - ప్రకాశించుట లేదో.

ఈ జగత్తు స్వప్నము వలె, ఇంద్రజాలము వలె కేవలము మనస్సుయొక్క విలాస మాత్రమే. ఈ జగత్తు ఆత్మరూపుడగు శ్రీహరి (అధిష్ఠానము) యందు, మేఘపంక్తి ఆకాశమునందు వలె, ప్రకటమగుచున్నది. ఈ జగత్తు ఆ శ్రీహరియొక్క ప్రకాశమునందే ప్రకాశించుచున్నది. సుషుప్తి ప్రళయములయందు ఆ శ్రీహరియందే విలీనమై భాసించుట లేదు.

తమేవ హృది విన్యస్య వాసుదేవం గుహాశయమ్ ।
నారాయణమణీయాంసం నిరాశీరయజత్ప్రభుమ్ ॥ 50

వాసుదేవమ్ - సకలజగన్నివాసుడు చైతన్యస్వరూపుడు అయినట్టియు, గుహా-ఆశయమ్ - హృదయమనే రహస్యస్థానమే నివాసముగా కలిగినట్టియు, అణీయాంసమ్ - సూక్ష్మాతిసూక్ష్మ డైనట్టియు, ప్రభుమ్ - జగన్నాథుడగు, తమ్ - ఆ, నారాయణం ఏవ - నారాయణుని మాత్రమే, హృది - హృదయమునందు, విన్యస్య - నిలిపి, నిరాశీః - కామనలు లేనివాడై, అయజత్ - యజ్ఞముల ద్వారా ఆరాధించెను.

సకలజగన్నివాసుడు మరియు చైతన్యస్వరూపుడు అగు నారాయణుడు సకలప్రాణులలో హృదయమనే రహస్యస్థానమునందు నివసించును. యయాతి కామనలను విడిచిపెట్టి సూక్ష్మాతిసూక్ష్ముడు మరియు జగన్నాథుడు అగు ఆ నారాయణుని మాత్రమే హృదయమునందు నిలిపి, ఆయనను యజ్ఞముల ద్వారా ఆరాధించెను.

ఏవం వర్షసహస్రాణి మనష్షష్ఠైర్మనస్సుఖమ్ ।
విదధానోఽపి నాతృప్యత్సార్వభౌమః కదింద్రియైః ॥ 51

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం
నవమస్కంధే అష్టాదశోఽధ్యాయః ॥

ఏవమ్ - ఈ విధముగా, వర్షసహస్రాణి - వేలాది సంవత్సరములను, మనః-షష్ఠైః - మనస్సు ఆరవదిగా గల, కదింద్రియైః - చెడు ఇంద్రియములతో, మనః-సుఖమ్ - కామనల భోగమును, విదధానః అపి - చేయుచున్నవాడే అయిననూ, సార్వభౌమః - యయాతి చక్రవర్తి, న అతృప్యత్ - సంతృప్తిని చెందలేదు.

యయాతి చక్రవర్తియే అయిననూ, వేలాది సంవత్సరములు నిరంతరముగా కామభోగములను శ్రోత్ర-త్వక్-నేత్ర-జిహ్వా-ఘ్రాణములు మరియు మనస్సు అనే దుష్టములగు (బహిర్ముఖములైన) ఇంద్రియములతో అనుభవించుచున్ననూ, సంతృప్తిని చెందలేదు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
యయాతి చరితమును వర్ణించే పదునెనిమిదవ
అధ్యాయము ముగిసినది (18).

* * * * *

# అథ ఏకోనవింశోఽధ్యాయః

## యయాతి గీతి

శ్రీశుక ఉవాచ।
స ఇత్థమాచరన్ కామాన్ స్త్రైణోఽపహ్నవమాత్మనః ।
బుద్ధ్వా ప్రియాయై నిర్విణ్ణో గాథామేతామగాయత ।। 1

ఇత్థమ్ - ఈ విధముగా, స్త్రైణః - స్త్రీకి వశుడైయున్న, సః - ఆ యయాతి, కామాన్ - విషయభోగములను, ఆచరన్ - అనుభవించుచున్న వాడై, ఆత్మనః - తన స్వరూపముయొక్క, అపహ్నవమ్ - కప్పివేయబడుటను, బుద్ధ్వా - గుర్తించి, నిర్విణ్ణః - విరక్తుడై, ప్రియాయై - ప్రియురాలగు దేవయాని కొరకు, ఏతామ్ - ఈ, గాథామ్ - గాథ (కథ) ను, అగాయత - గానము చేసెను (చెప్పెను).

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా స్త్రీకి వశవర్తుడై ఆ యయాతి విషయభోగముల ననుభవించుచుండెను. భోగముల వలన ఆత్మస్వరూపము కప్పివేయబడునని ఆయన గుర్తించి విరక్తుడాయెను. అపుడాయన తన ప్రియురాలగు దేవయానికి ఈ కథ (గీతి) ను చెప్పెను.

శృణు భార్గవ్యమూం గాథాం మద్విధాచరితాం భువి ।
ధీరా యస్యానుశోచంతి వనే గ్రామనివాసినః ।। 2

భార్గవి - ఓ దేవయానీ!, భువి - లోకమునందు, మద్-విధ-ఆచరితామ్ - నావంటివానిచే అనుష్ఠించబడిన, అమూమ్ - ఈ, గాథామ్ - గాథను, శృణు - వినుము, గ్రామనివాసినః - గ్రామమునందు నివసించే యస్య - ఎవనికి, వనే - వనమునందలి, ధీరాః - ధీరులు, అనుశోచంతి - జాలి పడెదరో.

భృగుకులసంజాతవగు ఓ దేవయానీ! ఈ లోకములో నా వలెనే స్త్రీకి వశుడై భోగపరాయణుడై ఉండే వానికి అనుభవమునకు వచ్చే ఈ

కథను వినుము. గ్రామము (ఇంద్రియసమూహము) నందు నివసించే నావంటి భోగపరాయణునిపై వనమునందు నివసించే (అంతర్ముఖులై యుండే) ధీరులు (ఆత్మానాత్మవివేకము గలవారు) జాలిపడెదరు.

బస్త ఏకో వనే కశ్చిద్విచిన్వన్ ప్రియమాత్మనః ।
దదర్శ కూపే పతితాం స్వకర్మవశగామజామ్ ॥ 3

కశ్చిత్ - ఒకానొక, ఏకః - ఒంటరి, బస్తః - మేకపోతు, వనే - అడవియందు, ఆత్మనః - తనకు, ప్రియమ్ - ఇష్టమైనదానిని గురించి, విచిన్వన్ - అన్వేషించుచున్నదై, స్వకర్మవశగామ్ - తన కర్మకు వశమై యున్నట్టియు, కూపే - నూతియందు, పతితామ్ - పడిన, అజామ్ - ఆడుమేకను, దదర్శ - చూచెను.

ఒకానొక ఒంటరి మేకపోతు అడవిలో తనకు ఇష్టమయ్యే వస్తువు కొరకు వెదుకుచుండెను. తన కర్మకు వశమై నూతిలో పడియున్న ఒక ఆడుమేకను అది చూచెను.

తస్యా ఉద్ధరణోపాయం బస్తః కామీ విచింతయన్ ।
వ్యధత్త తీర్థముద్ధృత్య విషాణాగ్రేణ రోధసీ ॥ 4

కామీ - కామన గల, బస్తః - మేకపోతు, తస్యాః - ఆ ఆడుమేక యొక్క, ఉద్ధరణ-ఉపాయమ్ - పైకి తీసే ఉపాయమును గురించి, విచింతయన్ - ఆలోచించువాడై, రోధసీ - గట్టుపై, విషాణ-అగ్రేణ - కొమ్ముల కొనలతో, ఉద్ధృత్య - మట్టిని పెల్లగించి, తీర్థమ్ - పైకి వచ్చే దోవను, వ్యధత్త - నిర్మాణము చేసెను.

ఆ మేకపోతునకు ఆడుమేకపై కామన కలిగెను. అది నూతినుండి ఆడుమేకను పైకి తీసే ఉపాయమును గురించి ఆలోచించెను. అది నూతి గట్టుపై తన కొమ్ముల కొనలతో మట్టిని పెల్లగించి నూతి లోపలినుండి పైకి వచ్చే దోవను తయారు చేసెను.

సోత్తీర్య కూపాత్సుశ్రోణీ తమేవ చకమే కిల ।
తయా వృతం సముద్వీక్ష్య బహ్వ్యోఽజాః కాంతకామినీః ॥ 5

పీవానం శ్మశ్రులం ప్రేష్ఠం మీఢ్వాంసం యాభకోవిదమ్ ।

సుశ్రోణీ - మిక్కిలి సుందరియగు, సా - ఆ ఆడుమేక, కూపాత్ - నూతినుండి, ఉత్తీర్య - పైకి వచ్చి, పీవానమ్ - బలిసి ఉన్నట్టియు, శ్మశ్రులమ్ - జుట్టుతో నిండిన గెడ్డము కలిగినట్టియు, ప్రేష్ఠమ్ - మిక్కిలి ప్రియమైనట్టియు, మీఢ్వాంసమ్ - ప్రీతిని వర్షించునట్టియు, యాభకోవిదమ్ - సంభోగ సమర్థమైన, తం ఏవ - ఆ మేకపోతునే, చకమే కిల - ప్రేమించెను సుమా!, తయా - ఆ ఆడుమేకతో, వృతమ్ - కూడియున్న, మేకపోతును, సముద్వీక్ష్య - పరిశీలనగా చూచి, బహ్వ్యః - చాల, అజాః - ఆడు మేకలు, కాంతకామినీః - సుందరమైన ఆ పోతును కామించునవి.

మిక్కిలి సుందరియగు ఆ ఆడుమేక నూతినుండి పైకి వచ్చి తనను పైకి తీసిన ఆ మేకపోతునే ప్రేమించెను సుమా! జుట్టు నిండిన గెడ్డమును కలిగి బలిసియున్న ఆ మేకపోతు ప్రీతిని వర్షించునది. సంభోగ సమర్థమగు ఆ మేకపోతుపై ఆ ఆడుమేకకు చాల ప్రేమ కలిగెను. అంతేగాక, అనేకములగు ఆడుమేకలు సుందరమైన ఆ మేకపోతును పరిశీలనగా చూచి, దానిని కామించినవి.

స ఏకోఽజవృషస్తాసాం బహ్వీనాం రతివర్ధనః ।
రేమే కామగ్రహగ్రస్త ఆత్మానం నావబుధ్యత ।। 6

సః - ఆ, ఏకః - ఒక్క, అజవృషః - మేకపోతు, బహ్వీనామ్ - అనేకములగు, తాసామ్ - ఆ ఆడుమేకలకు, రతివర్ధనః - ప్రీతిని వర్ధిల్ల జేయుచున్నది, కామగ్రహగ్రస్తః - కామమనే గ్రహముచే ఆవేశించ బడినది, ఆత్మానమ్ - తనను, న అవబుధ్యత - తెలుసుకొనలేదు.

ఆ ఒక్క మేకపోతు అనేకములగు ఆడుమేకలకు ప్రీతిని వర్ధిల్ల జేయుచుండెను. కామమనే పిశాచముచే ఆవేశించబడిన ఆ మేకపోతు తనను తానే విస్మరించి విహరించెను.

తమేవ ప్రేష్ఠతమయా రమమాణమజాఽన్యయా ।
విలోక్య కూపసంవిగ్నా నామృష్యద్బస్తకర్మ తత్ ।। 7

తం ఏవ - ఆ మేకపోతునే, శ్రేష్ఠతమయా - మిక్కిలి ప్రియమైన, అన్యయా - మరియొక, అజయా - ఆడుమేకతో, రమమాణమ్ - రమించుచున్నదానిని, విలోక్య - చూచి, కూపసంవిగ్నా - నూతిలో పడిన మేక, తత్ - ఆ, బస్తకర్మ - మేకపోతు ప్రవృత్తిని, న అమృష్యత్ - సహించలేదు.

ఒకనాడు అదే మేకపోతు పూర్వము నూతిలో పడిన ఆడుమేక కంటె కూడ మిక్కిలి ప్రియమైన మరియొక ఆడుమేకతో విహరించుచుండెను. ఆ ఆడుమేక మేకపోతుయొక్క ఆ ప్రవృత్తి (మరియొక ఆడుమేకతో విహరించుట) ని చూచి ఓర్వలేకపోయెను.

తం దుర్హృదం సుహృద్రూపం కామినం క్షణసౌహృదమ్ ।
ఇంద్రియారామముత్సృజ్య స్వామినం దుఃఖితా యయౌ ।। 8

దుర్హృదమ్ - కపటముతో కూడినట్టియు, సుహృద్-రూపమ్ - మిత్రుని రూపములో నున్నట్టియు, కామినమ్ - కాముకుడైనట్టియు, క్షణ సౌహృదమ్ - క్షణమాత్రమే ప్రేమ కలిగినట్టియు, ఇంద్రియ-ఆరామమ్ - ఇంద్రియములకు వశుడైన, తమ్ - ఆ మేకపోతును, ఉత్సృజ్య - విడిచిపెట్టి, దుఃఖితా - దుఃఖితురాలై, స్వామినమ్ - తన ప్రభువును గురించి, యయౌ - వెళ్లెను.

కాముకుడైన ఆ మేకపోతు మిత్రుని రూపములోనున్న కపట స్వభావుడు. ఆతడు చూపే ప్రేమ క్షణికము మాత్రమే. ఆ ఆడు మేక దుఃఖితురాలై ఇంద్రియములకు వశుడై యున్న ఆ మేకపోతును విడిచిపెట్టి తన ప్రభువు (తండ్రి) వద్దకు వెళ్లిపోయెను.

సోఽపి చానుగతః స్త్రైణః కృపణస్తాం ప్రసాదితుమ్ ।
కుర్వన్నిడవిడాకారం నాశక్నోత్పథి సంధితుమ్ ।। 9

స్త్రైణః - స్త్రీకి వశుడైనవాడు, కృపణః - దీనుడు అగు, సః అపి చ - ఆ మేకపోతు కూడ, ఇడవిడాకారమ్ - మే మే అనే ధ్వనిని, కుర్వన్ - చేయుచున్నవాడై, తామ్ - ఆ ఆడుమేకను, ప్రసాదితుమ్ - ప్రసన్నము చేసుకొనుటకు, అనుగతః - వెంట వెళ్లినవాడు, పథి - మార్గమునందు, సంధితుమ్ - జట్టు గట్టుటకు, న అశక్నోత్ - సమర్థుడు కాలేదు.

స్త్రీకి వశవర్తియై దీనుడైయున్న ఆ మేకపోతు కూడ మే మే అనే ధ్వనిని చేస్తూ ఆ ఆడుమేకను ప్రసన్నము చేసుకొనుటకై దాని వెంట వెళ్లెను. మార్గమునందు ఆ ఆడుమేకతో జత గట్టుటకు ప్రయత్నించిననూ, మేకపోతునకు అది చేతగాలేదు.

తస్యాస్తత్ర ద్విజః కశ్చిదజా స్వామ్యచ్ఛినద్రుషా ।
లంబంతం వృషణం భూయస్సందధేఽర్థాయ యోగవిత్ ।। 10

తత్ర - అచట, అజా - ఏ ఆడుమేక గలదో, తస్యాః - దానియొక్క, స్వామీ - తండ్రియగు, కశ్చిత్ - ఒకానొక, ద్విజః - బ్రాహ్మణుడు, రుషా - కోపముతో, లంబంతమ్ - వ్రేలాడుచున్న, వృషణమ్ - అండమును, అచ్ఛినత్ - కోసెను, యోగవిత్ - ఉపాయముల నెరింగిన ఆ బ్రాహ్మణుడు, అర్థాయ - ప్రయోజనము కొరకు, భూయః - మరల, సందధే - అతికించెను.

ఆ ఆడుమేక ప్రభువు (తండ్రి) ఒకానొక బ్రాహ్మణుడు. ఆయన కోపముతో పోతు మేకయొక్క వ్రేలాడుచున్న అండమును కోసివేసెను. కాని, ఆయన అనేకములగు ఉపాయములు తెలిసినవాడు. తన కుమార్తెయగు ఆడుమేకకు ప్రయోజనమును చేకూర్చుటకై ఆయన పోతుమేకకు అండము మరల అదుకుకొనునట్లు చేసెను.

సంబద్ధవృషణస్సోఽపి హ్యజయా కూపలబ్ధయా ।
కాలం బహుతిథం భద్రే కామైర్నాద్యాపి తుష్యతి ।। 11

భద్రే - ఓ కల్యాణీ!, సంబద్ధవృషణః - అదికించబడిన అండము గల, సః అపి - ఆ పోతుమేక కూడ, కూపలబ్ధయా - నూతియందు పొందబడిన, అజయా - ఆడుమేకతో కూడి, బహుతిథమ్ - చాల రోజుల, కాలమ్ - కాలమును, కామైః - కామనలచే, అద్య అపి - ఈ నాటికి కూడ, న తుష్యతి - సంతోషమును చెందుట లేదు.

ఓ కల్యాణీ! అండమును అదికించిన తరువాత ఆ పోతుమేక తనకు నూతియందు దొరికిన ఆడుమేకతో కూడి చాల కాలము కామనల

ననుభవించెను. అయిననూ, ఆ పోతుమేకకు ఈనాటికీ కామనల యెడల సంతృప్తి కలుగలేదు.

తథాऽహం కృపణస్సుభ్రు భవత్యాః ప్రేమయంత్రితః ।
ఆత్మానం నాభిజానామి మోహితస్తవ మాయయా ॥ 12

సుభ్రు - అందమైన కనుబొమలు గలదానా!, తథా - అదే విధముగా, అహమ్ - నేను, భవత్యాః - నీయొక్క, ప్రేమయంత్రితః - ప్రేమచే నియంత్రించ బడినవాడనై, తవ - నీయొక్క, మాయయా - మాయచే, మోహితః - వ్యామోహితుడనై, ఆత్మానమ్ - నన్ను, న అభిజానామి - తెలియకున్నాను.

అందమైన కనుబొమలు గల ఓ దేవయానీ! నేను కూడ అదే స్థితిలో ఉన్నాను. నేను నీ ప్రేమకు కట్టివేయబడి నీ మాయచే వ్యామోహితుడనై నా స్వరూపమును నేను తెలియకున్నాను.

యత్పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవః స్త్రియః ।
న దుహ్యంతి మనఃప్రీతిం పుంసః కామహతస్య తే ॥ 13

పృథివ్యామ్ - భూలోకమునందు, యత్ - ఏ, వ్రీహియవమ్ - ధాన్యము బార్లీలు, హిరణ్యమ్ - బంగారము, పశవః - పశువులు, స్త్రియః - స్త్రీలు గలరో, తే - అవి, కామహతస్య - కామనలచే వినష్టుడైన, పుంసః - వ్యక్తికి, మనఃప్రీతిమ్ - మనస్సునకు ప్రీతిని, న దుహ్యంతి - పూరించవు.

భూలోకములో ఎంత ధాన్యము, బార్లీ మొదలైన పంటలు గలవో, పాడిపశువులు బంగారము ప్రియురాండ్రు (పరిచారికలు) గలరో, అవి అన్నీ కలిసి కూడ కామనలచే వినష్టుడైన వ్యక్తి మనస్సునకు సంతృప్తిని (పూర్ణత్వమును) కలిగించ లేవు.

న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి ।
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే ॥ 14

కామః - కామన, జాతు - ఏనాడైననూ, కామానామ్ - కామనల యొక్క, ఉపభోగేన - భోగించుటచే, న శామ్యతి - చల్లారదు, హవిషా - నేతితో, కృష్ణవర్త్మా ఇవ - నల్లని మార్గము గల అగ్ని వలె, భూయః - అధికముగా, అభివర్ధతే ఏవ - వర్ధిల్లుచునే యుండును.

విషయభోగములయందలి తృష్ణ విషయభోగములను అనుభవించుటచే ఏ నాడైననూ చల్లారదు. అగ్ని తాను పయనించిన దారినంతనూ మసి చేయును. ఆ అగ్నికి నేతిని పోస్తే చల్లారదు; పైగా, మరింత వర్ధిల్లును. అదే విధముగా భోగానుభవములచే సర్వమును నాశము చేసే భోగతృష్ణ మరింత అధికముగా వర్ధిల్లును.

యదా న కురుతే భావం సర్వభూతేష్వమంగలమ్ ।
సమదృష్టేస్తదా పుంసస్సర్వాస్సుఖమయా దిశః ॥ 15

సర్వభూతేషు - సకలప్రాణులయందు, అమంగలమ్ - అశోభనమగు, భావమ్ - భావమును, యదా - ఎప్పుడైతే, న కురుతే - చేయడో, తదా - అప్పుడు, సమదృష్టేః - సమదర్శనము గల, పుంసః - వ్యక్తికి, సర్వాః - సకలములైన, దిశః - దిక్కులు, సుఖమయాః - ఆనందమును పొందించునవి.

సకలప్రాణులలో ఒకే పరమాత్మ సమానముగా ఉన్నాడు. కావున, ఆ పరమాత్మనే దర్శించి ఏ ప్రాణియందైననూ అశోభనమగు వైషమ్యభావమును ఏనాడైతే వ్యక్తి చేయడో, ఆ నాడు అట్టి సమదర్శనము గల వ్యక్తికి సకలదిక్కులు ఆనందమును పొందించును.

యా దుస్త్యజా దుర్మతిభిర్జీర్యతో యా న జీర్యతే ।
తాం తృష్ణాం దుఃఖనివహాం శర్మకామో ద్రుతం త్యజేత్ ॥ 16

దుర్మతిభిః - దుర్బుద్ధులచే, యా - ఏ తృష్ణ, దుస్త్యజా - విడిచిపెట్ట శక్యము కానిదియో, జీర్యతః - ముసలిదనముచే శిథిలమగుచున్న వ్యక్తియొక్క, యా - ఏ తృష్ణ, న జీర్యతే - శిథిలము కాదో, దుఃఖనివహామ్ - దుఃఖములకు నిలయమైన, తామ్ - అట్టి, తృష్ణామ్ - పేరాసను,

శర్మకామః - కల్యాణములను కోరేవాడు, ద్రుతమ్ - తొందరగా, త్యజేత్ - విడిచి పెట్టవలెను.

దుర్బుద్ధి గలవారు భోగములయందలి తృష్ణను విడిచి పెట్టలేరు. వ్యక్తియొక్క దేహము ముసలిదనముచే శిథిలమగుచున్ననూ, వాని తృష్ణ మాత్రము శిథిలము కాదు. దుఃఖములకు నిలయమగు అట్టి తృష్ణను కల్యాణములను కోరువాడు తొందరగా విడిచి పెట్టవలెను.

మాత్రా స్వస్రా దుహిత్రా వా నావివిక్తాసనో భవేత్ ।
బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి ।। 17

మాత్రా - తల్లితో గాని, స్వస్రా - చెల్లెలుతో గాని, దుహిత్రా వా - కుమార్తెతో గాని, అవివిక్త-ఆసనః - వేరు గాని ఆసనము గలవాడు, న భవేత్ - కారాదు, బలవాన్ - బలవంతమైన, ఇంద్రియగ్రామః - ఇంద్రియముల సముదాయము, విద్వాంసం అపి - విద్వాంసుని కూడ, కర్షతి - లాగివేయును.

తల్లితో గాని, చెల్లెలుతో గాని, కుమార్తెతో గాని ఒకే ఆసనమునందు కూర్చుండరాదు. ఇంద్రియముల సముదాయమునకు చాల బలము గలదు. అది విద్వాంసునినైయైననూ (భోగతృష్ణలోనికి) లాగివేయును.

పూర్ణం వర్షసహస్రం మే విషయాన్ సేవతోఽసకృత్ ।
తథాపి చానుసవనం తృష్ణా తేషూపజాయతే ।। 18

అసకృత్ - మరల మరల, విషయాన్ - ఇంద్రియభోగములను, సేవతః - సేవించుచున్న, మే - నాకు, వర్షసహస్రమ్ - వేయి సంవత్సరములు, పూర్ణమ్ - నిండెను, తథాపి - అయినప్పటికీ, అనుసవనమ్ - ఆయా కాలములయందు, తేషు - వాటియందు, తృష్ణా - తృష్ణ, ఉపజాయతే చ - పుట్టుచునే యున్నది.

నేను వేయి సంవత్సరములనుండి నిరంతరముగా ఇంద్రియభోగముల ననుభవించుచునే యున్నాను. అయినప్పటికీ, ఆయా కాలములయందు ఆ భోగములపై తృష్ణ ఉదయించుచునే యున్నది.

తస్మాదేతామహం త్యక్త్వా బ్రహ్మణ్యాధాయ మానసమ్ ।
నిర్ద్వంద్వో నిరహంకారశ్చరిష్యామి మృగైస్సహ ।। 19

తస్మాత్ - అందువలన, అహమ్ - నేను, ఏతామ్ - ఈ భోగతృష్ణను, త్యక్త్వా - విడిచిపెట్టి, బ్రహ్మణి - పరబ్రహ్మయందు, మానసమ్ - మనస్సును, ఆధాయ - నిలిపి, నిర్ద్వంద్వః - సుఖదుఃఖాది ద్వంద్వములు లేనివాడనై, నిరహంకారః - అహంకారము లేనివాడనై, మృగైః సహ - మృగములతో బాటుగా, చరిష్యామి - సంచరించెదను.

కావున, నేనీ భోగములయందలి తృష్ణను విడిచి పెట్టెదను. నేను పరబ్రహ్మయందు మనస్సును నిలిపి సుఖదుఃఖాది ద్వంద్వములకు అతీతుడనగుదును. నేను అహంకారము లేనివాడనై మృగములతో బాటుగా అడవిలో సంచరించెదను.

దృష్టం శ్రుతమసద్బుద్ధ్వా నానుధ్యాయేన్న సంవిశేత్ ।
సంసృతిం చాత్మనాశం చ తత్ర విద్వాన్ స ఆత్మదృక్ ।। 20

దృష్టమ్ - కనబడేది, శ్రుతమ్ - వినబడేది, అసత్ - మిథ్యయని, తత్ర - దృష్టశ్రుతములగు భోగములయందు, సంసృతిం చ - సంసారబంధమును, ఆత్మనాశమ్ - తాను వినష్టమగుటను కూడ, బుద్ధ్వా - తెలుసుకొని, న అనుధ్యాయేత్ - ధ్యానించరాదు, న సంవిశేత్ - భోగించరాదు, సః - అట్టి, విద్వాన్ - వివేకి, ఆత్మదృక్ - ఆత్మజ్ఞానము గలవాడు.

కనబడే (ఇహలోకమునందలి) మరియు వినబడే (పరలోకమునందలి) భోగములు మిథ్య. వాటియందు తగుల్కొన్న మానవుడు సంసారమునందు బద్ధుడై తాను వినాశమును పొందును. ఈ సత్యమును తెలుసుకొని సాధకుడు అట్టి భోగముల గురించి ధ్యానించరాదు; వాటిని భోగించరాదు. అట్టి వివేకము గల సాధకుడు ఆత్మజ్ఞానమును పొందును.

ఇత్యుక్త్వా నాహుషో జాయాం తదీయం పూరవే వయః ।
దత్త్వా స్వాం జరసం తస్మాదాదదే విగతస్పృహః ।। 21

విగతస్పృహః - తొలగిన కామనలు గల, నాహుషః - నహుషుని పుత్రుడగు యయాతి, జాయామ్ - భార్యయగు దేవయానిని ఉద్దేశించి, ఇతి - ఇట్లు, ఉక్త్వా - పలికి, పూరవే - పూరువు కొరకు, తదీయమ్ - ఆతనికి చెందిన, వయః - యౌవనమును, దత్త్వా - ఇచ్చి, స్వామ్ - తనదైన, జరసమ్ - వృద్ధాప్యమును, తస్మాత్ - ఆతనినుండి, ఆదదే - తీసుకొనెను.

నహుషపుత్రుడగు యయాతికి కామనలు తొలగిపోయెను. ఆయన భార్యతో ఈ విధముగా పలికి, పూరువునకు ఆతని యౌవనమును ఇచ్చివేసి, తన ముసలిదనమును తాను స్వీకరించెను.

దిశి దక్షిణపూర్వస్యాం ద్రుహ్యుం దక్షిణతో యదుమ్ ।
ప్రతీచ్యాం తుర్వసుం చక్ర ఉదీచ్యామనుమీశ్వరమ్ ॥ 22

దక్షిణపూర్వస్యాం దిశి - ఆగ్నేయదిక్కునందు, ద్రుహ్యుమ్ - ద్రుహ్యుని, దక్షిణతః - దక్షిణదిక్కునందు, యదుమ్ - యదువును, ప్రతీచ్యామ్ - పడమర దిక్కునందు, తుర్వసుమ్ - తుర్వసుని, ఉదీచ్యామ్ - ఉత్తరదిక్కునందు, అనుమ్ - అనువును, ఈశ్వరమ్ - ప్రభువునుగా, చక్రే - చేసెను.

ఆయన ఆగ్నేయదిక్కునందు ద్రుహ్యుని, దక్షిణమునందు యదువును, పడమర దిక్కునందు తుర్వసుని, ఉత్తరమునందు అనువును ప్రభువుగా నియమించెను.

భూమండలస్య సర్వస్య పూరుమర్హత్తమం విశామ్ ।
అభిషిచ్యాగ్రజాంస్తస్య వశే స్థాప్య వనం యయౌ ॥ 23

సర్వస్య - సకలమైన, భూమండలస్య - భూమండలముయొక్క, విశామ్ - సంపదలకు, అర్హత్తమమ్ - సర్వాధికమగు యోగ్యత గల, పూరుమ్ - పూరువును, అభిషిచ్య - అభిషేకించి, అగ్రజాన్ - అన్నలను, తస్య - ఆయనయొక్క, వశే - అధీనమునందు, స్థాప్య - స్థాపించి, వనమ్ - అడవిని గురించి, యయౌ - వెళ్లెను.

సకలభూమండలముయొక్క సంపదలకు సర్వాధికమగు యోగ్యత గలవాడు పూరువు. యయాతి ఆ పూరువును చక్రవర్తిగా అభిషేకించి, అన్నలను ఆయన అధీనములో ఉంచి, తాను అడవికి వెళ్లెను.

ఆసేవితం వర్షపూగాన్ షడ్వర్గం విషయేషు సః ।
క్షణేన ముముచే నీడం జాతపక్ష ఇవ ద్విజః ।। 24

సః - ఆ యయాతి, వర్షపూగాన్ - అనేక సంవత్సరములను, విషయేషు - ఇంద్రియభోగములయందు, ఆసేవితమ్ - అనుభవించబడిన, షడ్-వర్గమ్ - ఆరు ఇంద్రియముల సుఖమును, క్షణేన - క్షణకాలముచే, జాతపక్షః - పుట్టిన రెక్కలు గల, ద్విజః - పక్షి, నీడం ఇవ - గూడును వలె, ముముచే - విడిచి పెట్టెను.

ఆ యయాతి అనేక సంవత్సరములు నిరంతరముగా ఆరు ఇంద్రియములతో విషయభోగముల ననుభవించెను. కాని, ఆయన అట్టి ఆరు ఇంద్రియముల సుఖములను క్షణకాలములో, రెక్కలు వచ్చిన పక్షి గూడును వలె, విడిచిపెట్టెను.

స తత్ర నిర్ముక్తసమస్తసంగ ఆత్మానుభూత్యా విధుతత్రిలింగః ।
పరేఽమలే బ్రహ్మణి వాసుదేవే లేభే గతిం భాగవతీం ప్రతీతః ।। 25

నిర్ముక్తసమస్తసంగః - విడిచిపెట్టబడిన సకలములైన ఆసక్తులు గలవాడు, ఆత్మానుభూత్యా - స్వరూప సాక్షాత్కారముచే, విధుతత్రిలింగః - తుడిచిపెట్టబడిన మూడు గుణముల కార్యమైన లింగ దేహము గలవాడు, ప్రతీతః - ప్రఖ్యాతుడు అగు, సః - ఆ యయాతి, తత్ర - ఆ అడవియందు, పరే - ప్రకృతికి అతీతమైనట్టియు, అమలే - గుణసంగము లేనట్టియు, వాసుదేవే - సకలజగత్తునకు అధిష్ఠానమగు చైతన్యస్వరూపమైనట్టియు, బ్రహ్మణి - పరబ్రహ్మయందు, భాగవతీమ్ - భగవంతుని ఉపాసనచే పొందబడే, గతిమ్ - మోక్షమును, లేభే - పొందెను.

లోకప్రసిద్ధి చెందిన ఆ యయాతి సకలములైన ఆసక్తులను విడిచిపెట్టెను. జీవుని లింగదేహము మూడు గుణముల కార్యము. దానిని ఆయన జ్ఞానాగ్నిచే పూర్తిగా వినష్టము చేసెను. ఆయన ఆ అడవిలో భగ

వానుని ఉపాసనచే పొందబడే మోక్షమును పొందెను. ప్రకృతికి అతీతము, గుణసంగము లేనిది, సకలజగత్తునకు అధిష్ఠానము, చైతన్యఘనము అగు పరబ్రహ్మయందు ఆయన విలీనమాయెను.

శ్రుత్వా గాథాం దేవయానీ మేనే ప్రస్తోభమాత్మనః ।
స్త్రీపుంసోస్స్నేహవైక్లబ్యాత్పరిహాసమివేరితమ్ ॥ 26

దేవయానీ - దేవయాని, గాథామ్ - గీతిని, శ్రుత్వా - విని, ఆత్మనః - తనకు, ప్రస్తోభమ్ - నిందనుగా, స్త్రీపుంసోః - స్త్రీపురుషుల యొక్క, స్నేహవైక్లబ్యాత్ - ప్రేమయొక్క కలవరము వలన, ఈరితమ్ - చెప్పబడిన, పరిహాసం ఇవ - పరిహాసమును వలె, మేనే - తలచెను.

ఆ గీతిని విని దేవయాని తనను యయాతి నిందించుచున్నాడని తలచెను. స్త్రీపురుషుల మధ్యనుండే ప్రేమకు వియోగము కలిగినప్పుడు కలవరము కలుగను. అది లేకుండా నుండుటకై యయాతి ఈ గీతిని పరిహాసమును చెప్పినట్లు చెప్పినాడని ఆమె తలపోసెను.

సా సంనివాసం సుహృదాం ప్రపాయామివ గచ్ఛతామ్ ।
విజ్ఞాయేశ్వరతంత్రాణాం మాయావిరచితం ప్రభోః ॥ 27

సర్వత్ర సంగముత్సృజ్య స్వప్నౌపమ్యేన భార్గవీ ।
కృష్ణే మనస్సమావేశ్య వ్యధునోల్లింగమాత్మనః ॥ 28

భార్గవీ - భృగువంశీయురాలగు, సా - ఆ దేవయాని, ఈశ్వరతంత్రాణామ్ - ఈశ్వరునకు అధీనులైయుండే, సుహృదామ్ - బంధువుల యొక్క, సంనివాసమ్ - సహవాసమును, గచ్ఛతామ్ - బాటసారులకు, ప్రపాయాం ఇవ - చలివేంద్రము వద్ద వలె, ప్రభోః - ఈశ్వరునియొక్క, మాయావిరచితమ్ - మాయచే చేయబడినదానినిగా, విజ్ఞాయ - తెలుసుకొని, స్వప్న-ఔపమ్యేన - స్వప్నదృష్టాంతముచే, సర్వత్ర - సకలమునందు, సంగమ్ - ఆసక్తిని, ఉత్సృజ్య - విడిచిపెట్టి, కృష్ణే - శ్రీకృష్ణునియందు, మనః - మనస్సును, సమావేశ్య - చక్కగా నిలిపి, ఆత్మనః - తన యొక్క, లింగమ్ - లింగశరీరమును, వ్యధునోత్ - విడిచిపెట్టెను.

భృగువంశీయురాలగు ఆ దేవయాని తండ్రి-భర్త మొదలగు బంధువులతోడి సహవాసము చలివేంద్రము వద్ద బాటసారులు కలుసుకొనుట వంటిదేనని గుర్తించెను. మానవులందరు ఈశ్వరుని అధీనములో ఉన్నవారై అవిద్యకు లోబడి ఇట్టి బంధములను నిర్మించుకొనెదరు. ఈ జగత్తు స్వప్నమువలె మిథ్యయని ఆమె తెలుసుకొనెను. ఆమె పతిపుత్రరాజ్యాదులన్నింటియందు ఆసక్తిని విడిచిపెట్టి, మనస్సులో శ్రీకృష్ణుని పూర్తిగా నింపుకొని, తన లింగశరీరము (వ్యక్తిత్వ పరిచ్ఛేదము) ను భంగము చేసుకొనెను (ఈశ్వరునిలో విలీనమయ్యెను).

నమస్తుభ్యం భగవతే వాసుదేవాయ వేధసే ।
సర్వభూతాధివాసాయ శాంతాయ బృహతే నమః ॥ 29

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం
నవమస్కంధే ఏకోనవింశోఽధ్యాయః ॥

వాసుదేవాయ - సకలజగత్తునకు సత్తాస్ఫూర్తులననుగ్రహించే చైతన్యఘనుడైనట్టియు, వేధసే - జగత్తును సృష్టించినట్టియు, సర్వభూత -అధివాసాయ - సకలప్రాణులకు ఆశ్రయమైనట్టియు, శాంతాయ - శాంతుడైనట్టియు, బృహతే - దేశపరిచ్ఛేదములు లేనట్టియు, భగవతే - శ్రీహరి భగవానుడవగు, తుభ్యమ్ - నీ కొరకు, నమః నమః - అనేక నమస్కారములు.

ఓ శ్రీహరీ! సకలజగత్తునకు సత్తాస్ఫూర్తులననుగ్రహించే చైతన్యఘనుడవు నీవే. జగత్తును సృష్టించి సకలప్రాణులకు ఆశ్రయమైనది నీవే. గుణప్రవాహమునకు అతీతమగు శాంతతత్త్వము నీవే. దేశకాలపరిచ్ఛేదములకు అతీతుడవగు నీ కొరకు అనేక నమస్కారములు -- అని దేవయాని పలికెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
యయాతి గీతిని వర్ణించే పందొమ్మిదవ అధ్యాయము ముగిసినది (19).



# అథ వింశోऽధ్యాయః

## శకుంతలా దుష్యంతుల గాథ - భరతుని రాజ్య పాలనము

శ్రీశుక ఉవాచ।
పూరోర్వంశం ప్రవక్ష్యామి యత్ర జాతోऽసి భారత ।
యత్ర రాజర్షయో వంశ్యా బ్రహ్మవంశ్యాశ్చ జజ్ఞిరే ।। 1

భారత - భరతవంశీయుడవగు ఓ రాజా!, పూరోః - పూరువుయొక్క, వంశమ్ - వంశమును గురించి, ప్రవక్ష్యామి - చెప్పగలను, యత్ర - ఏ వంశమునందైతే, జాతః - పుట్టినవాడవు, అసి - అగుచున్నావో, యత్ర - ఏ వంశమునందైతే, వంశ్యాః - వంశమును వర్ధిల్లజేసిన, రాజర్షయః - రాజర్షులు, బ్రహ్మవంశ్యాః చ - వంశమును వర్ధిల్ల జేసిన బ్రహ్మవేత్తలు కూడ, జజ్ఞిరే - జన్మించిరో.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- భరతవంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! ఇప్పుడు పూరువుయొక్క వంశమును వర్ణించెదను. ఈ వంశమునందే నీవు జన్మించితివి. ఈ వంశములో వంశవర్ధనులగు రాజర్షులు మరియు బ్రహ్మర్షులు కూడ జన్మించిరి.

జనమేజయో హ్యభూత్పూరోః ప్రచిన్వాంస్తత్సుతస్తతః ।
ప్రవీరోऽథ నమస్యుర్వై తస్మాచ్చారుపదోऽభవత్ ।। 2

పూరోః - పూరువునుండి, జనమేజయః - జనమేజయుడు, అభూత్ - కలిగెను, తత్-సుతః - ఆయన పుత్రుడు, ప్రచిన్వాన్ - ప్రచిన్వంతుడు, తతః - ఆయన వలన, ప్రవీరః - ప్రవీరుడు, అథ వై - ఆయన వలనైతే, నమస్యుః - నమస్యువు, తస్మాత్ - ఆయన వలన, చారుపదః - చారుపదుడు, అభవత్ - కలిగెను.

పూరువుయొక్క పుత్రుడు జనమేజయుడు. జనమేజయుని పుత్రుడు ప్రచిన్వంతుడు. ప్రచిన్వంతుని పుత్రుడు ప్రవీరుడు. ప్రవీరుని పుత్రుడు నమస్యువు. నమస్యుని పుత్రుడు చారుపదుడు.

తస్య సుద్యురభూత్పుత్రస్తస్మాద్బహుగవస్తతః ।
సంయాతిస్తస్యాహంయాతీ రౌద్రాశ్వస్తత్సుతస్స్మృతః ॥ 3

తస్య - ఆయనకు, సుద్యుః - సుద్యువు అనే, పుత్రః - పుత్రుడు, అభూత్ - కలిగెను, తస్మాత్ - ఆయన వలన, బహుగవః - బహుగవుడు, తతః - ఆయన వలన, సంయాతిః - సంయాతి, తస్య - ఆయనకు, అహంయాతిః - అహంయాతి, తత్-సుతః - ఆయనయొక్క పుత్రుడు, రౌద్రాశ్వః - రౌద్రాశ్వుడని, స్మృతః - చెప్పబడినవాడు.

చారుపదుని పుత్రుడు సుద్యువు. సుద్యువు పుత్రుడు బహుగవుడు. బహుగవుని పుత్రుడు సంయాతి. సంయాతి పుత్రుడు అహంయాతి. అహంయాతి పుత్రుడు రౌద్రాశ్వుడు.

ఋతేయుస్తస్య కుక్షేయుః స్థండిలేయుః కృతేయుకః ।
జలేయుస్సంతతేయుశ్చ ధర్మసత్యవ్రతేయవః ॥ 4

దశైతేఽప్సరసః పుత్రా వనేయుశ్చావమస్స్మృతః ।
ఘృతాచ్యామింద్రియాణీవ ముఖ్యస్య జగదాత్మనః ॥ 5

తస్య - ఆయనకు, ఘృతాచ్యామ్ - ఘృతాచియందు, ఋతేయుః - ఋతేయువు, కుక్షేయుః - కుక్షేయువు, స్థండిలేయుః - స్థండిలేయువు, కృతేయుకః - కృతేయువు, జలేయుః - జలేయువు,. సంతతేయుః చ - సంతతేయువు, ధర్మసత్యవ్రత-ఈయవః - ధర్మేయువు సత్యేయువు వ్రతేయువులు, అవమః చ - ఆఖరివాడు, వనేయుః - వనేయువు అని, స్మృతః - చెప్పబడినవాడు, ఏతే - ఈ, దశ - పదిమంది, అప్సరసః - అప్సరసయొక్క, పుత్రాః - పుత్రులు, జగద్-ఆత్మనః - ప్రాణి కోటికి ఆత్మయైన, ముఖ్యస్య - ముఖమునందలి ప్రాణమునకు, ఇంద్రియాణి ఇవ - పది ఇంద్రియములు వలె.

ఆ రౌద్రాశ్వునకు ఘృతాచి అనే అప్సరసయందు -- ప్రాణికోటికి ఆత్మయైన ముఖ్య (ప్రధాన) ప్రాణమునకు పది ఇంద్రియములు (అయిదు కర్మేంద్రియములు, అయిదు జ్ఞానేంద్రియములు) వలె -- పది మంది పుత్రులు కలిగిరి. ఋతేయువు, కుక్షేయువు, స్థండిలేయువు, కృతేయువు, జలేయువు, సంతతేయువు, ధర్మేయువు, సత్యేయువు, వ్రతేయువు, వనే యువు అనునవి వారి పేర్లు. వీరిలో వనేయువు ఆఖరివాడు.

ఋతేయో రంతిభారోఽభూత్త్రయస్తస్యాత్మజా నృప ।
సుమతిర్ధ్రువోఽప్రతిరథః కణ్వోఽప్రతిరథాత్మజః ॥ 6

నృప - ఓ రాజా!, ఋతేయోః - ఋతేయువు వలన, రంతిభారః - రంతిభారుడు, అభూత్ - కలిగెను, తస్య - ఆయనకు, త్రయః - ముగ్గు రు, ఆత్మజాః - పుత్రులు, సుమతిః - సుమతి, ధ్రువః - ధ్రువుడు, అప్రతి రథః - అప్రతిరథుడు, అప్రతిరథ-ఆత్మజః - అప్రతిరథుని పుత్రుడు, కణ్వః - కణ్వుడు.

ఓ పరీక్షిన్మహారాజా! ఋతేయువుయొక్క పుత్రుడు రంతిభారుడు. రంతిభారునకు సుమతి, ధ్రువుడు, అప్రతిరథుడు అనే ముగ్గురు పుత్రులు కలిగిరి. అప్రతిరథుని పుత్రుడు కణ్వుడు.

తస్య మేధాతిథిస్తస్మాత్ప్రస్కణ్వాద్యా ద్విజాతయః ।
పుత్రోఽభూత్సుమతే రైభ్యో దుష్యంతస్తత్సుతో మతః ॥ 7

తస్య - ఆయనకు, మేధాతిథిః - మేధాతిథి, తస్మాత్ - ఆయన వలన, ప్రస్కణ్వ-ఆద్యాః - ప్రస్కణ్వుడు మొదలుగా గల, ద్విజాతయః - బ్రాహ్మణులు, సుమతేః - సుమతి వలన, రైభ్యః - రైభ్యుడనే, పుత్రః - పుత్రుడు, అభూత్ - కలిగెను, తత్-సుతః - ఆయన పుత్రుడు, దుష్యంతః - దుష్యంతుడని, మతః - చెప్పబడినవాడు.

కణ్వుని పుత్రుడు మేధాతిథి. ఆయననుండియే ప్రస్కణ్వుడు మొదలగు బ్రాహ్మణులు ఉదయించిరి. సుమతి (రంతిభారుని పుత్రుడు) యొక్క పుత్రుడు రైభ్యుడు. రైభ్యుని పుత్రుడు దుష్యంతుడు.

దుష్యంతో మృగయాం యాతః కణ్వాశ్రమపదం గతః ।
తత్రాసీనాం స్వప్రభయా మండయంతీం రమామివ ॥ 8

విలోక్య సద్యో ముముహే దేవమాయామివ స్త్రియమ్ ।
బభాషే తాం వరారోహాం భటైః కతిపయైర్వృతః ॥ 9

దుష్యంతః - దుష్యంతుడు, కతిపయైః - కొద్దిమంది, భటైః - భటులచే, వృతః - చుట్టువారబడినవాడై, మృగయామ్ - వేటను గురించి, యాతః - వెళ్లినవాడై, కణ్వ-ఆశ్రమపదమ్ - కణ్వమహర్షియొక్క ఆశ్రమ స్థానమును గురించి, గతః - వెళ్లినవాడు, తత్ర - అచట, ఆసీనామ్ - కూర్చున్నట్టియు, స్వప్రభయా - తన కాంతిచే, మండయంతీమ్ - అలంక రించుచున్నట్టియు, రమాం ఇవ - లక్ష్మీదేవి వలెనున్నట్టియు, దేవ మాయాం ఇవ - దేవమాయయా యన్నట్లు ఉన్న, స్త్రియమ్ - యువతి ని, విలోక్య - చూచి, సద్యః - వెంటనే, ముముహే - మోహమును పొందె ను, తామ్ - ఆ, వరారోహామ్ - సుందరిని ఉద్దేశించి, బభాషే - మాట లాడెను.

దుష్యంతుడు కొద్దిమంది భటులు చుట్టువారి రాగా వేటకు వెళ్లి, కణ్వమహర్షియొక్క ఆశ్రమస్థానమునకు వెళ్లెను. అచట కూర్చుండియున్న లక్ష్మీదేవివంటి ఒక స్త్రీని చూచెను. ఆమె తన కాంతిచే ఆ ఆశ్రమమునకే అలంకారమా యన్నట్లు ఉండెను. దేవమాయవంటి ఆ యువతిని చూచి ఆయన వెంటనే మోహమును పొందెను. అపుడాయన ఆ సుందరితో మాటలాడెను.

తద్దర్శనప్రముదితస్సన్నివృత్తపరిశ్రమః ।
పప్రచ్ఛ కామసంతప్తః ప్రహసన్ శ్లక్ష్ణయా గిరా ॥ 10

తద్-దర్శనప్రముదితః - ఆమెను చూచుటచే చాల హర్షమును పొందినవాడు, సన్నివృత్తపరిశ్రమః - పూర్తిగా తొలగిపోయిన అలసట గల వాడు, కామసంతప్తః - కామనచే మిక్కిలి తాపమును పొందినవాడు అగు దుష్యంతుడు, ప్రహసన్ - నవ్వుచున్నవాడై, శ్లక్ష్ణయా - మధురమగు, గిరా - వాక్కుతో, పప్రచ్ఛ - ప్రశ్నించెను.

ఆమెను చూచుటచే చాల హర్షమును పొందిన దుష్యంతునకు (వేట వలని) అలసట పూర్తిగా తొలగిపోయెను. (ఆమె యందలి) కామనచే మిక్కిలి తాపమును పొందిన ఆయన నవ్వుతూ మధురమగు వాక్కుతో ఆమెను ఇట్లు ప్రశ్నించెను.

కా త్వం కమలపత్రాక్షి కస్యాసి హృదయంగమే ।
కిం వా చికీర్షితం త్వత్ర భవత్యా నిర్జనే వనే ॥ **11**

కమలపత్ర-అక్షి - కలువ రేకుల కన్నుల దానా!, త్వమ్ - నీవు, కా - ఎవతెవు?, హృదయంగమే - హృదయమునాకర్షించే దానా!, కస్య - ఎవనిదానవు, అసి - అగుదువు?, భవత్యా తు - నీచేనైతే, అత్ర - ఈ, నిర్జనే - జనులు లేని, వనే - అడవియందు, కిం వా - ఎయ్యది, చికీర్షితమ్ - చేయగోర బడినది?

ఓ కలువ రేకుల కన్నుల దానా! నీవెవతెవు? నీవు నా హృదయమును దోచినావు సుమా! నీవు ఎవరి దానవు? నిర్జనమగు ఈ అడవిలో నీవు ఏమి చేయగోరుచున్నావు?

వ్యక్తం రాజన్యతనయాం వేద్మ్యహం త్వాం సుమధ్యమే ।
న హి చేతః పౌరవాణామధర్మే రమతే క్వచిత్ ॥ **12**

సుమధ్యమే - చక్కని నడుము దానా!, అహమ్ - నేను, త్వామ్ - నిన్ను, వ్యక్తమ్ - స్పష్టముగా, రాజన్యతనయామ్ - క్షత్రియుని కుమార్తెనుగా, వేద్మి - తెలియుచున్నాను, హి - ఏలయనగా, పౌరవాణామ్ - పూరువంశీయులయొక్క, చేతః - మనస్సు, క్వచిత్ - ఏనాడైననూ (ఎక్కడైననూ), అధర్మే - అధర్మమునందు, న రమతే - రమించదు.

ఓ చక్కని నడుము దానా! నీవు క్షత్రియకన్యవని స్పష్టముగా నాకు తెలియుచునే యున్నది. ఏలయనగా, పూరువంశీయుల మనస్సు ఏనాడైననూ (ఎక్కడైననూ) అధర్మమునందు రమించదు.

శకుంతలోవాచ ।
విశ్వామిత్రాత్మజైవాహం త్యక్తా మేనకయా వనే ।
వేదైతద్భగవాన్ కణ్వో వీర కిం కరవామ తే ।। 13

వీర - ఓ వీరుడా!, అహమ్ - నేను, విశ్వామిత్ర-ఆత్మజా ఏవ - విశ్వామిత్రుడనే క్షత్రియుని కుమార్తెనే, మేనకయా - మేనకచే, వనే - అడవియందు, త్యక్తా - విడిచిపెట్ట బడినదానను, భగవాన్ - పూజనీయుడగు, కణ్వః - కణ్వుడు, ఏతత్ - ఈ విషయమును, వేద - ఎరుగును, తే - నీ కొరకు, కిమ్ - దేనిని, కరవామ - మేము చేయవలెను?

శకుంతల ఇట్లు పలికెను --- ఓ వీరుడా! యథార్థమే. నేను విశ్వామిత్రుడనే క్షత్రియుని కుమార్తెనే. నన్ను మేనక అడవిలో విడిచి పెట్టినది. ఈ విషయము కణ్వమహర్షికి తెలియును. మేము నీకు చేయదగినది ఏమైన గలదా?

ఆస్యతాం హ్యరవిందాక్ష గృహ్యతామర్హణం చ నః ।
భుజ్యతాం సంతి నీవారా ఉష్యతాం యది రోచతే ।। 14

అరవిందాక్ష - పద్మములవంటి కన్నులు గలవాడా!, ఆస్యతాం హి - నిశ్చయముగా కూర్చుండ బడుగాక!, చ - మరియు, నః - మాయొక్క, అర్హణమ్ - పూజ, గృహ్యతామ్ - స్వీకరించబడు గాక!, నీవారాః - నివ్వెర ధాన్యపు సరుకులు, సంతి - కలవు, భుజ్యతామ్ - భుజించబడు గాక!, రోచతే యది - ఇష్టమైనచో, ఉష్యతామ్ - నివసించబడు గాక!

పద్మముల వంటి కన్నులు గలవాడా! సంశయించకుండా కూర్చుండుడు. మా పూజను స్వీకరించుడు. మా వద్ద నివ్వెర బియ్యపు సరుకులు గలవు. తమరు వాటిని భుజించుడు. తమకు ఇష్టమైనచో, ఇచట మకాము చేయుడు.

దుష్యంత ఉవాచ ।
ఉపపన్నమిదం సుభ్రు జాతాయాః కుశికాన్వయే ।
స్వయం హి వృణతే రాజ్ఞాం కన్యకాస్సదృశం వరమ్ ।। 15

సుభ్రు - అందమైన కనుబొమలు గలదానా!, కుశిక-అన్వయే - కుశికవంశమునందు, జాతాయాః - జన్మించిన నీకు, ఇదమ్ - ఇది, ఉపపన్నమ్ - తగియున్నది, హి - ఏలయనగా, రాజ్ఞామ్ - రాజుల, కన్యకాః - కన్యలు, సదృశమ్ - తగిన, వరమ్ - వరుని, స్వయమ్ - తామే, వృణతే - ఎన్నుకొనెదరు.

దుష్యంతుడిట్లు పలికెను --- అందమైన కనుబొమలు గలదానా! కుశిక వంశములో జన్మించిన నీవు ఇట్టి ఆతిథ్యమునిచ్చుట తగియే యున్నది. రాజకన్యకలు తామే తగిన వరుని ఎన్నుకొనెదరు సుమా!

ఓమిత్యు క్తే యథాధర్మముపయేమే శకుంతలామ్ ।
గాంధర్వవిధినా రాజా దేశకాలవిధానవిత్ ।। 16

ఓమ్ - అంగీకారమే, ఇతి - అని, ఉక్తే - పలుకబడగా, దేశకాలవిధానవిత్ - దేశకాలములను శాస్త్రవిధిని తెలిసియున్న, రాజా - దుష్యంత మహారాజు, శకుంతలామ్ - శకుంతలను, యథాధర్మమ్ - ధర్మమునతిక్రమించకుండగా, గాంధర్వవిధినా - గాంధర్వవివాహ పద్ధతిచే, ఉపయేమే - వివాహమాడెను.

దుష్యంత మహారాజు దేశకాలములను మరియు శాస్త్రవిధులను తెలిసినవాడు. శకుంతల తన అంగీకారమును తెలుపగానే, ఆయన ఆమెను ధర్మమును తప్పకుండా గాంధర్వవివాహ (పరస్పరము ప్రతిజ్ఞలను చేసుకొనుట) పద్ధతిలో వివాహము చేసుకొనెను.

అమోఘవీర్యో రాజర్షిర్మహిష్యాం వీర్యమాదధే ।
శ్వోభూతే స్వపురం యాతః కాలేనాసూత సా సుతమ్ ।। 17

అమోఘవీర్యః - అమోఘమగు శక్తి గల, రాజర్షిః - రాజర్షియగు దుష్యంతుడు, మహిష్యామ్ - భార్యయగు శకుంతలయందు, వీర్యమ్ - గర్భమును, ఆదధే - ఆధానము చేసెను, శ్వః-భూతే - తెల్లవారగానే, స్వపురమ్ - తన నగరమును గురించి, యాతః - వెళ్లినవాడు, కాలేన - కాలముచే, సా - ఆమె, సుతమ్ - పుత్రుని, అసూత - కనెను.

రాజర్షియగు దుష్యంతుడు అమోఘమగు శక్తి గలవాడు. ఆయన తన భార్యయగు శకుంతలయందు గర్భమును ఆధానము చేసెను. తెల్లవారగానే ఆయన తన నగరమునకు వెళ్లెను. ప్రసవకాలము సంప్రాప్తము కాగా, ఆమె పుత్రుని కనెను.

కణ్వః కుమారస్య వనే చక్రే సముచితాః క్రియాః ।
బద్ధ్వా మృగేంద్రాంస్తరసా క్రీడతి స్మ స బాలకః ।। 18

కుమారస్య - ఆ బాలకునకు, కణ్వః - కణ్వ మహర్షి, వనే - అడవియందు, సముచితాః - యోగ్యములైన, క్రియాః - క్రియలను, చక్రే - చేసెను, సః - ఆ, బాలకః - బాలుడు, మృగ-ఇంద్రాన్ - సింహములను, తరసా - బలముతో, బద్ధ్వా - బంధించి, క్రీడతి స్మ - ఆడెను.

ఆ బాలకునకు కణ్వ మహర్షి జాతకర్మ మొదలగు యథోచితములైన సంస్కారములను అడవిలోనే నిర్వర్తించెను. ఆ బాలుడు సింహములను బలముగా బంధించి వాటితో ఆడుకొనెడివాడు.

తం దురత్యయవిక్రాంతమాదాయ ప్రమదోత్తమా ।
హరేరంశాంశసంభూతం భర్తురంతికమాగమత్ ।। 19

దురత్యయవిక్రాంతమ్ - ఎదురు లేని పరాక్రమము కలిగినట్టియు, హరేః - శ్రీహరియొక్క, అంశ-అంశసంభూతమ్ - అంశయొక్క అంశతో పుట్టిన, తమ్ - ఆ బాలుని, ఆదాయ - తీసుకొని, ప్రమదా-ఉత్తమా - యువతులలో శ్రేష్ఠురాలగు శకుంతల, భర్తుః - భర్తయగు దుష్యంతునియొక్క, అంతికమ్ - సమీపమును గురించి, ఆగమత్ - వచ్చెను.

శ్రీహరియొక్క అంశయొక్క అంశతో పుట్టిన ఆ బాలకుడు ఎదురులేని పరాక్రమము గలవాడు. యువతులలో శ్రేష్ఠురాలగు శకుంతల ఆ బాలకుని తీసుకొని తన భర్తయగు దుష్యంతుని దగ్గరకు వచ్చెను.

యదా న జగృహే రాజా భార్యాపుత్రావనిందితౌ ।
శృణ్వతాం సర్వభూతానాం ఖే వాగాహాశరీరిణీ ।। 20

అనిందితౌ - దోషము లేని, భార్యాపుత్రౌ - భార్యను పుత్రుని, యదా - ఎప్పుడైతే, రాజా - దుష్యంత మహారాజు, న జగృహే - స్వీకరించలేదో అప్పుడు, సర్వభూతానామ్ - సకలప్రాణులు, శృణ్వతామ్ - వినుచుండగా, ఖే - ఆకాశమునందు, అశరీరిణీ - శరీరము లేని, వాక్ - వాక్కు, ఆహ - పలికెను.

దోషము లేని ఆ భార్యను, పుత్రుని దుష్యంత మహారాజు స్వీకరించ లేదు. అప్పుడు సకలప్రాణులు వినుచుండగా ఆకాశమునందు అశరీరవాణి ఇట్లు పలికెను.

మాతా భస్త్రా పితుః పుత్రో యేన జాతస్స ఏవ సః ।
భరస్వ పుత్రం దుష్యంత మాఽవమంస్థాశ్శకుంతలామ్ ॥ 21

మాతా - తల్లి, భస్త్రా - క్షేత్రము, పుత్రః - పుత్రుడు, పితుః - తండ్రికి చెందినవాడు, యేన - ఎవని ద్వారా, సః - ఆ పుత్రుడు, జాతః - పుట్టినాడో, సః ఏవ - ఆ తండ్రియే, దుష్యంత - ఓ దుష్యంతుడా!, పుత్రమ్ - పుత్రుని, భరస్వ - స్వీకరించుము, శకుంతలామ్ - శకుంతలను, మా అవమంస్థాః - అవమానించకుము.

పుత్రునకు తల్లి క్షేత్రము. పుత్రుడు వాస్తవములో తండ్రికి మాత్రమే చెందును. పుత్రుడు ఏ తండ్రి ద్వారా పుట్టునో, ఆ తండ్రికంటె భిన్నుడు కాడు. ఓ దుష్యంతా! పుత్రుని స్వీకరించి పాలించుము. శకుంతలను అవమానించకుము. (భరించుమని చెప్పుటచే ఆ బాలుడు భరతుడైనాడు).

రేతోధాః పుత్రో నయతి నరదేవ యమక్షయాత్ ।
త్వం చాస్య ధాతా గర్భస్య సత్యమాహ శకుంతలా ॥ 22

నరదేవ - ఓ మహారాజా!, రేతోధాః - వంశకర్తయగు, పుత్రః - పుత్రుడు, యమక్షయాత్ - యముని స్థానమునుండి, నయతి - తరింపజేయును, అస్య - ఈ, గర్భస్య - శిశువునకు, ధాతా - తండ్రివి, త్వం చ - నీవే, శకుంతలా - శకుంతల, సత్యమ్ - సత్యమును, ఆహ - పలికెను.

ఓ మహారాజా! వంశకర్తయగు పుత్రుడే తండ్రిని యమపురికి పోకుండా (నరకములో పడకుండా) తరింప జేయును. ఈ శిశువునకు తండ్రివి నీవే. శకుంతల సత్యమునే చెప్పుచున్నది.

పితర్యుపరతే సోఽపి చక్రవర్తీ మహాయశాః ।
మహిమా గీయతే తస్య హరేరంశభువో భువి ॥ 23

పితరి - తండ్రి, ఉపరతే - మరణించగా, సః అపి - ఆ బాలకుడు (భరతుడు) కూడ, చక్రవర్తీ - చక్రవర్తియై, మహాయశాః - గొప్ప కీర్తిని పొందినవాడు, హరేః - శ్రీహరియొక్క, అంశభువః - అంశ వలన జన్మించిన, తస్య - ఆ భరతునియొక్క, మహిమా - గొప్పదనము, భువి - భూలోకమునందు, గీయతే - గానము చేయబడుచున్నది.

తండ్రియగు దుష్యంతుడు మరణించిన తరువాత ఆ బాలకుడు (భరతుడు) చక్రవర్తియై గొప్ప కీర్తిని పొందెను. శ్రీహరియొక్క అంశ వలన జన్మించిన ఆ భరతుని గొప్పదనమును భూలోకములో జనులు కీర్తించుచున్నారు.

చక్రం దక్షిణహస్తేఽస్య పద్మకోశోఽస్య పాదయోః ।
ఈజే మహాభిషేకేణ సోఽభిషిక్తోఽధిరాడ్ విభుః ॥ 24

పంచపంచాశతా మేధ్యైర్గంగాయామను వాజిభిః ।

అస్య - ఈ భరతునియొక్క, దక్షిణహస్తే - కుడి చేతియందు, చక్రమ్ - చక్రము, అస్య - ఈయనయొక్క, పాదయోః - రెండు పాదములయందు, పద్మకోశః - పద్మపు మొగ్గ, మహా-అభిషేకేణ - గొప్ప అభిషేకముచే, అభిషిక్తః - అభిషేకించబడిన, సః - ఆ భరతుడు, విభుః - సర్వసమర్థుడు, అధిరాట్ - చక్రవర్తి, గంగాయాం అను - గంగాతీరమునందు, పంచపంచాశతా - ఏబై అయిదు, మేధ్యైః - పవిత్రములైన, వాజిభిః - అశ్వములతో, ఈజే - ఆరాధించెను.

ఈ భరతుని కుడిచేతియందు చక్రము, రెండు పాదములయందు పద్మపు మొగ్గలు (సాముద్రిక చిహ్నములైన చక్రవర్తి లక్షణములు)

ఉండెను. సర్వసమర్థుడగు ఆ భరతుడు గొప్ప అభిషేక క్రియ ద్వారా చక్ర వర్తిగా అభిషిక్తుడైనాడు. ఆయన గంగాతీరమునందు ఏభై అయిదు పవిత్ర ములైన అశ్వమేధ యాగములను చేసి ఈశ్వరుని ఆరాధించెను.

మామతేయం పురోధాయ యమునాయామను ప్రభుః ।। 25

అష్టసప్తతిమేధ్యాశ్వాన్ బబంధ ప్రదదద్వసు ।

ప్రభుః - భరత చక్రవర్తి, మామతేయమ్ - మమత పుత్రుడగు దీర్ఘ తమసుని, పురోధాయ - పురోహితునిగా చేసుకొని, యమునాయాం అను - యమునా తీరమునందు, వసు - సంపదను, ప్రదదత్ - దానము చేయు చున్నవాడై, అష్టసప్తతిమేధ్య-అశ్వాన్ - డెబ్బది ఎనిమిది పవిత్రములగు అశ్వములను, బబంధ - బంధించెను.

భరత చక్రవర్తి మమత పుత్రుడగు దీర్ఘతమసుని పురోహితునిగా చేసుకొని యమునా తీరమునందు డెబ్బది ఎనిమిది పవిత్రములగు అశ్వ మేధ యాగములను చేసి, సంపదను దానము చేసెను.

భరతస్య హి దౌష్యంతేరగ్నిస్సాచీగుణే చితః ।
సహస్రం బద్ధశో యస్మిన్ బ్రాహ్మణా గా విభేజిరే ।। 26

దౌష్యంతేః - దుష్యంత పుత్రుడగు, భరతస్య - భరతునకు, అగ్నిః - అగ్ని, సాచీగుణే - గొప్ప గుణములు గల స్థానమునందు, చితః - స్థాపించబడెను, యస్మిన్ - ఏ స్థానమునందైతే, సహస్రమ్ - వేయిమంది, బ్రాహ్మణాః - వేదవేత్తలు, గాః - గోవులను, బద్ధశః - బద్ధము బద్ధము చొప్పున, విభేజిరే - విభాగము చేసుకొనిరో.

దుష్యంత పుత్రుడగు భరతుడు సకలసద్గుణములు గల స్థానము నందు అగ్నిని స్థాపించి యజ్ఞమును చేసెను. ఆ స్థానమునందు వేయి మంది బ్రాహ్మణులు భరతునిచే ఈయబడిన గోవులను ఒక్కొక్కరు బద్ధము (13 084 గోవుల మంద) చొప్పున విభాగము చేసి తీసుకొనిరి.

త్రయస్త్రింశచ్ఛతం హ్యశ్వాన్ బద్ధ్వా విస్మాపయన్ నృపాన్ ।
దౌష్యంతిరత్యగాన్మాయాం దేవానాం గురుమాయయౌ ।। 27

దౌష్యంతిః - దుష్యంత పుత్రుడగు భరతుడు, త్రయస్త్రింశచ్ఛతమ్ - నూట ముప్పై మూడు, అశ్వాన్ - అశ్వములను, బద్ధ్వా - బంధించి, నృపాన్ - రాజులను, విస్మాపయన్ - విస్మయపరచుచున్నవాడై, మాయామ్ - మాయను, (దేవానామ్ - దేవతలయొక్క, మాయామ్ - సంపదను), హి - నిశ్చయముగా, అత్యగాత్ - అతిక్రమించెను, దేవానామ్ - దేవతలకు, గురుమ్ - గురువగు శ్రీహరిని, ఆయయౌ - పొందెను.

దుష్యంత పుత్రుడగు భరతుడు నూట ముప్పై మూడు అశ్వమేధ యాగములను చేసి రాజులను విస్మయ పరచెను. ఆయన వైభవము నిశ్చయముగా దేవతల వైభవమును కూడ అధిగమించెను. ఆయన అవిద్యను అతిక్రమించి (ఆత్మజ్ఞానమును పొంది) దేవగురువగు శ్రీహరిలో ఐక్యమాయెను.

మృగాన్ శుక్లదతః కృష్ణాన్ హిరణ్యేన పరీవృతాన్ ।
అదాత్కర్మణి మష్ణారే నియుతాని చతుర్దశ ।। 28

శుక్లదతః - తెల్లని దంతములు కలిగినట్టియు, హిరణ్యేన - బంగారముతో, పరీవృతాన్ - అలంకరించ బడినట్టియు, కృష్ణాన్ - నల్లని, చతుర్దశ - పదునాలుగు, నియుతాని - లక్షల, మృగాన్ - గొప్ప ఏనుగులను, మష్ణారే - మష్ణారమునందు, అదాత్ - దానము చేసెను.

యజ్ఞములోని మష్ణారము అనే కర్మయందు ఆయన తెల్లని దంతములు గల నల్లని పదునాలుగు లక్షల గొప్ప జాతి ఏనుగులను దానము చేసెను. అవి బంగరు ఆభరణములచే అలంకరించబడి యుండెను.

భరతస్య మహత్కర్మ న పూర్వే నాపరే నృపాః ।
నైవాపుర్నైవ ప్రాప్స్యంతి బాహుభ్యాం త్రిదివం యథా ।। 29

భరతస్య - భరతునియొక్క, మహత్ - గొప్ప, కర్మ - కర్మను, పూర్వే - పూర్వజులైన, నృపాః - రాజులు, న - చేయలేదు, అపరే - రాబోయే రాజులు, న - చేయబోరు, యథా - ఎల్లాగైతే, బాహుభ్యామ్ -

రెండు చేతులతో, త్రిదివమ్ - స్వర్గమును, న ఏవ ఆపుః - ఇదివరలో పట్టు కొనలేదు, న ఏవ ప్రాప్స్యంతి - భవిష్యత్తులో పట్టుకొనలేరు.

మానవులు రెండు చేతులను పైకెత్తి స్వర్గమును పట్టుకొనుట ఇది వరలో జరుగలేదు, ఈ పైన జరుగబోదు. అదే విధముగా, భరతుడు చేసిన కర్మలను ఆయనకు పూర్వమునందలి రాజులు చేయలేదు, ఆయన తరు వాతి రాజులు చేయబోరు.

కిరాతహూణాన్ యవనానంధ్రాన్ కంకాన్ ఖశాన్ శకాన్ ।
అబ్రహ్మణ్యాన్నృపాంశ్చాహన్ మ్లేచ్ఛాన్ దిగ్విజయేఽఖిలాన్ ॥ 30

దిగ్-విజయే - దిగ్విజయ యాత్రయందు, కిరాతహూణాన్ - కిరాతులను హూణులను, యవనాన్ - యవనులను, అంధ్రాన్ - అంధ్రు లను, కంకాన్ - కంకులను, ఖశాన్ - ఖశులను, శకాన్ - శకులను, అబ్ర హ్మణ్యాన్ - వేదవిరోధులగు, నృపాన్ - రాజులను, మ్లేచ్ఛాన్ - మ్లేచ్ఛుల ను, అఖిలాన్ - అందరినీ, అహన్ - సంహరించెను.

ఆయన దిగ్విజయ యాత్రయందు కిరాతులను, హూణులను, యవనులను, అంధ్రులను, కంకులను, ఖశులను, శకులను, మ్లేచ్ఛులను, వేదవిరోధులగు రాజులను అందరినీ సంహరించెను.

జిత్వా పురాఽసురా దేవాన్ యే రసౌకాంసి భేజిరే ।
దేవస్త్రియో రసాం నీతాః ప్రాణిభిః పునరాహరత్ ॥ 31

యే - ఏ, అసురాః - రాక్షసులు, పురా - పూర్వము, దేవాన్ - దేవతలను, జిత్వా - జయించి, రసా-ఓకాంసి - రసాతలమునందలి స్థాన ములను, భేజిరే - పొందిరో, ప్రాణిభిః - బలశాలురగు ఆ రాక్షసులచే, దేవ స్త్రియః - దేవతాస్త్రీలు, రసామ్ - రసాతలమును గురించి, నీతాః - తీసు కొని వెళ్లబడిరో వారిని, పునః - మరల, ఆహరత్ - తీసుకువచ్చెను.

పూర్వము బలశాలురగు రాక్షసులు దేవతలను జయించి, రసాతల మును చేరిరి. అప్పుడు వారు దేవతాస్త్రీలను బలాత్కారముగా రసాతల

మునకు తీసుకుపోయిరి. భరత మహారాజు ఆ దేవతాస్త్రీలను (చెర విడి పించి) మరల (స్వర్గమునకు) తెచ్చెను.

సర్వకామాన్ దుదుహతుః ప్రజానాం తస్య రోదసీ ।
సమాస్త్రిణవసాహస్రీర్దిక్షు చక్రమవర్తయత్ ॥ 32

తస్య - ఆయనయొక్క, ప్రజానామ్ - ప్రజలకు, రోదసీ - స్వర్గ లోక పృథివీ లోకములు, సర్వకామాన్ - అభీష్టములగు సకల వస్తువులను, దుదుహతుః - పిదికినవి, త్రిణవసాహస్రీః - ఇరవై ఏడు వేల, సమాః - సంవత్సరములను, దిక్షు - దిక్కులయందు, చక్రమ్ - శాసనమును, అవర్త యత్ - ప్రవర్తిల్ల జేసెను.

ఆయన పాలించుచుండగా భూలోక స్వర్గలోకములు ప్రజలకు అభీష్టములైన సకలవస్తువులను (పంటలు మొదలగువాటిని, వర్షములు మొదలగువాటిని) సమృద్ధిగా ఇచ్చినవి. ఆయన చక్రవర్తిగా ఇరవై ఏడు వేల సంవత్సరముల కాలము నిరంతరముగా దిక్కులయందు తన శాసన మును ప్రవర్తిల్ల జేసెను.

స సమ్రాడ్ లోకపాలాఖ్యమైశ్వర్యమధిరాట్శ్రియమ్ ।
చక్రం చాస్ఖలితం ప్రాణాన్ మృషేత్యుపరరామ హ ॥ 33

సః - ఆ, సమ్రాట్ - భరత చక్రవర్తి, లోకపాల-ఆఖ్యమ్ - లోకపా లకులయందు ప్రఖ్యాతమైన, ఐశ్వర్యమ్ - ఐశ్వర్యమును, అధిరాట్-శ్రి యమ్ - రాజాధిరాజుల సంపదను, అస్ఖలితమ్ - ఎదురు లేని, చక్రమ్ - శాసనమును, ప్రాణాన్ చ - ప్రాణములను కూడ, మృషా - మిథ్య, ఇతి - అని, నిశ్చిత్య - నిశ్చయించుకొని, ఉపరరామ హ - విరక్తుడాయెను.

లోకపాలకులలో ప్రఖ్యాతమైన ఈశ్వరభావము, రాజాధిరాజుల సంపద, ఎదురు లేని శాసనము, ఆఖరికి ప్రాణములు కూడ మిథ్యయేనని నిశ్చయించుకొని, ఆ భరత చక్రవర్తి విరక్తుడాయెను.

తస్యాసన్ నృప వైదర్భ్యః పత్న్యస్తిస్రస్సుసమ్మతాః ।
జఘ్నుస్త్యాగభయాత్పుత్రాన్నానురూపా ఇతీరితే ॥ 34

నృప - ఓ రాజా!, తస్య - ఆయనకు, వైదర్భ్యః - విదర్భ రాజకుమార్తెలు, సుసమ్మతాః - మిక్కిలి ప్రియమైనవారు అగు, తిస్రః - ముగ్గురు, పత్న్యః - భార్యలు, ఆసన్ - ఉండిరి, అనురూపాః - తగినవారు, న - కాదు, ఇతి - అని, ఈరితే - పలుకబడగా, త్యాగభయాత్ - విడిచిపెట్టుననే భయము వలన, జఘ్నుః - చంపిరి.

ఓ పరీక్షిన్మహారాజా! ఆయనకు మిక్కిలి ప్రియురాండ్రైన ముగ్గురు భార్యలు ఉండిరి. వారు విదర్భ రాజకుమార్తెలు. వారికి కలిగిన సంతానమును గురించి -- వీరు నాకు తగినవారు కారు -- అని భరతుడు పలికెను. భరతుడు తమను విడిచి పెట్టునేమో యను భయము వలన వారు ఆ పిల్లలను చంపిరి.

తస్యైవం వితథే వంశే తదర్థం యజతస్సుతమ్ ।
మరుత్స్తోమేన మరుతో భరద్వాజముపాదదుః ॥ 35

వంశే - వంశము, ఏవమ్ - ఈ విధముగా, వితథే - వ్యర్థము కాగా, తద్-అర్థమ్ - ఆ వంశము కొరకు, మరుత్స్తోమేన - మరుత్స్తోమ మనే యాగముతో, యజతః - ఆరాధించుచున్న, తస్య - ఆయనకు, మరుతః - మరుద్దేవతలు, భరద్వాజమ్ - భరద్వాజుని, సుతమ్ - పుత్రుని గా, ఉపాదదుః - సమర్పించిరి.

వంశాంకురము లేని కారణముగా ఈ విధముగా తన వంశము వ్యర్థమగుచుండగా, భరతుడు మరుత్స్తోమమనే యజ్ఞమును చేసి మరుద్దేవతల నారాధించెను. ఆ మరుద్దేవతలు ఆయనపై ప్రసన్నులై ఆయనకు భరద్వాజుని పుత్రునిగా సమర్పించిరి.

భరద్వాజుని ఉత్పత్తి గాథ ---

అంతర్వత్న్యాం భ్రాతృపత్న్యాం మైథునాయ బృహస్పతిః ।
ప్రవృత్తో వారితో గర్భం శప్త్వా వీర్యమవాసృజత్ ॥ 36

బృహస్పతిః - బృహస్పతి, అంతర్వత్న్యామ్ - గర్భవతియగు, భ్రాతృపత్న్యామ్ - సోదరుని భార్యయందు, మైథునాయ - సంభోగము

కొరకు, ప్రవృత్తః - ప్రవర్తిల్లినవాడు, వారితః - వారించబడినవాడై, గర్భమ్ - గర్భమునందలి శిశువును, శప్త్వా - శపించి, వీర్యమ్ - బీజమును, అవాసృజత్ - విడిచి పెట్టెను.

ఒకనాడు బృహస్పతి గర్భవతియగు తన సోదరుని (ఉతథ్యుని) భార్య (మమత) తో సంభోగము కొరకు ప్రవర్తిల్లగా, గర్భమునందలి శిశువు వారించెను. అప్పుడు బృహస్పతి కోపించి ఆ శిశువును (గ్రుడ్డివాడవు కమ్మని) శపించి వీర్యమును విడిచి పెట్టెను (దానినుండి పుత్రుడు జన్మించెను).

తం త్యక్తుకామాం మమతాం భర్తృత్యాగవిశంకితామ్ ।
నామనిర్వచనం తస్య శ్లోకమేనం సురా జగుః ॥ 37

భర్తృత్యాగవిశంకితామ్ - భర్త విడిచి పెట్టుననే ఆశంక కలిగినట్టియు, తమ్ - ఆ బాలకుని, త్యక్తుకామామ్ - విడిచి పెట్టుటకై సంకల్పించిన, మమతామ్ - మమతను ఉద్దేశించి, సురాః - దేవతలు, తస్య - ఆ బాలకుని, నామనిర్వచనమ్ - పేరును నిర్వచించే, ఏనమ్ - ఈ, శ్లోకమ్ - శ్లోకమును, జగుః - పాడిరి.

తన భర్త తనను విడిచి పెట్టుననే ఆశంకతో మమత ఆ పిల్లవానిని విడిచి పెట్టుటకు సంకల్పించెను. అప్పుడు దేవతలు మమతను ఉద్దేశించి ఈ శ్లోకమును పాడిరి. మమతా-బృహస్పతుల సంవాదమైన ఈ శ్లోకములో గర్భమునందలి బాలకుని పేరు నిర్వచించ బడినది.

మూఢే భర ద్వాజమిమం భర ద్వాజం బృహస్పతే ।
యాతౌ యదుక్త్వా పితరౌ భరద్వాజస్తతస్త్వయమ్ ॥ 38

మూఢే - ఓ మూర్ఖురాలా!, ద్వాజమ్ - ఇద్దరి వలన పుట్టిన, ఇమమ్ - ఈ బాలకుని, భర - పోషించుము, బృహస్పతే - ఓ బృహస్పతీ!, ద్వాజమ్ - ఇద్దరి వలన పుట్టిన, ఇమమ్ - వీనిని, భర - పోషించుము, యత్ - దేనినైతే, ఉక్త్వా - పలికి, పితరౌ - తల్లిదండ్రులు, యాతౌ - నిష్క్రమించిరో, తతః - దాని వలన, అయం తు - ఈ బాలకుడైతే, భరద్వాజః - భరద్వాజుడు.

బృహస్పతి -- ఓ మూర్ఖురాలా! ఈ పిల్లవాడు మన యిద్దరి వలన పుట్టినవాడు. కావున వీనిని పోషించుము.
మమత -- ఓ బృహస్పతీ! ఈ పిల్లవాడు మన ఇద్దరి వలన జన్మించిన వాడు గావున వీనిని నీవే పోషించుము.
ఈ విధముగా పలికి వారిద్దరు బాలకుని విడిచి పెట్టిరి. వారి పలుకులను బట్టి ఈ బాలకుడు భరద్వాజుడైనాడు.

చోద్యమానా సురైరేవం మత్వా వితథమాత్మజమ్ ।
వ్యసృజన్మరుతోఽబిభ్రన్దత్తోఽయం వితథేఽన్వయే ॥ 39

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం
నవమ స్కంధే వింశోఽధ్యాయః ॥

ఏవమ్ - ఈ విధముగా, చోద్యమానా - ప్రేరితురాలైన మమత, ఆత్మజమ్ - ఆ పుత్రుని, వితథమ్ - వ్యర్థునిగా, మత్వా - తలచి, వ్యసృజత్ - విడిచి పెట్టెను, మరుతః - మరుద్దేవతలు, అబిభ్రన్ - పోషించిరి, అన్వయే - వంశము, వితథే - వ్యర్థము కాగా, అయమ్ - ఈతడు, దత్తః - ఈయబడినవాడు.

ఈ విధముగా దేవతలు మమతను (భర్త త్యజించునేమోననే ఆశంక వద్దు అని) ప్రేరేపించిరి. కాని, ఆ బాలకుడు వ్యర్థుడేనని తలచి మమత వానిని విడిచి పెట్టెను. అప్పుడు మరుద్దేవతలు ఆ బాలకుని పోషించిరి. భరతుని వంశము వ్యర్థము (అంకురము లేనిది) అగుచుండగా, వారీ బాలకుని భరతునకు సమర్పించిరి.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
శకుంతలా దుష్యంతుల గాథను, భరతుని రాజ్యపాలనమును
వర్ణించే ఇరువదియవ అధ్యాయము ముగిసినది (20).

* * * * *

# అథ ఏకవింశోఽధ్యాయః

## రంతిదేవోపాఖ్యానము

శ్రీశుక ఉవాచ।
వితథస్య సుతో మన్యుర్బృహత్క్షత్రో జయస్తతః ।
మహావీర్యో నరో గర్గస్సంకృతిస్తు నరాత్మజః ।। 1

వితథస్య - వితథునియొక్క, సుతః - పుత్రుడు, మన్యుః - మన్యువు, తతః - ఆయన వలన, బృహత్క్షత్రః - బృహత్క్షత్రుడు, జయః - జయుడు, మహావీర్యః - మహావీర్యుడు, నరః - నరుడు, గర్గః - గర్గుడు, నర-ఆత్మజః తు - నరుని పుత్రుడైతే, సంకృతిః - సంకృతి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- వితథుడనే భరద్వాజునియొక్క పుత్రుడు మన్యువు. మన్యువునకు బృహత్క్షత్రుడు, జయుడు, మహావీర్యుడు, నరుడు, గర్గుడు అనే పుత్రులు గలరు. వారిలో నరుని పుత్రుడు సంకృతి.

గురుశ్చ రంతిదేవశ్చ సంకృతేః పాండునందన ।
రంతిదేవస్య హి యశ ఇహాముత్ర చ గీయతే ।। 2

పాండునందన - పాండవులకు ఆనందమును కలిగించువాడా!, సంకృతేః - సంకృతి వలన, గురుః చ - గురువు, రంతిదేవః చ - రంతిదేవుడు, రంతిదేవస్య - రంతిదేవునియొక్క, యశః హి - కీర్తియైతే, ఇహ - ఈ లోకమునందు, అముత్ర చ - స్వర్గాదిలోకములయందు కూడ, గీయతే - గానము చేయబడుచున్నది.

పాండవులకు ఆనందమును కలిగించే ఓ పరీక్షిన్మహారాజా! సంకృతికి గురువు, రంతిదేవుడు అనే ఇద్దరు పుత్రులు గలరు. వారిలో రంతిదేవు

ని కీర్తి భూలోకములో మాత్రమే గాక, స్వర్గాది లోకములయందు కూడ గానము చేయబడుచున్నది.

వియద్విత్తస్య దదతో లబ్ధం లబ్ధం బుభుక్షతః ।
నిష్కించనస్య ధీరస్య సకుటుంబస్య సీదతః ।। 3

వియద్-విత్తస్య - ఆకాశమునుండి (యాదృచ్ఛికముగా) వచ్చే ధనము కలిగినట్టియు, లబ్ధం లబ్ధమ్ - పొందబడిన సర్వమును, దదతః - దానము చేయునట్టియు, బుభుక్షతః - ఆకలి కలిగినట్టియు, నిష్కించనస్య - ఏమీ లేనట్టియు, ధీరస్య - ధైర్యశాలియైనట్టియు, సకుటుంబస్య - కుటుంబముతో కూడియున్నట్టియు, సీదతః - క్లేశమును పొందినట్టియు.

ఆ రంతిదేవుని వద్ద యాదృచ్ఛికముగా తనకు గాలివాటముగా లభించిన ధనము మాత్రమే గలదు. పైగా, ఆయన తనకు లభించిన దానిని లభించుట తోడనే దానము చేసెడివాడు. దానితో ఆయన వద్ద ధనము ఏమీ లేకుండుటచే, సరియగు ఆహారము లేక ఆయన ఆకలితో బాధపడెడి వాడు. ఈ విధముగా కుటుంబముతో సహా క్లేశమును పొందియున్ననూ, ఆయన ధైర్యమును కోల్పోలేదు.

వ్యతీయురష్టచత్వారింశదహాన్యపిబతః కిల ।
ఘృతపాయససంయావం తోయం ప్రాతరుపస్థితమ్ ।। 4

అపిబతః - నీటిని కూడ త్రాగని ఆయనకు, అష్టచత్వారింశత్ - నలభై ఎనిమిది, అహాని - రోజులు, వ్యతీయుః కిల - గడచినవి, ప్రాతః - ఉదయము, ఘృతపాయససంయావమ్ - నేయి పాయసము మరియు హల్వా, తోయమ్ - నీరు, ఉపస్థితమ్ - లభించినది.

రంతిదేవునకు త్రాగే నీరు కూడ దొరకకుండెను. ఈ విధముగా నలభై ఎనిమిది రోజులు గడచిపోయెను. ఒకనాడు ఉదయము ఆయనకు నేయి, పాయసము, హల్వా మరియు నీరు లభించెను.

కృచ్ఛ్రప్రాప్తకుటుంబస్య క్షుత్తృడ్భ్యాం జాతవేపథోః ।
అతిథిర్బ్రాహ్మణః కాలే భోక్తుకామస్య చాగమత్ ।। 5

కృచ్ఛ్రప్రాప్తకుటుంబస్య - క్లేశమును పొందియున్న కుటంబము కలిగినట్టియు, క్షుత్-తృడ్భ్యామ్ - ఆకలి దప్పికలచే, జాతవేపథోః - పుట్టిన వణుకు కలిగినట్టియు, భోక్తుకామస్య చ - ఆహారమును తినగోరు చున్న రంతిదేవునకు, కాలే - సమయమునందు, బ్రాహ్మణః - బ్రాహ్మణు డు, అతిథిః - అతిథియై, ఆగమత్ - వచ్చెను.

రంతిదేవుని కుటుంబము చాల క్లేశమును పొందియుండెను. ఆయనకు కూడ ఆకలి దప్పికలచే శరీరములో వణుకు పుట్టుచుండెను. ఆయన ఆ ఆహారమును తినగోరునంతలో, సరిగ్గా అదే సమయమునందు ఒక బ్రాహ్మణుడు అతిథియై విచ్చేసెను.

తస్మై సంవ్యభజత్సోఽన్నమాదృత్య శ్రద్ధయాఽన్వితః ।
హరిం సర్వత్ర సంపశ్యన్ స భుక్త్వా ప్రయయౌ ద్విజః ॥ 6

సర్వత్ర - సర్వమునందు, హరిమ్ - శ్రీహరిని, సంపశ్యన్ - దర్శించే, సః - ఆ రంతిదేవుడు, శ్రద్ధయా - శ్రద్ధతో, అన్వితః - కూడినవా డై, తస్మై - ఆ బ్రాహ్మణుని కొరకు, ఆదృత్య - ఆదరించి, అన్నమ్ - ఆహారమును, సంవ్యభజత్ - పంచి యిచ్చెను, ద్విజః - బ్రాహ్మణుడు, భుక్త్వా - భుజించి, ప్రయయౌ - నిష్క్రమించెను.

రంతిదేవుడు సర్వమునందు శ్రీహరిని దర్శించును. ఆయన ఆ బ్రాహ్మణుని ఆదరించి శ్రద్ధతో కూడినవాడై, ఆహారమును బ్రాహ్మణునకు వడ్డించెను. ఆ బ్రాహ్మణుడు భుజించి నిష్క్రమించెను.

అథాన్యో భోక్ష్యమాణస్య విభక్తస్య మహీపతే ।
విభక్తం వ్యభజత్తస్మై వృషలాయ హరిం స్మరన్ ॥ 7

మహీపతే - ఓ మహారాజా!, అథ - తరువాత, విభక్తస్య - (మిగి లిన ఆహారమును కుటుంబసభ్యులకు) పంచి యిచ్చిన ఆ రంతిదేవుడు, భోక్ష్యమాణస్య - భుజించ బోవుచుండగా, అన్యః - మరియొకడు, తస్మై - ఆ, వృషలాయ - శూద్రుని కొరకు, విభక్తమ్ - ఈయగా మిగిలిన ఆహార మును, హరిమ్ - శ్రీహరిని, స్మరన్ - స్మరించువాడై, వ్యభజత్ - పంచి యిచ్చెను.

ఓ పరీక్షిన్మహారాజా! ఆ రంతిదేవుడు మిగిలిన ఆహారమును కుటుంబసభ్యులకు పంచి యిచ్చి తాను తినబోవుచుండెను. ఇంతలో ఒక శూద్రుడు అతిథియై వచ్చెను. అప్పుడాయన శ్రీహరిని స్మరిస్తూ ఆ మిగిలిన ఆహారమును ఆ అతిథికి పంచి యిచ్చెను.

యాతే శూద్రే తమన్యోఽగాదతిథిశ్శ్వభిరావృతః ।
రాజన్ మే దీయతామన్నం సగణాయ బుభుక్షతే ॥ 8

శూద్రే - శూద్రుడు, యాతే - వెళ్లగా, శ్వభిః - కుక్కలచే, ఆవృతః - చుట్టువారబడియున్న, అన్యః - మరియొక, అతిథిః - అతిథి, తమ్ - ఆ రంతిదేవుని, అగాత్ - సమీపించెను, రాజన్ - ఓ రాజా!, సగణాయ - కుక్కల గుంపుతో కూడినట్టియు, బుభుక్షతే - ఆకలి గొనియున్న, మే - నా కొరకు, అన్నమ్ - ఆహారము, దీయతామ్ - ఈయబడు గాక!

ఆ శూద్రుడు వెళ్లగానే రంతిదేవుని వద్దకు మరియొక అతిథి వచ్చెను. ఆ అతిథి చుట్టూ కుక్కలు ఉండెను. ఆతడు రంతిదేవునితో నిట్లనెను -- ఓ రాజా! నేను, నా కుక్కలు ఆకలి గొనియున్నాము. మాకు ఆహారమును ఇమ్ము.

స ఆదృత్యావశిష్టం యద్బహుమానపురస్కృతమ్ ।
తచ్చ దత్త్వా నమశ్చక్రే శ్వభ్యశ్శ్వపతయే విభుః ॥ 9

సః - ఆ, విభుః - రంతిదేవ మహారాజు, ఆదృత్య - ఆదరించి, యత్ - ఏది, అవశిష్టమ్ - మిగిలినదో, తత్ చ - దానిని కూడ, బహుమానపురస్కృతమ్ - సత్కార పూర్వకముగా, శ్వపతయే - కుక్కల యజమాని కొరకు, శ్వభ్యః - కుక్కల కొరకు, దత్త్వా - ఇచ్చి, నమః - నమస్కారమును, చక్రే - చేసెను.

ఆ రంతిదేవ మహారాజు ఆ అతిథిని కూడ ఆదరించెను. మిగిలియున్న ఆహారమును ఆయన ఆ అతిథికి, ఆతని కుక్కలకు సత్కార పూర్వకముగా ఇచ్చి నమస్కారమును చేసెను.

పానీయమాత్రముచ్ఛేషం తచ్చైకపరితర్పణమ్ ।
పాస్యతః పుల్కసోఽభ్యాగాదపో దేహ్యశుభస్య మే ॥ 10

పానీయమాత్రమ్ - నీరు మాత్రమే, ఉచ్ఛేషమ్ - మిగిలియున్నది, తత్ చ - అది కూడ, ఏకపరితర్పణమ్ - ఒక్కని దాహమును తీర్చగలిగేది, పాస్యతః - త్రాగబోవుచుండగా, పుల్కసః - కసాయివాడు, అభ్యాగాత్ - వచ్చెను, అశుభస్య - అశుభకర్మను చేసే, మే - నా కొరకు, అపః - నీటిని, దేహి - ఇమ్ము.

రంతిదేవుని వద్ద ఒక్కని దాహమును తీర్చగలిగే నీరు మాత్రమే మిగిలి యుండెను. దానిని ఆయన త్రాగబోవుచుండగా ఒక కసాయి వచ్చి, అశుభకర్మను చేసి బ్రదికే నాకు నీటిని ఇండు, అని కోరెను.

తస్య తాం కరుణాం వాచం నిశమ్య విపులశ్రమామ్ ।
కృపయా భృశసంతప్త ఇదమాహామృతం వచః ॥ 11

తస్య - వానియొక్క, కరుణామ్ - దీనమైనట్టియు, విపులశ్రమామ్ - అధికమగు శ్రమను కలిగియున్న, తామ్ - ఆ, వాచమ్ - పలుకును, నిశమ్య - విని, కృపయా - దయచే, భృశసంతప్తః - మిక్కిలి పీడించబడినవాడై, ఇదమ్ - ఈ, అమృతమ్ - అమృతమువంటి, వచః - మాటను, ఆహ - పలికెను.

వాని ఆ దీనమైన వాక్కులో అధికమగు శ్రమ ధ్వనించుచుండెను. దానిని వినుట తోడనే రంతిదేవుడు దయచే చాల పీడను పొందెను. ఆయన అమృతతుల్యమగు ఈ మాటను పలికెను.

న కామయేఽహం గతిమీశ్వరాత్పరామష్టర్ద్ధియుక్తామపునర్భవం వా ।
ఆర్తిం ప్రపద్యేఽఖిలదేహభాజామంతఃస్థితో యేన భవంత్యదుఃఖాః ॥12

అహమ్ - నేను, ఈశ్వరాత్ - ఈశ్వరుని వలన, పరామ్ - సర్వోత్కృష్టమైనట్టియు, అష్ట-ఋద్ధియుక్తామ్ - అష్టైశ్వర్యములతో కూడియున్న, గతిమ్ - స్థితిని గాని, అపునర్భవం వా - పునర్జన్మ లేని మోక్షమును గాని, న కామయే - కోరుట లేదు, అఖిలదేహభాజామ్ - సకల శరీరధారు

లకు, అంతః - లోపల, స్థితః - ఉన్నవాడనై, ఆర్తిమ్ - దుఃఖమును, ప్రపద్యే - పొందెదను, యేన - దేనిచే, అదుఃఖాః - దుఃఖము లేనివారు, భవంతి - అగుదురో.

నేను ఈశ్వరునినుండి అష్టైశ్వర్యములతో కూడిన సర్వోత్కృష్ట మైన స్థితిని గాని, తిరిగి పుట్టుక లేని మోక్షమును గాని కోరుట లేదు. నేను కోరేదేమంటే, నేను సకలప్రాణుల హృదయములోనుండి వారి దుఃఖమును అనుభవించవలెను. ఎందుకంటే, నేను అట్లు చేయుట వలన వారికి దుఃఖము తొలగిపోవును.

క్షుత్తృట్శ్రమో గాత్రపరిశ్రమశ్చ దైన్యం క్లమశ్శోకవిషాదమోహాః ।
సర్వే నివృత్తాః కృపణస్య జంతోర్జిజీవిషోర్జీవజలార్పణాన్మే ।। 13

కృపణస్య - దీనుడైనట్టియు, జిజీవిషోః - జీవించగోరే, జంతోః - ప్రాణికి, జీవజల-అర్పణాత్ - ప్రాణములను నిలబెట్టే నీటిని ఇచ్చుట వలన, మే - నాకు, క్షుత్-తృట్-శ్రమః - ఆకలి దప్పికల శ్రమ, గాత్రపరిశ్రమః చ - శరీరమునకు ఉండే అలసట, దైన్యమ్ - దీనత్వము, క్లమః - గ్లాని, శోకవిషాదమోహాః - శోకము విషాదము మోహములు, సర్వే - అన్నియు, నివృత్తాః - తొలగిపోయినవి.

ఈతడు దీనుడు, జీవించగోరే ప్రాణి. నీటిని ఇచ్చి ఈతని ప్రాణములను నిలబెట్టుట వలన నాకు ఆకలి దప్పికల శ్రమ, శరీరములోని అలసట, దైన్యము, గ్లాని, మానసిక పీడ, అవయవముల శైథిల్యము, వ్యామోహము అనే లక్షణములన్నియు దూరమైనవి.

ఇతి ప్రభాష్య పానీయం మ్రియమాణః పిపాసయా ।
పుల్కసాయాదదాద్ధీరో నిసర్గకరుణో నృపః ।। 14

ఇతి - ఈ విధముగా, ప్రభాష్య - గొప్ప మాటలను పలికి, పిపాసయా - దప్పికతో, మ్రియమాణః - మరణించుచున్నవాడు, ధీరః - ధీరుడు, నిసర్గకరుణః - సహజముగానే దయాగుణము గల, నృపః - రంతిదేవ మహారాజు, పుల్కసాయ - ఆ కసాయి కొరకు, పానీయమ్ - నీటిని, అదాత్ - ఇచ్చెను.

సహజముగా దయాగుణము గల రంతిదేవ మహారాజు ఆత్మానాత్మవివేకము (ధైర్యము) గలవాడు. ఆయన ఒకవైపు దప్పికతో మరణించుటకు సిద్ధముగా నుండెను. అయిననూ, ఆయన ఈ విధముగా పలికి నీటిని ఆ కసాయివానికి ఇచ్చివేసెను.

తస్య త్రిభువనాధీశాః ఫలదాః ఫలమిచ్ఛతామ్ ।
ఆత్మానం దర్శయాంచక్రుర్మాయావిష్ణువినిర్మితాః ॥ 15

ఫలమ్ - ఫలమును, ఇచ్ఛతామ్ - కోరువారలకు, ఫలదాః - ఫలములనిచ్చువారు, మాయావిష్ణువినిర్మితాః - మాయచే విష్ణువుచే కల్పించబడిన, త్రిభువన-అధి-ఈశాః - ముల్లోకముల అధీశ్వరులగు బ్రహ్మాదులు, తస్య - ఆయనకు, ఆత్మానమ్ - తనను, దర్శయాంచక్రుః - చూపించిరి.

ముల్లోకములకు అధీశ్వరులగు బ్రహ్మాదులు విష్ణుమాయచే కల్పించబడిన ఆయా రూపములతో రంతిదేవుని వద్దకు వచ్చియుండిరి. ఇప్పుడు వారు తమ అసలు రూపములతో ఆయనకు దర్శనమిచ్చిరి. ఫలములను కోరే ప్రాణులకు ఫలములనిచ్చేది వారే.

స వై తేభ్యో నమస్కృత్య నిస్సంగో విగతస్పృహః ।
వాసుదేవే భగవతి భక్త్యా చక్రే మనః పరమ్ ॥ 16

నిస్సంగః - సంసారాసక్తి లేనివాడు, విగతస్పృహః - తొలగిన తృష్ణ గలవాడు అగు, సః వై - ఆ రంతిదేవుడైతే, తేభ్యః - వారి కొరకు, నమస్కృత్య - నమస్కరించి, పరమ్ - కేవలము, వాసుదేవే భగవతి - వాసుదేవ భగవానునియందు, భక్త్యా - భక్తితో, మనః - మనస్సును, చక్రే - నిలిపెను.

రంతిదేవునియందు సంసారాసక్తి గాని, భోగములయందు తృష్ణ గాని సుతరాము లేకుండెను. ఆయన వారికి నమస్కరించి, మనస్సును భక్తితో కేవలము వాసుదేవ భగవానునియందు మాత్రమే నిలిపియుంచెను.

ఈశ్వరాలంబనం చిత్తం కుర్వతోఽనన్యరాధసః ।
మాయా గుణమయీ రాజన్ స్వప్నవత్ప్రత్యలీయత ॥ 17

రాజన్ - ఓ రాజా!, చిత్తమ్ - మనస్సును, ఈశ్వర-ఆలంబనమ్ - ఈశ్వరుడే ఆలంబనము కలదిగా, కుర్వతః - చేయునట్టియు, అనన్యారాధసః - ఇతరమును కోరని రంతిదేవునకు, గుణమయీ - త్రిగుణాత్మకమగు, మాయా - అవిద్య, స్వప్నవత్ - కలవలె, ప్రత్యలీయత - విలీనమాయెను.

ఓ పరీక్షిన్మహారాజా! రంతిదేవునకు ఈశ్వరుడు తప్ప ఇతరమునందు తృష్ణ లేదు. కావున, ఆయన తన చిత్తమునకు ఈశ్వరుని మాత్రమే ఆలంబనముగా చేసుకొనెను. దాని వలన సత్త్వరజస్తమోగుణాత్మకమగు అవిద్య (సంసారము) కలవలె ఆయన స్వరూపమునందు విలీనమయ్యెను.

తత్ప్రసంగానుభావేన రంతిదేవానువర్తినః ।
అభవన్ యోగినస్సర్వే నారాయణపరాయణాః ॥ 18

రంతిదేవ-అనువర్తినః - రంతిదేవుని అనుసరించేవారు, సర్వే - అందరు, తత్-ప్రసంగ-అనుభావేన - ఆయనతోడి నిరంతరమగు సంగము యొక్క మహిమచే, నారాయణపరాయణాః - నారాయణుడే పరమాశ్రయముగా గల, యోగినః - జ్ఞానులుగా, అభవన్ - అయిరి.

రంతిదేవుని అనుయాయులకు ఆయనతో నిరంతరమగు సంగము ఉండెను. అట్టి సత్సంగముయొక్క మహిమచే వారు కూడ నారాయణుడే పరమమగు ఆశ్రయముగా గల యోగులుగా తీర్చి దిద్దబడిరి.

గర్గాచ్ఛినిస్తతో గార్గ్యః క్షత్రాద్బ్రహ్మ హ్యవర్తత ।
దురితక్షయో మహావీర్యాత్తస్య త్రయ్యారుణిః కవిః ॥ 19

పుష్కరారుణిరిత్యత్ర యే బ్రాహ్మణగతిం గతాః ।

గర్గాత్ - గర్గుని వలన, శినిః - శిని, తతః - ఆయన వలన, గార్గ్యః - గార్గ్యుడు, క్షత్రాత్ - క్షత్రియుడగు గార్గ్యునినుండి, బ్రహ్మ - బ్రాహ్మణ వంశము, అవర్తత - ప్రవర్తిల్లెను, మహావీర్యాత్ - మహావీర్యుని వలన, దురితక్షయః - దురితక్షయుడు, తస్య - ఆయనకు, త్రయ్యారుణిః - త్రయ్యారుణి, కవిః - కవి, పుష్కరారుణిః - పుష్కరారుణి, ఇతి - అనే పుత్రులు,

యే - ఎవరైతే, అత్ర - ఈ క్షత్రియవంశమునందు, బ్రాహ్మణగతిమ్ - బ్రాహ్మణరూపమును, గతాః - పొందినవారో.

మన్యుపుత్రుడగు గర్గుని పుత్రుడు శిని. శిని యొక్క పుత్రుడు గార్గ్యుడు. గార్గ్యుడు క్షత్రియుడే అయినా, ఆయననుండి ప్రవర్తిల్లిన వంశము వారు బ్రాహ్మణులైనారు. మన్యుపుత్రుడగు మహావీర్యుని పుత్రుడు దురితక్షయుడు. దురితక్షయునకు త్రయ్యారుణి, కవి, పుష్కరారుణి అనే ముగ్గురు పుత్రులు ఉండిరి. వారు క్షత్రియవంశమునందు జన్మించినమా, బ్రాహ్మణరూపమును పొందిరి.

బృహత్క్షత్రస్య పుత్రోఽభూద్ధస్తీ యద్ధస్తినాపురమ్ ॥ 20

అజమీఢో ద్విమీఢశ్చ పురుమీఢశ్చ హస్తినః ।
అజమీఢస్య వంశ్యాస్స్యుః ప్రియమేధాదయో ద్విజాః ॥ 21

బృహత్క్షత్రస్య - బృహత్క్షత్రునకు, హస్తీ - హస్తి అనే, పుత్రః - పుత్రుడు, అభూత్ - ఉండెను, యత్ - ఎవనిచే, హస్తినాపురమ్ - హస్తినాపురమో, హస్తినః - హస్తి వలన, అజమీఢః - అజమీఢుడు, ద్విమీఢః చ - ద్విమీఢుడు, పురుమీఢః చ - పురుమీఢుడు, ప్రియమేధ-ఆదయః - ప్రియమేధుడు మొదలుగా గల, ద్విజాః - బ్రాహ్మణులు, అజమీఢస్య - అజమీఢునియొక్క, వంశ్యాః - వంశమునకు చెందినవారలు, స్యుః - అయిరి.

(మన్యుపుత్రుడగు) బృహత్క్షత్రుని పుత్రుడు హస్తి. హస్తినాపురమును నిర్మించినది హస్తియే. హస్తికి అజమీఢుడు, ద్విమీఢుడు, పురుమీఢుడు అనే పుత్రులు గలరు. ప్రియమేధుడు మొదలుగా గల అజమీఢుని పుత్రులు బ్రాహ్మణులు అయిరి.

అజమీఢాద్బృహదిషుస్తస్య పుత్రో బృహద్ధనుః ।
బృహత్కాయస్తతస్తస్య పుత్ర ఆసీజ్జయద్రథః ॥ 22

అజమీఢాత్ - అజమీఢుని వలన, బృహదిషుః - బృహదిషువు, తస్య - ఆయనయొక్క, పుత్రః - పుత్రుడు, బృహద్ధనుః - బృహద్ధనువు,

తతః - ఆయన వలన, బృహత్కాయః - బృహత్కాయుడు, తస్య - ఆయనకు, జయద్రథః - జయద్రథుడనే, పుత్రః - పుత్రుడు, ఆసీత్ - ఉండెను.

అజమీఢుని (మరియొక) పుత్రుడు బృహదిషువు. బృహదిషువు యొక్క పుత్రుడు బృహద్ధనువు. బృహద్ధనువుయొక్క పుత్రుడు బృహత్కాయుడు. బృహత్కాయుని పుత్రుడు జయద్రథుడు.

తత్సుతో విశదస్తస్య సేనజిత్సమజాయత ।
రుచిరాశ్వో దృఢహనుః కాశ్యో వత్సశ్చ తత్సుతాః ।। 23

తత్-సుతః - ఆయనయొక్క పుత్రుడు, విశదః - విశదుడు, తస్య - ఆయనకు, సేనజిత్ - సేనజిత్తు, సమజాయత - జన్మించెను, రుచిరాశ్వః - రుచిరాశ్వుడు, దృఢహనుః - దృఢహనువు, కాశ్యః - కాశ్యుడు, వత్సః చ - వత్సుడు, తత్-సుతాః - ఆయనయొక్క పుత్రులు.

జయద్రథుని పుత్రుడు విశదుడు. విశదుని పుత్రుడు సేనజిత్తు. సేనజిత్తునకు రుచిరాశ్వుడు, దృఢహనువు, కాశ్యుడు, వత్సుడు అనే పుత్రులుకలిగిరి.

రుచిరాశ్వసుతః పారః పృథుసేనస్తదాత్మజః ।
పారస్య తనయో నీపస్తస్య పుత్రశతం త్వభూత్ ।। 24

రుచిరాశ్వసుతః - రుచిరాశ్వునియొక్క పుత్రుడు, పారః - పారుడు, తద్-ఆత్మజః - ఆయనయొక్క పుత్రుడు, పృథుసేనః - పృథుసేనుడు, పారస్య - పారునియొక్క, తనయః - పుత్రుడు, నీపః - నీపుడు, తస్య తు - ఆయనకైతే, పుత్రశతమ్ - పుత్రుల వంద, అభూత్ - కలిగెను.

రుచిరాశ్వునియొక్క పుత్రుడు పారుడు. పారుని పుత్రుడు పృథుసేనుడు. పారుని మరియొక పుత్రుడు నీపుడు. నీపునకైతే వందమంది పుత్రులు కలిగిరి.

స కృత్వ్యాం శుకకన్యాయాం బ్రహ్మదత్తమజీజనత్ ।
స యోగీ గవి భార్యాయాం విష్వక్సేనమధాత్సుతమ్ ।। 25

సః - ఆయన, శుకకన్యాయామ్ - శుకుని కుమార్తెయగు, కృత్వ్యామ్ - కృత్వియందు, బ్రహ్మదత్తమ్ - బ్రహ్మదత్తుని, అజీజనత్ - కనెను, సః - ఆ, యోగీ - యోగి, భార్యాయామ్ - భార్యయగు, గవి - సరస్వతియందు, విష్వక్సేనమ్ - విష్వక్సేనుడనే, సుతమ్ - పుత్రుని, అధాత్ - కనెను.

ఆ నీపుడు శుకుని కుమార్తెయగు కృత్వియందు బ్రహ్మదత్తుడనే పుత్రుని కనెను. ఆ బ్రహ్మదత్తుడు యోగి. ఆయన భార్య సరస్వతి. ఆయనకు ఆమెయందు విష్వక్సేనుడనే పుత్రుడు కలిగెను.

జైగీషవ్యోపదేశేన యోగతంత్రం చకార హ ।
ఉదక్స్వేనస్తతస్తస్మాద్భల్లాదో బార్హదీషవాః ।। 26

జైగీషవ్య-ఉపదేశేన - జైగీషవ్యుని ఉపదేశముచే, యోగతంత్రమ్ - యోగశాస్త్రమును, చకార హ - చేసెను, తతః - ఆయన వలన, ఉదక్స్వేనః - ఉదక్స్వేనుడు, తస్మాత్ - ఆయన వలన, భల్లాదః - భల్లాదుడు, బార్హదీషవాః - బృహదిషువుయొక్క వంశములోనివారు.

జైగీషవ్య మహర్షియొక్క ఉపదేశముచే ఆ బ్రహ్మదత్తుడు యోగశాస్త్రమును రచించెను. ఆ విష్వక్సేనుని పుత్రుడు ఉదక్స్వేనుడు. ఉదక్స్వేనుని పుత్రుడు భల్లాదుడు. వీరందరు బృహదిషువుయొక్క వంశమునకు చెందినవారు.

యవీనరో ద్విమీఢస్య కృతిమాంస్తత్సుతస్స్మృతః ।
నామ్నా సత్యధృతిర్యస్య దృఢనేమిస్సుపార్శ్వకృత్ ।। 27

ద్విమీఢస్య - ద్విమీఢునకు, యవీనరః - యవీనరుడు, తత్-సుతః - ఆయనయొక్క పుత్రుడు, కృతిమాన్ - కృతిమంతుడని, స్మృతః - చెప్పబడినవాడు, యస్య - ఎవనికైతే, నామ్నా - పేరుచే, సత్యధృతిః - సత్యధృతి, దృఢనేమిః - దృఢనేమి, సుపార్శ్వకృత్ - సుపార్శ్వుని కన్నవాడు.

(హస్తియొక్క పుత్రుడగు) ద్విమీఢుని పుత్రుడు యవీనరుడు. యవీనరుని పుత్రుడు కృతిమంతుడు. కృతిమంతుని పుత్రుడు సత్యధృతి. సత్యధృతియొక్క పుత్రుడు దృఢనేమి. దృఢనేమియొక్క పుత్రుడు సుపార్శ్వుడు.

సుపార్శ్వాత్సుమతిస్తస్య పుత్రస్సన్నతిమాంస్తతః ।
కృతిర్హిరణ్యనాభాద్యో యోగం ప్రాప్య జగౌ స్మ షట్ ॥ 28
సంహితాః ప్రాచ్యసామ్నాం వై నీపో హ్యుగ్రాయుధస్తతః ।

సుపార్శ్వాత్ - సుపార్శ్వుని వలన, సుమతిః - సుమతి, తస్య - ఆయనయొక్క, పుత్రః - పుత్రుడు, సన్నతిమాన్ - సన్నతిమంతుడు, తతః - ఆయన వలన, కృతిః - కృతి, యః - ఎవడైతే, హిరణ్యనాభాత్ - హిరణ్యనాభుని నుండి, యోగమ్ - యోగవిద్యను, ప్రాప్య - పొంది, ప్రాచ్యసామ్నామ్ - ప్రాచ్యసామలనే మంత్రములయొక్క, షట్ - ఆరు, సంహితాః వై - సంహితలను కూడ, జగౌ - గానము చేసెనో, నీపః హి - నీపుడు, తతః - ఆయన వలన, ఉగ్రాయుధః - ఉగ్రాయుధుడు.

సుపార్శ్వుని పుత్రుడు సుమతి. సుమతియొక్క పుత్రుడు సన్నతిమంతుడు. సన్నతిమంతుని పుత్రుడు కృతి. ఆ కృతి హిరణ్యనాభునినుండి యోగవిద్యను పొంది, ప్రాచ్యసామలనే ఆరు మంత్రసంహితలను కూడ గానము చేసెను. కృతియొక్క పుత్రుడు నీపుడు. నీపుని పుత్రుడు ఉగ్రాయుధుడు.

తస్య క్షేమ్యస్సువీరోఽథ సువీరస్య రిపుంజయః ॥ 29
తతో బహురథో నామ పురమీఢోఽప్రజోఽభవత్ ।
నలిన్యామజమీఢస్య నీలశ్శాంతిస్సుతస్తతః ॥ 30

తస్య - ఆయనకు, క్షేమ్యః - క్షేమ్యుడు, అథ - ఆయన వలన, సువీరః - సువీరుడు, సువీరస్య - సువీరునకు, రిపుంజయః - రిపుంజయుడు, తతః - ఆయన వలన, బహురథః నామ - బహురథుడని ప్రసిద్ధి జెందినవాడు, పురమీఢః - పురమీఢుడు, అప్రజః - సంతానము లేనివాడు,

అభవత్ - ఆయెను, అజమీఢస్య - అజమీఢునకు, నలిన్యామ్ - నలిని యందు, నీలః - నీలుడు, తతః - ఆయన వలన, శాంతిః - శాంతి అనే, సుతః - పుత్రుడు.

ఉగ్రాయుధుని పుత్రుడు క్షేమ్యుడు. క్షేమ్యుని పుత్రుడు సువీరుడు. సువీరుని పుత్రుడు రిపుంజయుడు. రిపుంజయుని పుత్రుడు బహురథుడని ప్రసిద్ధి జెందెను. (హస్తియొక్క మరియొక పుత్రుడగు) పురమీఢునకు సంతానము కలుగలేదు. (హస్తియొక్క మరియొక పుత్రుడగు) అజమీఢునకు రెండవ భార్యయగు నలినియందు నీలుడనే పుత్రుడు కలిగెను. నీలుని పుత్రుడు శాంతి.

శాంతేస్సుశాంతిస్తత్పుత్రః పురుజోఽర్కస్తతోఽభవత్ ।
భర్మ్యాశ్వస్తనయస్తస్య పంచాసన్ముద్గలాదయః ।। 31
యవీనరో బృహదిషుః కాంపిల్యస్సంజయస్సుతాః ।

శాంతేః - శాంతి వలన, సుశాంతిః - సుశాంతి, తత్-పుత్రః - ఆయనయొక్క పుత్రుడు, పురుజః - పురుజుడు, తతః - ఆయన వలన, అర్కః - అర్కుడు, అభవత్ - కలిగెను, తస్య - ఆయనయొక్క, తనయః - పుత్రుడు, భర్మ్యాశ్వః - భర్మ్యాశ్వుడు, ముద్గల-ఆదయః - ముద్గలుడు మొదలుగా గలవారు, యవీనరః - యవీనరుడు, బృహదిషుః - బృహదిషువు, కాంపిల్యః - కాంపిల్యుడు, సంజయః - సంజయుడు అనే, పంచ - అయిదుగురు, సుతాః - పుత్రులు, ఆసన్ - కలిగిరి.

శాంతియొక్క పుత్రుడు సుశాంతి. సుశాంతియొక్క పుత్రుడు పురుజుడు. పురుజునియొక్క పుత్రుడు అర్కుడు. అర్కునియొక్క పుత్రుడు భర్మ్యాశ్వుడు. భర్మ్యాశ్వునకు ముద్గలుడు, యవీనరుడు, బృహదిషువు, కాంపిల్యుడు, సంజయుడు అనే అయిదుగురు పుత్రులు కలిగిరి. వీరిలో ముద్గలుడు పెద్దవాడు.

భర్మ్యాశ్వః ప్రాహ పుత్రా మే పంచానాం రక్షణాయ హి ।। 32
విషయాణామలమిమే ఇతి పంచాలసంజ్ఞితాః ।

భర్మ్యాశ్వః - భర్మ్యాశ్వుడు, ప్రాహ - పలికెను, మే - నాయొ క్క, పుత్రాః - పుత్రులు, పంచానామ్ - అయిదు, విషయాణామ్ - దేశము లయొక్క, రక్షణాయ - రక్షించుట కొరకు, అలమ్ - సమర్థులు, హి - నిశ్చ యము, ఇతి - అనే కారణముగా, పంచాలసంజ్ఞితాః - పంచాలులు అనే పేరు గలవారు.

నా పుత్రులు అయిదు దేశములను రక్షించుటకు నిశ్చయముగా సమర్థులు అని భర్మ్యాశ్వుడు పలికెను. ఇందువలననే, వారికి పంచాలులు (పంచ అలమ్) అనే పేరు వచ్చెను.

ముద్గలాద్బ్రహ్మ నిర్వృత్తం గోత్రం మౌద్గల్యసంజ్ఞితమ్ ॥ 33

మిథునం ముద్గలాద్భార్మ్యాద్దివోదాసః పుమానభూత్ ।
అహల్యా కన్యకా యస్యాం శతానందస్తు గౌతమాత్ ॥ 34

ముద్గలాత్ - ముద్గలుని వలన, మౌద్గల్యసంజ్ఞితమ్ - మౌద్గల్య మనే, బ్రహ్మ గోత్రమ్ - బ్రాహ్మణ గోత్రము, నిర్వృత్తమ్ - ప్రవర్తిల్లెను, భార్మ్యాత్ - భర్మ్యాశ్వుని పుత్రుడైన, ముద్గలాత్ - ముద్గలుని వలన, మిథునమ్ - ఇద్దరు (మగ పిల్లవాడు, ఆడు పిల్ల), పుమాన్ - మగ పిల్లవా డు, దివోదాసః - దివోదాసుడు, అభూత్ - కలిగెను, కన్యకా - ఆడు పిల్ల, అహల్యా - అహల్య, యస్యాం తు - ఏ అహల్యయందైతే, గౌతమాత్ - గౌతమముని వలన, శతానందః - శతానందుడో.

భర్మ్యాశ్వుని పుత్రుడగు ముద్గలుని వలన మౌద్గల్యమనే బ్రాహ్మణ గోత్రము ప్రవర్తిల్లెను. ముద్గలునకు దివోదాసుడనే మగ పిల్లవా డు, అహల్య అనే అమ్మాయి అనే ఇద్దరు పిల్లలు కలిగిరి. అహల్యయందు గౌతమమహర్షి వలన శతానందుడు కలిగెను.

తస్య సత్యధృతిః పుత్రో ధనుర్వేదవిశారదః ।
శరద్వాంస్తత్సుతో యస్మాదుర్వశీదర్శనాత్కిల ॥ 35

శరస్తంబేఽపతద్రేతో మిథునం తదభూచ్ఛుభమ్ ।

తస్య - ఆయనకు, సత్యధృతిః - సత్యధృతి అనే, ధనుర్వేదవిశారదః - ధనుర్వేదమునందు నిపుణుడగు, పుత్రః - పుత్రుడు, తత్-సుతః - ఆయనయొక్క పుత్రుడు, శరద్వాన్ - శరద్వంతుడు, యస్మాత్ - ఎవని నుండియైతే, ఉర్వశీదర్శనాత్ - ఊర్వశిని చూచుట వలన, రేతః - రేతస్సు, శరస్తంబే - ముంజగడ్డి దుబ్బుయందు, అపతత్ కిల - పడెనో, తత్ - అది, శుభమ్ - శుభకరమైన, మిథునమ్ - ఇద్దరు (మగ, ఆడ) పిల్లల జంట, అభూత్ - ఆయెను.

ఆ శతానందునకు సత్యధృతి అనే పుత్రుడు కలిగెను. ఆ సత్యధృతి ధనుర్వేదమునందు నిపుణుడు. ఆయన పుత్రుడు శరద్వంతుడు. శరద్వంతుడు ఊర్వశిని చూచినప్పుడు ఆయన రేతస్సు ముంజగడ్డి దుబ్బుపై పడి, శుభకరమైన ఇద్దరు (మగ, ఆడు) పిల్లల జంటగా ఆయెను.

తద్దృష్ట్వా కృపయాఽగృహ్ణాచ్ఛంతనుర్మృగయాం చరన్ ।
కృపః కుమారః కన్యా చ ద్రోణపత్న్యభవత్కృపీ ॥ 36

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం
నవమస్కంధే ఏకవింశోఽధ్యాయః ॥

మృగయామ్ - వేటను, చరన్ - సంచరించుచున్న, శంతనుః - శంతను మహారాజు, తత్ - ఆ జంటను, దృష్ట్వా - చూచి, కృపయా - దయతో, అగృహ్ణాత్ - స్వీకరించెను, కుమారః - బాలకుడు, కృపః - కృపుడు, కన్యా చ - బాలిక కూడ, కృపీ - కృపి, ద్రోణపత్నీ - ద్రోణునియొక్క భార్య, అభవత్ - ఆయెను.

వేటాడుచున్న శంతను మహారాజు ఆ జంటను చూచి దయ కలిగి వారిని తీసుకువెళ్లి రక్షించెను. వారిలో మగ పిల్లవాడే కృపాచార్యుడు. అమ్మాయి కృపి. ఆమెయే ద్రోణాచార్యునకు భార్య ఆయెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
రంతిదేవోపాఖ్యానమును వర్ణించే ఇరువది ఒకటవ
అధ్యాయము ముగిసినది (21).

* * * * *

# అథ ద్వావింశోఽధ్యాయః

## పాంచాల-కురు-మగధ వంశముల వర్ణనము

శ్రీశుక ఉవాచ।
మిత్రేయుశ్చ దివోదాసాచ్చ్యవనస్తత్సుతో నృప ।
సుదాసస్సహదేవోఽథ సోమకో జంతుజన్మకృత్ ।। 1

తస్య పుత్రశతం తేషాం యవీయాన్ పృషతస్సుతః ।
ద్రుపదో ద్రౌపదీ తస్య ధృష్టద్యుమ్నాదయస్సుతాః ।। 2

నృప - ఓ రాజా!, దివోదాసాత్ - దివోదాసుని వలన, మిత్రేయుః చ - మిత్రేయువు, తత్-సుతః - ఆయనయొక్క పుత్రుడు, చ్యవనః - చ్యవనుడు, సుదాసః - సుదాసుడు, సహదేవః - సహదేవుడు, అథ - మరియు, సోమకః - సోమకుడు, జంతుజన్మకృత్ - జంతువు అనే పుత్రునకు జన్మనిచ్చినవాడు, తస్య - ఆయనకు, పుత్రశతమ్ - వందమంది పుత్రులు, తేషామ్ - వారిలో, పృషతః - పృషతుడు, యవీయాన్ - కనిష్ఠుడు, సుతః - ఆయన పుత్రుడు, ద్రుపదః - ద్రుపదుడు, తస్య - ఆయనకు, ద్రౌపదీ - ద్రౌపది, ధృష్టద్యుమ్న-ఆదయః - ధృష్టద్యుమ్నుడు మొదలుగా గల, సుతాః - పుత్రులు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! ముద్గలుని పుత్రుడగు దివోదాసునకు మిత్రేయువు పుత్రుడు. మిత్రేయువునకు చ్యవనుడు, సుదాసుడు, సహదేవుడు, సోమకుడు అనే నలుగురు పుత్రులు ఉండిరి. వారిలో సోమకునకు వందమంది పుత్రులు కలిగిరి. వారిలో జంతువు పెద్దవాడు కాగా, పృషతుడు కనిష్ఠుడు. పృషతుని పుత్రుడు ద్రుపదుడు. ద్రుపదునకు ద్రౌపది అనే కుమార్తె, మరియు ధృష్టద్యుమ్నుడు, శిఖండి మొదలగు పుత్రులు ఉండిరి.

ధృష్టద్యుమ్నాద్ధృష్టకేతుర్భార్మ్యాః పంచాలకా ఇమే ।
యోఽజమీఢసుతో హ్యన్య ఋక్షస్సంవరణస్తతః ।। 3

ధృష్టద్యుమ్నాత్ - ధృష్టద్యుమ్నుని వలన, ధృష్టకేతుః - ధృష్టకేతువు, భార్మ్యాః - భర్మ్యాశ్వునకు చెందిన, ఇమే - వీరు, పంచాలకాః - పాంచాలురు, అజమీఢసుతః - అజమీఢునియొక్క పుత్రుడైన, యః - ఏ, అన్యః హి - మరియొకడు, ఋక్షః - ఋక్షుడు గలడో, తతః - వాని వలన, సంవరణః - సంవరణుడు.

ధృష్టద్యుమ్నుని పుత్రుడు ధృష్టకేతువు. భర్మ్యాశ్వుని వంశమునకు చెందిన ఈ రాజులు పాంచాలురు (పంచాల దేశరాజులు) అనబడుదురు. అజమీఢునకు ఋక్షుడనే మరియొక పుత్రుడు గలడు. ఆ ఋక్షుని పుత్రుడు సంవరణుడు.

తపత్యాం సూర్యకన్యాయాం కురుక్షేత్రపతిః కురుః ।
పరీక్షిత్సుధనుర్జహ్నుర్నిషధాశ్వః కురోస్సుతాః ।। 4

సూర్యకన్యాయామ్ - సూర్యుని పుత్రికయగు, తపత్యామ్ - తపతియందు, కురుక్షేత్రపతిః - కురుక్షేత్రమునకు ప్రభువగు, కురుః - కురువు, పరీక్షిత్ - పరీక్షిత్తు, సుధనుః - సుధనువు, జహ్నుః - జహ్నువు, నిషధాశ్వః - నిషధాశ్వుడు అనువారలు, కురోః - కురువుయొక్క, సుతాః - పుత్రులు.

సంవరణునకు సూర్యుని పుత్రికయగు తపతియందు కురువు జన్మించి కురుక్షేత్రమునకు అధిపతి ఆయెను. ఆయనకు పరీక్షిత్తు, సుధనువు, జహ్నువు, నిషధాశ్వుడు అనే నలుగురు పుత్రులు కలిగిరి.

సుహోత్రోఽభూత్సుధనుషశ్చ్యవనోఽథ తతః కృతీ ।
వసుస్తస్యోపరిచరో బృహద్రథముఖాస్తతః ।। 5

కుశాంబమత్స్యప్రత్యగ్రచేదిపాద్యాశ్చ చేదిపాః ।

సుధనుషః - సుధనువు వలన, సుహోత్రః - సుహోత్రుడు, అభూత్ - కలిగెను, అథ - ఆయన వలన, చ్యవనః - చ్యవనుడు, తతః -

ఆయన వలన, కృతీ - కృతి, తస్య - ఆయనకు, ఉపరిచరః వసుః - ఉపరి చర వసువు, తతః - ఆయన వలన, బృహద్రథముఖాః - బృహద్రథుడు మొదలగువారు, కుశాంబమత్స్యప్రత్యగ్రచేదిప-ఆద్యాః చ - కుశాంబుడు మత్స్యుడు ప్రత్యగ్రుడు మరియు చేదిపుడు మొదలైన, చేదిపాః - చేదిదేశ ప్రభువులు.

సుధనువుయొక్క పుత్రుడు సుహోత్రుడు. సుహోత్రుని పుత్రుడు చ్యవనుడు. చ్యవనుని పుత్రుడు కృతి. కృతియొక్క పుత్రుడు ఉపరిచర వసువు. ఉపరిచర వసువునకు బృహద్రథుడు, కుశాంబుడు, మత్స్యుడు, ప్రత్యగ్రుడు, చేదిపుడు మొదలగు పుత్రులు కలిగిరి. వీరిలో బృహద్రథుడు పెద్దవాడు. వీరు చేదిదేశమునకు ప్రభువులైరి.

బృహద్రథాత్కుశాగ్రోఽభూదృషభస్తస్య తత్సుతః ॥ 6

జజ్ఞే సత్యహితోఽపత్యం పుష్పవాంస్తత్సుతో జహుః ।
అన్యస్యాం చాపి భార్యాయాం శకలే ద్వే బృహద్రథాత్ ॥ 7

బృహద్రథాత్ - బృహద్రథుని వలన, కుశాగ్రః - కుశాగ్రుడు, అభూత్ - కలిగెను, తస్య - ఆయనకు, ఋషభః - ఋషభుడు, తత్-సుతః - ఆయనయొక్క పుత్రుడు, సత్యహితః - సత్యహితుడు, జజ్ఞే - పుట్టెను, అపత్యమ్ - సంతానము, పుష్పవాన్ - పుష్పవంతుడు, తత్-సుతః - ఆయనయొక్క పుత్రుడు, జహుః - జహువు, బృహద్రథాత్ - బృహద్రథుని వలన, అన్యస్యామ్ - మరియొక, భార్యాయాం చ అపి - భార్యయందు కూడ, ద్వే - రెండు, శకలే - ముక్కలు.

బృహద్రథుని పుత్రుడు కుశాగ్రుడు. కుశాగ్రుని పుత్రుడు ఋషభుడు. ఋషభుని పుత్రుడు సత్యహితుడు. సత్యహితుని పుత్రుడు పుష్పవంతుడు. పుష్పవంతుని పుత్రుడు జహువు. బృహద్రథునకు ఇద్దరు భార్యలు గలరు. వారిలో రెండవ భార్య (ఒకే శరీరముయొక్క) రెండు ముక్కలను ప్రసవించెను.

తే మాత్రా బహిరుత్సృష్టే జరయా చాభిసంధితే ।
జీవ జీవేతి క్రీడంత్యా జరాసంధోఽభవత్సుతః ॥ 8

తే - అవి, మాత్రా - తల్లిచే, బహిః - బయట, ఉత్సృష్టే - పారవే యబడినవి, జీవ - బ్రదుకుము, జీవ - బ్రదుకుము, ఇతి - అని, క్రీడంత్యా - క్రీడించుచున్న, జరయా చ - జరచే, అభిసంధితే - దగ్గరగా చేర్చి సంధానము చేయబడినవి, జరాసంధః - జరాసంధుడు అనే, సుతః - పుత్రుడు, అభవత్ - ఆయెను.

తల్లి ఆ రెండు ముక్కలను బయట పారవేసెను. జర అనే రాక్షసి ఆటలాడుతూ, ఆ ముక్కలను రెండింటినీ తీసుకొని బ్రదుకుము, బ్రదుకుము, అని పలుకుతూ దగ్గరకు చేర్చి సంధానము చేయగా, ఆ శిశువు బ్రదికెను. ఆ శిశువే బృహద్రథునకు జరాసంధుడు (జరచే సంధానము చేయబడినవాడు) అనే పుత్రుడు ఆయెను.

తతశ్చ సహదేవోఽభూత్సోమాపిర్యచ్ఛ్రుతశ్రవాః ।
పరీక్షిదనపత్యోఽభూత్సురథో నామ జాహ్నవః ॥ 9

తతః చ - ఆ జరాసంధుని వలన కూడ, సహదేవః - సహదేవుడు, అభూత్ - కలిగెను, సోమాపిః - సోమాపి, యత్ - ఎవని వలనైతే, శ్రుతశ్రవాః - శ్రుతశ్రవసుడు కలిగెనో, పరీక్షిత్ - పరీక్షిత్తు, అనపత్యః - సంతానము లేనివాడు, అభూత్ - ఆయెను, జాహ్నవః - జహ్నువుయొక్క పుత్రుడు, సురథః నామ - సురథుడని ప్రసిద్ధి గాంచినవాడు.

జరాసంధుని పుత్రుడు సహదేవుడు. సహదేవుని పుత్రుడు సోమాపి. సోమాపియొక్క పుత్రుడు శ్రుతశ్రవసుడు. కురుపుత్రుడగు పరీక్షిత్తునకు సంతానము కలుగలేదు. కురుపుత్రుడగు జహ్నువునకు సురథుడని ప్రసిద్ధి గాంచిన పుత్రుడు కలిగెను.

తతో విదూరథస్తస్మాత్సార్వభౌమస్తతోఽభవత్ ।
జయసేనస్తత్తనయో రాధికోఽతోఽయుతో హ్యభూత్ ॥ 10

తతః - వాని వలన, విదూరథః - విదూరథుడు, తస్మాత్ - ఆయన వలన, సార్వభౌమః - సార్వభౌముడు, తతః - ఆయన వలన, జయసేనః - జయసేనుడు, అభవత్ - కలిగెను, తత్-తనయః - ఆయన

యొక్క పుత్రుడు, రాధికః - రాధికుడు, అతః హి - ఈయన వలనైతే, అయుతః - అయుతుడు, అభూత్ - కలిగెను.

సురథుని పుత్రుడు విదూరథుడు. విదూరథుని పుత్రుడు సార్వభౌముడు. సార్వభౌముని పుత్రుడు జయసేనుడు. జయసేనుని పుత్రుడు రాధికుడు. రాధికుని పుత్రుడు అయుతుడు.

తతశ్చ క్రోధనస్తస్మాద్దేవాతిథిరముష్య చ ।
ఋష్యస్తస్య దిలీపోఽభూత్ప్రతీపస్తస్య చాత్మజః ॥ 11

తతః చ - ఆయన వలన కూడ, క్రోధనః - క్రోధనుడు, తస్మాత్ - ఆయన వలన, దేవాతిథిః - దేవాతిథి, అముష్య చ - ఈయనకు కూడ, ఋష్యః - ఋష్యుడు, తస్య - ఆయనకు, దిలీపః - దిలీపుడు, అభూత్ - కలిగెను, తస్య చ - ఆయనకు కూడ, ప్రతీపః - ప్రతీపుడనే, ఆత్మజః - పుత్రుడు.

అయుతుని పుత్రుడు క్రోధనుడు. క్రోధనుని పుత్రుడు దేవాతిథి. దేవాతిథియొక్క పుత్రుడు ఋష్యుడు. ఋష్యుని పుత్రుడు దిలీపుడు. దిలీపుని పుత్రుడు ప్రతీపుడు.

దేవాపిశ్శంతనుస్తస్య బాహ్లీక ఇతి చాత్మజాః ।
పితృరాజ్యం పరిత్యజ్య దేవాపిస్తు వనం గతః ॥ 12

తస్య - ఆయనకు, దేవాపిః - దేవాపి, శంతనుః - శంతనుడు, చ - మరియు, బాహ్లీకః - బాహ్లీకుడు, ఇతి - అనే, ఆత్మజాః - పుత్రులు, దేవాపిః తు - దేవాపియైతే, పితృరాజ్యమ్ - తండ్రియొక్క రాజ్యమును, పరిత్యజ్య - విడిచిపెట్టి, వనమ్ - అడవిని గురించి, గతః - వెళ్ళినవాడు.

ప్రతీపునకు దేవాపి, శంతనుడు, బాహ్లీకుడు అనే పుత్రులు కలిగిరి. వారిలో దేవాపి తండ్రినుండి సంక్రమించిన రాజ్యాధికారమును విడిచిపెట్టి అడవికి వెళ్ళెను.

అభవచ్ఛంతనూ రాజా ప్రాఙ్మహాభిషసంజ్ఞితః ।
యం యం కరాభ్యాం స్పృశతి జీర్ణం యౌవనమేతి సః ॥ 13

శాంతిమాప్నోతి చైవాగ్ర్యాం కర్మణా తేన శంతనుః ।

శంతనుః - శంతనుడు, రాజా - రాజు, అభవత్ - ఆయెను, ప్రాక్ - పూర్వజన్మయందు, మహాభిషసంజ్ఞితః - మహాభిషుడు అనే పేరు గల వాడు, యం యమ్ - ఏయే, జీర్ణమ్ - ముదుసలిని, కరాభ్యామ్ - రెండు చేతులతో, స్పృశతి - స్పృశించునో, సః - ఆతడు, యౌవనమ్ - యౌవన మును, ఏతి - పొందును, అగ్ర్యామ్ - ఉత్కృష్టమైన, శాంతిం చ - శాంతి ని కూడ, ఆప్నోతి - పొందును, తేన - ఆ, కర్మణా - కర్మచే, శంతనుః - శంతనుడు.

శంతనుడు రాజు ఆయెను. ఆయనకు పూర్వజన్మలో మహాభి షుడు అని పేరు. ఆ శంతనుడు ఏయే ముదుసలిని తన రెండు చేతులతో స్పృశించునో, ఆయా వ్యక్తి యౌవనమును పొందును. అంతేగాక, ఆ వ్యక్తికి ఉత్కృష్టమైన శాంతి లభించును. ఆ విధముగా స్పృశించి శాంతిని కలిగించుటచేతనే ఆయనకు ఆ శంతనుడు (శాంతిని విస్తరింప జేయువా డు) అనే పేరు సార్థకమాయెను.

సమా ద్వాదశ తద్రాజ్యే న వవర్ష యదా విభుః ।। 14

శంతనుర్బ్రాహ్మణైరుక్తః పరివేత్తా త్వమగ్రభుక్ ।
రాజ్యం దేహ్యగ్రజాయాశు పురరాష్ట్రవివృద్ధయే ।। 15

తద్-రాజ్యే - ఆ శంతను మహారాజుయొక్క రాజ్యమునందు, యదా - ఎప్పుడైతే, విభుః - వర్షాధిపతి, ద్వాదశ - పన్నెండు, సమాః - సంవత్సరములను, న వవర్ష - వర్షించలేదో అప్పుడు, శంతనుః - శంతను డు, బ్రాహ్మణైః - బ్రహ్మవేత్తలచే, ఉక్తః - చెప్పబడినాడు, అగ్రభుక్ - అన్నకంటె ముందే రాజ్యమును అనుభవించే, త్వమ్ - నీవు, పరివేత్తా - పరివేత్తవు, పురరాష్ట్రవివృద్ధయే - నగరముయొక్క రాష్ట్రముయొక్క అభి వృద్ధి కొరకు, ఆశు - వెంటనే, రాజ్యమ్ - రాజ్యమును, అగ్రజాయ - అన్న కొరకు, దేహి - ఇమ్ము.

ఆ శంతను మహారాజుయొక్క రాజ్యములో వర్షాధిపతి పన్నెండు సంవత్సరములలో ఒక్కనాడైననూ వర్షించలేదు. అప్పుడు శంతునునితో

బ్రహ్మవేత్తలు ఇట్లు చెప్పినారు -- అన్న ఉండగా నీవు ఆయన రాజ్యమును భోగించుచున్నావు. కావున, నీవు కూడ పరివేత్త (అన్నకంటె ముందుగా వివాహమును చేసుకొనువాడు) వంటివాడవే అగుదువు. ఆ దోషమును నివారించి, పురమునకు రాష్ట్రమునకు అభివృద్ధిని కలిగించుటకై వెంటనే రాజ్యమును అన్నకు అప్పజెప్పుము.

ఏవముక్తో ద్విజైర్జ్యేష్ఠం ఛందయామాస సోఽబ్రవీత్ ।
తన్మంత్రిప్రహితైర్విప్రైర్వేదాద్విభ్రంశితో గిరా ।। 16

వేదవాదాతివాదాన్వై తదా దేవో వవర్ష హ ।

ద్విజైః - వేదవేత్తలచే, ఏవమ్ - ఈ విధముగా, ఉక్తః - పలుకబడిన, సః - ఆ శంతనుడు, జ్యేష్ఠమ్ - అన్నగారిని, ఛందయామాస - ప్రార్థించెను, తత్-మంత్రిప్రహితైః - ఆ శంతనుని మంత్రిచే పంపబడిన, విప్రైః - వేదవేత్తలచే, గిరా - వచనముచే, వేదాత్ - వేదమునుండి, విభ్రంశితః - భ్రష్టుడు గావించబడిన, సః - ఆ దేవాపి, వేదవాద-అతివాదాన్ - వేదవాక్కులను నిందించే వచనములను, అబ్రవీత్ - పలికెను, తదా వై - అప్పుడు మాత్రమే, దేవః - పర్జన్యదేవుడు, వవర్ష హ - వర్షించెనట.

వేదవేత్తలీ విధముగా పలుకగా శంతనుడు అడవిలోనున్న అన్నగారగు దేవాపిని ప్రార్థించెను. కాని, అంతకు ముందే శంతనుని మంత్రి (అశ్మరావుడు) కొందరు వేదవేత్తలను (శంతనునకు తెలియకుండా) దేవాపి వద్దకు పంపెను. వారు దేవాపికి పాఖండమతమును బోధించి వేదధర్మము నుండి భ్రష్టుడగునట్లు చేసిరి. అట్లు భ్రష్టుడైన దేవాపి శంతనునితో వేదధర్మమును నిందించే వచనములను పలికెను. (తద్ద్వారా ఆయన రాజ్యార్హతను కోల్పోయి, శంతనునియందలి పరివేత్తను పోలిన దోషము తొలగిపోయెను). అప్పుడు మాత్రమే పర్జన్యదేవుడు ఆ రాజ్యములో వర్షించెను.

దేవాపిర్యోగమాస్థాయ కలాపగ్రామమాశ్రితః ।। 17

సోమవంశే కలౌ నష్టే కృతాదౌ స్థాపయిష్యతి ।।

దేవాపిః - దేవాపి, యోగమ్ - యోగసాధనను, ఆస్థాయ - అను ష్ఠించి, కలాపగ్రామమ్ - కలాపగ్రామమును, ఆశ్రితః - ఆశ్రయించినవా డు, కలౌ - కలియుగమునందు, సోమవంశే - చంద్రవంశము, నష్టే - విన ష్టము కాగా, కృత-ఆదౌ - కృతయుగారంభమునందు, స్థాపయిష్యతి - స్థాపించగలడు.

దేవాపి యోగసాధనను చేస్తూ కలాపగ్రామమునాశ్రయించి ఉన్నాడు. కలియుగములో చంద్రవంశము వినష్టమగును. అప్పుడు మరల కృతయుగారంభమునందు దేవాపి చంద్రవంశమును స్థాపించగలడు.

బాహ్లీకాత్సోమదత్తోఽభూద్భూరిర్భూరిశ్రవాస్తతః ॥ 18

శలశ్చ శంతనోరాసీద్గంగాయాం భీష్మ ఆత్మవాన్ ।
సర్వధర్మవిదాం శ్రేష్ఠో మహాభాగవతః కవిః ॥ 19

బాహ్లీకాత్ - బాహ్లీకుని వలన, సోమదత్తః - సోమదత్తుడు, అభూత్ - కలిగెను, తతః - ఆయన వలన, భూరిః - భూరి, భూరిశ్రవాః - భూరిశ్రవసుడు, చ - మరియు, శలః - శలుడు, శంతనోః - శంతనుని వల న, గంగాయామ్ - గంగయందు, భీష్మః - భీష్ముడు, ఆత్మవాన్ - మనోజ యము గలవాడు, సర్వధర్మవిదామ్ - సకలధర్మములను తెలిసినవారిలో, శ్రేష్ఠః - శ్రేష్ఠుడు, మహాభాగవతః - గొప్ప భగవద్భక్తుడు, కవిః - జ్ఞాని.

(ప్రతీపుని పుత్రుడగు) బాహ్లీకునకు సోమదత్తుడు అనే పుత్రుడు ఉండెను. సోమదత్తునకు భూరి, భూరిశ్రవసుడు, శలుడు అనే ముగ్గురు పుత్రులు కలిగిరి. (ప్రతీపుని మరియొక పుత్రుడగు) శంతనునకు గంగ యందు భీష్ముడు కలిగెను. ఆ భీష్ముడు మనోజయము గలవాడు. ఆయన సకలధర్మములను తెలిసినవారిలో శ్రేష్ఠుడు, గొప్ప భగవద్భక్తుడు, మరియు జ్ఞాని.

వీరయూథాగ్రణీర్యేన రామోఽపి యుధి తోషితః ।
శంతనోర్దాశకన్యాయాం జజ్ఞే చిత్రాంగదస్సుతః ॥ 20

వీరయూథ-అగ్రణీః - వీరుల సైన్యమునకు నాయకుడు, యేన - ఏ భీష్మునిచేనైతే, రామః అపి - పరశు రాముడు కూడ, తోషితః - సంతోష పెట్టబడినాడో, శంతనోః - శంతనుని వలన, దాశకన్యాయామ్ - దాశరాజుయొక్క కుమార్తెయందు, చిత్రాంగదః - చిత్రాంగదుడనే, సుతః - పుత్రుడు, జజ్ఞే - పుట్టెను.

భీష్ముడు వీరుల సైన్యమునకు నాయకుడు (సకలవీరులలో అగ్రే సరుడు). ఆయన యుద్ధములో పరశు రాముని కూడ మెప్పించినాడు. శంతనునకు దాశరాజుయొక్క కుమార్తె (సత్యవతి) యందు చిత్రాంగదు డనే పుత్రుడు జన్మించెను.

విచిత్రవీర్యశ్చావరజో నామ్నా చిత్రాంగదో హతః ।
యస్యాం పరాశరాత్సాక్షాదవతీర్ణో హరేః కలా ॥ 21

అవరజః చ - ఆతనికంటె చిన్నవాడు, విచిత్రవీర్యః - విచిత్రవీర్యు డు, చిత్రాంగదః - చిత్రాంగదుడు, నామ్నా - అదే పేరుగల వానిచే, హతః - సంహరించ బడినవాడు, యస్యామ్ - ఏ సత్యవతియందైతే, పరాశరాత్ - పరాశర మహర్షి వలన, సాక్షాత్ - సాక్షాత్తుగా, హరేః - శ్రీహరియొక్క, కలా - అంశ, అవతీర్ణః - అవతరించెనో.

చిత్రాంగదుని తమ్ముడు విచిత్రవీర్యుడు. చిత్రాంగదుని అదే పేరు గల గంధర్వుడు సంహరించెను. సత్యవతియందు పరాశర మహర్షి వలన సాక్షాత్తుగా శ్రీహరి తన అంశతో వ్యాసుడై అవతరించెను.

వేదగుప్తో మునిః కృష్ణో యతోఽహమిదమధ్యగామ్ ।
హిత్వా స్వశిష్యాన్ పైలాదీన్ భగవాన్ బాదరాయణః ॥ 22

మహ్యం పుత్రాయ శాంతాయ పరం గుహ్యమిదం జగౌ ।

కృష్ణః - కృష్ణద్వైపాయనుడనే, మునిః - మహర్షి, వేదగుప్తః - వేదములను సంరక్షించినవాడు, యతః - ఏ మహర్షినుండైతే, అహమ్ - నేను, ఇదమ్ - ఈ భాగవతమును, అధ్యగామ్ - అధ్యయనము చేసితినో, భగవాన్ - పూజనీయుడగు, బాదరాయణః - బాదరాయణుడు, స్వశి

ష్యాన్ - తన శిష్యులైన, పైల-ఆదీన్ - పైలుడు మొదలగువారిని, హిత్వా - విడిచిపెట్టి, పుత్రాయ - పుత్రుడనైనట్టియు, శాంతాయ - కామాదిదోషములు లేని, మహ్యామ్ - నా కొరకు, పరమ్ - సర్వోత్కృష్టమైనట్టియు, గుహ్యామ్ - వేదసారమైన, ఇదమ్ - ఈ భాగవతమును, జగౌ - ఉపదేశించెను.

కృష్ణ ద్వైపాయన (వ్యాస) మహర్షి లోకమునందు వేదములను సంరక్షించెను (నిలబెట్టెను). ఈ భాగవతమును నేను ఆయననుండియే అధ్యయనము చేసితిని. పూజనీయుడగు ఆ బాదరాయణ (వ్యాస) మహర్షి తన శిష్యులైన పైలుడు, వైశంపాయనుడు మొదలగువారిని విడిచిపెట్టి వేదముల సారమగు ఈ భాగవతమును, కామాదిదోషములు లేని నాకు ఉపదేశించెను. ఈ భాగవతము సర్వోత్కృష్టమైనది.

విచిత్రవీర్యోఽథోవాహ కాశిరాజసుతే బలాత్ ॥ 23

స్వయంవరాదుపానీతే అంబికాంబాలికే ఉభే ।
తయోరాసక్తహృదయో గృహీతో యక్ష్మణా మృతః ॥ 24

అథ - మంగలము (శంతనుని వంశవృత్తాంతమును కొనసాగిస్తూ), విచిత్రవీర్యః - విచిత్రవీర్యుడు, బలాత్ - బలాత్కారముగా, స్వయంవరాత్ - స్వయంవరమునుండి, ఉపానీతే - తీసుకురాబడినట్టియు, కాశిరాజసుతే - కాశిరాజుయొక్క కుమార్తెలైన, అంబికా-అంబాలికే - అంబికను అంబాలికను, ఉభే - ఇద్దరిని, ఉవాహ - వివాహమాడెను, తయోః - వారిద్దరియందు, ఆసక్తహృదయః - లగ్నమైన హృదయము గల విచిత్రవీర్యుడు, యక్ష్మణా - క్షయరోగముచే, గృహీతః - పట్టుకొనబడినవాడై, మృతః - మరణించినవాడు.

మంగలము! శంతనుని వంశవృత్తాంతమును కొనసాగించెదము. కాశిరాజుయొక్క పుత్రికలగు అంబికను, అంబాలికను స్వయంవరము నుండి భీష్ముడు బలాత్కారముగా తీసుకొని వచ్చెను. వారినిద్దరిని విచిత్రవీర్యుడు వివాహమాడెను. ఆయన వారిద్దరియందు ఆసక్తమైన హృదయ

మును కలిగియుండెను. ఇంతలో క్షయరోగము పట్టుకొని ఆయన మరణించెను.

క్షేత్రేఽప్రజస్య వై భ్రాతుర్మాత్రోక్తో బాదరాయణః ।
ధృతరాష్ట్రం చ పాండుం చ విదురం చాప్యజీజనత్ ॥ 25

అప్రజస్య - సంతానము లేని, భ్రాతుః - సోదరుడగు విచిత్రవీర్యుని యొక్క, క్షేత్రే - భార్యయందు, మాత్రా - తల్లియగు సత్యవతిచే, ఉక్తః - ఆదేశించబడిన, బాదరాయణః - వ్యాస మహర్షి, ధృతరాష్ట్రం చ - ధృతరాష్ట్రుని, పాండుం చ - పాండువును, విదురం చ అపి - విదురుని కూడ, అజీజనత్ - కనెను.

విచిత్రవీర్యునకు సంతానము లేకుండెను. తల్లియగు సత్యవతి యొక్క ఆదేశముచే వ్యాస మహర్షి తన సోదరుడగు విచిత్రవీర్యుని భార్యలయందు ధృతరాష్ట్రుని, పాండువును మరియు విదురుని కనెను.

గాంధార్యాం ధృతరాష్ట్రస్య జజ్ఞే పుత్రశతం నృప ।
తత్ర దుర్యోధనో జ్యేష్ఠో దుశ్శలా చాపి కన్యకా ॥ 26

నృప - ఓ రాజా!, ధృతరాష్ట్రస్య - ధృతరాష్ట్రునకు, గాంధార్యామ్ - గాంధారియందు, పుత్రశతమ్ - పుత్రుల వంద, దుశ్శలా - దుశ్శల అనే, కన్యకా అపి చ - కన్య కూడ, జజ్ఞే - జన్మించెను, తత్ర - వారిలో, దుర్యోధనః - దుర్యోధనుడు, జ్యేష్ఠః - జ్యేష్ఠుడు.

ఓ పరీక్షిన్మహారాజా! ధృతరాష్ట్రునకు గాంధారియందు వంద మంది పుత్రులు, దుశ్శల అనే కన్య కూడ జన్మించెను. ఆ పుత్రులలో దుర్యోధనుడు పెద్దవాడు.

శాపాన్మైథునరుద్ధస్య పాండోః కుంత్యాం మహారథాః ।
జాతా ధర్మానిలేంద్రేభ్యో యుధిష్ఠిరముఖాస్త్రయః ॥ 27

శాపాత్ - శాపము వలన, మైథునరుద్ధస్య - సంభోగమునందు అడ్డుకొనబడిన, పాండోః - పాండువునకు, కుంత్యామ్ - కుంతియందు, ధర్మ-అనిల-ఇంద్రేభ్యః - యమధర్మరాజు వాయువు మరియు ఇంద్రుల

వలన, మహారథాః - మహారథులైన, యుధిష్ఠిరముఖాః - యుధిష్ఠిరుడు మొదలుగా గల, త్రయః - ముగ్గురు, జాతాః - పుట్టినవారు.

శాపము కారణముగా పాండు మహారాజునకు స్త్రీసహవాసము నిషేధించబడెను. ఆయన భార్యయగు కుంతియందు యమధర్మరాజు-వాయుదేవుడు-ఇంద్రుల వలన క్రమముగా ధర్మరాజు, భీముడు, మరియు అర్జునులు జన్మించిరి. వారు మహారథులు.

నకులస్సహదేవశ్చ మాద్ర్యాం నాసత్యదస్రయోః ।
ద్రౌపద్యాం పంచ పంచభ్యః పుత్రాస్తే పితరోఽభవన్ ।। 28

మాద్ర్యామ్ - మాద్రియందు, నాసత్యదస్రయోః - అశ్వినీ కుమారుల వలన, నకులః - నకులుడు, సహదేవః చ - సహదేవుడు కూడ, పంచభ్యః - ఐదుగురి వలన, ద్రౌపద్యామ్ - ద్రౌపదియందు, పంచ - అయిదుగురు, పుత్రాః - పుత్రులు, అభవన్ - కలిగిరి, తే - నీ, పితరః - తండ్రులు.

మాద్రియందు అశ్వినీ కుమారుల వలన నకుల సహదేవులు జన్మించిరి. అయిదుగురు పాండవులకు ద్రౌపదియందు అయిదుగురు పుత్రులు కలిగిరి. వారే నీ (పరీక్షిత్తుయొక్క) తండ్రులు.

యుధిష్ఠిరాత్ప్రతివింధ్యశ్శ్రుతసేనో వృకోదరాత్ ।
అర్జునాచ్ఛ్రుతకీర్తిస్తు శతానీకస్తు నాకులిః ।। 29

యుధిష్ఠిరాత్ - యుధిష్ఠిరుని వలన, ప్రతివింధ్యః - ప్రతివింధ్యుడు, వృకోదరాత్ - భీముని వలన, శ్రుతసేనః - శ్రుతసేనుడు, అర్జునాత్ తు - అర్జునుని వలనైతే, శ్రుతకీర్తిః - శ్రుతకీర్తి, నాకులిః తు - నకులుని పుత్రుడైతే, శతానీకః - శతానీకుడు.

యుధిష్ఠిరుని పుత్రుడు ప్రతివింధ్యుడు. భీముని పుత్రుడు శ్రుతసేనుడు. అర్జునుని పుత్రుడు శ్రుతకీర్తి. నకులుని పుత్రుడు శతానీకుడు.

సహదేవసుతో రాజన్ శ్రుతకర్మా తథాఽపరే ।
యుధిష్ఠిరాత్తు పౌరవ్యాం దేవకోఽథ ఘటోత్కచః ।। 30

భీమసేనాద్ధిడింబాయాం కాల్యాం సర్వగతస్తతః ।
సహదేవాత్సుహోత్రం తు విజయాఽసూత పార్వతీ ॥ 31

రాజన్ - ఓ రాజా!, సహదేవసుతః - సహదేవుని పుత్రుడు, శ్రుత కర్మా - శ్రుతకర్ముడు, తథా - అదే విధముగా, అపరే - ఇతరులు (జన్మిం చిరి), యుధిష్ఠిరాత్ తు - ధర్మరాజు వలనైతే, పౌరవ్యామ్ - పౌరవియం దు, దేవకః - దేవకుడు, అథ - మరియు, భీమసేనాత్ - భీమసేనుని వల న, హిడింబాయామ్ - హిడింబయందు, ఘటోత్కచః - ఘటోత్కచుడు, తతః - ఆ భీమసేనుని వలన, కాల్యామ్ - కాళియందు, సర్వగతః - సర్వ గతుడు, సహదేవాత్ తు - సహదేవుని వలనైతే, పార్వతీ - పర్వతుని పుత్రి కయగు, విజయా - విజయ, సుహోత్రమ్ - సుహోత్రుని, అసూత - కనె ను.

ఓ పరీక్షిన్మహారాజా! సహదేవుని పుత్రుడు శ్రుతకర్ముడు. ఇంతేగా క, వీరికి ఇతర సంతానము కూడ గలదు. ధర్మరాజునకు పౌరవియందు దేవకుడు, భీమునకు హిడింబయందు ఘటోత్కచుడు, కాళియందు సర్వగ తుడు, సహదేవునకు పర్వతుని పుత్రికయగు విజయయందు సుహోత్రుడు జన్మించిరి.

కరేణుమత్యాం నకులో నిరమిత్రం తథాఽర్జునః ।
ఇరావంతములూప్యాం వై సుతాయాం బభ్రువాహనమ్ ।
మణిపూరపతేర్సోఽపి తత్పుత్రః పుత్రికాసుతః ॥ 32

నకులః - నకులుడు, కరేణుమత్యామ్ - కరేణుమతియందు, నిర మిత్రమ్ - నిరమిత్రుని, తథా - మరియు, అర్జునః - అర్జునుడు, ఉలూప్యాం వై - ఉలూపియందైతే, ఇరావంతమ్ - ఇరావంతుని, మణిపూ రపతేః - మణిపూర నగర ప్రభువుయొక్క, సుతాయామ్ - కుమార్తెయం దు, బభ్రువాహనమ్ - బభ్రువాహనుని, సః - ఆతడు, తత్-పుత్రః అపి - ఆ అర్జునుని పుత్రుడే అయిననూ, పుత్రికాసుతః - మాతామహుని సుతు డు.

నకులునకు కరేణుమతియందు నిరమిత్రుడు, అర్జునునకు ఉలూపియందు ఇరావంతుడు జన్మించిరి. మణిపూర దేశాధిపతియొక్క పుత్రిక యందు అర్జునునకే బభ్రువాహనుడు జన్మించెను. ఈ విధముగా ఆ బభ్రువాహనుడు అర్జునుని పుత్రుడే అయిననూ, పుత్రికాధర్మము (పుత్రిక యొక్క పుత్రుని మాతామహుడు తన పుత్రునిగా స్వీకరించుట) ను బట్టి మాతామహుని పుత్రుడు ఆయెను.

తవ తాతస్సుభద్రాయామభిమన్యురజాయత ।
సర్వాతిరథజిద్వీర ఉత్తరాయాం తతో భవాన్ ॥ 33

తవ - నీయొక్క, తాతః - తండ్రియగు, అభిమన్యుః - అభిమన్యుడు, సుభద్రాయామ్ - సుభద్రయందు, అజాయత - జన్మించెను, సర్వ-అతిరథజిత్ - అతిరథులనందరినీ జయించిన, వీరః - వీరుడు, తతః - ఆయన వలన, ఉత్తరాయామ్ - ఉత్తరయందు, భవాన్ - నీవు.

అర్జునునకు సుభద్రయందు నీ తండ్రియగు అభిమన్యుడు జన్మించెను. ఆయన అతిరథులనందరినీ జయించిన వీరుడు. ఆయనకు ఉత్తరయందు నీవు జన్మించితివి.

పరిక్షీణేషు కురుషు ద్రౌణేర్బ్రహ్మాస్త్రతేజసా ।
త్వం చ కృష్ణానుభావేన సజీవో మోచితోఽంతకాత్ ॥ 34

కురుషు - కురువంశీయులు, పరిక్షీణేషు - నశించగా, ద్రౌణేః - ద్రోణపుత్రుడగు అశ్వత్థామయొక్క, బ్రహ్మ-అస్త్రతేజసా - బ్రహ్మాస్త్రము యొక్క తేజస్సుచే, అంతకాత్ - మృత్యువునుండి, కృష్ణ-అనుభావేన - శ్రీకృష్ణుని మహిమచే, త్వం చ - నీవైతే, మోచితః - విడిపించ బడినవాడవై, సజీవః - ప్రాణములతో నున్నవాడవు.

కురువంశీయులగు దుర్యోధనాదులు నశించిరి. అప్పుడు ద్రోణపుత్రుడగు అశ్వత్థామచే ప్రయోగించబడిన బ్రహ్మాస్త్రముయొక్క తేజస్సుచే నీవు కూడ మృత్యువు వాత పడితివి. కాని, శ్రీకృష్ణుడు తన మహిమచే నిన్ను మృత్యువునుండి విడిపించగా, నీవు ప్రాణములతో నున్నావు.

తవేమే తనయాస్తాత జనమేజయపూర్వకాః ।
శ్రుతసేనో భీమసేన ఉగ్రసేనశ్చ వీర్యవాన్ ॥ 35

తాత - కుమారా!, జనమేజయపూర్వకాః - జనమేజయుడు పెద్ద వాడుగా గలవారు, వీర్యవాన్ - పరాక్రమశాలియగు, శ్రుతసేనః - శ్రుతసేనుడు, భీమసేనః - భీమసేనుడు, చ - మరియు, ఉగ్రసేనః - ఉగ్రసేనుడు, ఇమే - వీరు, తవ - నీయొక్క, తనయాః - పుత్రులు.

ఓ కుమారా! పరాక్రమశాలురగు ఈ జనమేజయుడు, శ్రుతసేనుడు, భీమసేనుడు, ఉగ్రసేనుడు నీ పుత్రులు. వీరిలో జనమేజయుడు పెద్దవాడు.

జనమేజయస్త్వాం విదిత్వా తక్షకాన్నిధనం గతమ్ ।
సర్పాన్ వై సర్పయాగాగ్నౌ స హోష్యతి రుషాఽన్వితః ॥ 36

సః - ఆ, జనమేజయః - జనమేజయుడు, త్వామ్ - నిన్ను, తక్షకాత్ - తక్షకుని వలన, నిధనమ్ - మరణమును, గతమ్ - పొందినవానినిగా, విదిత్వా - తెలుసుకొని, రుషా - కోపముతో, అన్వితః - కూడినవాడై, సర్పయాగ-అగ్నౌ - సర్పయాగముయొక్క అగ్నియందు, సర్పాన్ - సర్పములను, వై - నిశ్చయముగా, హోష్యతి - హోమము చేయగలడు.

నీవు తక్షకుని కారణముగా మరణించినావని తెలిసి ఆ జనమేజయుడు కోపించి, సర్పయాగమును చేసి, ఆ అగ్నియందు సర్పములను నిశ్చయముగా హోమము చేయగలడు.

కావషేయం పురోధాయ తురం తురగమేధయాట్ ।
సమంతాత్పృథివీం సర్వాం జిత్వా యక్ష్యతి చాధ్వరైః ॥ 37

సర్వామ్ - సమస్తమైన, పృథివీమ్ - భూమిని, సమంతాత్ - అన్ని వైపులా, జిత్వా - జయించి, కావషేయమ్ - కవషుని పుత్రుడగు, తురమ్ - తురుని, పురోధాయ - పురోహితునిగా చేసుకొని, అధ్వరైః - యాగములచే, యక్ష్యతి - ఆరాధించ గలడు, తురగమేధయాట్ - అశ్వమేధ యాగములను చేయువాడు.

జనమేజయుడు భూమండలమునంతను అన్ని వైపులా జయించి, కవషుని పుత్రుడగు తురుని పురోహితునిగా చేసుకొని యజ్ఞములను చేసి భగవంతుని ఆరాధించ గలడు. ఈయన అశ్వమేధ యాగములను కూడ చేయగలడు.

తస్య పుత్రశ్శతానీకో యాజ్ఞవల్క్యాత్త్రయీం పఠన్ ।
అస్త్రజ్ఞానం క్రియాజ్ఞానం శౌనకాత్పరమేష్యతి ॥ 38

తస్య - ఆయనయొక్క, పుత్రః - పుత్రుడగు, శతానీకః - శతానీకుడు, యాజ్ఞవల్క్యాత్ - యాజ్ఞవల్క్యుని నుండి, త్రయీమ్ - వేదమును, పఠన్ - అధ్యయనము చేయువాడై, అస్త్రజ్ఞానమ్ - అస్త్రముల విజ్ఞానమును, శౌనకాత్ - శౌనక మహర్షి వలన, క్రియాజ్ఞానమ్ - వైదికకర్మల విజ్ఞానమును, పరమ్ - పరమాత్మజ్ఞానమును, ఏష్యతి - పొందగలడు.

ఆ జనమేజయునకు శతానీకుడనే పుత్రుడు కలుగును. ఆ శతానీకుడు యాజ్ఞవల్క్యునినుండి వేదమును, కృపాచార్యునినుండి అస్త్రముల విజ్ఞానమును, శౌనక మహర్షి వలన వైదిక కర్మల విజ్ఞానమును మరియు పరమాత్మ జ్ఞానమును కూడ పొందగలడు.

సహస్రానీకస్తత్పుత్రస్తతశ్చైవాశ్వమేధజః ।
అసీమకృష్ణస్తస్యాపి నేమిచక్రస్తు తత్సుతః ॥ 39

తత్-పుత్రః - ఆయనయొక్క పుత్రుడు, సహస్రానీకః - సహస్రానీకుడు, తతః చ - ఆయన వలన కూడ, అశ్వమేధజః - అశ్వమేధజుడు, తస్య అపి - ఆయనకు కూడ, అసీమకృష్ణః - అసీమకృష్ణుడు, తత్-సుతః తు - ఆయనయొక్క పుత్రుడైతే, నేమిచక్రః - నేమిచక్రుడు.

ఆ శతానీకుని పుత్రుడు సహస్రానీకుడు. సహస్రానీకుని పుత్రుడు అశ్వమేధజుడు. అశ్వమేధజుని పుత్రుడు అసీమకృష్ణుడు. అసీమకృష్ణుని పుత్రుడు నేమిచక్రుడు.

గజాహ్వయే హృతే నద్యా కౌశాంబ్యాం సాధు వత్స్యతి ।
ఉక్తస్తతశ్చిత్రరథస్తస్మాత్కవిరథస్సుతః ॥ 40

గజ-ఆహ్వయే - హస్తినాపురము, నద్యా - గంగానదిచే, హృతే - ముంచివేయబడగా, కౌశాంబ్యామ్ - కౌశాంబియందు, సాధు - సుఖముగా, వత్స్యతి - నివసించ గలడు, తతః - ఆయన వలన, చిత్రరథః - చిత్రరథుడు కలుగునని, ఉక్తః - చెప్పబడినవాడు, తస్మాత్ - ఆయన వలన, కవిరథః - కవిరథుడనే, సుతః - పుత్రుడు.

హస్తినాపురమును గంగ ముంచివేయును. అప్పుడు ఆ నేమిచక్రుడు కౌశాంబియందు సుఖముగా నివసించ గలడు. నేమిచక్రుని పుత్రుడు చిత్రరథుడు, చిత్రరథుని పుత్రుడు కవిరథుడు కాగలరు.

తస్మాచ్చ వృష్టిమాంస్తస్య సుషేణోఽథ మహీపతిః ।
సునీథస్తస్య భవితా నృచక్షుర్యత్సుఖీనలః ।। 41

తస్మాత్ చ - ఆయన వలన కూడ, వృష్టిమాన్ - వృష్టిమంతుడు, అథ - తరువాత, తస్య - ఆయనకు, సుషేణః మహీపతిః - సుషేణ మహారాజు, తస్య - ఆయనకు, సునీథః - సునీథుడు, భవితా - కలుగగలడు, నృచక్షుః - నృచక్షువు, యత్ - ఎవనినుండియైతే, సుఖీనలః - సుఖీనలుడో.

ఆ కవిరథుని పుత్రుడు వృష్టిమంతుడు, వృష్టిమంతుని పుత్రుడు సుషేణ మహారాజు, సుషేణుని పుత్రుడు సునీథుడు, సునీథుని పుత్రుడు నృచక్షువు, నృచక్షుని పుత్రుడు సుఖీనలుడు కాగలరు.

పరిప్లవస్సుతస్తస్మాన్మేధావీ సునయాత్మజః ।
నృపంజయస్తతో దూర్వస్తిమిస్తస్మాజ్జనిష్యతి ।। 42

తస్మాత్ - వాని వలన, పరిప్లవః - పరిప్లవుడనే, సుతః - పుత్రుడు, సునయ-ఆత్మజః - సునయుని పుత్రుడు, మేధావీ - మేధావి, తతః - ఆయన వలన, నృపంజయః - నృపంజయుడు, దూర్వః - దూర్వుడు, తస్మాత్ - ఆయన వలన, తిమిః - తిమి, జనిష్యతి - జన్మించగలడు.

ఆ సుఖీనలుని పుత్రుడు పరిప్లవుడు, పరిప్లవుని పుత్రుడు సునయుడు, సునయుని పుత్రుడు మేధావి, మేధావి పుత్రుడు నృపంజయుడు, నృపంజయుని పుత్రుడు దూర్వుడు, దూర్వుని పుత్రుడు తిమి కాగలరు.

తిమేర్బృహద్రథస్తస్మాచ్ఛతానీకస్సుదాసజః ।
శతానీకాద్దుర్దమనస్తస్యాపత్యం బహీనరః ।। 43

తిమేః - తిమి వలన, బృహద్రథః - బృహద్రథుడు, తస్మాత్ - ఆయన వలన, సుదాసజః - సుదాసుని వలన జన్మించిన, శతానీకః - శతానీకుడు, శతానీకాత్ - శతానీకుని వలన, దుర్దమనః - దుర్దమనుడు, తస్య - ఆయనయొక్క, అపత్యమ్ - పుత్రుడు, బహీనరః - బహీనరుడు.

తిమియొక్క పుత్రుడు బృహద్రథుడు, బృహద్రథుని పుత్రుడు సుదాసుడు, సుదాసుని పుత్రుడు శతానీకుడు, శతానీకుని పుత్రుడు దుర్దమనుడు, దుర్దమనుని పుత్రుడు బహీనరుడు కాగలరు.

దండపాణిర్నిమిస్తస్య క్షేమకో భవితా నృపః ।
బ్రహ్మక్షత్రస్య వై ప్రోక్తో వంశో దేవర్షిసత్కృతః ।। 44

దండపాణిః - దండపాణి, నిమిః - నిమి, తస్య - ఆయనకు, క్షేమకః నృపః - క్షేమక మహారాజు, భవితా - కలుగగలడు, దేవ-ఋషిసత్కృతః - దేవతలచే మహర్షులచే సత్కరించబడే, బ్రహ్మక్షత్రస్య - బ్రాహ్మణులకు మరియు క్షత్రియులకు, వంశః - మూలమగు సోమవంశము, ప్రోక్తః వై - చెప్పబడినది.

బహీనరుని పుత్రుడు దండపాణి, దండపాణియొక్క పుత్రుడు నిమి, ఆ నిమియొక్క పుత్రుడు క్షేమక మహారాజు కాగలరు. ఈ విధముగా బ్రాహ్మణుల మరియు క్షత్రియులయొక్క వంశములకు మూలమైన సోమవంశము చెప్పబడినది. ఈ సోమవంశము దేవతలచే మరియు మహర్షులచే సత్కరించబడేది.

క్షేమకం ప్రాప్య రాజానం సంస్థాం ప్రాప్స్యతి వై కలౌ ।
అథ మాగధరాజానో భవితారో వదామి తే ।। 45

కలౌ - కలియుగమునందు, క్షేమకమ్ - క్షేమకుని, రాజానమ్ - రాజునుగా, ప్రాప్య - పొంది, సంస్థామ్ - సమాప్తిని, వై - నిశ్చయముగా, ప్రాప్స్యతి - పొందగలదు, అథ - తరువాత, భవితారః - రాబోయే, మాగధరాజానః - మగధదేశపు రాజులు, తే - నీ కొరకు, వదామి - చెప్పెదను.

కలియుగములో సోమవంశము క్షేమక మహారాజుతో నిశ్చయముగా సమాప్తిని పొందగలదు. తరువాత నీకు నేను మగధదేశమును పాలించబోయే రాజులను గురించి చెప్పగలను.

భవితా సహదేవస్య మార్జారిర్యచ్ఛ్రుతశ్రవాః ।
తతోఽయుతాయుస్తస్యాపి నిరమిత్రోఽథ తత్సుతః ॥ 46

సునక్షత్రస్సునక్షత్రాద్బృహత్సేనోఽథ కర్మజిత్ ।
తతస్సృతంజయాద్విప్రశ్శుచిస్తస్య భవిష్యతి ॥ 47

సహదేవస్య - సహదేవునకు, మార్జారిః - మార్జారి, భవితా - కలుగగలడు, యత్ - ఎవనివలనైతే, శ్రుతశ్రవాః - శ్రుతశ్రవసుడు, తతః - ఆయన వలన, అయుతాయుః - అయుతాయువు, తస్య అపి - ఆయనకు కూడ, నిరమిత్రః - నిరమిత్రుడు, అథ - తరువాత, తత్-సుతః - ఆయన యొక్క పుత్రుడు, సునక్షత్రః - సునక్షత్రుడు, సునక్షత్రాత్ - సునక్షత్రుని వలన, బృహత్సేనః - బృహత్సేనుడు, అథ - అయన వలన, కర్మజిత్ - కర్మజిత్తు, తతః - ఆయన వలన కలిగిన, సృతంజయాత్ - సృతంజయుని వలన, విప్రః - విప్రుడు, తస్య - ఆయనకు, శుచిః - శుచి, భవిష్యతి - కలుగగలడు.

(జరాసంధుని పుత్రుడగు) సహదేవునకు మార్జారి, మార్జారికి శ్రుతశ్రవసుడు, శ్రుతశ్రవసునకు అయుతాయువు, అయుతాయువునకు నిరమిత్రుడు, నిరమిత్రునకు సునక్షత్రుడు, సునక్షత్రునకు బృహత్సేనుడు, బృహత్సేనునకు కర్మజిత్తు, కర్మజిత్తునకు సృతంజయుడు, సృతంజయునకు విప్రుడు, విప్రునకు శుచి పుత్రులై జన్మించగలరు.

క్షేమోఽథ సువ్రతస్తస్మాద్ధర్మసూత్రశ్శమస్తతః ।
ద్యుమత్సేనోఽథ సుమతిస్సుబలో జనితా తతః ॥ 48

అథ - ఆయన వలన, క్షేమః - క్షేముడు, తస్మాత్ - ఆయన వల న, సువ్రతః - సువ్రతుడు, ధర్మసూత్రః - ధర్మసూత్రుడు, తతః - ఆయన వలన, శమః - శముడు, అథ - ఆయన వలన, ద్యుమత్సేనః - ద్యుమత్సే నుడు, సుమతిః - సుమతి, తతః - ఆయన వలన, సుబలః - సుబలుడు, జనితా - జన్మించగలడు.

ఆ శుచికి క్షేముడు, క్షేమునకు సువ్రతుడు, సువ్రతునకు ధర్మసూ త్రుడు, ధర్మసూత్రునకు శముడు, శమునకు ద్యుమత్సేనుడు, ద్యుమత్సే నునకు సుమతి, సుమతికి సుబలుడు పుత్రులై జన్మించగలరు.

సునీథస్సత్యజిదథ విశ్వజిద్యద్రిపుంజయః ।
బార్హద్రథాశ్చ భూపాలా భావ్యాస్సాహస్రవత్సరమ్ ।। 49

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం
నవమస్కంధే ద్వావింశోఽధ్యాయః ।।

సునీథః - సునీథుడు, అథ - ఆయన వలన, సత్యజిత్ - సత్యజి త్తు, విశ్వజిత్ - విశ్వజిత్తు, యత్ - ఎవని వలనైతే, రిపుంజయః - రిపుంజ యుడో, బార్హద్రథాః చ - బృహద్రథుని వంశమునకు చెందిన, భూపాలాః - రాజులు, సాహస్రవత్సరమ్ - వేయి సంవత్సరములను, భావ్యాః - ఉండగలరు.

సుబలునకు సునీథుడు, సునీథునకు సత్యజిత్తు, సత్యజిత్తునకు విశ్వజిత్తు, విశ్వజిత్తునకు రిపుంజయుడు పుత్రులై జన్మించగలరు. బృహద్ర థుని వంశమునకు చెందిన రాజులు వేయి సంవత్సరములు నిరంతరముగా పాలించగలరు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
పాంచాల-కురు-మగధవంశములను వర్ణించే ఇరువది
రెండవ అధ్యాయము ముగిసినది (22).



# అథ త్రయోవింశోऽధ్యాయః

## యయాతి పుత్రులగు అను-ద్రుహ్యు-తుర్వసు-యదువుల వంశముల వర్ణనము

శ్రీశుక ఉవాచ।
అనోస్సభానరశ్చక్షుః పరోక్షశ్చ త్రయస్సుతాః ।
సభానరాత్కాలనరస్సృంజయస్తత్సుతస్తతః ॥ 1

జనమేజయస్తస్య పుత్రో మహాశీలో మహామనాః ।
ఉశీనరస్తితిక్షుశ్చ మహామనస ఆత్మజౌ ॥ 2

అనోః - అనువు వలన, సభానరః - సభానరుడు, చక్షుః - చక్షువు, చ - మరియు, పరోక్షః - పరోక్షుడు అనే, త్రయః - ముగ్గురు, సుతాః - పుత్రులు, సభానరాత్ - సభానరుని వలన, కాలనరః - కాలనరుడు, తత్సుతః - ఆయనయొక్క పుత్రుడు, సృంజయః - సృంజయుడు, తతః - ఆయన వలన, జనమేజయః - జనమేజయుడు, తస్య - ఆయనయొక్క, పుత్రః - పుత్రుడు, మహాశీలః - మహాశీలుడు, మహామనాః - మహామనసుడు, ఉశీనరః - ఉశీనరుడు, చ - మరియు, తితిక్షుః - తితిక్షువు, మహామనసః - మహామనసునియొక్క, ఆత్మజౌ - పుత్రులు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- (యయాతి పుత్రుడగు) అనువునకు సభానరుడు, చక్షువు, పరోక్షుడు అనే ముగ్గురు పుత్రులు ఉండిరి. సభానరుని పుత్రుడు కాలనరుడు. కాలనరుని పుత్రుడు సృంజయుడు. సృంజయుని పుత్రుడు జనమేజయుడు. జనమేజయుని పుత్రుడు మహాశీలుడు. మహాశీలుని పుత్రుడు మహామనసుడు. మహామనసునకు ఉశీనరుడు, తితిక్షువు అనే ఇద్దరు పుత్రులు ఉండిరి.

శిబిర్వనశ్శమిర్దక్షశ్చత్వారోశీనరాత్మజాః ।
వృషాదర్భస్సువీరశ్చ మద్రః కైకేయ ఆత్మజాః ॥ 3

శిబేశ్చత్వార ఏవాసంస్తితిక్షోశ్చ రుశద్రథః ।
తతో హేమోఽథ సుతపా బలిస్సుతపసోఽభవత్ ॥ 4

శిబిః - శిబి, వనః - వనుడు, శమిః - శమి, దక్షః - దక్షుడు అనే, చత్వారః - నలుగురు, ఉశీనర-ఆత్మజాః - ఉశీనరుని పుత్రులు, వృషాదర్భః - వృషాదర్భుడు, సువీరః - సువీరుడు, మద్రః - మద్రుడు, చ - మరియు, కైకేయః - కైకేయుడు అనే, చత్వారః ఏవ - నలుగురు మాత్రమే, శిబేః - శిబికి, ఆత్మజాః - పుత్రులు, ఆసన్ - ఉండిరి, తితిక్షోః చ - తితిక్షువునకు కూడ, రుశద్రథః - రుశద్రథుడు, తతః - ఆయన వలన, హేమః - హేముడు, అథ - ఆయన వలన, సుతపాః - సుతపసుడు, సుతపసః - సుతపసునినుండి, బలిః - బలి, అభవత్ - కలిగెను.

ఉశీనరునకు శిబి, వనుడు, శమి, దక్షుడు అనే నలుగురు పుత్రులు ఉండిరి. శిబికి కూడ వృషాదర్భుడు, సువీరుడు, మద్రుడు, కైకేయుడు అనే నలుగురు పుత్రులు ఉండిరి. (మహామనసుని పుత్రుడగు) తితిక్షువుయొక్క పుత్రుడు రుశద్రథుడు. రుశద్రథుని పుత్రుడు హేముడు. హేముని పుత్రుడు సుతపసుడు. సుతపసుని పుత్రుడు బలి.

అంగవంగకలింగాద్యాస్సుహ్మపుండ్రాంధ్రసంజ్ఞితాః ।
జజ్ఞిరే దీర్ఘతమసో బలేః క్షేత్రే మహీక్షితః ॥ 5

బలేః మహీక్షితః - బలి మహారాజుయొక్క, క్షేత్రే - భార్యయందు, దీర్ఘతమసః - దీర్ఘతమసుని వలన, అంగవంగకలింగ-అద్యాః - అంగుడు వంగుడు కలింగుడు మొదలగువారు, సుహ్మపుంద్ర-అంధ్రసంజ్ఞితాః - సుహ్మడు పుండ్రుడు అంధ్రుడు అనే పేర్లు గలవారు, జజ్ఞిరే - జన్మించిరి.

బలి మహారాజుయొక్క భార్యయందు (ఉతథ్యుని పుత్రుడగు) దీర్ఘతమసుడనే మహర్షి వలన అంగుడు, వంగుడు, కలింగుడు, సుహ్మడు, పుండ్రుడు, అంధ్రుడు అనే పుత్రులు కలిగిరి.

చక్రుస్స్వనామ్నా విషయాన్ షడిమాన్ ప్రాచ్యకాంశ్చ తే ।
ఖనపానోఽంగతో జజ్ఞే తస్మాద్దివిరథస్తతః ॥ 6

సుతో ధర్మరథో యస్య జజ్ఞే చిత్రరథోఽప్రజాః ।
రోమపాద ఇతి ఖ్యాతస్తస్మై దశరథస్సఖా ।। 7

తే - వారు, స్వనామ్నా - తమ పేరుతో, ప్రాచ్యకాన్ - తూర్పు నందుండే, ఇమాన్ - ఈ, షట్ - ఆరు, విషయాన్ - దేశములను, చక్రుః - స్థాపించిరి, అంగతః - అంగుని వలన, ఖనపానః - ఖనపానుడు, జజ్ఞే - జన్మించెను, తస్మాత్ - ఆయన వలన, దివిరథః - దివిరథుడు, తతః - ఆయన వలన, ధర్మరథః - ధర్మరథుడనే, సుతః - పుత్రుడు, యస్య - ఎవనికైతే, చిత్రరథః - చిత్రరథుడు, జజ్ఞే - జన్మించెనో, అప్రజాః - సంతానము లేనివాడు, రోమపాదః - రోమపాదుడు, ఇతి - అని, ఖ్యాతః - ప్రసిద్ధి గలవాడు, తస్మై - ఆయన కొరకు, దశరథః - దశరథుడు, సఖా - మిత్రుడు.

వారు తమ తమ పేర్లతో తూర్పు దిక్కునందు ఈ ఆరు రాజ్యములనేర్పాటు చేసిరి. అంగుని పుత్రుడు ఖనపానుడు. ఖనపానుని పుత్రుడు దివిరథుడు. దివిరథుని పుత్రుడు ధర్మరథుడు. ధర్మరథుని పుత్రుడు చిత్రరథుడు. చిత్రరథునకు సంతానము లేదు. ఆయనకే రోమపాదుడు అనే ప్రసిద్ధి కూడ గలదు. ఆయన దశరథుని మిత్రుడు.

శాంతాం స్వకన్యాం ప్రాయచ్ఛదృష్యశృంగ ఉవాహ తామ్ ।
దేవేఽవర్షతి యం రామా ఆనిన్యుర్హరిణీసుతమ్ ।। 8

నాట్యసంగీతవాదిత్రైర్విభ్రమాలింగనార్హణైః ।

స్వకన్యామ్ - తన కుమార్తెయగు, శాంతామ్ - శాంతను, ప్రాయచ్ఛత్ - పెంచుకొనుటకు ఇచ్చెను, ఋష్యశృంగః - ఋష్యశృంగుడు, తామ్ - ఆమెను, ఉవాహ - వివాహమాడెను, దేవే - పర్జన్యదేవుడు, అవర్షతి - వర్షించకపోగా, హరిణీసుతమ్ - హరిణియొక్క పుత్రుడగు, యమ్ - ఏ ఋష్యశృంగుని, రామాః - సుందరులగు యువతులు, నాట్యసంగీతవాదిత్రైః - నాట్యము సంగీతము వాద్యధ్వనులు అనువాటితో, విభ్రమ-ఆలింగన-అర్హణైః - విలాసలు ఆలింగనములు బహుమతులు అనువాటితో, ఆనిన్యుః - తీసుకువచ్చిరో.

దశరథుడు తన కుమార్తెను రోమపాదునకు పెంపుడు ఇచ్చెను. రోమపాదుని రాజ్యములో వర్షదేవుడు వర్షించకపోతే, సుందరులగు యువతులు హరిణీ-విభాండకుల పుత్రుడగు ఋష్యశృంగుని వద్దకు వెళ్లిరి. వారు ఆయన యెదుట సంగీతముతో మరియు వాద్యధ్వనులతో కూడిన నాట్యము ప్రదర్శించిరి. ఆయన యెదుట విలాసలను ప్రదర్శించి, ఆయనను ఆలింగనము చేసుకొని, ఆయనకు బహుమతులనిచ్చి, రాజధానికి తీసుకు వచ్చిరి (అపుడు వర్షములు పడెను). ఆ ఋష్యశృంగుడు శాంతను వివాహమాడెను.

స తు రాజ్ఞోఽనపత్యస్య నిరూప్యేష్టిం మరుత్వతః ।। 9
ప్రజామదాద్దశరథో యేన లేభేఽప్రజాః ప్రజాః ।।

సః తు - ఆ ఋష్యశృంగుడైతే, మరుత్వతః - ఇంద్రునకు, ఇష్టిమ్ - ఇష్టిని, నిరూప్య - చేసి, అనపత్యస్య - సంతానము లేని, రాజ్ఞః - రోమపాద మహారాజునకు, ప్రజామ్ - సంతానమును, అదాత్ - ఇచ్చెను, యేన - ఏ యాగముచే, అప్రజాః - సంతానము లేని, దశరథః - దశరథుడు, ప్రజాః - పుత్రులను, లేభే - పొందెనో.

ఆ ఋష్యశృంగుడు ఇంద్రదేవతాకమగు ఇష్టిని చేసి, దాని ప్రభావముచే రోమపాద మహారాజునకు సంతానము కలుగునట్లు చేసెను. అదే యాగముచే పుత్రసంతానము లేని దశరథుడు కూడ పుత్రులను గనెను.

చతురంగో రోమపాదాత్పృథులాక్షస్తు తత్సుతః ।। 10

బృహద్రథో బృహత్కర్మా బృహద్భానుశ్చ తత్సుతాః ।
ఆద్యాద్బృహన్మనాస్తస్మాజ్జయద్రథ ఉదాహృతః ।। 11

రోమపాదాత్ - రోమపాదుని వలన, చతురంగః - చతురంగుడు, తత్-సుతః తు - ఆయనయొక్క పుత్రుడైతే, పృథులాక్షః - పృథులాక్షుడు, బృహద్రథః - బృహద్రథుడు, బృహత్కర్మా - బృహత్కర్ముడు, చ - మరియు, బృహద్భానుః - బృహద్భానువు, తత్-సుతాః - ఆయనయొక్క పుత్రులు, ఆద్యాత్ - మొదటివాడైన బృహద్రథుని వలన, బృహన్మనాః -

బృహన్మనసుడు, తస్మాత్ - ఆయన వలన, జయద్రథః - జయద్రథుడని, ఉదాహృతః - చెప్పబడినవాడు.

రోమపాదుని పుత్రుడు చతురంగుడు. చతురంగుని పుత్రుడు పృథులాక్షుడు. పృథులాక్షునకు బృహద్రథుడు, బృహత్కర్మడు, బృహద్భానువు అనే పుత్రులు గలరు. వారిలో మొదటివాడగు బృహద్రథుని పుత్రుడు బృహన్మనసుడు. బృహన్మనసుని పుత్రుడు జయద్రథుడని పురాణవేత్తలు చెప్పిరి.

విజయస్తస్య సంభూత్యాం తతో ధృతిరజాయత ।
తతో ధృతవ్రతస్తస్య సత్కర్మాఽధిరథస్తతః ॥ 12

తస్య - ఆయనకు, సంభూత్యామ్ - సంభూతియందు, విజయః - విజయుడు, తతః - ఆయన వలన, ధృతిః - ధృతి, అజాయత - పుట్టెను, తతః - ఆయన వలన, ధృతవ్రతః - ధృతవ్రతుడు, తస్య - ఆయనకు, సత్కర్మా - సత్కర్మడు, తతః - ఆయన వలన, అధిరథః - అధిరథుడు.

ఆ జయద్రథునకు సంభూతియందు విజయుడు జన్మించెను. విజయుని పుత్రుడు ధృతి. ధృతియొక్క పుత్రుడు ధృతవ్రతుడు. ధృతవ్రతుని పుత్రుడు సత్కర్మడు. సత్కర్మని పుత్రుడు అధిరథుడు.

యోఽసౌ గంగాతటే క్రీడన్మంజూషాంతర్గతం శిశుమ్ ।
కుంత్యాఽపవిద్ధం కానీనమనపత్యోఽకరోత్సుతమ్ ॥ 13

అనపత్యః - సంతానము లేని, యః - ఏ, అసౌ - ఈయన, గంగాతటే - గంగానదీ తీరమునందు, క్రీడన్ - విహరించుచున్నవాడై, కానీనమ్ - కన్యకు పుట్టినట్టియు, కుంత్యా - కుంతీదేవిచే, అపవిద్ధమ్ - పరిత్యజించబడినట్టియు, మంజూషా-అంతర్గతమ్ - పెట్టె లోపలనున్న, శిశుమ్ - శిశువును, సుతమ్ - పుత్రునిగా, అకరోత్ - చేసుకొనెనో.

ఆ అధిరథునకు సంతానము లేకుండెను. కుంతీదేవి కన్యగనుండగనే శిశువును కని ఆ శిశువు (కర్ణుడు) ను ఒక పెట్టెలో పెట్టి విడిచిపెట్టెను.

అధిరథుడు గంగాతీరమునందు విహరిస్తూ ఆ శిశువును చేరదీసి తన పుత్రునిగా చేసుకొనెను.

వృషసేనస్సుతస్తస్య కర్ణస్య జగతీపతేః ।
ద్రుహ్యోశ్చ తనయో బభ్రుస్సేతుస్తస్యాత్మజస్తతః ॥ 14

ఆరబ్ధస్తస్య గాంధారస్తస్య ధర్మస్తతో ధృతః ।

జగతీపతేః - మహారాజగు, తస్య - ఆ, కర్ణస్య - కర్ణునియొక్క, సుతః - పుత్రుడు, వృషసేనః - వృషసేనుడు, ద్రుహ్యోః చ - ద్రుహ్యుని యొక్క, తనయః - పుత్రుడు, బభ్రుః - బభ్రువు, తస్య - ఆయనయొక్క, ఆత్మజః - పుత్రుడు, సేతుః - సేతువు, తతః - ఆయన వలన, ఆరబ్ధః - ఆరబ్ధుడు, తస్య - ఆయనకు, గాంధారః - గాంధారుడు, తస్య - ఆయనకు, ధర్మః - ధర్ముడు, తతః - ఆయన వలన, ధృతః - ధృతుడు.

మహారాజగు కర్ణునియొక్క పుత్రుడు వృషసేనుడు. (యయాతి పుత్రుడగు) ద్రుహ్యునియొక్క పుత్రుడు బభ్రువు. బభ్రువుయొక్క పుత్రుడు సేతువు. సేతువుయొక్క పుత్రుడు ఆరబ్ధుడు. ఆరబ్ధునియొక్క పుత్రుడు గాంధారుడు. గాంధారునియొక్క పుత్రుడు ధర్ముడు. ధర్ముని యొక్క పుత్రుడు ధృతుడు.

ధృతస్య దుర్మనాస్తస్మాత్ప్రచేతాః ప్రాచేతసం శతమ్ ॥ 15

మ్లేచ్ఛాధిపతయోఽభూవన్నుదీచీం దిశమాశ్రితాః ।
తుర్వసోశ్చ సుతో వహ్నిర్వహ్నేర్భర్గోఽథ భానుమాన్ ॥ 16

ధృతస్య - ధృతునకు, దుర్మనాః - దుర్మనసుడు, తస్మాత్ - ఆయన వలన, ప్రచేతాః - ప్రచేతసుడు, ప్రాచేతసమ్ - ప్రచేతసుని పుత్రుల సమూహము, శతమ్ - వంద, మ్లేచ్ఛ-అధిపతయః - మ్లేచ్ఛుల రాజులు, అభూవన్ - అయిరి, ఉదీచీం దిశమ్ - ఉత్తరదిక్కును, ఆశ్రితాః - ఆశ్రయించినవారు, తుర్వసోః చ - తుర్వసునియొక్క, సుతః - పుత్రుడు, వహ్నిః - వహ్ని, వహ్నేః - వహ్నికి, భర్గః - భర్గుడు, అథ - ఆయన వలన, భానుమాన్ - భానుమంతుడు.

ధృతుని పుత్రుడు దుర్మనసుడు. దుర్మనసుని పుత్రుడు ప్రచేతసుడు. ప్రచేతసునకు వందమంది పుత్రులు కలిగిరి. వారు ఉత్తరదిక్కును ఆశ్రయించి, మ్లేచ్ఛులకు రాజులయిరి. (యయాతి పుత్రుడగు) తుర్వసుని పుత్రుడు వహ్ని. వహ్నియొక్క పుత్రుడు భర్గుడు. భర్గునియొక్క పుత్రుడు భానుమంతుడు.

త్రిభానుస్తత్సుతోఽస్యాపి కరంధమ ఉదారధీః ।
మరుతస్తత్సుతోఽపుత్రః పుత్రం పౌరవమన్వభూత్ ॥ 17

తత్-సుతః - ఆయనయొక్క పుత్రుడు, త్రిభానుః - త్రిభానువు, అస్య అపి - ఈయనకు కూడ, ఉదారధీః - ఉదారమగు బుద్ధి గల, కరంధమః - కరంధముడు, తత్-సుతః - ఆయనయొక్క పుత్రుడగు, మరుతః - మరుతుడు, అపుత్రః - పుత్రులు లేనివాడు, పౌరవమ్ - పూరువంశమునందు పుట్టిన దుష్యంతుని, పుత్రమ్ - పుత్రునిగా, అన్వభూత్ - స్వీకరించెను.

ఆ భానుమంతుని పుత్రుడు త్రిభానువు. ఈ త్రిభానుని పుత్రుడగు కరంధముడు గొప్ప దానబుద్ధి గలవాడు. కరంధముని పుత్రుడు మరుతుడు. మరుతునకు పుత్రులు లేకపోవుటచే, ఆయన పూరువంశమునందు పుట్టిన దుష్యంతుని తన పుత్రునిగా స్వీకరించెను.

దుష్యంతస్స పునర్భేజే స్వం వంశం రాజ్యకాముకః ।
యయాతేర్జ్యేష్ఠపుత్రస్య యదోర్వంశం నరర్షభ ॥ 18

వర్ణయామి మహాపుణ్యం సర్వపాపహరం నృణామ్ ।

రాజ్యకాముకః - రాజ్యమునందు కామన గల, సః - ఆ, దుష్యంతః - దుష్యంతుడు, పునః - మరల, స్వమ్ - తనదైన, వంశమ్ - వంశమును, భేజే - పొందెను, నర-ఋషభ - మనుష్యులలో శ్రేష్ఠుడవగు ఓ రాజా!, యయాతేః - యయాతియొక్క, జ్యేష్ఠపుత్రస్య - జ్యేష్ఠపుత్రుడగు, యదోః - యదువుయొక్క, వంశమ్ - వంశమును, వర్ణయామి - వర్ణించుచున్నాను, మహాపుణ్యమ్ - గొప్ప పవిత్రమైనది, నృణామ్ - మానవులకు, సర్వపాపహరమ్ - సకలపాపములను హరించునది.

మానవులలో శ్రేష్ఠుడవగు ఓ పరీక్షిన్మహారాజా! ఆ దుష్యంతుడు రాజ్యమునందు కామన గలవాడు. పూరువంశీయులకు మాత్రమే రాజ్యాధికారము ఉండెను. కావున, మరుతునిచే పుత్రునిగా స్వీకరించబడిన దుష్యంతుడు మరల తన పౌరవవంశమునే స్వీకరించెను. నేనిప్పుడు యదువుయొక్క వంశమును వర్ణించెదను. యదువు యయాతియొక్క పెద్ద కుమారుడు. చాల పవిత్రమగు ఈ వంశవర్ణనము మానవుల సకలదోషములను హరించివేయును.

యదోర్వంశం నరశ్శ్రుత్వా సర్వపాపైః ప్రముచ్యతే ।। 19
యత్రావతీర్ణో భగవాన్ పరమాత్మా నరాకృతిః ।

నరః - మానవుడు, యదోః - యదువుయొక్క, వంశమ్ - వంశమును గురించి, శ్రుత్వా - విని, సర్వపాపైః - సకలపాపములచే, ప్రముచ్యతే - విముక్తుడగును, యత్ర - ఏ వంశమునందైతే, పరమాత్మా - పరబ్రహ్మ, భగవాన్ - భగవానుడు, నర-ఆకృతిః - మానవరూపము గలవాడై, అవతీర్ణః - అవతరించెనో.

యదువుయొక్క వంశమును గురించి విన్న మానవుడు సకలపాపములనుండి విముక్తుడగును. ఆ వంశమునందే పరబ్రహ్మ భగవానుడు మానవరూపమును దాల్చి అవతరించెను.

యదోస్సహస్రజిత్క్రోష్టా నలో రిపురితి శ్రుతాః ।। 20
చత్వారస్సూనవస్తత్ర శతజిత్ప్రథమాత్మజః ।
మహాహయో వేణుహయో హైహయశ్చేతి తత్సుతాః ।। 21

యదోః - యదువు వలన, సహస్రజిత్ - సహస్రజిత్తు, క్రోష్టా - క్రోష్టు, నలః - నలుడు, రిపుః - రిపువు, ఇతి - అని, శ్రుతాః - ప్రసిద్ధులైన, చత్వారః - నలుగురు, సూనవః - పుత్రులు, తత్ర - వారిలో, ప్రథమ-ఆత్మజః - మొదటివాని పుత్రుడు, శతజిత్ - శతజిత్తు, మహాహయః - మహాహయుడు, వేణుహయః - వేణుహయుడు, చ - మరియు, హైహయః - హైహయుడు, ఇతి - అనువారలు, తత్-సుతాః - ఆయన పుత్రులు.

యదువునకు సహస్రజిత్తు, క్రోష్టు, నలుడు, రిపువు అనే నలుగురు పుత్రులు గలరు. వారిలో పెద్దవాడగు సహస్రజిత్తునకు శతజిత్తు పుత్రుడు. మహోహయుడు, వేణుహయుడు, హైహయుడు అనువారలు శతజిత్తు యొక్క పుత్రులు.

ధర్మస్తు హైహయసుతో నేత్రః కుంతేః పితా తతః ।
సోహంజిరభవత్కుంతేర్మహిష్మాన్ భద్రసేనకః ॥ 22

హైహయసుతః తు - హైహయుని పుత్రుడైతే, ధర్మః - ధర్ముడు, తతః - ఆయన వలన, నేత్రః - నేత్రుడు, కుంతేః - కుంతియొక్క, పితా - తండ్రి, కుంతేః - కుంతి వలన, సోహంజిః - సోహంజి, అభవత్ - కలిగెను, మహిష్మాన్ - మహిష్మంతుడు, భద్రసేనకః - భద్రసేనుడు.

హైహయుని పుత్రుడు ధర్ముడు. ధర్ముని పుత్రుడు నేత్రుడు. నేత్రుని పుత్రుడు కుంతి. కుంతియొక్క పుత్రుడు సోహంజి. సోహంజి యొక్క పుత్రుడు మహిష్మంతుడు. మహిష్మంతుని పుత్రుడు భద్రసేనుడు.

దుర్మదో భద్రసేనస్య ధనకః కృతవీర్యసూః ।
కృతాగ్నిః కృతవర్మా చ కృతౌజా ధనకాత్మజాః ॥ 23

భద్రసేనస్య - భద్రసేనునకు, దుర్మదః - దుర్మదుడు, ధనకః - ధనకుడు, కృతవీర్యసూః - కృతవీర్యుని తండ్రి, కృతాగ్నిః - కృతాగ్ని, కృతవర్మా - కృతవర్మ, చ - మరియు, కృతౌజాః - కృతౌజసుడు, ధనక-ఆత్మజాః - ధనకుని పుత్రులు.

భద్రసేనునకు దుర్మదుడు, ధనకుడు అనే ఇద్దరు పుత్రులు కలిగిరి. ధనకునకు కృతవీర్యుడు, కృతాగ్ని, కృతవర్మ, మరియు కృతౌజసుడు అనే నలుగురు పుత్రుల్లు కలిగిరి.

అర్జునః కృతవీర్యస్య సప్తద్వీపేశ్వరోఽభవత్ ।
దత్తాత్రేయాద్ధరేరంశాత్ప్రాప్తయోగమహాగుణః ॥ 24

కృతవీర్యస్య - కృతవీర్యునకు, అర్జునః - అర్జునుడు, సప్తద్వీప-ఈశ్వరః - ఏడు ఖండములకు ప్రభువు, అభవత్ - ఆయెను, హరేః -

శ్రీహరియొక్క, అంశాత్ - అవతారమైన, దత్తాత్రేయాత్ - దత్తాత్రేయుని వలన, ప్రాప్తయోగమహాగుణః - పొందబడిన యోగము మరియు యోగసిద్ధులు గలవాడు.

కృతవీర్యుని పుత్రుడు అర్జునుడు. ఆతడు ఏడు ఖండములకు ప్రభువు ఆయెను. ఆతనికి శ్రీహరి అంశావతారమైన దత్తాత్రేయుని వలన యోగము మరియు యోగసిద్ధులు లభించెను.

న నూనం కార్తవీర్యస్య గతిం యాస్యంతి పార్థివాః ।
యజ్ఞదానతపోయోగశ్రుతవీర్యజయాదిభిః ॥ 25

పార్థివాః - మహారాజులు, యజ్ఞదానతపోయోగశ్రుతవీర్యజయ-ఆదిభిః - యజ్ఞము దానము తపస్సు యోగము జ్ఞానము పరాక్రమము విజయము మొదలగువాటిచే, కార్తవీర్యస్య - కార్తవీర్యార్జునుని, గతిమ్ - సామ్యమును, న యాస్యంతి - పొందలేరు, నూనమ్ - నిశ్చయము.

యజ్ఞము, దానము, తపస్సు, యోగము, జ్ఞానము, పరాక్రమము, విజయము, దుష్టశిక్షణము మొదలగు గుణములయందు మహారాజులు ఎవరైననూ కార్తవీర్యార్జునుని సామ్యమును నిశ్చయముగా పొందలేరు.

పంచాశీతిసహస్రాణి హ్యవ్యాహతబలస్సమాః ।
అనష్టవిత్తస్మరణో బుభుజేఽక్షయ్యషడ్వసు ॥ 26

హి - ఏలయనగా, అవ్యాహతబలః - క్షీణము కాని శక్తి గలవాడు, అనష్టవిత్తస్మరణః - నష్టమైన విత్తముయొక్క స్మృతి లేనివాడు (నశించని విత్తము గల స్మరణము గలవాడు) అగు అర్జునుడు, పంచ-అశీతిసహస్రాణి - ఎనభై అయిదు వేల, సమాః - సంవత్సరములను, అక్షయ్యషడ్-వసు - క్షీణించని ఆరు ఇంద్రియముల భోగములు గలవాడు.

ఏలయనగా, క్షీణించని శక్తి గల ఆ కార్తవీర్యార్జునుడు ఎనభై అయిదు వేల సంవత్సరముల కాలము నిరంతరముగా క్షీణించని ఆరు ఇంద్రియముల భోగములననుభవించెను. ఆయనకు తన సంపద నష్టమైన

ఘటన ఏదీ స్మృతిలో లేదు. ఆయనను స్మరించువారలకు కూడ సంపద నష్టము కాదు.

తస్య పుత్రసహస్రేషు పంచైవోర్వరితా మృధే ।
జయధ్వజశ్శూరసేనో వృషభో మధురూర్జితః ॥ 27

తస్య - ఆయనయొక్క, పుత్రసహస్రేషు - వేలాది పుత్రులయందు, పంచ ఏవ - అయిదుగురు మాత్రమే, మృధే - యుద్ధమునందు, ఉర్వరితాః - మిగిలినవారు, జయధ్వజః - జయధ్వజుడు, శూరసేనః - శూరసేనుడు, వృషభః - వృషభుడు, మధుః - మధువు, ఊర్జితః - ఊర్జితుడు.

ఆ కార్తవీర్యార్జునునకు పది వేల మంది పుత్రులు గలరు. కాని, (పరశురామునితోడి) యుద్ధమునందు జయధ్వజుడు, శూరసేనుడు, వృషభుడు, మధువు, ఊర్జితుడు అనే అయిదుగురు మాత్రమే ప్రాణములతో బయట పడిరి.

జయధ్వజాత్తాలజంఘస్తస్య పుత్రశతం త్వభూత్ ।
క్షత్రం యత్తాలజంఘాఖ్యమౌర్వతేజోపసంహృతమ్ ॥ 28

జయధ్వజాత్ - జయధ్వజుని వలన, తాలజంఘః - తాలజంఘుడు, తస్య తు - ఆయనకైతే, పుత్రశతమ్ - పుత్రుల వంద, అభూత్ - కలిగెను, యత్ - ఏ, తాలజంఘ-ఆఖ్యమ్ - తాలజంఘులు అనే పేరు గల, క్షత్రమ్ - క్షత్రియజాతి, ఔర్వతేజః-ఉపసంహృతమ్ - ఔర్వ మహర్షి యొక్క తేజస్సుచే నశింప జేయబడినదో.

జయధ్వజుని పుత్రుడు తాలజంఘుడు. ఆయనకు వందమంది పుత్రులు ఉండిరి. వారు తాలజంఘ క్షత్రియులు అనే పేరును బడసిరి. సగర మహారాజు ఔర్వ మహర్షినుండి ఆగ్నేయాస్త్రమును పొంది, దానితో ఆ తాలజంఘులను సంహరించెను.

తేషాం జ్యేష్ఠో వీతిహోత్రో వృష్ణిః పుత్రో మధోస్స్మృతః ।
తస్య పుత్రశతం త్వాసీద్వృష్ణిజ్యేష్ఠం యతః కులమ్ ॥ 29

మాధవా వృష్ణయో రాజన్ యాదవాశ్చేతి సంజ్ఞితాః ।

తేషామ్ - వారిలో, జ్యేష్ఠః - పెద్దవాడు, వీతిహోత్రః - వీతిహోత్రుడు, మధోః - మధువుయొక్క, పుత్రః - పుత్రుడు, వృష్ణిః - వృష్ణియని, స్మృతః - చెప్పబడినవాడు, తస్య తు - ఆ మధువునకైతే, వృష్ణిజ్యేష్ఠమ్ - వృష్ణి పెద్దవాడుగా గల, పుత్రశతమ్ - పుత్రుల వంద, ఆసీత్ - ఉండెను, యతః - ఎవరివలనైతే, కులమ్ - వంశమో, రాజన్ - ఓ రాజా!, మాధవాః - మాధవులు, వృష్ణయః - వృష్ణులు, చ - మరియు, యాదవాః - యాదవులు, ఇతి - అని, సంజ్ఞితాః - పేరు గలవారు.

ఆ తాలజంఘులలో పెద్దవాడు వీతిహోత్రుడు. (కార్తవీర్యార్జునుని పుత్రుడగు) మధువునకు వందమంది పుత్రులు గలరు. వారిలో వృష్ణి పెద్దవాడు. ఈ యదువు, వృష్ణి, మధువుల వలననే వంశము ప్రవర్తిల్లినది. ఆ వంశీయులు క్రమముగా యాదవులు, వృష్ణులు, మాధవులు అనే పేరుతో ప్రసిద్ధిని బడసినారు.

యదుపుత్రస్య చ క్రోష్టోః పుత్రో వృజినవాంస్తతః ॥ 30

శ్వాహిస్తతో రుశేకుర్వై తస్య చిత్రరథస్తతః ।
శశబిందుర్మహాయోగీ మహాభోజో మహానభూత్ ॥ 31

చతుర్దశమహారత్నశ్చక్రవర్త్యపరాజితః ।

యదుపుత్రస్య - యదువుయొక్క పుత్రుడైన, క్రోష్టోః చ - క్రోష్టువుయొక్క, పుత్రః - పుత్రుడు, వృజినవాన్ - వృజినవంతుడు, తతః - ఆయన వలన, శ్వాహిః - శ్వాహి, తతః - ఆయన వలన, రుశేకుః - రుశేకుడు, తస్య వై - ఆయనకైతే, చిత్రరథః - చిత్రరథుడు, తతః - ఆయన వలన, శశబిందుః - శశబిందువు, మహాయోగీ - గొప్ప యోగి, మహాభోజః - గొప్ప భోగి, మహాన్ - గొప్పవాడు, అభూత్ - ఆయెను, చతుర్దశమహారత్నః - పదునాలుగు రకముల శ్రేష్ఠవస్తువులు గలవాడు, చక్రవర్తీ - చక్రవర్తి, అపరాజితః - పరాజయము నెరుగనివాడు.

యదువుయొక్క పుత్రుడు క్రోష్టువు. క్రోష్టువుయొక్క పుత్రుడు వృజినవంతుడు. వృజినవంతుని పుత్రుడు శ్వాహి. శ్వాహియొక్క పుత్రుడు రుశేకుడు. రుశేకుని పుత్రుడు చిత్రరథుడు. చిత్రరథుని పుత్రుడు శశబిందువు. ఆయన చాల గొప్పవాడు. ఆయన గొప్ప యోగియే గాక, గొప్ప భోగి కూడ ఆయెను. పరాజయము నెరుగని ఆ శశబిందు చక్రవర్తి ఏనుగు, గుర్రము, రథము మొదలైన పదునాలుగు రకముల శ్రేష్ఠవస్తువు లను కలిగియుండెను.

తస్య పత్నీసహస్రాణాం దశాఽఽసన్సుమహాయశాః ॥ 32
దశలక్షసహస్రాణి పుత్రాణాం తాస్వజీజనత్ ।

తస్య - ఆయనకు, పత్నీసహస్రాణామ్ - భార్యల వేలయొక్క, దశ - పది, ఆసన్ - ఉండెను, సుమహాయశాః - చాల గొప్ప కీర్తి గల ఆ శశబిందువు, తాసు - వారియందు, పుత్రాణామ్ - పుత్రులయొక్క, దశల క్షసహస్రాణి - పదివేల లక్షలను, అజీజనత్ - కనెను.

చాల గొప్ప కీర్తి గల ఆ శశబిందువునకు పదివేల మంది భార్య లుండిరి. ఆయన వారియందు పదివేల లక్షల పుత్రులను కనెను.

తేషాం తు షట్ప్రధానానాం పృథుశ్రవస ఆత్మజః ॥ 33
ధర్మో నామోశనా తస్య హయమేధశతస్య యాట్ ।
తత్సుతో రుచకస్తస్య పంచాసన్నాత్మజాశ్శృణు ॥ 34

షట్-ప్రధానానామ్ - ఆర్గురు ప్రముఖులుగా గల, తేషామ్ - వారి లో, పృథుశ్రవసః - పృథుశ్రవసునియొక్క, ఆత్మజః - పుత్రుడు, ధర్మః - ధర్ముడని, నామ - ప్రసిద్ధి చెందినవాడు, తస్య - ఆయనకు, ఉశనా - ఉశ నుడు, హయమేధశతస్య - వంద అశ్వమేధములను, యాట్ - అనుష్ఠించి నవాడు, తత్-సుతః - ఆయనయొక్క పుత్రుడు, రుచకః - రుచకుడు, తస్య - ఆయనకు, పంచ - అయిదుగురు, ఆత్మజాః - పుత్రులు, ఆసన్ - కలిగిరి, శృణు - వినుము.

ఆ వంద కోట్ల పుత్రులలో పృథుశ్రవసుడు, పృథుకీర్తి మొదలైన ఆర్గురు ప్రముఖులు. వారిలో పృధుశ్రవసునకు ధర్ముడని ప్రసిద్ధి గాంచిన పుత్రుడు ఉండెను. ధర్ముని పుత్రుడగు ఉశనుడు వంద అశ్వమేధ యాగములను చేసెను. ఉశనుని పుత్రుడు రుచకుడు. రుచకునకు అయిదుగురు పుత్రులు ఉండిరి. వారి పేర్లను వినుము.

పురుజిద్రుక్మరుక్మేషుపృథుజ్యామఘసంజ్ఞితాః ।
జ్యామఘస్త్వప్రజోఽప్యన్యాం భార్యాం శైబ్యాపతిర్భయాత్ ।। 35
నావిందచ్ఛత్రుభవనాద్భోజ్యాం కన్యామహారషీత్ ।

పురుజిద్-రుక్మరుక్మేషుపృథుజ్యామఘసంజ్ఞితాః - పురుజిత్తు రుక్ముడు రుక్మేషువు పృథువు మరియు జ్యామఘుడు అనే పేర్లు గలవారు, శైబ్యాపతిః - శైబ్యకు భర్తయగు, జ్యామఘః తు - జ్యామఘుడైతే, అప్రజః అపి - సంతానము లేనివాడే అయిననూ, భయాత్ - భయము వలన, అన్యామ్ - మరియొక, భార్యామ్ - భార్యను, న అవిందత్ - పొందలేదు, శత్రుభవనాత్ - శత్రువుల భవనమునుండి, భోజ్యామ్ - భోజ్య అనే (భోజవంశమునకు చెందిన), కన్యామ్ - కన్యను, అహారషీత్ - తీసుకొని వచ్చెను.

పురుజిత్తు, రుక్ముడు, రుక్మేషువు, పృథువు, మరియు జ్యామఘుడు అనునవి ఆ రుచకుని పుత్రుల పేర్లు. వారిలో జ్యామఘునకు తన భార్యయగు శైబ్యయందు సంతానము కలుగలేదు. అయినా, ఆయన భార్య వలని భయము వలన ఇంకో స్త్రీని వివాహమాడలేదు. కాని, శత్రు రాజుపై జయించిన సందర్భములో, శత్రురాజుయొక్క అంతఃపురము నుండి భోజవంశమునకు చెందిన భోజ్య అనే కన్యను తీసుకొని వచ్చెను.

రథస్థాం తాం నిరీక్ష్యాహ శైబ్యా పతిమమర్షితా ।। 36
కేయం కుహక మత్స్థానం రథమారోపితేతి వై ।

రథస్థామ్ - రథమునందున్న, తామ్ - ఆ భోజ్యను, నిరీక్ష్య - పరిశీలనగా చూచి, శైబ్యా వై - శైబ్యయైతే, అమర్షితా - కోపించినదియై,

పతిమ్ - భర్తను గురించి, కుహక - మోసగాడా!, రథమ్ - రథమును, మత్-స్థానమ్ - నా స్థానమును, ఆరోపితా - ఎక్కించబడిన, ఇయమ్ - ఈమె, కా - ఎవతె?, ఇతి - అని, ఆహ - పలికెను.

రథమునందున్న ఆ భోజ్యను పరిశీలనగా చూచిన శైబ్య కోపించి నదై భర్తయగు జ్యామఘునితో నిట్లనెను -- ఓయీ మోసగాడా! రథములో నా స్థానములో నీవీమెను ఎక్కించితివి. ఈమె ఎవరు?

స్నుషా తవేత్యభిహితే స్మయంతీ పతిమబ్రవీత్ ॥ 37

అహం వంధ్యాఽసపత్నీ చ స్నుషా మే యుజ్యతే కథమ్ ।
జనయిష్యసి యం రాజ్ఞి తస్యేయముపయుజ్యతే ॥ 38

తవ - నీయొక్క, స్నుషా - కోడలు, ఇతి - అని, అభిహితే - చెప్పబడగా, స్మయంతీ - నవ్వుచున్నదియై, పతిమ్ - భర్తను ఉద్దేశించి, అబ్రవీత్ - పలికెను, అహమ్ - నేను, వంధ్యా - పిల్లలు లేనిదానను, అసపత్నా చ - సవతి లేనిదానను కూడా, మే - నాకు, స్నుషా - కోడలు, కథమ్ - ఎట్లు, యుజ్యతే - పొసగును?, రాజ్ఞి - ఓ మహారాణీ!, యమ్ - ఎవనినైతే, జనయిష్యసి - జన్మనీయగలవో, తస్య - వానికి, ఇయమ్ - ఈమె, ఉపయుజ్యతే - ఉపయోగ పడును.

నీ కోడలు, అని జ్యామఘుడు చెప్పెను. అపుడా శైబ్య చిరునవ్వుతో -- నాకు పిల్లలు లేరు, పైగా సవతి కూడ లేనిదానను, నాకు కోడలు అని చెప్పుట సత్యము ఎట్లు అగును? -- అని భర్తను ప్రశ్నించెను. అపుడా రాజు -- ఓ మహారాణీ! నీకు పుట్టబోయే కొడుకు ఈమెను వివాహము చేసుకొనగలడు -- అని పలికెను.

అన్వమోదంత తద్విశ్వేదేవాః పితర ఏవ చ ।
శైబ్యా గర్భమధాత్కాలే కుమారం సుషువే శుభమ్ ।
స విదర్భ ఇతి ప్రోక్త ఉపయేమే స్నుషాం సతీమ్ ॥ 39

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం
నవమస్కంధే త్రయోవింశోఽధ్యాయః ॥

విశ్వేదేవాః - విశ్వేదేవతలు, పితరః ఏవ చ - పితృదేవతలు కూడ, తత్ - ఆ మాటను, అన్వమోదంత - అనుమోదించిరి, కాలే - సమయము వచ్చినప్పుడు, శైబ్యా - శైబ్య, గర్భమ్ - గర్భమును, అధాత్ - ధరించెను, శుభమ్ - చక్కని, కుమారమ్ - పిల్లవానిని, సుషువే - కనెను. సః - ఆ పిల్లవాడు, విదర్భః - విదర్భుడు అని, ప్రోక్తః - పిలువబడినవాడు, సతీమ్ - సాధ్వియగు, స్నుషామ్ - కోడలిని, ఉపయేమే - వివాహమాడెను.

జ్యామఘుని ఆ మాటను విశ్వేదేవతలు మరియు పితృదేవతలు కూడ అనుమోదించిరి. కొంత కాలమునకు శైబ్య గర్భమును దాల్చి పండువంటి పిల్లవానిని కనెను. ఆ బాలకునకు విదర్భుడని పేరు. ఆ బాలుడే పెరిగి పెద్దవాడై సాధ్వియగు భోజ్యను వివాహమాడెను. ఈ విధముగా ఆమె యథార్థముగనే శైబ్యకు కోడలు ఆయెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
యయాతి పుత్రులగు అను-ద్రుహ్యు-తుర్వసు-యదువుల వంశములను
వర్ణించే ఇరువది మూడవ అధ్యాయము ముగిసినది (23).

* * * * *

# అథ చతుర్వింశోఽధ్యాయః

## విదర్భుని వంశము

శ్రీశుక ఉవాచ।
తస్యాం విదర్భోఽజనయత్పుత్రౌ నామ్నా కుశక్రథౌ ।
తృతీయం రోమపాదం చ విదర్భకులనందనమ్ ॥ 1

విదర్భః - విదర్భుడు, తస్యామ్ - ఆమెయందు, నామ్నా - పేరుచే, కుశక్రథౌ - కుశుడు క్రథుడు అనే, పుత్రౌ - ఇద్దరు పుత్రులను, తృతీయమ్ - మూడవవాడైనట్టియు, విదర్భకులనందనమ్ - విదర్భుని వంశమును ఆనందింపజేసే, రోమపాదం చ - రోమపాదుని కూడ, అజనయత్ - కనెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- విదర్భుడు ఆ భోజ్యయందు కుశుడు, క్రథుడు, రోమపాదుడు అనే ముగ్గురు పుత్రులను కనెను. వీరిలో మూడవవాడగు రోమపాదుడు విదర్భవంశీయులకు ఆనందమును కలిగించువాడు.

రోమపాదసుతో బభ్రుర్బభ్రోః కృతిరజాయత ।
ఉశికస్తత్సుతస్తస్మాచ్చేదిశ్చైద్యాదయో నృప ॥ 2

నృప - ఓ రాజా!, రోమపాదసుతః - రోమపాదునియొక్క పుత్రుడు, బభ్రుః - బభ్రువు, బభ్రోః - బభ్రువు వలన, కృతిః - కృతి, అజాయత - పుట్టెను, తత్-సుతః - ఆయనయొక్క పుత్రుడు, ఉశికః - ఉశికుడు, తస్మాత్ - ఆయన వలన, చేదిః - చేది, చైద్య-ఆదయః - శిశుపాలుడు మొదలగువారు.

ఓ పరీక్షిన్మహారాజా! రోమపాదుని పుత్రుడు బభ్రువు. బభ్రువు యొక్క పుత్రుడు కృతి. కృతియొక్క పుత్రుడు ఉశికుడు. ఉశికుని పుత్రుడు

చేది. శిశుపాలుడు, దమఘోషుడు మొదలగువారు ఆ చేది వంశమునకు చెందినవారే.

క్రథస్య కుంతిః పుత్రోఽభూద్ధృష్టిస్తస్యాథ నిర్వృతిః ।
తతో దశార్హో నామ్నాఽభూత్తస్య వ్యోమస్సుతస్తతః ।। 3

జీమూతో వికృతిస్తస్య యస్య భీమరథస్సుతః ।

క్రథస్య - క్రథునకు, కుంతిః - కుంతి అనే, పుత్రః - పుత్రుడు, అభూత్ - కలిగెను, తస్య - ఆయనకు, ధృష్టిః - ధృష్టి, అథ - ఆయనకు, నిర్వృతిః - నిర్వృతి, తతః - ఆయన వలన, నామ్నా - పేరుచే, దశార్హః - దశార్హుడు అనువాడు, అభూత్ - కలిగెను, తస్య - ఆయనకు, వ్యోమః - వ్యోముడనే, సుతః - పుత్రుడు, తతః - ఆయన వలన, జీమూతః - జీమూతుడు, తస్య - ఆయనకు, వికృతిః - వికృతి, యస్య - ఎవనికైతే, భీమరథః - భీమరథుడు, పుత్రః - పుత్రుడో.

(విదర్భుని పుత్రుడగు) క్రథుని పుత్రుడు కుంతి. కుంతియొక్క పుత్రుడు ధృష్టి. ధృష్టియొక్క పుత్రుడు నిర్వృతి. నిర్వృతియొక్క పుత్రుడు దశార్హుడు. దశార్హుని పుత్రుడు వ్యోముడు. వ్యోముని పుత్రుడు జీమూతుడు. జీమూతుని పుత్రుడు వికృతి. వికృతియొక్క పుత్రుడు భీమరథుడు.

తతో నవరథః పుత్రో జాతో దశరథస్తతః ।। 4

కరంభిశ్శకునేః పుత్రో దేవరాతస్తదాత్మజః ।
దేవక్షత్రస్తతస్తస్య మధుః కురువశాదనుః ।। 5

తతః - ఆయన వలన, నవరథః - నవరథుడనే, పుత్రః - పుత్రుడు, జాతః - జన్మించెను, తతః - ఆయన వలన, దశరథః - దశరథుడు, శకునేః - శకునియొక్క, పుత్రః - పుత్రుడు, కరంభిః - కరంభి, తద్-ఆత్మజః - ఆయనయొక్క పుత్రుడు, దేవరాతః - దేవరాతుడు, తతః - ఆయన వలన, దేవక్షత్రః - దేవక్షత్రుడు, తస్య - ఆయనకు, మధుః - మధువు, కురువశాత్ - కురువశుని వలన, అనుః - అనువు.

ఆ భీమరథుని పుత్రుడు నవరథుడు. నవరథుని పుత్రుడు దశరథుడు. దశరథుని పుత్రుడు శకుని. శకునియొక్క పుత్రుడు కరంభి. కరంభియొక్క పుత్రుడు దేవరాతుడు. దేవరాతుని పుత్రుడు దేవక్షత్రుడు. దేవక్షత్రుని పుత్రుడు మధువు. మధువుయొక్క పుత్రుడు కురువశుడు. కురువశుని పుత్రుడు అనువు.

పురుహోత్రస్త్వనోః పుత్రస్తస్యాయుస్సాత్వతస్తతః ।
భజమానో భజిర్దివ్యో వృష్ణిర్దేవావృధోఽంధకః ।। 6

సాత్వతస్య సుతాస్సప్త మహాభోజశ్చ మారిష ।

మారిష - ఓ ఆర్యా!, అనోః - అనువుయొక్క, పుత్రః తు - పుత్రుడైతే, పురుహోత్రః - పురుహోత్రుడు, తస్య - ఆయనకు, ఆయుః - ఆయువు, తతః - ఆయన వలన, సాత్వతః - సాత్వతుడు, తతః - ఆయన వలన, భజమానః - భజమానుడు, భజిః - భజి, దివ్యః - దివ్యుడు, వృష్ణిః - వృష్ణి, దేవావృధః - దేవావృధుడు, అంధకః - అంధకుడు, చ - మరియు, మహాభోజః - మహాభోజుడు అనే, సప్త - ఏడుగురు, సాత్వతస్య - సాత్వతునియొక్క, సుతాః - పుత్రులు.

ఓ ఆర్యా! అనువుయొక్క పుత్రుడు పురుహోత్రుడు. పురుహోత్రుని పుత్రుడు ఆయువు. ఆయువుయొక్క పుత్రుడు సాత్వతుడు. సాత్వతునకు భజమానుడు, భజి, దివ్యుడు, వృష్ణి, దేవావృధుడు, అంధకుడు, మహాభోజుడు అనే ఏడ్గురు పుత్రులు గలరు.

భజమానస్య నిమ్లోచిః కింకిణో ధృష్టిరేవ చ ।। 7

ఏకస్యామాత్మజాః పత్న్యామన్యస్యాం చ త్రయస్సుతాః ।
శతాజిచ్చ సహస్రాజిదయుతాజిదితి ప్రభో ।। 8

బభ్రుర్దేవావృధసుతస్తయోః శ్లోకౌ పఠంత్యమూ ।

ప్రభో - ఓ మహారాజా!, భజమానస్య - భజమానునకు, ఏకస్యామ్ - ఒక, పత్న్యామ్ - భార్యయందు, నిమ్లోచిః - నిమ్లోచి, కింకిణః - కింకిణుడు, చ - మరియు, ధృష్టిః ఏవ - ధృష్టి అనే, ఆత్మజాః - పుత్రు

లు, అన్యస్యాం చ - మరియొక భార్యయందు కూడ, శతాజిత్ - శతాజిత్తు, సహస్రాజిత్ - సహస్రాజిత్తు, చ - మరియు, అయుతాజిత్ - అయుతాజిత్తు, ఇతి - అనే, త్రయః - ముగ్గురు, సుతాః - పుత్రులు, దేవావృధ సుతః - దేవావృధుని పుత్రుడు, బభ్రుః - బభ్రువు, తయోః - వారిద్దరి విషయమునందు, అమూ - ఈ రెండు, శ్లోకౌ - శ్లోకములను, పఠంతి - పఠించెదరు.

ఓ మహారాజా! భజమానునకు మొదటి భార్యయందు నిమ్లోచి, కింకిణుడు, ధృష్టి అనే ముగ్గురు పుత్రులు, మరియు రెండవ భార్యయందు శతాజిత్తు, సహస్రాజిత్తు, అయుతాజిత్తు అనే ముగ్గురు పుత్రులు కలిగిరి. (సాత్వతుని ఇంకో పుత్రుడగు) దేవావృధుని పుత్రుడు బభ్రువు. వీరిద్దరి గురించి పెద్దలు ఈ (క్రింది) రెండు శ్లోకములను పఠించుచున్నారు.

యథైవ శృణుమో దూరాత్సంపశ్యామస్తథాంతికాత్ ॥ 9

బభ్రుశ్శ్రేష్ఠో మనుష్యాణాం దేవైర్దేవావృధస్సమః ।
పురుషాః పంచషష్టిశ్చ షట్ సహస్రాణి చాష్ట చ ॥ 10

యేఽమృతత్వమనుప్రాప్తా బభ్రోర్దేవావృధాదపి ।

దూరాత్ - దూరమునుండి, యథా - ఏ విధముగా, శృణుమః - వినెదమో, అంతికాత్ - దగ్గరగా, తథా ఏవ - అదే విధముగా, సంపశ్యామః - కనుచున్నాము, బభ్రుః - బభ్రువు, మనుష్యాణామ్ - మానవులలో, శ్రేష్ఠః - శ్రేష్ఠుడు, దేవావృధః - దేవావృధుడు, దేవైః - దేవతలతో, సమః - సమానమైనవాడు, బభ్రోః - బభ్రువు కంటె, దేవావృధాత్ అపి - దేవావృధుని కంటె కూడ, అను - తరువాత, యే - ఏ, పంచషష్టిః చ షట్ సహస్రాణి చ అష్ట చ - పదునాలుగు వేల అరవై అయిదుమంది, పురుషాః - వంశీయులు గలరో వారు, అమృతత్వమ్ - మోక్షమును, ప్రాప్తాః - పొందినవారు.

బభ్రు-దేవావృధుల గురించి దూరమునుండి ఏ విధముగా (ఎంత గొప్పగా) వింటామో, దగ్గరకు వెళ్లి చూస్తే వారు ఖచ్చితముగా అటులనే యుందురు. మానవులలో బభ్రువు శ్రేష్ఠుడు. దేవావృధుడు దేవతలతో

సమానమైనవాడు. బభ్రు-దేవావృధుల వంశములో వారి తరువాత పదునా లుగు వేల అరవై అయిదుగురు వంశీయులు వారిద్దరి ప్రభావము వలననే మోక్షమును పొందిరి (ఇవి వారి మహిమను వర్ణించే రెండు శ్లోకములు).

మహాభోజోఽపి ధర్మాత్మా భోజా ఆసంస్తదన్వయే ॥ 11

వృష్ణేస్సుమిత్రః పుత్రోఽభూద్యుధాజిచ్చ పరంతప ।
శినిస్తస్యానమిత్రశ్చ నిమ్నోఽభూదనమిత్రతః ॥ 12

పరంతప - శత్రువులను తపింపజేసే ఓ రాజా!, మహాభోజః అపి - మహాభోజుడు కూడ, ధర్మాత్మా - ధర్మాత్ముడు, తద్-అన్వయే - ఆయ నయొక్క వంశమునందు, భోజాః - భోజులు, ఆసన్ - కలిగిరి, వృష్ణేః - వృష్ణి వలన, సుమిత్రః - సుమిత్రుడనే, పుత్రః - పుత్రుడు, చ - మరియు, యుధాజిత్ - యుధాజిత్తు, అభూత్ - కలిగెను, తస్య - ఆ యుధాజిత్తున కు, శినిః - శిని, చ - మరియు, అనమిత్రః - అనమిత్రుడు, అనమిత్రతః - అనమిత్రుని వలన, నిమ్నః - నిమ్నుడు, అభూత్ - కలిగెను.

అంతశ్శత్రువులను తపింపజేసిన ఓ పరీక్షిన్మహారాజా! (సాత్వ తుని ఇంకో పుత్రుడైన) మహాభోజుడు కూడ (బభ్రు-దేవావృధుల వలె) ధర్మాత్ముడే. ఆయన వంశమునందు భోజులు అనే రాజులు ఉదయించిరి. (సాత్వతుని ఇంకో పుత్రుడైన) వృష్ణికి సుమిత్రుడు మరియు యుధాజిత్తు అనే పుత్రులు కలిగిరి. ఆ యుధాజిత్తునకు శిని, అనమిత్రుడు అనే పుత్రులు కలిగిరి. అనమిత్రుని పుత్రుడు నిమ్నుడు.

సత్రాజితః ప్రసేనశ్చ నిమ్నస్యాప్యాసతుస్సుతౌ ।
అనమిత్రసుతో యోఽన్యశ్శినిస్తస్యాథ సత్యకః ॥ 13

యుయుధానస్సాత్యకిర్వై జయస్తస్య కుణిస్తతః ।

నిమ్నస్య అపి - నిమ్నునకు కూడ, సత్రాజితః - సత్రాజితుడు, చ - మరియు, ప్రసేనః - ప్రసేనుడు అనే, సుతౌ - ఇద్దరు పుత్రులు, ఆసతుః - కలిగిరి, అనమిత్రసుతః - అనమిత్రుని పుత్రుడగు, అన్యః - మరియొ కడు, యః - ఏ, శినిః - శిని గలడో, తస్య - ఆయనకు, సత్యకః - సత్యకు

డు, అథ - ఆయనకు, యుయుధానః - యుయుధానుడు, వై - ఆయనకు, సాత్యకిః - సాత్యకి, తస్య - ఆయనకు, జయః - జయుడు, తతః - ఆయన వలన, కుణిః - కుణి.

నిమ్నునకు సత్రాజితుడు, ప్రసేనుడు అనే పుత్రులు కలిగిరి. (యుధాజిత్తు పుత్రుడగు) అనమిత్రుని మరియొక (యుధాజిత్తు పుత్రునికంటె భిన్నుడైన) పుత్రుడు శిని. శినియొక్క పుత్రుడు సత్యకుడు. సత్యకుని పుత్రుడు యుయుధానుడు. యుయుధానుని పుత్రుడు సాత్యకి. సాత్యకి యొక్క పుత్రుడు జయుడు. జయుని పుత్రుడు కుణి.

యుగంధరోऽనమిత్రస్య వృష్ణిః పుత్రోऽపరస్తతః ।। 14

శ్వఫల్కశ్చిత్రరథశ్చ గాందిన్యాం చ శ్వఫల్కతః ।
అక్రూరప్రముఖా ఆసన్ పుత్రా ద్వాదశ విశ్రుతాః ।। 15

యుగంధరః - యుగంధరుడు, అనమిత్రస్య - అనమిత్రునకు, అపరః - మరియొక, వృష్ణిః - వృష్ణి అనే, పుత్రః - పుత్రుడు, తతః - ఆయన వలన, శ్వఫల్కః - శ్వఫల్కుడు, చ - మరియు, చిత్రరథః - చిత్రరథుడు, శ్వఫల్కతః - శ్వఫల్కుని వలన, గాందిన్యామ్ - గాందినియందు, అక్రూరప్రముఖాః - అక్రూరుడు ప్రముఖుడుగా గల, ద్వాదశ - పన్నెండు మంది, విశ్రుతాః - ప్రఖ్యాతి చెందిన, పుత్రాః - పుత్రులు, ఆసన్ - ఉండిరి.

కుణియొక్క పుత్రుడు యుగంధరుడు. (యుధాజిత్తు పుత్రుడగు) అనమిత్రునకు వృష్ణి అనే మరియొక (సాత్వతుని పుత్రుడగు వృష్ణికంటె భిన్నుడైన) మూడవ పుత్రుడు కూడ గలడు. వృష్ణికి శ్వఫల్కుడు, చిత్రరథుడు అనే పుత్రులు ఉండిరి. శ్వఫల్కునకు గాందిని అనే భార్యయందు, ప్రఖ్యాతి గాంచిన అక్రూరుడు కాకుండా ఇంకో పన్నెండు మంది ప్రసిద్ధులైన పుత్రులు కలిగిరి.

ఆసంగస్సారమేయశ్చ మృదురో మృదువిద్గిరిః ।
ధర్మవృద్ధస్సుకర్మా చ క్షేత్రోపేక్షోऽరిమర్దనః ।। 16

శత్రుఘ్నో గంధమాదశ్చ ప్రతిబాహుశ్చ ద్వాదశ ।

ఆసంగః - ఆసంగుడు, సారమేయః చ - సారమేయుడు, మృదురః - మృదురుడు, మృదువిత్ - మృదువిత్తు, గిరిః - గిరి, ధర్మ వృద్ధః - ధర్మవృద్ధుడు, సుకర్మా చ - సుకర్ముడు, క్షేత్రోపేక్షః - క్షేత్రోపేక్షుడు, అరిమర్దనః - అరిమర్దనుడు, శత్రుఘ్నః - శత్రుఘ్నుడు, గంధమాదః చ - గంధమాదుడు, ప్రతిబాహుః చ - ప్రతిబాహుడు, ద్వాదశ - పన్నెండుగురు.

ఆసంగుడు, సారమేయుడు, మృదురుడు, మృదువిత్తు, గిరి, ధర్మ వృద్ధుడు, సుకర్ముడు, క్షేత్రోపేక్షుడు, అరిమర్దనుడు, శత్రుఘ్నుడు, గంధ మాదుడు, ప్రతిబాహుడు అనునవి ఆ (అక్రూరుడు కాకుండా మిగిలిన) పన్నెండుగురి పేర్లు.

తేషాం స్వసా సుచీరాఖ్యా ద్వావక్రూరసుతావపి ॥ 17

దేవవానుపదేవశ్చ తథా చిత్రరథాత్మజాః ।
పృథుర్విదూరథాద్యాశ్చ బహవో వృష్ణినందనాః ॥ 18

తేషామ్ - వారికి, సుచీరా-ఆఖ్యా - సుచీర అనే పేరు గల, స్వసా - చెల్లెలు, అక్రూరసుతౌ - అక్రూరుని పుత్రులు, ద్వౌ అపి - ఇద్దరు కూడ, దేవవాన్ - దేవవంతుడు, ఉపదేవః చ - ఉపదేవుడు, తథా - మరియు, చిత్రరథ-ఆత్మజాః - చిత్రరథుని పుత్రులు, పృథుః - పృథువు, విదూరథ-ఆద్యాః - విదూరథుడు మొదలగువారు, బహవః - చాలమంది, వృష్ణినం దనాః - వృష్ణివంశమునానందింప జేయువారు.

వారికి సుచీర అనే చెల్లెలు కూడ గలదు. అక్రూరునకు కూడ దేవ వంతుడు, ఉపదేవుడు అనే ఇద్దరు పుత్రులు గలరు. (వృష్ణియొక్క మరి యొక పుత్రుడగు) చిత్రరథునకు పృథువు, విదూరథుడు మొదలగు చాల మంది పుత్రులు గలరు. వారందరు వృష్ణివంశీయులలో శ్రేష్ఠులే (కావుననే, ఆ వంశీయులనానందింప జేయువారు).

కుకురో భజమానశ్చ శుచిః కంబలబర్హిషః ।
కుకురస్య సుతో వహ్నిర్విలోమా తనయస్తతః ॥ 19

కుకురః - కుకురుడు, భజమానః - భజమానుడు, శుచిః - శుచి, చ - మరియు, కంబలబర్హిషః - కంబలబర్హిషుడు, కుకురస్య - కుకురుని యొక్క, సుతః - పుత్రుడు, వహ్నిః - వహ్ని, తతః - ఆయన వలన, విలోమా - విలోముడనే, తనయః - పుత్రుడు.

కుకురుడు, భజమానుడు, శుచి, కంబలబర్హిషుడు అనే నలుగురు (సాత్వతుని పుత్రుడగు అంధకుని పుత్రులు). కుకురుని పుత్రుడు వహ్ని. వహ్నియొక్క పుత్రుడు విలోముడు.

కపోతరోమా తస్యానుస్సఖా యస్య చ తుంబురుః ।
అంధకో దుందుభిస్తస్మాదరిద్యోతః పునర్వసుః ॥ 20

తస్య - ఆయనకు, కపోతరోమా - కపోతరోముడు, అనుః - అనువు, యస్య చ - ఎవనికైతే, తుంబురుః - తుంబురుడు, సఖా - మిత్రుడో, అంధకః - అంధకుడు, దుందుభిః - దుందుభి, తస్మాత్ - ఆయన వలన, అరిద్యోతః - అరిద్యోతుడు, పునర్వసుః - పునర్వసువు.

ఆ విలోముని పుత్రుడు కపోతరోముడు. కపోతరోముని పుత్రుడు అనువు. అనువునకు తుంబురుడు మిత్రుడు. అనువుయొక్క పుత్రుడు అంధకుడు. అంధకుని పుత్రుడు దుందుభి. దుందుభియొక్క పుత్రుడు అరిద్యోతుడు. అరిద్యోతుని పుత్రుడు పునర్వసువు.

తస్యాఽఽహుకశ్చాహుకీ చ కన్యా చైవాహుకాత్మజౌ ।
దేవకశ్చోగ్రసేనశ్చ చత్వారో దేవకాత్మజాః ॥ 21
దేవవానుపదేవశ్చ సుదేవో దేవవర్ధనః ।

తస్య - ఆయనకు, ఆహుకః చ - ఆహుకుడు, చ - మరియు, ఆహుకీ - ఆహుకి అనే, కన్య ఏవ - కుమార్తె కూడా, దేవకః చ - దేవకుడు, ఉగ్రసేనః చ - ఉగ్రసేనుడు అనువారలు, ఆహుక-ఆత్మజౌ - ఆహుకుని పుత్రులు, దేవక-ఆత్మజాః - దేవకుని పుత్రులు, చత్వారః - నలుగు

రు, దేవవాన్ - దేవవంతుడు, ఉపదేవః - ఉపదేవుడు, సుదేవః - సుదేవుడు, చ - మరియు, దేవవర్ధనః - దేవవర్ధనుడు.

ఆ పునర్వసువునకు ఆహుకుడనే పుత్రుడు, ఆహుకి అనే కుమార్తె కూడ గలరు. ఆహుకునకు దేవకుడు, ఉగ్రసేనుడు అనే ఇద్దరు పుత్రులు గలరు. దేవకునకు దేవవంతుడు, ఉపదేవుడు, సుదేవుడు, దేవవర్ధనుడు అనే నలుగురు పుత్రులు గలరు.

తేషాం స్వసారస్సప్తాసన్ ధృతదేవాదయో నృప ।। 22

శాంతిదేవోపదేవా చ శ్రీదేవా దేవరక్షితా ।
సహదేవా దేవకీ చ వసుదేవ ఉవాహ తాః ।। 23

నృప - ఓ రాజా!, తేషామ్ - వారికి, సప్త - ఏడ్గురు, ధృతదేవా-ఆదయః - ధృతదేవ మొదలగు, స్వసారః - చెల్లెళ్లు, ఆసన్ - ఉండిరి, శాంతిదేవా - శాంతిదేవ, ఉపదేవా చ - ఉపదేవ, శ్రీదేవా - శ్రీదేవ, దేవరక్షితా - దేవరక్షిత, సహదేవా - సహదేవ, చ - మరియు, దేవకీ - దేవకి, వసుదేవః - వసుదేవుడు, తాః - వారిని, ఉవాహ - వివాహమాడెను.

ఓ పరీక్షిన్మహారాజా! దేవవంతుడు మొదలైన ఆ నలుగురికి ఏడ్గురు చెల్లెళ్లు కూడ గలరు. ధృతదేవ, శాంతిదేవ, ఉపదేవ, శ్రీదేవ, దేవరక్షిత, సహదేవ, దేవకి అనునవి వారి పేర్లు. వారినందరిని వసుదేవుడు వివాహమాడెను.

కంసస్సునామా న్యగ్రోధః కంకశ్శంకుస్సుహూస్తథా ।
రాష్ట్రపాలోఽథ సృష్టిశ్చ తుష్టిమానౌగ్రసేనయః ।। 24

కంసః - కంసుడు, సునామా - సునాముడు, న్యగ్రోధః - న్యగ్రోధుడు, కంకః - కంకుడు, శంకుః - శంకువు, సుహూః - సుహూ, తథా - మరియు, రాష్ట్రపాలః - రాష్ట్రపాలుడు, అథ - మరియు, సృష్టిః చ - సృష్టి, తుష్టిమాన్ - తుష్టిమంతుడు అనువారు, ఔగ్రసేనయః - ఉగ్రసేనుని పుత్రులు.

కంసుడు, సునాముడు, న్యగ్రోధుడు, కంకుడు, శంకువు, సుహూ, రాష్ట్రపాలుడు, సృష్టి, మరియు తుష్టిమంతుడు అనువారలు (ఆహుకుని పుత్రుడగు) ఉగ్రసేనుని పుత్రులు (తొమ్మిదిమంది).

కంసా కంసవతీ కంకా శూరభూ రాష్ట్రపాలికా ।
ఉగ్రసేనదుహితరో వసుదేవానుజస్త్రియః ।। 25

కంసా - కంస, కంసవతీ - కంసవతి, కంకా - కంక, శూరభూః - శూరభువు, రాష్ట్రపాలికా - రాష్ట్రపాలిక, ఉగ్రసేనదుహితరః - ఉగ్రసేనుని కుమార్తెలు, వసుదేవ-అనుజస్త్రియః - వసుదేవుని తమ్ముల భార్యలు.

ఉగ్రసేనునకు కంస, కంసవతి, కంక, శూరభువు, రాష్ట్రపాలిక అనే ఐదుగురు కుమార్తెలు ఉండిరి. వారిని వసుదేవుని తమ్ములు అగు దేవభాగుడు మొదలగువారు వివాహమాడిరి.

శూరో విదూరథాదాసీద్భజమానస్సుతస్తతః ।
శినిస్తస్మాత్స్వయంభోజో హృదీకస్తత్సుతో మతః ।। 26

విదూరథాత్ - విదూరథుని వలన, శూరః - శూరుడు, ఆసీత్ - కలిగెను, తతః - ఆయన వలన, భజమానః - భజమానుడు అనే, సుతః - పుత్రుడు, తస్మాత్ - ఆయన వలన, శినిః - శిని, స్వయంభోజః - స్వయంభోజుడు, తత్-సుతః - ఆయనయొక్క పుత్రుడు, హృదీకః - హృదీకుడు అని, మతః - చెప్పబడినవాడు.

(చిత్రరథుని పుత్రుడగు) విదూరథుని పుత్రుడు శూరుడు. శూరుని పుత్రుడు భజమానుడు. భజమానుని పుత్రుడు శిని. శినియొక్క పుత్రుడు స్వయంభోజుడు. స్వయంభోజుని పుత్రుడు హృదీకుడు.

దేవబాహుశ్శతధనుః కృతవర్మేతి తత్సుతాః ।
దేవమీఢస్య శూరస్య మారిషా నామ పత్న్యభూత్ ।। 27

దేవబాహుః - దేవబాహువు, శతధనుః - శతధనువు, కృతవర్మా - కృతవర్మ, ఇతి - అనువారలు, తత్-సుతాః - ఆయనయొక్క పుత్రులు,

దేవమీఢస్య - దేవమీఢుని పుత్రుడైన, శూరస్య - శూరునకు, మారిషా నామ - మారిష అని ప్రసిద్ధి గాంచిన, పత్నీ - భార్య, అభూత్ - ఉండెను.

హృదీకునకు దేవబాహువు, శతధనువు, కృతవర్మ అనే పుత్రులు గలరు. దేవమీఢుని పుత్రుడైన శూరుని భార్య మారిష అనే పేరుతో ప్రసిద్ధి గాంచెను.

తస్యాం స జనయామాస దశ పుత్రానకల్మషాన్ ।
వసుదేవం దేవభాగం దేవశ్రవసమానకమ్ ॥ 28

సృంజయం శ్యామకం కంకం శమీకం వత్సకం వృకమ్ ।

తస్యామ్ - ఆమెయందు, సః - ఆయన, వసుదేవమ్ - వసుదేవుని, దేవభాగమ్ - దేవభాగుని, దేవశ్రవసమ్ - దేవశ్రవసుని, ఆనకమ్ - ఆనకుని, సృంజయమ్ - సృంజయుని, శ్యామకమ్ - శ్యామకుని, కంకమ్ - కంకుని, శమీకమ్ - శమీకుని, వత్సకమ్ - వత్సకుని, వృకమ్ - వృకుని, దశ - పదిమంది, అకల్మషాన్ - నిష్కల్మషులైన, పుత్రాన్ - పుత్రులను, జనయామాస - కనెను.

ఆ శూరునకు ఆ మారిషయందు వసుదేవుడు, దేవభాగుడు, దేవశ్రవసుడు, ఆనకుడు, సృంజయుడు, శ్యామకుడు, కంకుడు, శమీకుడు, వత్సకుడు, వృకుడు అనే పదిమంది నిష్కల్మషులగు పుత్రులు కలిగిరి.

దేవదుందుభయో నేదురానకా యస్య జన్మని ॥ 29

వసుదేవం హరేః స్థానం వదంత్యానకదుందుభిమ్ ।

యస్య - ఎవ్వాని, జన్మని - పుట్టుకయందు, దేవదుందుభయః - దేవతల దుందుభులు, ఆనకాః - భేరీలు, నేదుః - మ్రోగినవో, హరేః - శ్రీహరికి, స్థానమ్ - జన్మనిచ్చే తండ్రియగు, వసుదేవమ్ - వసుదేవుని, ఆనకదుందుభిమ్ - ఆనకదుందుభినిగా, వదంతి - చెప్పుచున్నారు.

వసుదేవుడు శ్రీహరికి జన్మను ఈయబోయే తండ్రి. కావుననే, ఆయన పుట్టినప్పుడు దేవతల దుందుభులు, భేరీలు వాటంతట అవియే మ్రోగినవి. అందువలననే, ఆయనకు ఆనకదుందుభి అనే ప్రసిద్ధి కలిగినది.

పృథా చ శ్రుతదేవా చ శ్రుతకీర్తిశ్శ్రుతశ్రవాః ॥ 30

రాజాధిదేవీ చైతేషాం భగిన్యః పంచ కన్యకాః ।
కుంతేస్సఖ్యుః పితా శూరో హ్యపుత్రస్య పృథామదాత్ ॥ 31

పృథా చ - పృథ, శ్రుతదేవా చ - శ్రుతదేవ, శ్రుతకీర్తిః - శ్రుతకీర్తి, శ్రుతశ్రవాః - శ్రుతశ్రవ, చ - మరియు, రాజాధిదేవీ - రాజాధిదేవి అనే, పంచ - అయిదుగురు, కన్యకాః - కన్యలు, ఏతేషామ్ - వీరియొక్క, భగిన్యః - చెల్లెళ్లు, పితా - తండ్రియగు, శూరః - శూరుడు, సఖ్యుః - మిత్రుడైనట్టియు, అపుత్రస్య - సంతానము లేని, కుంతేః - కుంతికి, పృథామ్ - పృథను, అదాత్ - ఇచ్చెను.

శూరుని పుత్రులగు ఈ పదిమంది సోదరులకు అయిదుగురు సోదరిలు కూడ గలరు. పృథ, శ్రుతదేవ, శ్రుతకీర్తి, శ్రుతశ్రవ, మరియు రాజాధిదేవి అనేవి ఆ అయిదుగురు కన్యల పేర్లు. తండ్రియగు శూరునకు కుంతి అనే మిత్రుడు ఉండెను. ఆ కుంతికి సంతానము లేకుండెను. శూరుడు పృథను ఆ కుంతికి పెంపుడుగా ఇచ్చెను.

సాఽఽప దుర్వాససో విద్యాం దేవహూతీం ప్రతోషితాత్ ।
తస్యా వీర్యపరీక్షార్థమాజుహావ రవిం శుచిమ్ ॥ 32

సా - ఆమె, ప్రతోషితాత్ - మిక్కిలి సంతోషమును పొందిన, దుర్వాససః - దూర్వాస మహర్షి నుండి, దేవహూతీమ్ - దేవతలనాహ్వానించే, విద్యామ్ - ఉపాసనను, ఆప - పొందెను, తస్యాః - ఆ విద్యయొక్క, వీర్యపరీక్షా-అర్థమ్ - శక్తిని పరీక్షించుట కొరకై, శుచిమ్ - పరమ పవిత్రుడగు, రవిమ్ - సూర్యదేవుని, ఆజుహావ - ఆహ్వానించెను.

ఆ కుంతి దూర్వాస మహర్షిని పరిచర్యలచే చాల సంతోషపెట్టి, ఆయననుండి దేవతలనాహ్వానించే ఉపాసనను పొందెను. ఆమె ఆ విద్య యొక్క శక్తిని పరీక్షించుటకై పరమపవిత్రుడగు సూర్యుని ఆహ్వానించెను.

తదైవోపాగతం దేవం వీక్ష్య విస్మితమానసా ।
ప్రత్యయార్థం ప్రయుక్తా మే యాహి దేవ క్షమస్వ మే ॥ 33

తదా ఏవ - అదే సమయములో, ఉపాగతమ్ - దగ్గరకు వచ్చిన, దేవమ్ - సూర్యదేవుని, వీక్ష్య - చూచి, విస్మితమానసా - ఆశ్చర్యపడిన మనస్సు గల కుంతి, మే - నాయొక్క, ప్రత్యయ-అర్థమ్ - విశ్వాసము కొరకు, ప్రయుక్తా - ప్రయోగించబడినది, దేవ - ఓ సూర్యదేవా!, యాహి - వెళ్లుము, మే - నాకు, క్షమస్వ - క్షమించుము.

అదే క్షణములో సూర్యదేవుడు ఆ కుంతి వద్దకు వచ్చి నిలబడెను. ఆయనను చూచి ఆమె మనస్సులో చాల ఆశ్చర్యపడి ఇట్లు పలికెను -- ఓ సూర్యదేవా! నేను విద్యపై నమ్మకము కలుగుట కొరకై దానిని ప్రయోగించితిని. నీవు నన్ను క్షమించి వెళ్లుము.

అమోఘం దర్శనం దేవి ఆధిత్సే త్వయి చాత్మజమ్ ।
యోనిర్యథా న దుష్యేత కర్తాహం తే సుమధ్యమే ।। 34

దేవి - ఓ కుంతీదేవీ!, దర్శనమ్ - దర్శనము, అమోఘమ్ - వ్యర్థము కానిది, త్వయి చ - నీయందు, ఆత్మజమ్ - పుత్రుని, ఆధిత్సే - ఆధానము చేసెదను, సుమధ్యమే - సన్నని నడుము గలదానా!, యథా - ఏవిధముగానైతే, తే - నీయొక్క, యోనిః - కన్యాత్వము, న దుష్యేత - దుష్టము కాదో, (తథా - ఆ తీరున), అహమ్ - నేను, కర్తా - చేయగలను.

(సూర్యదేవుడు ఇట్లు పలికెను) -- ఓ కుంతీదేవీ! నా దర్శనము వ్యర్థము కాబోదు. నేను నీకు పుత్రుని ఈయగలను. ఓ సుందరీ! కాని, నీ కన్యాత్వమునకు దోషము కలుగని విధముగా అనుగ్రహించగలను.

ఇతి తస్యాం స ఆధాయ గర్భం సూర్యో దివం గతః ।
సద్యః కుమారస్సంజజ్ఞే ద్వితీయ ఇవ భాస్కరః ।। 35

ఇతి - అని, సః - ఆ, సూర్యః - సూర్యుడు, తస్యామ్ - ఆమె యందు, గర్భమ్ - గర్భమును, ఆధాయ - ఆధానము చేసి, దివమ్ - సూర్యలోకమును గురించి, గతః - వెళ్లినవాడు, సద్యః - వెనువెంటనే, ద్వితీయః - రెండవ, భాస్కరః ఇవ - సూర్యుడువంటి, కుమారః - పుత్రుడు, సంజజ్ఞే - జన్మించెను.

ఇట్లు పలికి సూర్యదేవుడు ఆమెయందు గర్భాధానమును చేసి సూర్యలోకమునకు వెళ్లెను. వెనువెంటనే రెండవ సూర్యుడువంటి బాలకుడు పుట్టెను.

తం సాఽత్యజన్నదీతోయే కృచ్ఛ్రాల్లోకస్య బిభ్యతీ ।
ప్రపితామహస్తాముపాహ పాండుర్వై సత్యవిక్రమః ॥ 36

సా - ఆమె, లోకస్య - లోకమునకు, బిభ్యతీ - భయపడుచున్నదై, తమ్ - ఆ బాలకుని, నదీతోయే - నదీజలమునందు, కృచ్ఛ్రాత్ - అతికష్టము మీద, అత్యజత్ - విడిచిపెట్టెను, ప్రపితామహః - ముత్తాత, సత్యవిక్రమః - సత్యమునందు పరాక్రమించువాడు అగు, పాండుః వై - పాండువు అయితే, తామ్ - ఆమెను, ఉవాహ - వివాహమాడెను.

ఆమె లోకమునకు భయపడి ఆ బాలకుని అతికష్టము మీద నదీజలములయందు విడిచిపెట్టెను. ఓ పరీక్షిన్మహారాజా! మీ ముత్తాతయగు పాండువు సత్యము కొరకు పరాక్రమించే వ్యక్తి. అయన ఆ కుంతిని వివాహమాడెను.

శ్రుతదేవాం తు కారూషో వృద్ధశర్మా సమగ్రహీత్ ।
యస్యామభూద్దంతవక్త్ర ఋషిశప్తో దితేస్సుతః ॥ 37

శ్రుతదేవాం తు - శ్రుతదేవనైతే, కారూషః - కరూష దేశాధిపతియగు, వృద్ధశర్మా - వృద్ధశర్మ, సమగ్రహీత్ - పాణిగ్రహణము చేసెను, యస్యామ్ - ఏ శ్రుతదేవయందైతే, ఋషిశప్తః - సనకాది మహర్షులచే శపించబడినవాడై, దితేః - దితియొక్క, సుతః - పుత్రుడైన హిరణ్యాక్షుడు, దంతవక్త్రః - దంతవక్త్రుడై, అభూత్ - జన్మించెనో.

కుంతి చెల్లెలు అగు శ్రుతదేవను కరూష దేశాధిపతియగు వృద్ధశర్మ వివాహమాడెను. సనకాది మహర్షులచే శపించబడిన విజయుడు దితియొక్క పుత్రుడగు హిరణ్యాక్షుడై జన్మించెను. ఆ హిరణ్యాక్షుడే మరల శ్రుతదేవయందు దంతవక్త్రుడై జన్మించెను.

కైకేయో ధృష్టకేతుశ్చ శ్రుతకీర్తిమవిందత ।
సంతర్దనాదయస్తస్యాం పంచాఽఽసన్ కైకయాస్సుతాః ।। 38

కైకేయః - కేకయ దేశాధిపతియగు, ధృష్టకేతుః చ - ధృష్టకేతువు, శ్రుతకీర్తిమ్ - శ్రుతకీర్తిని, అవిందత - వివాహమాడెను, తస్యామ్ - ఆమెయందు, పంచ - అయిదుగురు, సంతర్దన-ఆదయః - సంతర్దనుడు మొదలగు, కైకయాః - కేకయ రాజకుమారులగు, సుతాః - పుత్రులు, ఆసన్ - కలిగిరి.

కేకయ దేశాధిపతియగు ధృష్టకేతువు కుంతి చెల్లెలగు శ్రుతకీర్తిని వివాహమాడెను. ఆమెకు సంతర్దనుడు, ప్రతర్దనుడు మొదలగు అయిదుగురు పుత్రులు జన్మించి, కేకయ రాజకుమారులైరి.

రాజాధిదేవ్యామావంత్యౌ జయసేనోఽజనిష్ట హ ।
దమఘోషశ్చేదిరాజశ్శ్రుతశ్రవసమగ్రహీత్ ।। 39

జయసేనః - జయసేనుడు, రాజాధిదేవ్యామ్ - రాజాధిదేవియందు, ఆవంత్యౌ - అవంతీదేశాధీశులనిద్దరిని, అజనిష్ట హ - కనెను, చేదిరాజః - చేదిదేశాధిపతియగు, దమఘోషః - దమఘోషుడు, శ్రుతశ్రవసమ్ - శ్రుతశ్రవను, అగ్రహీత్ - చెట్టపట్టెను.

జయసేనుడు శూరుని మరియొక పుత్రికయగు రాజాధిదేవిని వివాహమాడెను. వారికి ఇద్దరు పుత్రులు (వింద-అనువిందులు) కలిగిరి. వారు అవంతీ (ఉజ్జయినీ) దేశమునకు అధిపతులైరి. చేదిదేశాధిపతియగు దమఘోషుడు శూరుని మరో పుత్రికయగు శ్రుతశ్రవను వివాహమాడెను.

శిశుపాలస్సుతస్తస్యాః కథితస్తస్య సంభవః ।
దేవభాగస్య కంసాయాం చిత్రకేతుబృహద్బలౌ ।। 40

తస్యాః - ఆమెయొక్క, సుతః - పుత్రుడు, శిశుపాలః - శిశుపాలుడు, తస్య - వానియొక్క, సంభవః - పుట్టుక, కథితః - చెప్పబడినది, దేవభాగస్య - దేవభాగునకు, కంసాయామ్ - కంసయందు, చిత్రకేతుబృహద్వలౌ - చిత్రకేతు బృహద్వలులు.

ఆ శ్రుతశ్రవయొక్క కుమారుడే శిశుపాలుడు. వాని పుట్టుక ఇదివరలో (సప్తమ స్కంధము) చెప్పబడినది. (వసుదేవుని సోదరుడు, శూరుని పుత్రుడు అగు) దేవభాగుడు కంస (ఉగ్రసేనుని కుమార్తె) యందు చిత్రకేతువు, బృహద్వలుడు అనే ఇద్దరు పుత్రులను కనెను.

కంసవత్యాం దేవశ్రవసస్సువీర ఇషుమాంస్తథా ।
కంకాయామానకాజ్జాతస్సత్యజిత్పురుజిత్తథా ।। 41

దేవశ్రవసః - దేవశ్రవసుని వలన, కంసవత్యామ్ - కంసవతియందు, సువీరః - సువీరుడు, తథా - మరియు, ఇషుమాన్ - ఇషుమంతుడు, ఆనకాత్ - ఆనకుని వలన, కంకాయామ్ - కంకయందు, సత్యజిత్ - సత్యజిత్తు, తథా - మరియు, పురుజిత్ - పురుజిత్తు, జాతః - పుట్టినవాడు.

(వసుదేవుని మరియొక సోదరుడగు) దేవశ్రవసునకు కంసవతి (ఉగ్రసేనుని కుమార్తె) యందు సువీరుడు, ఇషుమంతుడు అనే ఇద్దరు పుత్రులు కలిగిరి. (వసుదేవుని మరియొక సోదరుడగు) ఆనకునకు కంక (ఉగ్రసేనుని కుమార్తె) యందు సత్యజిత్తు, పురుజిత్తు అనే ఇద్దరు పుత్రులు కలిగిరి.

సృంజయో రాష్ట్రపాల్యాం చ వృషదుర్మర్షణాదికాన్ ।
హరికేశహిరణ్యాక్షౌ శూరభూమ్యాం చ శ్యామకః ।। 42

సృంజయః చ - సృంజయుడైతే, రాష్ట్రపాల్యామ్ - రాష్ట్రపాలికయందు, వృషదుర్మర్షణ-ఆదికాన్ - వృషుడు దుర్మర్షణుడు మొదలగు వారిని, శ్యామకః - శ్యామకుడు, శూరభూమ్యామ్ - శూరభువునందు, హరికేశహిరణ్యాక్షౌ చ - హరికేశుని హిరణ్యాక్షుని.

(వసుదేవుని సోదరుడగు) సృంజయునకు (ఉగ్రసేనుని పుత్రికయగు) రాష్ట్రపాలికయందు వృషుడు, దుర్మర్షణుడు మొదలగు పుత్రులు కలిగిరి. (వసుదేవుని సోదరుడగు) శ్యామకునకు (ఉగ్రసేనుని పుత్రికయగు) శూరభువుయందు హరికేశుడు, హిరణ్యాక్షుడు అనే ఇద్దరు పుత్రులు కలిగిరి.

మిశ్రకేశ్యామప్సరసి వృకాదీన్ వత్సకస్తథా ।
తక్షపుష్కరశాలాదీన్ దుర్వార్క్ష్యాం వృక ఆదధే ॥ 43

మిశ్రకేశ్యామ్ - మిశ్రకేశి అనే, అప్సరసి - అప్సరసయందు, వత్సకః - వత్సకుడు, వృక-ఆదీన్ - వృకుడు మొదలగువారిని, తథా - మరియు, వృకః - వృకుడు, దుర్వార్క్ష్యామ్ - దుర్వార్క్షియందు, తక్షపుష్కరశాల-ఆదీన్ - తక్షుడు పుష్కరుడు శాలుడు మొదలగువారిని, ఆదధే - కనెను.

వసుదేవుని సోదరుడగు వత్సకునకు మిశ్రకేశి అనే అప్సరస యందు వృకుడు మొదలగు పుత్రులు కలిగిరి. వృకునకు దుర్వార్క్షి యందు తక్షుడు, పుష్కరుడు, శాలుడు మొదలగు పుత్రులు కలిగిరి.

సుమిత్రార్జునపాలాదీన్ శమీకాత్తు సుదామినీ ।
కంకశ్చ కర్ణికాయాం వై ఋతధామజయావపి ॥ 44

సుదామినీ తు - సుదామినియైతే, శమీకాత్ - శమీకుని వలన, సుమిత్ర-అర్జునపాల-ఆదీన్ - సుమిత్రుడు అర్జునపాలుడు మొదలగువారిని, కంకః చ - కంకుడు కూడ, కర్ణికాయాం వై - కర్ణికయందైతే, ఋతధామజయౌ అపి - ఋతధాముడు జయుడు అనువారిని కూడ.

(వసుదేవుని సోదరుడగు) శమీకునకు సుదామినియందు సుమిత్రుడు, అర్జునపాలుడు మొదలగు పుత్రులు కలిగిరి. (వసుదేవుని మరియొక సోదరుడగు) కంకునకు కూడ కర్ణికయందు ఋతధాముడు, జయుడు అనే పుత్రులు కలిగిరి.

పౌరవీ రోహిణీ భద్రా మదిరా రోచనా ఇలా ।
దేవకీప్రముఖా ఆసన్ పత్న్య ఆనకదుందుభేః ॥ 45

ఆనకదుందుభేః - వసుదేవునకు, పౌరవీ - పౌరవి, రోహిణీ - రోహిణి, భద్రా - భద్ర, మదిరా - మదిర, రోచనా - రోచన, ఇలా - ఇల, దేవకీప్రముఖాః - దేవకి ముఖ్యురాలుగా గల, పత్న్యః - భార్యలు, ఆసన్ - ఉండిరి.

వసుదేవునకు పౌరవి, రోహిణి, భద్ర, మదిర, రోచన, ఇల, దేవకి మొదలగు భార్యలు గలరు. వారిలో దేవకి ప్రముఖురాలు.

బలం గదం సారణం చ దుర్మదం విపులం ధ్రువమ్ ।
వసుదేవస్తు రోహిణ్యాం కృతాదీనుదపాదయత్ ॥ 46

వసుదేవః తు - వసుదేవుడైతే, రోహిణ్యామ్ - రోహిణియందు, బలమ్ - బలుని, గదమ్ - గదుని, సారణం చ - సారణుని, దుర్మదమ్ - దుర్మదుని, విపులమ్ - విపులుని, ధ్రువమ్ - ధ్రువుని, కృత-ఆదీన్ - కృతుడు మొదలగువారిని, ఉదపాదయత్ - కనెను.

వసుదేవునకు రోహిణియందు బలుడు, గదుడు, సారణుడు, దుర్మదుడు, విపులుడు, ధ్రువుడు, కృతుడు మొదలగు పుత్రులు కలిగిరి.

సుభద్రో భద్రవాహశ్చ దుర్మదో భద్ర ఏవ చ ।
పౌరవ్యాస్తనయా హ్యేతే భూతాద్యా ద్వాదశాఽభవన్ ॥ 47

సుభద్రః - సుభద్రుడు, భద్రవాహః చ - భద్రవాహుడు, దుర్మదః - దుర్మదుడు, భద్రః ఏవ చ - భద్రుడు అనే, భూత-ఆద్యాః - భూతుడు మొదటివాడుగా గల, ఏతే హి - వీరైతే, పౌరవ్యాః - పౌరవియొక్క, ద్వాదశ - పన్నెండు, తనయాః - పుత్రులై, అభవన్ - జన్మించిరి.

వసుదేవునకు పౌరవియందు భూతుడు, సుభద్రుడు, భద్రవాహుడు, దుర్మదుడు, భద్రుడు మొదలుగాగల పన్నెండుమంది పుత్రులు కలిగిరి. వీరిలో భూతుడు పెద్దవాడు.

నందోపనందకృతకశూరాద్యా మదిరాత్మజాః ।
కౌసల్యా కేశినం త్వేకమసూత కులనందనమ్ ॥ 48

నంద-ఉపనందకృతకశూర-ఆద్యాః - నందుడు ఉపనంధుడు కృతకుడు శూరుడు మొదలగువారు, మదిరా-ఆత్మజాః - మదిరయొక్క పుత్రులు, కౌసల్యా తు - కౌసల్యయైతే, కులనందనమ్ - వంశమునకు ఆనందమును కలిగించే, కేశినమ్ - కేశిని, ఏకమ్ - ఒక్కనినే, అసూత - కనెను.

వసుదేవునకు మదిరయందు నందుడు, ఉపనందుడు, కృతకుడు, శూరుడు మొదలగు పుత్రులు కలిగిరి. కౌసల్య (భద్ర, వసుదేవుని మరి యొక భార్య) కు మాత్రము వంశమును ఆనందింపే జేసే కేశి అనే ఒకే పుత్రుడు కలిగెను.

రోచనాయామతో జాతా హస్తహేమాంగదాదయః ।
ఇలాయామురువల్కాదీన్ యదుముఖ్యానజీజనత్ ॥ 49

అతః - ఈ వసుదేవుని వలన, రోచనాయామ్ - రోచనయందు, హస్తహేమాంగద-ఆదయః - హస్తుడు హేమాంగదుడు మొదలగువారు, జాతాః - జన్మించినవారు, ఇలాయామ్ - ఇలయందు, ఉరువల్క-ఆదీన్ - ఉరువల్కుడు మొదలగు, యదుముఖ్యాన్ - యాదవ ప్రముఖులను, అజీజనత్ - కనెను.

వసుదేవునకు రోచన అనే భార్యయందు హస్తుడు, హేమాంగ దుడు మొదలగు పుత్రులు, ఇలయందు ఉరువల్కుడు మొదలగు ప్రముఖు లైన యాదవులు జన్మించిరి.

విపృష్ఠో ధృతదేవాయామేక ఆనకదుందుభేః ।
శాంతిదేవాత్మజా రాజన్ శ్రమప్రతిశ్రుతాదయః ॥ 50

ఆనకదుందుభేః - వసుదేవుని వలన, ధృతదేవాయామ్ - ధృతదే వయందు, విపృష్ఠః - విపృష్ఠుడు, ఏకః - ఒక్కడే, రాజన్ - ఓ రాజా!, శ్రమప్రతిశ్రుత-ఆదయః - శ్రముడు ప్రతిశ్రుతుడు మొదలగువారు, శాంతి దేవా-ఆత్మజాః - శాంతిదేవయొక్క పుత్రులు.

ఓ పరీక్షిన్మహారాజా! వసుదేవునకు ధృతదేవయందు విపృష్ఠుడు అనే ఒకే పుత్రుడు కలిగెను. ఆయనకే శాంతిదేవయందు శ్రముడు, ప్రతి శ్రుతుడు మొదలగు పుత్రులు కలిగిరి.

రాజానః కల్పవర్షాద్యా ఉపదేవాసుతా దశ ।
వసుహంససువంశాద్యాశ్శ్రీదేవాయాస్తు షట్ సుతాః ॥ 51

కల్పవర్ష-ఆద్యాః - కల్పవర్షుడు మొదలుగాగల, రాజానః - రాజులు, దశ - పదిమంది, ఉపదేవాసుతాః - ఉపదేవయొక్క పుత్రులు, వసుహంససువంశ-ఆద్యాః - వసువు హంస సువంశుడు మొదలుగా గల, షట్ తు - ఆర్గురైతే, శ్రీదేవాయాః - శ్రీదేవయొక్క, సుతాః - పుత్రులు.

వసుదేవునకు ఉపదేవ అనే భార్యయందు కల్పవర్షుడు పెద్దవాడుగా గల పదిమంది రాజులు జన్మించిరి. ఆయనకే శ్రీదేవయందు వసువు, హంస, సువంశుడు మొదలగు ఆర్గురు పుత్రులు కలిగిరి.

దేవరక్షితయా లబ్ధా నవ చాత్ర గదాదయః ।
వసుదేవస్సుతానష్టావాదధే సహదేవయా ॥ 52

పురువిశ్రుతముఖ్యాంస్తు సాక్షాద్ధర్మో వసూనివ ।

అత్ర చ - ఈ వసుదేవుని వలన, దేవరక్షితయా - దేవరక్షితచే, గద-ఆదయః - గదుడు మొదలగు, నవ - తొమ్మిదిమంది, లబ్ధాః - పొందబడిరి, వసుదేవః - వసుదేవుడు, సహదేవయా తు - సహదేవ ద్వారానైతే, పురువిశ్రుతముఖ్యాన్ - పురువిశ్రుతుడు మొదలగు, అష్టౌ - ఎనమండుగురిని, ధర్మః - ధర్ముడు, సాక్షాత్ - స్వయముగా, వసూన్ ఇవ - వసువులను వలె, ఆదధే - కనెను.

వసుదేవునకు దేవరక్షితయందు గదుడు మొదలగు తొమ్మండుగురు పుత్రులు కలిగిరి. ఆయనకే సహదేవయందు, సాక్షాత్తుగా ధర్మునకు వసువులు కలిగినట్లుగా, పురువిశ్రుతుడు మొదలైన ఎనమండుగురు పుత్రులు కలిగిరి.

వసుదేవస్తు దేవక్యామష్ట పుత్రానజీజనత్ ॥ 53

కీర్తిమంతం సుషేణం చ భద్రసేనముదారధీః ।
ఋజుం సమ్మర్దనం భద్రం సంకర్షణమహీశ్వరమ్ ॥ 54

ఉదారధీః - ఉదారమగు బుద్ధిగల, వసుదేవః తు - వసుదేవుడైతే, దేవక్యామ్ - దేవకియందు, అష్ట - ఎనమండుగురు, కీర్తిమంతమ్ - కీర్తిమంతుని, సుషేణం చ - సుషేణుని, భద్రసేనమ్ - భద్రసేనుని, ఋజుమ్

- ఋజువును, సమ్మర్దనమ్ - సమ్మర్దముని, భద్రమ్ - భద్రుని, అహీశ్వరమ్ - నాగరాజగు శేషుడైన, సంకర్షణమ్ - బలరాముని, పుత్రాన్ - పుత్రులనుగా, అజీజనత్ - కనెను.

ఉదారశీలుడగు వసుదేవుడు దేవకియందు కీర్తిమంతుడు, సుషేణుడు, భద్రసేనుడు, ఋజువు, సమ్మర్దనుడు, భద్రుడు, శేషుని అవతారమగు బలరాముడు అనే పుత్రులను, శ్రీహరితో కలిపి ఎనమండుగురిని కనెను.

అష్టమస్తు తయోరాసీత్స్వయమేవ హరిః కిల ।
సుభద్రా చ మహాభాగా తవ రాజన్ పితామహీ ।। 55

తయోః - వారిద్దరికి, అష్టమః తు - ఎనిమిదవ పుత్రుడైతే, స్వయమ్ - స్వయముగా, హరిః ఏవ కిల - శ్రీహరియే గదా!, రాజన్ - ఓ రాజా!, మహాభాగా - గొప్ప పుణ్యాత్మురాలు, తవ - నీయొక్క, పితామహీ - తండ్రియొక్క తల్లియగు, సుభద్రా చ - సుభద్ర కూడ.

ఓ పరీక్షిన్మహారాజా! దేవకీ వసుదేవులకు సాక్షాత్తు శ్రీహరియే ఎనిమిదవ పుత్రుడై జన్మించెను. వారికి సుభద్ర అనే ఒక కన్య కూడ గలదు. ఆ గొప్ప పుణ్యాత్మురాలే నీ తండ్రియొక్క తల్లి.

యదా యదేహ ధర్మస్య క్షయో వృద్ధిశ్చ పాప్మనః ।
తదా తు భగవానీశ ఆత్మానం సృజతే హరిః ।। 56

యదా యదా - ఎప్పుడెప్పుడైతే, ఇహ - ఈ లోకమునందు, ధర్మస్య - ధర్మముయొక్క, క్షయః - క్షయము, చ - మరియు, పాప్మనః - పాపముయొక్క, వృద్ధిః - వృద్ధియో, తదా తు - అప్పుడైతే, ఈశః - జగన్నాథుడగు, భగవాన్ హరిః - శ్రీహరి భగవానుడు, ఆత్మానమ్ - తనను, సృజతే - సృష్టించుకొనును.

ఈ లోకమునందు ఎప్పుడెప్పుడైతే ధర్మము క్షీణించి పాపము పెరిగిపోవునో, అప్పుడప్పుడు జగన్నాథుడగు శ్రీహరి తానే స్వయముగా అవతరించును.

న హ్యస్య జన్మనో హేతుః కర్మణో వా మహీపతే ।
ఆత్మమాయాం వినేశస్య పరస్య ద్రష్టురాత్మనః ॥ 57

మహీపతే - ఓ మహారాజా!, ఈశస్య - జగన్నాథుడైనట్టియు, పరస్య - ప్రకృతికి అతీతుడైనట్టియు, ద్రష్టుః - దృక్స్వరూపుడైనట్టియు, ఆత్మనః - ఆత్మరూపుడైన, అస్య - ఈ శ్రీహరియొక్క, జన్మనః - పుట్టుకకు గాని, కర్మణః వా - చేష్టకు గాని, ఆత్మమాయాం వినా - తన మాయాశక్తిని మినహాయించి, హేతుః - మరియొక కారణము, న హి - లేనే లేదు.

ఓ మహారాజా! జగన్నాథుడగు శ్రీహరి ప్రకృతికి అతీతుడు. దృక్స్వరూపుడైన ఆయన సకలప్రాణులలో ఆత్మరూపుడై యున్నాడు. ఆయన తన మాయాశక్తిచేతనే అవతరించి లీలలను నెరపును. ఇంతకు మినహాయించి ఆయన జన్మకు గాని, చేష్టలకు గాని మరియొక కారణము (పూర్వకర్మ, మరియు వాసనలు) లేదు.

యన్మాయాచేష్టితం పుంసః స్థిత్యుత్పత్త్యప్యయాయ హి ।
అనుగ్రహస్తన్నివృత్తేరాత్మలాభాయ చేష్యతే ॥ 58

యత్-మాయాచేష్టితమ్ - ఎవనియొక్క మాయావిలాస, పుంసః - వ్యక్తియొక్క, స్థితి-ఉత్పత్తి-అప్యయాయ - మనుగడకు జన్మకు మరణమునకు కూడ అగునో, అనుగ్రహః - అనుగ్రహము, తత్-నివృత్తేః - ఆ మాయను నివారించుట వలన, ఆత్మలాభాయ చ - తనను పొందుట కొరకు కూడ, ఇష్యతే - చేష్ట చేయుచున్నదో.

శ్రీహరియొక్క మాయావిలాస వలననే జీవుడు జన్మించి మనుగడను సాగించి మరణించుచున్నాడు. ఆ శ్రీహరియొక్క అనుగ్రహము వ్యక్తికి ఆ మాయను నివృత్తము చేసి శ్రీహరిని పొందుటకు కారణమగును.

అక్షౌహిణీనాం పతిభిరసురైర్నృపలాంఛనైః ।
భువ ఆక్రమ్యమాణాయా అభారాయ కృతోద్యమః ॥ 59

అక్షౌహిణీనామ్ - అక్షౌహిణులకు, పతిభిః - ప్రభువులైనట్టియు, నృపలాంఛనైః - రాజుల వేషములోనున్న, అసురైః - రాక్షసులచే, ఆక్రమ్య

మాణాయాః - ఆక్రమించబడుచున్న, భువః - భూమికి, అభారాయ - భారము లేకుండుట కొరకై, కృత-ఉద్యమః - చేయబడిన ఉద్యమము గల వాడు.

రాక్షసులు రాజుల రూపములో జన్మించి అనేకములగు అక్షౌహిణీల సైన్యమును ప్రోగుచేసి భూమిని ఆక్రమించి భూమికి భారమగుచుండగా, ఆ భారమును తగ్గించుటకై శ్రీహరి ఉద్యమించినాడు.

కర్మాణ్యపరిమేయాణి మనసాఽపి సురేశ్వరైః ।
సహసంకర్షణశ్చక్రే భగవాన్ మధుసూదనః ।। 60

మధుసూదనః - మధువు అనే రాక్షసుని సంహరించిన, భగవాన్ - శ్రీహరి భగవానుడు, సహసంకర్షణః - సంకర్షణదేవునితో గూడినవాడై, సుర-ఈశ్వరైః అపి - దేవనాయకులచేనైననూ, మనసా - మనస్సుచేనైననూ, అపరిమేయాణి - ఊహ చేయజాలని, కర్మాణి - లీలలను, చక్రే - చేసెను.

మధువు అనే రాక్షసుని సంహరించిన శ్రీహరి సంకర్షణదేవుని అవతారమైన బలరామునితో గూడి చేసిన (దావానల భక్షణము మొదలైన) లీలలను దేవనాయకులు కూడ మనస్సుచేనైననూ ఊహ చేయజాలరు.

కలౌ జనిష్యమాణానాం దుఃఖశోకతమోనుదమ్ ।
అనుగ్రహాయ భక్తానాం సుపుణ్యం వ్యతనోద్యశః ।। 61

కలౌ - కలియుగమునందు, జనిష్యమాణానామ్ - పుట్టబోయే, భక్తానామ్ - భక్తులకు, అనుగ్రహాయ - అనుగ్రహము కొరకై, దుఃఖశోకతమః-నుదమ్ - శరీరపీడను మానసిక పీడను మరియు అజ్ఞానమును పోగొట్టునట్టియు, సుపుణ్యమ్ - మిక్కిలి పవిత్రమైన, యశః - కీర్తిని, వ్యతనోత్ - విస్తరింప జేసెను.

శ్రీహరి కలియుగములో పుట్టబోయే భక్తులననుగ్రహించుట కొరకై మిక్కిలి పవిత్రమైన తన కీర్తిని విస్తరింప జేసెను. ఆ కీర్తిని గానము చేయు

వారికి అది శరీరపీడను, మానసదుఃఖమును, మరియు అజ్ఞానమును పోగొట్టును.

యస్మిన్ సత్కర్ణపీయూషే యశస్తీర్థవరే సకృత్ ।
శ్రోత్రాంజలిరుపస్పృశ్య ధునుతే కర్మవాసనామ్ ।। 62

సత్-కర్ణపీయూషే - సత్పురుషుల చెవులకు అమృతమైన, యస్మిన్ - ఏ, యశః-తీర్థవరే - కీర్తి అనే గొప్ప తీర్థమునందు, శ్రోత్ర-అంజలిః - చెవియే దోసిలిగా గల వ్యక్తి, సకృత్ - ఒక్కసారి, ఉపస్పృశ్య - ఆచమనమును చేసి, కర్మవాసనామ్ - కర్మల సంస్కారమును, ధునుతే - క్షాళన చేసుకొనునో.

సత్పురుషుల చెవులకు అమృతమైన శ్రీహరియొక్క యశస్సే గొప్ప తీర్థము (పావనము చేయునది). దానియందు చెవియే దోసిలి కాగా ఒక్కసారి ఆచమనమును చేయు వ్యక్తి (భగవానుని కీర్తిని కొద్దిగానైననూ శ్రవణము చేయు వ్యక్తి) కర్మల సంస్కారము (బంధము) ను క్షాళన చేసుకొనును (అనగా, మోక్షమును పొందును).

భోజవృష్ణ్యంధకమధుశూరసేనదశార్హకైః ।
శ్లాఘనీయేహితశ్శశ్వత్కురుసృంజయపాండుభిః ।। 63

భోజవృష్ణి-అంధకమధుశూరసేనదశార్హకైః - భోజులు వృష్ణులు అంధకులు మధువులు శూరసేనులు దశార్హులు అనువారిచే, కురుసృంజయపాండుభిః - కురు-సృంజయ-పాండువంశీయులచే, శశ్వత్ - నిరంతరముగా, శ్లాఘనీయ-ఈహితః - కొనియాడబడే చేష్టలు గలవాడు.

భోజ-వృష్ణి-అంధక-మధు-శూరసేన-దశార్హ-కురు-సృంజయ-పాండు వంశీయులు నిరంతరముగా శ్రీకృష్ణ భగవానుని లీలలను కొనియాడెడివారు.

స్నిగ్ధస్మితేక్షితోదారైర్వాక్యైర్విక్రమలీలయా ।
నృలోకం రమయామాస మూర్త్యా సర్వాంగరమ్యయా ।। 64

స్నిగ్ధస్మిత-ఈక్షిత-ఉదారైః - ప్రేమతో నిండిన చిరునవ్వుతో కూడిన చూపులు గల ఉదారమైన, వాక్యైః - పలుకులతో, విక్రమలీలయా - పరాక్రమముయొక్క లీలతో, సర్వ-అంగరమ్యయా - సకలావయవము లయందు సుందరమైన, మూర్త్యా - రూపముతో, నృలోకమ్ - మానవలో కమును, రమయామాస - రమింప జేసెను.

శ్రీకృష్ణుడు ప్రేమతో నిండిన చూపులతో ఉదారమైన పలుకులను చిరునవ్వుతో పలికెడివాడు. సకలావయవములయందు సుందరమైన రూపము గల ఆయన పరాక్రమముయొక్క లీలలను నెరపెడివాడు. ఈ విధముగా ఆయన మానవలోకమును రమింపజేసెను.

యస్యాననం మకరకుండలచారుకర్ణ-
భ్రాజత్కపోలసుభగం సవిలాసహాసమ్ ।
నిత్యోత్సవం న తతృపుర్దృశిభిః పిబంత్యో
నార్యో నరాశ్చ ముదితాః కుపితా నిమేశ్చ ।। 65

మకరకుండలచారుకర్ణభ్రాజత్-కపోలసుభగమ్ - మకరకుండల ములతో సుందరమైన చెవులతో ప్రకాశించే చెక్కిళ్లతో అందమైనట్టియు, సవిలాసహాసమ్ - విలాసతో కూడిన నవ్వును కలిగియున్నట్టియు, నిత్య-ఉత్సవమ్ - నిత్యము ఉల్లాసముగానుండే, యస్య - ఏ శ్రీకృష్ణునియొక్క, ఆననమ్ - ముఖమును, దృశిభిః - చూపులతో, పిబంత్యః - పానము చేయుచున్న, ముదితాః - ఆనందించే, నార్యః - స్త్రీలు, నరాః చ - పురు షులు కూడ, న తతృపుః - తృప్తిని చెందలేదో, చ - మరియు, నిమేః - నిమికి, కుపితాః - కోపించినవారో.

మొసలి ఆకారములోనున్న కుండలములచే సుందరమైన చెవు లతో శ్రీకృష్ణుని చెక్కిళ్లు ప్రకాశించుచుండెను. ఆయన ముఖము విలాసతో కూడిన నవ్వుతో శోభిల్లుచుండెను. నిత్యము ఉల్లాసముగానుండే శ్రీకృష్ణుని అట్టి ముఖమును చూపులతో త్రాగి (సాదరముగా చూచి) ఆనందించే పురు షులకు, స్త్రీలకు కూడ తృప్తి కలుగకుండెను. పైగా, వారు కనులకు రెప్ప పాటును కలిగించిన నిమి మహారాజుపై కోపించెడివారు. (రెప్పపాటుకు, నిమికి గల సంబంధము కొరకు 13 వ అధ్యాయమును చూడుడు).

జాతో గతః పితృగృహాద్వ్రజమేధితార్థో
హత్వా రిపూన్ సుతశతాని కృతోరుదారః ।
ఉత్పాద్య తేషు పురుషః క్రతుభిస్సమీజే
ఆత్మానమాత్మనిగమం ప్రథయన్ జనేషు ॥ 66

జాతః - పుట్టినవాడై, పురుషః - మానవాకారుడై (పురుషోత్తము డు), పితృగృహాత్ - తండ్రియొక్క ఇంటినుండి, వ్రజమ్ - గొల్లపల్లెను గురించి, గతః - వెళ్లినవాడు, ఏధిత-అర్థః - వర్ధిల్ల జేయబడిన ప్రయోజ నము గలవాడై, రిపూన్ - శత్రువులను, హత్వా - సంహరించి, కృత-ఉరు దారః - స్వీకరించబడిన చాలమంది భార్యలు గలవాడై, తేషు - వారియం దు, సుతశతాని - పుత్రుల వందలను, ఉత్పాద్య - కని, ఆత్మనిగమమ్ - తనదైన వేదమార్గమును, జనేషు - మానవులయందు, ప్రథయన్ - ప్రసి ద్ధము చేయువాడై, ఆత్మానమ్ - తనను, క్రతుభిః - క్రతువులతో, సమీజే - చక్కగా ఆరాధించెను.

పురుషోత్తముడగు శ్రీహరి నిజరూపముతో జన్మించి తరువాత మనుష్యాకారమును స్వీకరించెను. ఆయన తండ్రియొక్క గృహమగు కారాగారమును విడిచిపెట్టి నందగోకులమునకు వెళ్లి అచట వారి ప్రయోజ నములను వర్ధిల్లజేసెను. ఆయన చాలమందిని భార్యలుగా స్వీకరించి వారియందు వందలాది పుత్రులను కనెను. ఆయన క్రతువులతో తనను తానే చక్కగా ఆరాధించుకొని, తనదైన వేదమార్గమునకు జనులలో ప్రశ స్తిని కలిగించెను.

పృథ్వ్యాస్స వై గురుభరం క్షపయన్ కురూణా-
మంతస్సముత్థకలినా యుధి భూపచంవః ।
దృష్ట్వా విధూయ విజయే జయముద్విఘోష్య
ప్రోచ్యోద్ధవాయ చ పరం సమగాత్స్వధామ ॥ 67

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం
నవమస్కంధే చతుర్వింశోఽధ్యాయః ॥

॥ ఇతి నవమః స్కంధః సమాప్తః ॥

సః - ఆ శ్రీకృష్ణుడు, కురూణామ్ - కురువంశీయుల, అంతః - లోపల, సముత్థకలినా - బయలుదేరిన కలహముతో, పృథ్వ్యాః - భూమి యొక్క, గురుభరమ్ - పెద్ద భారమును, వై - నిశ్చయముగా, క్షపయన్ - తొలగించువాడై, యుధి - యుద్ధమునందు, భూపచంవః - మహారాజుల సైన్యములను, దృష్ట్యా - చూపుతో, విధూయ - నశింపజేసి, విజయే - అర్జునునియందు, జయమ్ - విజయమును, ఉద్విఘోష్య - ఉద్ఘోషమును చేసి, చ - మరియు, ఉద్ధవాయ - ఉద్ధవుని కొరకు, పరమ్ - పరతత్త్వము ను, ప్రోచ్య - బోధించి, స్వధామ - తన ధామమగు వైకుంఠమును, సమ గాత్ - చేరుకొనెను.

ఆ శ్రీకృష్ణుడు కురువంశీయుల లోపల పుట్టిన కలహముతో భూమికి భారమైన దుష్టులను యుద్ధమునందు సంహరింపజేసి ఆ విధ ముగా భూమియొక్క పెద్ద భారమును తొలగించెను. ఆయన ఆ యుద్ధ ములో తన చూపులతోనే మహారాజుల సైన్యమును నశింపజేసి, అర్జునుని విజయమును ఉద్ఘోషించెను. తరువాత ఆయన ఉద్ధవునికి పరతత్త్వమును బోధించి, తన ధామమగు వైకుంఠమును చేరుకొనెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందు తొమ్మిదవ స్కంధములో
విదర్భుని వంశమును వర్ణించే ఇరువది నాల్గవ
అధ్యాయము ముగిసినది (24).

నవమ స్కంధము ముగిసినది.

హరిః ఓమ్, తత్సత్, శ్రీకృష్ణార్పణమస్తు



T.T.D. Religious Publications Series No. 765
Price : Rs.



భారతీయ వాఙ్మయం అంతా ఒక యెత్తు; శ్రీమద్భాగవతం ఒక్కటి ఒక యెత్తు. ఈ ప్రఖ్యాతికి ముఖ్యకారణం – భగవంతుణ్ణి గూర్చి తెలిపే గ్రంథాల్లో భాగవత పురాణం అగ్రగణ్యమై అలరారుతూ వుండటం.

"వేద"మనే కల్పతరువున ఫలించి, శుక యోగీంద్రుని వాక్కులనెడి అమృత రసంతో సమ్మిళితమయి, పుడమికి అవతరించిన పరిపక్వ మధుర ఫలం భాగవతం!

ఇంతటి విశిష్టతగల భాగవత మహాపురాణాన్ని 'తత్త్వప్రకాశిక' – అనే తెలుగు టీకతో ప్రచురించటం తెలుగువారందరికీ మిగుల సంతోషదాయకమైన విషయం. తి.తి.దేవస్థానంవారి ఈ ప్రచురణ సంస్కృతమూలంలోని పరమార్థాన్ని తెలిసికోవటానికి, అలాగే, పోతన మహాకవి రచనను ఇతోఽధికంగా అవగాహన చేసి కోవటానికి –ఉభయ తారకంగా ఆంధ్రావళికి ఉపయోగపడుతుంది.

సార్థకనామధేయులైన ఈ టీకను రచించినవారు పూజ్యశ్రీ తత్త్వవిదానంద సరస్వతీ స్వామివారు. బ్రహ్మ విద్యాకుటీర (సికిందరాబాదు) నిలయులు. సంస్కృతాంధ్రాంగ్లాది బహుభాషావేత్తలు. వేద, వేదాంతాది ప్రాచీన విద్యల్లోను, రసాయన శాస్త్రాది ఆధునికవైజ్ఞానిక శాస్త్రాల్లోను నిష్ణాతులు.

పరిశోధన, బోధన, బహుగ్రంథ రచన, సామాజికాది సమస్యల సదవగాహన – ఇత్యాది రంగాల్లో విశేషానుభవం గడించిన పరిణత ప్రజ్ఞావంతులు శ్రీస్వామివారు. ఆర్ష విద్యాపారంగతులైన వీరు ఉత్తమవక్తగా అనేక జాతీయ, అంతర్జాతీయ వేదికలపై ప్రశస్తిగాంచారు.

విశేషించి, ఉపనిషత్తుల్లో నిక్షిప్తమై ఉన్న ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని ప్రబోధించే ఉదారాశయంతో సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించిన యతివరేణ్యులు వీరు! బ్రహ్మవిద్యానిధులయిన వీరు భాగవతానికి సరళ సుందరశైలిలో ఈ టీక రచించటం బంగారుకు తావి అబ్బినట్లయింది!

Printed and Published by Sri K.V. Ramanachary, I.A.S., Executive Officer
Tirumala Tirupati Devasthanams and Printed at TTD Press, Tirupati.